

శ్రీ వేదాంత దేశికులు అనుగ్రహించిన

# శ్రీ అచ్యుత శతకము

## జ్యోతిర్మయీ వ్యాఖ్యా సహితము




వ్యాఖ్యాత :

వాచస్పతి, పండితరత్న

**శ్రీమాన్ కె.వి. రాఘవాచార్యులు**



తిరుమల చారిటబుల్ ట్రస్టు, హైదరాబాదు

శ్రీమదచ్యుతాయనమః

శ్రీ నిగమాన్త మహాదేశికాయనమః

# శ్రీ అచ్చు అసలఅమ్ - శ్రీ అచ్యుత శతకమ్

జ్యోతిర్మయీ వ్యాఖ్యా సహితమ్


వ్యాఖ్యాత :

వాచస్పతి, పండితరత్న

**శ్రీమాన్ కె.వి. రాఘవాచార్యులు**



ప్రచురణ

తిరుమల చారిటబుల్ ట్రస్టు

హైదరాబాదు

శ్రీ వేదాంత దేశికులు అనుగ్రహించిన

**శ్రీ అచ్యుత శతకమ్** (జ్యోతిర్మయీ వ్యాఖ్యా సహితము)


| | | |
|---|---|---|
| వ్యాఖ్యాత | : | **శ్రీమాన్ కె.వి.రాఘవాచార్యులు** |
| కాపీరైట్ | : | సర్వహక్కులు గ్రంథకర్తవి |
| ప్రథమ ముద్రణ | : | విజయనామ సంవత్సరం 2013 |
| ప్రతులు | : | 500 |
| మూల్యము | : | రూ. 150/- |
| ప్రాప్తిస్థానము | : | **శ్రీ మాలోల గ్రంథమాల**<br>శ్రీ అహోబిల మఠము<br>2-2-20/28. డి.డి. కాలనీ,<br>హైదరాబాద్- 500 013 |
| ముద్రణ సహకారం | : | **"పుస్తక శిల్పి" శ్రీ తాళ్ళపల్లి మురళీధర గౌడు**<br>సెల్: 9393 176 552 |
| ముఖచిత్రం | : | **తిరువహీంద్రపురమందు వెలసిన**<br>**శ్రీ దేవనాథస్వామి- శెంగమల వల్లితాయార్** |
| ముఖచిత్ర రూపకల్పన | : | **టి. మల్లేశ్** |
| అక్షరాలంకరణ | : | **కె.బి.టి. కొండయ్య** |
| ప్రచురణ కర్తలు | : | **డా॥ కె.వి.రమణాచార్యులు** ఐ.ఏ.ఎస్ (రి)<br>**తిరుమల చారిటబుల్ ట్రస్టు,**<br>సి-501, నఫీజ్ రెసిడెన్సీ,<br>ఏ.సి.గార్డ్స్, హైదరాబాద్- 500 028<br>ఫోన్: 040-2330 6899 |
| ముద్రణ | : | **కర్షక్ ఆర్ట్ ప్రింటర్స్**<br>విద్యానగర్, హైదరాబాద్ - 500 044<br>ఫోన్ : 040-2761 8261 |

శ్రీమత్పరమహంస పరివ్రాజకాచార్యులు
**శ్రీశ్రీశ్రీ త్రిదండి చిన్న శ్రీమన్నారాయణ**
**రామానుజ జీయర్‌స్వామివారు**
వేద విశ్వవిద్యాలయ ప్రాంగణము
శ్రీరాంనగరం, శంషాబాద్, హైదరాబాద్



# అనేక మంగళాశాసనాలు

శ్రీమతే నారాయణాయనమః
అనేక మంగళాశాసనాలు
ప్రియ స్వామినః!

ప్రియ శ్రీమన్! ఉ.వే. రాఘవాచార్య స్వామిన్! దేవరవారు ఇటీవల తాము వ్రాసిన అచ్యుత శతకవ్యాఖ్యను యథావకాశం చూచినాము. దేవరవారి శ్రమ ఫలేగ్రాహి అయిందని భావిస్తున్నాం. దేశికుల హృదయాన్ని తరచిచూచారా అన్నట్లుగా ఉన్నాయి దేవరవారి వ్యాఖ్యలు. సాంప్రదాయిక విషయాల వివరణంలోను, దార్శనిక విషయాల వివరణంలోను దేవరవారు నిర్మత్సరంగా రచన సాగించారు. విశేషించి అచ్యుత శతకమనే ఈ ప్రస్తుత స్తుతి గ్రంథంలో **'నతసత్య'** డైన స్వామియొక్క బహుముఖీన వైభవాన్ని దేశికులవారు సరళ ప్రాకృతశైలిలో కటాక్షించారు. ఏ కాలంలోనైనా పెద్దల నాశ్రయించి లౌకిక విషయచింతవీడి స్వామి చరణవరణం చేసినవారు ఉంటారు. ఇతరులూ ఉంటారు. ఇతర విషయ ప్రవణులకు వారి కాలమంతా కలిధర్మ విస్తృతమై ఉంటుంది. అలాకాక భగవత్పదప్రావణ్యం కలవారికి కలి స్పర్శ ఉండదు. కలి ప్రభావం నేటి సమాజంలో సర్వులకు భయంకరంగా అనుభవగోచరం అవుతున్నది. ఇలాంటి కాలంలోనే మానసిక వ్యాపృతులలో తమ శతకంలోని ఈ క్రింది ప్రాకృతరచనలో ఆవిష్కరించారు.

***యేషాం మతిరితరముఖీ***
***కాలః సకలో౽పి తేషాం కలివిస్తారః।***
***యేతవపదే ప్రవణాః***
***నాస్తి కలిర్నాగపతినగరపతే! తేషామ్॥***

ఈనాటి కలిబలపుష్టమైన మనః ప్రవృత్తికిగల నిదానాన్ని దేశికులు అనుగ్రహించారు. భగవద్విషయంలో డోలాయమాన మానసత పనికిరాదు. దృఢాధ్యవసాయం అవసరం. డోలాయమాన మానసులకు పరమాత్మ సన్నిహితంగా (అర్చాదిరూపంలో) ఉన్నా దుర్గ్రాహ్యుడే అవుతాడు. కారణం, విషయలంపటతయే.

*అహిపతినగరీంద్ర! త్వామ్*
*ఆసన్నమపి గగనమివ దుర్ గ్రాహ్యామ్।*
*విషయేషు విలగంతః*
*త్వరమాణా అపి నలభంతే దోలాయ మానమనసః॥*

ఇలా చాలా సులభంగా సాగిన ఈ రచనకు, దేవరవారి వ్యాఖ్య కూడా సులభమై దేశికహృదయాన్ని ఆవిష్కరించి, ఈ రచనను మరింత సులభతమం చేస్తున్నది. దేవరవారి ఈ శ్రమకు ఆంధ్ర జిజ్ఞాసుపాఠకలోకం తగిన ఆదరణాన్ని ఇచ్చి, కృతజ్ఞతను ఆవిష్కరిస్తుందని విశ్వసిస్తూ అనేక మంగళాశాసనములు చేస్తున్నాం.

జై శ్రీమన్నారాయణ

(చిన్న శ్రీమన్నారాయణరామానుజజీయర్)

'శాస్త్రరత్నాకర' 'శాస్త్రవిద్వన్మణి'
**డా॥ సముద్రాల వేంకట రంగరామానుజాచార్యులు**
డైరెక్టర్, ఎకడమిక్ కౌన్సిల్-జీవ,
శ్రీరామనగరం-ముచ్చింతల్ రోడ్,
పాలమాకుల పోస్టు- 509 325, ఆర్.ఆర్. జిల్లా



# దేశిక వరివస్య

**ఉ.** వే. శ్రీమాన్ రాఘవాచార్యస్వామివారి లేఖిని నుండి మరొక భవ్య వ్యాఖ్య అచ్యుతశతకంపై, హృద్యంగా ఆవిర్భవించింది. ఇతర రచనలకంటే విలక్షణంగా ఆలంబనం చేసికొని ఆవిర్భవించిందీ వ్యాఖ్య. ఈ శతకంలో కీర్తింపబడిన స్వామి **'సత్యశబ్దవాచ్యుడు' 'దాస్యసత్య' 'కింకరసత్య' 'నతసత్య'** ఇత్యాది శబ్దాలచే కీర్తింపబడిన 'అచ్యుతుడు' తిరువహీంద్ర పురాధీశుడైన స్వామి అహిపతినగరేంద్ర, భుజగేంద్ర పురపతి, అహీంద్రపురనాథ ఇత్యాదిగా కీర్తింపబడ్డాడు. ఈ స్వామిపట్ల వేదాన్త దేశికులకు గల ప్రీతి అసాధారణం. ఈ ప్రదేశంలోనే దేశికులు తపస్సు చేశారని ప్రతీతి. ఇక్కడే దేశికులు గరుడోపాసన చేసి గరుడ పంచాశత్, గరుడదండకం రచించారు. దేవనాయకుడుగా కీర్తింపబడిన ఈ స్వామిపై దేవనాయక పంచాశత్ అనుగ్రహించారు. హయగ్రీవస్తుతిని కూడా ఇక్కడే అనుగ్రహించారు.

ఇంతటి ప్రీతిపాత్రమైన స్థానం కనుకనే దేశికుల తిరునక్షత్ర పర్వాన్ని ఇక్కడ చాలా వైభవంగా నిర్వహిస్తారు. పెరియతిరుమొళి ప్రబంధంలో తిరుమంగైయాళ్వారులు ఈ స్వామిని కీర్తించారు. ప్రస్తుత స్తోత్రంలో 101 శ్లోకాలున్నాయి. ప్రాకృతంలో వ్రాయబడిన గాథలకు సంస్కృతానుసరణం కూడా దేశికులదే. ప్రాకృతభాషలో ఈ స్తుతిని అనుగ్రహించడంలోని ఆంతర్యాన్ని వివేచకులు విశదపరచారు. ప్రాకృతికభాష సాధారణంగా నాటకాలలో స్త్రీ పాత్రలకు, నీచపాత్రలకు వినియోగించడం ఉంటుంది. కనుక, తమను, ఒక నాయికగా భావించి, ప్రాకృతభాషాబద్ధంగా ఈ శతకాన్ని కూర్చారని కొందరు వివేచకులు తమ అభిప్రాయాన్ని వెలిబుచ్చారు. అయితే ఈ భావనలో అంతగా సామంజస్యం శతకం పరిశీలించినప్పుడు కలగడం లేదు.

ఏ ఒక్క శ్లోకంలోనూ, దేశికులు తమయందు నాయికాభావాన్ని భావించినట్లు ఉట్టంకనం, లేదా సూచనం ఎంతమాత్రం లేదు. ఇందులో స్వాభిమత దర్శన సిద్ధాంతాన్నే వివిధ అంశాలలో ఆవిష్కరించడానికి వారుద్యమించినట్లు స్పష్టంగా గోచరిస్తుంది.

పరమాత్మకుగల ఉపాదానాది త్రివిధకారణత్వం, సర్వశబ్ద వాచ్యత్వం, శరణాగతాశ్రితత్త్వం, లక్ష్మీవైశిష్ట్యం, దయాళుత్వాది గుణవత్త్వం ఇలా ఎన్నో దార్శనిక సాంప్రదాయిక విశేషాలతో పాటు దేవనాయకుడుగా కీర్తింపబడిన స్వామియొక్క దివ్యమంగళ విగ్రహవైభవం, అర్చిరాదిగతి ద్వారా పరమపర ప్రాప్తిచ్ఛ ఇలా ఎన్నో విశేషాలను దేశికులు తమ దేవనాయక పంచాశత్తులో భావించినట్లే ఈ శతకంలోనూ భావించారు. దేవనాయక పంచాశత్తుకు, అచ్యుతశతకానికి పలుతావుల్లో భావసామ్యం కనిపిస్తుంది. స్తుతింపబడే స్వామి ఒక్కడే కనుక, భావసామ్యం సహజమే.

ఇక కొందరు అచ్యుతశతకాన్ని మధురభక్తి ప్రధానమని భావించారు. వాస్తవానికి ఆ లక్షణాలేవి ఈ శతకంలో లేవు. పలు శ్లోకాల్లో తనను పుంలింగశబ్దాలతోనే పరామర్శిస్తూ తమ రచన దేశికులు సాగించడాన్ని బట్టి చూస్తే వారు ప్రాకృతాన్ని ఎన్నుకోవడంలో నాయికాభావాదుల్లాంటివేవీ ప్రయోజకాలు కావనే చెప్పవచ్చు. వారికి ప్రాకృతభాషా విశేషం పట్ల గల అభినివేశమే ఈ రచనను ఇలా సాగించడానికి ప్రరోచకం తప్ప వేరు కాదని చెప్పచ్చు.

*'కర్మమయధర్మతప్తం... కదాప్యతృష్ణాకం... మాం కారయ'*

*బాలప్లవగ ఇవ తరలః సాగరం తరితుమనాః'*

**'అచ్యుత విషయాక్రాన్తం భవార్ణవా వార్త భ్రమనిమజ్జన్తమ్'** ఇత్యాది శ్లోకాల్లో పుంలింగ శబ్దాలచే తమను పరామర్శించాన్ని బట్టి వారిలో నాయికా భావన ఈ శతకంలో లేదనే కనిపిస్తుంది. కనుక ఇది మధుర శృంగారపరమైనదనే మాట కూడా కేవలభావనయే తప్ప వస్తుత్త్వం కాదు.

అంతేకాదు ఏదైనారసం ఉన్నది అంటే అలా ఉన్నదనడానికి నియామకమైన రససామగ్రి విభావాదికం ఉండాలి. అలాంటి రచనాప్రణాళిక ఏది ఇక్కడ లేదు. కనుక ఇది వస్తుప్రధానమైన స్తుతియేతప్ప రసప్రధాన కావ్యరచన కాదు. విశేషంగా

నమ్మాళ్వారులకు తిరువాయిమొళిలోని చివరి దశకాల్లో కలిగిన పరమపద ప్రాప్తిచ్ఛ, ఈ శతకంలోని చివరిభాగంలో విస్పష్టంగా దేశికులభావనలో గోచరిస్తుంది. 101 శ్లోకాలతో ప్రాకృతగాథలతో కూడిన ఈ శతకంలో 1 నుండి 7వ శ్లోకం వరకు వాఙ్మనోఽతీతుడైన స్వామిని తాము స్తుతింప నుద్యమించడంలోని అపచారాన్ని క్షమించమని వివిధ భంగులలో ప్రార్థించడం ఉంది. ఓ కింకరసత్యా! స్వామీ! బాలుడనైన నాచే పలుకబడిన నీ స్తుతిరూపమైన వాక్కు **'పంజరశుక జల్పితం'** లా నీకు ప్రసన్నతను గొల్పుగాక, అంటూ మలినమైనప్పటికీ నా భాషితం నీ కీర్తిజ్యోత్స్నలో చేరి విశుద్ధి పొందుతుందంటారు. ఎలా? సాధారణ మార్గంలో ప్రవహించే నీరు గంగా స్రోతస్సులో చేరి పవిత్రమైనట్లు, నా వాక్కు నీ వైభవాన్ని స్తుతించే గొప్పవైన శ్రుతివచనాల మధ్య బాలిశమైనదంటారు. అయితే మాలోని అపండితత్త్వాన్ని నీవే వారిస్తున్నావంటారు. ఎందువల్ల? తమ ఆచార్యుల జిహ్వాగ్ర సింహాసనాన్ని అధిష్ఠించి లబ్ధప్రతిష్ఠుడై ఉన్నా ఇలాంటి భావాలు ఎన్నో ఉన్నాయి కదా స్వామీ!

శ్రీమద్దేశికుల శ్లోకాల్లో ఎన్నో బ్రహ్మసూత్రాధికరణ న్యాయాలు శ్రుతివచనాలు అన్వయించి ఉన్నాయి. 'సదాక్షపిత సకల హేతుః' (8) అనే శ్లోకంలో ఉభయలింగాధి కరణన్యాయం, 'సకలానాం ధరణ నియమన' ఇత్యాది (11)వ శ్లోకంలో శరీర లక్షణ నిరూపణ పురస్సరం, కార్యకారణావస్థాద్వయ విశిష్టత్వ మూలమైన అనన్యత్వం ఆరంభణాద్యధికరణ న్యాయసిద్ధం సూచింపబడింది. 'పురుషప్రధాన శరీరః' (12) అనే శ్లోకంలో త్రివిధకారణత్వ నిరూపక ప్రకృత్యాద్యధికరణ తాత్పర్యం ఆవిష్కరింపబడింది.

'ఆరాధ్య త్రిదశవిలయే' (18), కల్పయసి కాంక్షితాని (19) ఇత్యాది శ్లోకాల్లో 'ఫలమత ఉపపత్తేః' అనే న్యాయసిద్ధమైన అర్థం నిరూపింపబడింది. 'జ్ఞానస్య కోవిషయః' (23) అనే శ్లోకంలో ఉపాయోపేయానన్యత్వ నిరూపకమైన పరాధికరణ న్యాయసిద్ధార్థం నిరూపింపబడింది.

అంతేకాదు విష్ణ్వాదిపురాణాల్లో వర్ణింపబడిన భూషణాస్త్రాధ్యాయ రహస్యాలను కూడా దేశికులు 'త్రిగుణం తస్యవికారాః' అనే (30) శ్లోకంలో ఆవిష్కరించారు.

ఇంచుమించుగా ప్రతిశ్లోకంలోను ఏదో ఒక ఉపనిషద్వచనమో, పురాణ వచనమో, బ్రహ్మసూత్రన్యాయమో స్పృశింపబడటం వల్ల ఈ స్తుతి దార్శనిక విషయ భారాన్ని కూడా వహిస్తున్నదని చెప్పవలసి ఉంది.

ఆగమమాత్రప్రమాణుడైన స్వామి, ఆ గోపీజనం తన మాహాత్మ్యాన్ని ప్రకాశింపజేశాడు. ఎవ్వరు శ్రద్ధాళువులో వారి హృదయాల్లో సులభుడై ఉంటూ, ఎవ్వరు నిర్భరంగా ఉండజాలక డోలాయమాన మానసులో వారిని దూరంగా విడిచిపెడతాడట. ఈ జగత్తులోని పురుషతత్త్వ స్త్రీ తత్త్వాలు రెండూ స్వామికి, విభూతులై ఉంటాయి. కనుక సర్వమూ లక్ష్మీనారాయణాత్మకమే తప్ప వేరు కాదంటారు. ఎన్నో శ్రుతులను తమ శ్లోకాల్లో స్పృశించారు దేశికులు. ఇంచుమించుగా ప్రతి శ్లోకంలోనూ ఒక శ్రుతివచనం ఇమిడి ఉండటం గమనించవచ్చు. ఇక దర్శన, సంప్రదాయ సిద్ధాంతాలు పుంఖానుపుంఖాలుగా ఏర్చికూర్చారు. ఒకచోట కొంత సంప్రదాయ విరుద్ధత కనిపిస్తుంది. ముఖ్యంగా భగవద్భక్తులను జీవన్ముక్తులతో పోల్చినతీరు – **'జీవన్ముక్త సదృశాః అచ్యుతదృశ్యంతే పావనాస్తవభక్తాః'** అనే శ్లోకం కొంత విచారణీయమే.

'జీవన్ముక్తత' అనేది అపసిద్ధాంతమని, మనస్వామి విశదపరచారు తమ వ్యాఖ్యలో. 'ఇహైవతైర్జితస్సర్గః' అనే గీతాశ్లోకభాష్యంలో **'ముక్త ఏవ'** అన్న భాష్యకార వచనాన్ని వ్యాఖ్యానిస్తూ **'ముక్తప్రాయ ఏవ'** అని వివరించారు శ్రీదేశికులు. ఇక్కడ ఉండగానే, ఈ శరీరంతోనే, ముక్తులు పొందే బ్రహ్మానుభవంలాంటి అనుభవాన్ని పొందేవారు కొందరుండవచ్చునని తాత్పర్యం తప్ప **'జీవన్ముక్తు'** లనే వారుంటారని శ్రీవైష్ణవ సంప్రదాయం అంగీకరించదు. **'జీవన్తః ఏవ ముక్తాః'** అని వ్యుత్పత్తి చెబితే ఈ రెండు పదాలు విరుద్ధార్థాలు కనుక, ఇలాంటి నిర్వచనం కుదరదని పెద్దలు వ్యాఖ్యానించారు. ఎందువల్లనంటే జీవచ్ఛబ్దానికి శరీరం కలవాడని అర్థం. ముక్తశబ్దం అశరీరత్వ స్థితిని బోధిస్తుంది అంటే శరీరాన్ని పూర్తిగా విడిచిపెట్టిన తరువాత, అర్చిరాదిమార్గంలో పరమపదానికి వెళ్ళి బ్రహ్మానుభవాన్ని పొందడమే ముక్తి. ఇది ప్రాకృతికశరీరం ఉండగా సాధ్యం కాదు. **'తస్య తావదేవ చిరమ్ యావన్న విమోక్ష్యే'** అన్న శ్రుతివచనాన్ని బట్టి కర్మమూలంగా ఏర్పడిన జన్మపరంపర ముగిసి చిట్టచివరి దేహం కూడా తొలగిపోయిన తరువాతనే బ్రహ్మానుభవరూపమైన మోక్షం కలుగుతుంది

కనుక 'జీవన్' 'ముక్త' అను రెండు పదాలు ఏక కాలంలోనే ఒకనిలోనే అన్వయించడం పరస్పర విరుద్ధం అని ఆచార్యుల అభిప్రాయం. కనుక ఇతర సంప్రదాయాల్లో అంగీకరింపబడిన జీవన్ముక్తి ఇక్కడ లేదు. కనుక పై శ్లోకంలో 'జీవన్ముక్త సదృశాః' అన్న పదాన్ని కొంతవివేచనతో అర్థం చేసికోవాలని, మన స్వామి వ్యాఖ్యానించి సంప్రదాయ మర్మాన్ని ఉద్ఘాటించారు. దార్శనిక విషయాల వివరణంలోనూ వీరి లేఖిని విశ్రమించలేదు. ఈ వయస్సులో కూడా వీరు చేస్తున్న వ్యవసాయం సర్వాదర్శప్రాయం. స్వామివారికి సర్వథా దాసోహాలు, వారి కృషికి కృతజ్ఞతలు ఆవిష్కరిస్తూ దాసుడు శెలవు తీసుకుంటున్నాడు.

భాగవత విధేయుడు

**సముద్రాల వేంకటరంగరామానుజాచార్యులు**

అధ్యక్షుడు,

శ్రీమదుభయవేదాన్తాచార్య పీఠం ట్రస్టు

'జీవా'

శంషాబాద్ (మం) రంగారెడ్డి జిల్లా



మహా మహోపాధ్యాయ,
కవిశాబ్దిక కేసరి, శాస్త్ర రత్నాకర,
ఉ.వే. మహోదధి, శ్రీమాన్
**డా॥ శ్రీ.న.చ. రఘునాథాచార్యులు**

# ప్రస్తావః

రసఘన మచ్యుత శతకం
శ్రీమద్వేదాన్త దేశికై రచితమ్
కే.వీ. రాఘవగురుణా
వివృతం విబుధేషు మోదమాధత్తామ్॥

దేశిక కృతీస్సమస్తాః
స్తుతిరూపాస్సుష్ఠు విశదయన్నేషః
బిరుదంబుధాగ్రణీత్వాత్
అర్హతిచాభినవ మల్లినాథత్వమ్॥

విదుషా రఘునాథబుధేన కృతాం
స్తుతిమాదరతః పరిగృహ్య భవాన్
ముదమంచతు సౌహృదశాలితయా
ప్రదదీత శుభం వృషశైల పతిః॥

16-4-523, శివనగర్
వరంగల్ - 2, సెల్: 9849 133 137
తేది: 20-04-2013

ఇత్థం విజ్ఞాపయతి
మహామహోపాధ్యాయః
**శ్రీ.న.చ. రఘునాథాచార్యః**

పండితరత్న, వేదాన్త వాచస్పతి,
సత్సంప్రదాయ సుధాంబుధి,
ఉ.వే. శ్రీమాన్
**డా॥ ఈ.ఏ. శింగరాచార్యులు** (తిరుపతి)



# జ్యోతిర్మయీసుధ

*శ్రీమాన్ వేంకటనాథార్యః కవితార్కిక కేసరీ,*
*వేదాంతాచార్య వర్యోమే సన్నిధత్తాం సదాహృది॥*

సర్వతంత్ర స్వతంత్రులు, కవితార్కిక కేసరి, వేదాంతాచార్యేత్యాది బిరుదాలం కృతులైన శ్రీమద్వేంకటనాథుల శతాధిక కృతులలో స్తోత్రవాఙ్మయం విలక్షణమైనది. వీరు విరచించిన 28 స్తోత్రాలలో ఎక్కువ సంఖ్యలోని స్తోత్రాలు దివ్యదేశాలలోని అర్చామూర్తులను ఉద్దేశించి రచింపబడడం విశేషం. వాటిలో, ప్రాకృతభాషలో, గాథా ఛ్ఛందస్సులోని 101 గాథలలో ప్రణీతమైన అచ్యుతశతకం, తిరువహీంద్రపురమ్ అనబడే దివ్యక్షేత్రంలోని దేవనాయక స్వామిని ఉద్దేశించినది. మధ్యదేశ తిరుపతులు రెండిటిలో తిరువహీంద్రపురం ఒకటికాగా, మఱి ఒక క్షేత్రం తిరుక్కోవలూరు. ఇచటి స్వామిని గూర్చి దేశికులు దేహళీశస్తుతిని రచించారు.

తిరువహీంద్రపురంతో శ్రీదేశికులకు అవినాభావ సంబంధం ఉన్నది. ఈ దివ్యదేశంలోనే దేశికులు గరుడ భగవానుని అనుగ్రహంతో హయగ్రీవస్వామి సాక్షాత్కారాన్ని పొందారు. ఇచటి దేవనాయక స్వామిని గూర్చి శ్రీ దేశికులు ముమ్మణిక్కోవై, నవమణిమాలై, పన్దు, కళల్, అమ్మానై, ఊశల్, ఏశల్- అనే ఏడు ద్రావిడ కృతులను, దేవనాయక పంచాశత్ అనే సంస్కృత భాషలోని స్తోత్రాన్ని, ప్రాకృత భాషలో అచ్యుతశతకాన్ని మొత్తం తొమ్మిది కృతులను రచించారు. ఈ ద్రావిడ ప్రబంధాలలో ముమ్మణిక్కోవైలో 10 పాశురాలు, నవమణిమాలై మాత్రం ఇపుడు లభ్యం కాగా, మిగిలిన కృతులు లుప్తాలు. ఈ విధంగా సంస్కృత, ద్రావిడ, ప్రాకృత భాషలలో మూడింటిలో శ్రీదేశికుల శ్రీసూక్తికి లక్ష్యమైన దివ్యక్షేత్రం ఇది ఒక్కటే.

నవమణిమాలై ప్రబంధం చివరలో దేశికులు దేవనాయకుని గూర్చి తాము నిర్మించిన కృతుల వివరాన్ని ఒక అందమైన (ఈ క్రింది) పాశురములో తెలిపారు.

"అన్దమిల్ శీర్ అయిన్దైనక రమర్న్దనాదన్
అడియిణైమేల్ అడియురైయాల్ ఐమ్బదేత్తి
చ్చిన్దైకవర్ పిరాకిరుత నూఱుకూఱి
చ్చెన్దమిషమ్ మణిక్కోవై శెఱియచ్చేర్త్తు
పన్దు కళల్ అమ్మానైయూ శలేశల్
పరవు నవమణిమాలై యివైయుమ్ శొన్నేన్
మున్దైమ్మఱైమొళియ వళిమొళినీ యెన్ఱు
ముకున్దనరుళ్ తన్దపయన్ పెట్రేన్నానే!!"

ముమ్మణిక్కోవై అనే ద్రావిడ కృతిని దేశికులు నాయకీ భావంతో రచించారు. ఇందులో నాయకి విరహ దశను చూచి చెలికత్తె బాధతో పలికే ఈ క్రింది పాశురం నమ్మాళ్వార్ల తిరువిరుత్త ప్రబంధంలోని పాశురాలను గుర్తుచేస్తుంది.

"ఆర్క్కుమ్ కరుణై పొళివాన్ అయిన్దైయిల్ వన్దమర్న్ద
కార్ క్కొణ్డలై క్కణ్డకాదల్ పునమయిల్ కణ్పనియా
వేర్క్కు ముకిష్క్కుమ్ విదిల్ విదిర్క్కుమ్ వెళ్కి ఎవ్వుయిర్క్కుమ్

పార్క్కిన్ఱ వర్క్కిదు నామెన్సొల్? ఎన్ఱు పయిలువమే" (అందరిని అనుగ్రహించడం కోసం తిరువహీంద్రపురంలో వేంచేసి ఉండే దేవనాయకుడనే నీల మేఘాన్ని చూచిన ఆ స్వామి పట్ల ప్రేమను పొందినది, పర్వత చరియలలో సంచరించేది అయిన నెమలివంటి ఆకర్షణీయమైన వర్ణాన్ని కల్గిన దేశికనాయకి) దుఃఖాశ్రువులు చిందగా, ఆమె శరీరంలో స్వేదం కమ్ముకొన్నది. ఆమె శరీరం గగుర్పాటు పొందుతున్నది. కంపాన్ని పొందుతున్నది. ఆమె లజ్జను పొంది, వేడి నిట్టూర్పులు విడుస్తున్నది. ఆమెకు కలిగిన ఇటువంటి స్థితిని చూచినవారు "ఇదేమి" అని ప్రశ్నిస్తే ఏమని బదులివ్వను? ఇటువంటి గాఢమైన అభినివేశం శ్రీ దేశికులకు తిరువహీంద్ర పురం అర్చామూర్తి విషయంలో ఉన్నది.

అచ్యుతశతకంలోని మొదటి శ్లోకం ఆరంభమే విలక్షణమైనది. ఈ స్తుతి ఆరంభాన్ని "నమత త్రిదశానాం నాథం సత్యం దాసా నామచ్యుతమ్" అని చేయడంలోని దేశికుల ఆంతర్యం గమనించదగినది. దేవనాయకస్వామికి అచ్యుతుడనే నామం కూడా ఉన్నది. అచ్యుత నామాన్ని శ్రీపరాశర భట్టర్ తమ భగవద్గుణ దర్పణమనే సహస్రనామ భాష్యంలో "తేభ్యః ప్రపన్నేభ్యో నాపగతః" (అటువంటి ప్రపన్నులను విడచి ఉండడు) అని వివరించి, దానికి ప్రమాణంగా "యస్మాన్నచ్యుత పూర్వోఽహ మచ్యుతస్తేన కర్మణా" అనే వాక్యాన్ని ఉదాహరించారు. "నచ్యుతః- అచ్యుతః" అనే విగ్రహవాక్యాన్ని అచ్యుత నామానికి ఈ అర్థానికి అనుగుణంగా గ్రహించాలి.

నమ్మాళ్వార్లు తిరువాయ్ మొళి ప్రబంధంలో అచ్యుతనామ నిరుక్తిని పరమహృద్యంగా తెలిపారు. "తీర్న్ద అడియవర్ తమ్మైత్తిరుత్తిప్పణి కొళ్ళవల్ల ఆర్న్దపుకళ్ అచ్చుతన్ అమరర్ పిరాన్" (3-5-11) (తననే ఉపాయమని, ఉపేయమని స్థిరంగా నమ్మి ఉండే ప్రపన్నులను ఆయా కైంకర్యాలలో నియోగించి, వారి నుండి సేవలను పరిగ్రహించగలిగిన అచ్యుతుడు, నిత్యసూరినాథుడు) అనే సూక్తిలో నమ్మాళ్వార్లు అచ్యుతనామాన్ని వివరించారు. ఈ సూక్తిని నంబిళ్ళై అనే వ్యాఖ్యాత వివరిస్తూ- "ప్రాప్యప్రాపకాలు రెండూ భగవానుడే అనే స్థిరమైన నమ్మికను కలవారికి కలిగే ప్రాప్య ప్రాపక విరోధులను సమూలంగా తీర్చి, వారిని ఆజ్ఞాపించి, వారినుండి సర్వదేశ సర్వకాల సర్వావస్థలలో సర్వవిధ కైంకర్యాలను స్వీకరించేవాడు, ఏ కొఱతలేని సమస్త కల్యాణ గుణాలతో పూర్ణుడు "తనను ఆశ్రయించినవారికి కైంకర్యంలో చ్యుతిని కల్గించాడు" అనే మాటను ఏనాడూ రానివ్వని సమస్త కల్యాణ గుణపూర్ణుడైన అచ్యుతుడు అని వివరించారు. "నవిద్యతేచ్యుతిః యస్మాత్ స అచ్యుతః" అనే వ్యుత్పత్తి ఇక్కడ గ్రాహ్యం. ఇటువంటి సర్వకాల సర్వదేశ సర్వావస్థోచిత కైంకర్యం నిత్యసూరులకే సాధ్యం కనుక, వెంటనే "అమరర్ పిరాన్" అని ఆళ్వార్లు అన్నారు. తొండరడిప్పొడి ఆళ్వార్లు కూడా ఇదే భావాన్ని "అచ్యుతా! అమరరేఱే" అని తిరుమాలై ప్రబంధంలో వ్యక్తం చేశారు. ఈఇద్దఱి భావాన్ని స్వీకరించిన తిరుమంగైయాళ్వార్లు అచ్యుతనామ భావాన్ని అర్చావతార పరంగా అనుసంధించారు. ఆ అర్చారూపం కూడా తిరువహీంద్ర పురంలోని దేవనాయకుడే కావడం గమనించతగినది. తిరువహీంద్రపురాన్ని కీర్తించే

దశకంలో తిరుమంగైమన్నన్- "వైయమేళు ముణ్డు ఆలిలై వైకియ మాయన్ అడియవర్క్కు మెయ్యన్ ఆకియ దెయ్వ నాయకనిడమ్" (పెరియతిరుమొళి 3-1-3) అని అన్నారు. ఈ సూక్తిలోని "అడియవర్క్కుమెయ్యన్" అనే ప్రయోగమే అచ్యుత నామనిరుక్తి. ఈ ప్రయోగమే తిరువహీంద్రపురంలోని అర్చామూర్తి నామం కూడా స్థిరపడింది. ఈ నామాన్ని దేశికులు "దాసానాం సత్యమ్" అని శ్లోకంలో సంస్కృతీకరించారు. ఇక, "ఆడియవర్క్కుమెయ్యన్" ఇత్యాది ప్రయోగాన్ని పెరియ వాచ్చాన్ పిళ్లై వ్యాఖ్యానించిన తీరు పరమ రమణీయం. దీనిని పెరియవాచ్చాన్ పిళ్ళై" వైయమేళుముణ్డు ఆలిలైవైకియ మాయన్" అనే ప్రయోగాన్ని కలుపుకొని వివరించారు.

కాదాచిత్కంగా జగత్తుకు సంభవించే ప్రళయాన్ని తీర్చి రక్షించడమే కాకుండా, భగవానుని నిత్యం దర్శించి ఆనందించాలనే ఆశనుకల ఈ లోకంలోని అనన్య భక్తిని కల ఆళ్వార్లవంటి దాసుల అనుభవానికి విచ్ఛేదం కల్గితే అది వారికి నిత్య ప్రళయమే కాగలదు కనుక ఆ నిత్య ప్రళయాన్ని తీర్చి రక్షించే స్వామి దేవనాయకస్వామి. భగవద్విషయంలో ప్రాప్య ప్రాపక బుద్ధిని కలవారు- "అడియవర్". నమ్మాళ్వార్ల సూక్తిలోను, తిరుమంగైమన్నన్ సూక్తిలోను ఈ పదమే భగవానుని పట్ల అనన్య భక్తిని కల దాసులను నిర్దేశించే పదంగా ప్రయోగింపబడడం గమనించదగిన అంశం. ఈ విధంగా భక్తులకు కలిగే నిత్య ప్రళయాన్ని తీర్చి, అపరిచ్ఛిన్నుడైన తనను ఇదమిత్థంగా పరిచ్ఛేదించి, అనుభవించేటట్లుగా చేసే దాస సత్యస్వరూపుడు దేవనాయకుడు. పరమ పదంలోని నిత్యసూరులకు తన రీతులను అన్నిటినీ అనుభవింపజేసేటట్లే, ఇక్కడ ఈ లోకంలోని ఆళ్వార్లవంటి భక్తులకు కూడా "అహమేవం విధః" అనే రీతిలో తనను అనుభవించేటట్లు చేసే దేవనాయక స్వామి వేంచేసి ఉండే దివ్యక్షేత్రం తిరువహీంద్రపురం అనేది పెరియవాచ్చాన్ పిళ్ళై వ్యాఖ్యాన సూక్తిలోని తాత్పర్యం. ఈ అర్థాలను అన్నిటిని మనస్సులో నిలుపుకొన్న దేశికులు అచ్యుతశతక ప్రారంభంలోని "త్రిదశానాం నాథమ్" అనే ప్రయోగాన్ని "దెయ్వనాయకన్" అనే ఆళ్వార్ల సూక్తిని, "సత్యందాసానామ్" అనే ప్రయోగాన్ని "అడియవర్క్కుమెయ్యన్" అనే ఆళ్వార్ల సూక్తిని స్మరింపజేసేటట్లుగా ప్రయోగించారు. "త్రిదశానాం నాథమ్" అనే ప్రయోగమే దేవనాయక శబ్దార్థం. దీనిని నమ్మాళ్వార్లు "అమరర్ పిరానై" అని అనగా, తొండరడిప్పొడి

"అమరరేతే" అని అన్నారు. ఈ రెండు పదాలు నిత్య సూరినాథుని నిర్దేశిస్తాయి. అందువల్ల "త్రిదశానాం నాథమ్" అనే దేశిక సూక్తిలోని త్రిదశ శబ్దాన్ని సామాన్యంగా చూస్తే దేవతలనే అర్థం స్ఫురించినా, ఆళ్వార్ల సూక్తిని బట్టి గమనిస్తే అనన్యార్హశేషత్వ అనన్య శరణత్వ అనన్య భోగ్యత్వాలనే మూడు దశలను కల అనన్యభక్తులైన దాసులనే అర్థవిశేషాన్ని గ్రహించడంలో స్వారస్యం ఉన్నది. విశేషమేమంటే, నమ్మాళ్వార్ల సూక్తిలో అచ్యుతనామం, దాని భావం అనుసంధింపబడగా, తొణ్డరడిప్పొడి సూక్తిలో నామం అనుసంధింపబడింది. తిరుమఙ్గై ఆళ్వార్లసూక్తిలో అర్థానుసంధానం చేయబడింది. అర్థంతోపాటు, నామం కూడా దేశిక సూక్తిలో అనుసంధింపబడింది. ఇంతటి గంభీరమైన అర్థస్ఫూర్తిని దేశికుల శ్రీసూక్తి కలిగి ఉన్నది.

అచ్యుత శతకంలో దేశికులు పలు ప్రసిద్ధ ప్రమాణాల భావాన్ని పలు శ్లోకాలుగా అందంగా మలిచారు. భగవద్గీతలోని ప్రసిద్ధమైన "నేహాభి క్రమనాశోஉస్తి" ఇత్యాది భగవద్గీతా సూక్తిని "నాస్త్యభిక్రమ నాశః" (70) అనే శ్లోకంగాను, "నఖలు భాగవతాః యమవిషయం గచ్ఛంతి" అనే ప్రమాణాన్ని "నఖలు యమ విషయే గతిః" ఇత్యాది (55) శ్లోకంగాను, "పరిత్రాణాయ సాధూనామ్" (32) అనే సూక్తిని "నిర్యాంతిత్వత్తోஉచ్యుత" ఇత్యాది శ్లోకంగాను అనుగ్రహించిన శ్రీదేశికుల కవనా సామర్థ్యం అనితర సాధారణం. ప్రాకృతగాథలను ఛాయను కూడా వారే అనుగ్రహించారు.

ఇంతవరకు అచ్యుత శతకానికి తెలుగు భాషలో విపులమైన వ్యాఖ్య వెలువడలేదు. ఈ లోటును తీరుస్తూ ఇప్పుడు వాచస్పతి, శాస్త్రవిద్వన్మణి, జగద్విఖ్యాత వ్యాఖ్యాత అయిన ఉ.వే. శ్రీమాన్ కె.వి.రాఘవాచార్య స్వామివారు సంతరించిన విస్తృతమైన జ్యోతిర్మయి వ్యాఖ్య వెలువడింది. 85 సంవత్సరాలు నిండిన వయస్సులో కూడా వీరు సాగించే నిరంతర రచనా వ్యాసంగం, మొక్కవోని బుద్ధిబలం, ఏ మాత్రం తగ్గని ధారణాశక్తి, దేశిక సూక్తిపట్ల గల అపారభక్తి- ఆశ్చర్యాన్ని కల్గించక మానవు. శ్రీదేశికుల ప్రయోగాలన్నీ ప్రౌఢార్థ గంభీరాలు. నారికేళపాకాలు. అందులోను అచ్యుత శతకం ఎంతో లోతైన భావాలను కలిగినది. వీటిని అట్టడుగు వరకు ముట్టాలంటే ఆ పాతాళ నిమగ్న పీవరతను వైనమంథాచలం వంటి బుద్ధికావాలి. అచంచల దీక్ష కావాలి. నిరంతర పరిశ్రమ కావాలి. వీనిని అంతటిని సమగ్రంగా కలిగిన శ్రీమాన్

ఆచార్యులవారు దేశిక సూక్తి క్షీరాబ్ధిని తఱచి అపూర్వార్థాలను జ్యోతిర్మయీసుధగా వెలువరించి మనకు ఉదారంగా అమృతాన్ని పంచుతున్నారు. వారికి చేయగలిగిన ప్రత్యుపకారం కైమోడ్పు తప్ప వేఱొకటి ఏమున్నది కనుక!

శ్రీమాన్ రాఘవాచార్య స్వామివారి వ్యాఖ్యాన వైఖరి విలక్షణమైనది. ప్రతి శ్లోకానికి ప్రతిపదార్థ తాత్పర్యాలను తెల్పిన తరువాత వ్యాఖ్యానారంభంలో అవతారికా రూపంగా సారభూతంగా ఆ శ్లోక తాత్పర్యాన్ని ఒక వాక్యంలో తెలియజేస్తారు. తరువాత శ్లోకంలోని వ్యాఖ్యేయ పదాలను, ప్రయోగాలను ప్రస్తావించి, పలు ప్రమాణాలను పుంఖాను పుంఖాలుగా ఉట్టంకిస్తూ వివరిస్తారు. ఉదాహరణగా ఒకటి రెండు శ్లోకాల వ్యాఖ్యనుగూర్చి మాత్రం విన్నవిస్తాను.

"త్రిగుణం తస్య వికారాః" ఇత్యాది 30వ శ్లోకంలో శ్రీ దేశికులు దేవనాయక స్వామి మేనిలో శాస్త్రాలలో తెలుపబడిన చిదచిత్తత్త్వాలు అన్న దివ్య భూషణాయుధాల రూపంలో దర్శన మిస్తున్నాయని అన్నారు. ఈ విధమైన భావాన్నే దేశికులు దేవనాయక పంచాశత్‌లోని "తత్త్వాని యాని చిదచిత్ ప్రవిభాగవంతి... దీవ్యంతి తాన్యహిపురం దరధామనాథ! దివ్యాస్త్ర భూషణతయా తవ విగ్రహేஉస్మిన్" అనే 13వ శ్లోకంలో వ్యక్తం చేశారు. శ్రీమాన్ స్వామివారు అచ్యుత శతక శ్లోకాన్ని వ్యాఖ్యానిస్తూ "మూల ప్రకృతి రవికృతిః" ఇత్యాది సాంఖ్యకారికను, శ్రీవిష్ణుపురాణంలోని అస్త్రభూషణాధ్యాయ శ్లోకాలను ఉదాహరించి వివరించారు. అంతేకాక, ఈ అర్థాన్ని దేశికులు అధికార సంగ్రహమనే ద్రావిడ ప్రబంధం "పురదన్ మణివరమాక" అనే పాశురంలో తెలియజేశారని అన్నారు. ఇదే రీతిలో, "ముఖచంద్ర మౌళి" అనే 34వ శ్లోకాన్ని దేశికులు ఆళ్వార్లవలె నాయకీభావాన్ని పొంది పలికారు అని శ్రీమాన్ స్వామివారు చేసిన వ్యాఖ్యానం రమణీయమైనది. దేశికుల భావనా సాగరంలోని లోతులను తాకింది (ముమ్మణిక్కోవై- అనే ద్రావిడ ప్రబంధంలో దేశికులు తిరువహీంద్ర పురనాథుని విషయంగా దేశికనాయకీ రూపంలో పాడిన పాశురాలను ఇది గుర్తుకు తెస్తుంది). ఈ సందర్భంలో తిరుమంగై ఆళ్వార్లు తిరునెడున్దాణ్డకమనే ప్రబంధంలో పరకాల నాయకిగా పలికేటప్పుడు, భగవానుని కుంతల కాంతికి వశ అయినట్లే. ఈ వేదాంత దేశిక నాయకి కూడా దేవనాయకుని కుంతల కాంతికి వశీకృత అయినది అని అంటూ చేసిన వివరణం చాలా హృద్యం. ఈ శ్లోకంలో, ముఖచంద్రుడు, కిరీటి

సూర్యుడు, చికురాంధకారాలనే విరుద్ధ విభూతుల ఘటనను తనలో నిర్వహించే దేవనాయకుని అఘటితఘటనాశక్తిని వివరిస్తూ, తిరువాయ్‌మొళి ప్రబంధంలో నమ్మాళ్వార్లు భగవానుని విరుద్ధ విభూతికత్వాన్ని కీర్తించే "నల్ కురవుమ్ శెల్వముమ్" అనే దశకంలోని గాథలను ఉదాహరించడం శ్రీ స్వామివారికి ద్రావిడ ప్రబంధాలలో గల గాఢమైన అవగాహనకు చిన్నతార్కాణం. ఇటువంటి అమూల్యమైన, అందమైన వివరణలు జ్యోతిర్మయీ వ్యాఖ్యలో అడుగడుగునా దర్శనమిస్తాయి.

శ్రీమాన్ రాఘవాచార్య స్వామి వారితో నాకు సుమారు 15 సంవత్సరాల క్రితం పరిచయం కలిగింది. అది క్రమంగా బలపడి, ఈనాటికీ కొనసాగడం, వారు నన్ను పుత్రసమానునిగా అభిమానించడం నా అదృష్ట విశేషంగా భావిస్తాను. నా సాహిత్య, సంప్రదాయ కృషికి వారు ఇచ్చే ప్రోత్సాహం, మంగళాశాసనాలు ఎంతో దోహదాన్ని చేస్తున్నాయి. ఈ అచ్యుత శతక వ్యాఖ్య జ్యోతిర్మయిని గూర్చి నేను ఏమని పలికినా, అది సూర్యునకు దివిటీ చూపడం వంటిదే. అయినా, వారి ఆజ్ఞను మీరలేక, కొంత సహజ చాపల్యం వల్ల ఏవో కొన్ని విషయాలను విన్నవించాను. నాకీ గొప్ప అవకాశాన్ని అనుగ్రహించిన శ్రీమాన్ స్వామివారి సన్నిధిలో సవినయంగా, కృతజ్ఞతా భావ పురస్సరంగా ప్రణమిల్లుతున్నాను. వారు- "పశ్యేమ శరదశ్శతమ్" అనే వేద పురుషుడు చేసిన మంగళాశాసన క్రమంలో పరిపూర్ణాయురారోగ్యాలతో విరాజిల్లుతూ, శ్రీ దేశికసూక్తి వార్ధినుండి సుధారసాన్ని ఉద్ధరించి అందరికి పంచిపెట్టాలని మనసార కోరుకొంటున్నాను. స్వస్తి.

*కవితార్కిక సింహాయ కల్యాణ గుణశాలినే।*
*శ్రీమతే వేంకటేశాయ వేదాంత గురవేనమః॥*

*అచ్యుత శతక పయోధేః శ్రీ రాఘవ సూరి సుమతి మంథేన।*
*ఉదితా దివ్యసుధేయం వ్యాఖ్యా జ్యోతిర్మయీ నూనమ్॥*

18-3-58/7, శాంతినగర్,
కె.టి.రోడ్, తిరుపతి- 517 507
తేది: 03-05-2013

భాగవత విధేయుడు,
**ఈ.ఏ.శింగరాచార్యులు**
సెల్: 98850 03420

# విజ్ఞాపనం

రామానుజ దయాపాత్రం జ్ఞానవైరాగ్య భూషణమ్।
శ్రీమద్వేంకటనాథార్యం వందే వేదాన్త దేశికమ్॥

పుణ్యపాపాలచే మలినమైన ఈ సంసార గర్భంలో పడి ఎన్ని జన్మలు గడచినాయో తెలియదు కాని ఆపదమొక్కులవాడైన తిరుమల శ్రీవేంకటేశ్వర భగవానుడు ఈ జీవుణ్ణి కృపతో కటాక్షించి విభవనామ సంవత్సరం క్రీ.శ. 1929లో మానవ జన్మను ప్రసాదించాడు. అస్మత్పితృపాదులు శ్రీమాన్ కారంచేటి తిరుమల మనోహరాచార్యస్వామివారు నాకు పంచాబ్ద ప్రాయమందే దివ్య ప్రబంధంతో పాటు అనేక స్తోత్రాలను నేర్పి కంఠస్థం చేయించారు. కౌమార దశలోనే పవిత్ర ఉపనయన వివాహ సంస్కారాలను విధిగా జరిపినారు. 1949 నుంచి ఉద్యోగ సరస్సులో ఈదులాడసాగాను. సుఖదుఃఖాల సుడిగుండంలో చిక్కుకొన్ననూ "మన్మనాభవ" అనే గీతాచార్య సూక్తిని అనుష్ఠిస్తూ ఉజ్జీవించుటయే అభ్యాసమైనది.

సిద్ధిపేట ప్రభుత్వ డిగ్రీకళాశాలలో లెక్చరర్‌గా నున్న నాకు మిత్రులు, 'యువభారతి' అధ్యక్షులైన డా॥ ఇరివెంటి కృష్ణమూర్తిగారు 1983లో ఆజ్ఞాపత్రాన్ని పంపి, 'మాఘకావ్యవైభవం' సంగ్రహంగా రచించి ఇమ్మని ప్రోత్సహించి, నన్ను కృతకృత్యుని చేశారు.

తర్వాత సిద్ధిపేట రామాలయమందు ధనుర్మాస కాలక్షేపం చేస్తూ, నేను నివసించి యున్న శ్రీమాన్ ఎ.రామరాజు వకీల్‌గారి గృహమందే కుటుంబంతో వేంచేసి యున్న ఉభయ వేదాన్త విద్వాంసులు, సలక్షణ కృష్ణ యజుర్వేద ఘనపాఠకులు, బహుభాషా ప్రవక్తలైన శ్రీమాన్ కె.సంతాన గోపాలాచార్య స్వామి వారు శ్రీ వేదాన్త దేశిక ప్రణీత 'గోదాస్తుతి'కి 'పరిమళ వ్యాఖ్యానం' రచించి ప్రచురించుమని నన్ను ప్రేరేపించినారు. ఆ పుస్తకంలో మున్నుడి కూడా తామే వ్రాసి, నాకు మంగళాశాసనం కృప చేశారు.

ఉద్యోగం నుంచి విశ్రాంతి నొంది హైదరాబాదులో నివసిస్తున్న నన్ను హైదరాబాదు- అహోబిల మఠం ఛైర్మన్‌గా నున్న, సుప్రసిద్ధులైన శ్రీమాన్ వి.పి.

రాఘువాచార్యస్వామివారు 1990లో "ఈ సంవత్సరం నుంచి అహోబిల మఠంలో ధనుర్మాసమందు 'తిరుప్పావై' మీరే తెలుగులో ప్రవచనం చేయవలె"నని ఆజ్ఞాపించి, క్రమంగా మూడేండ్లు గొప్ప అవకాశాన్ని కల్పించారు. ఈ మధ్యకాలాననే శ్రీరంగం నుంచి వేంచేసిన అ.మఠం 44వ పట్టం- శ్రీశ్రీ శ్రవణ్ శఠకోప వేదాన్త దేశిక జీయర్‌స్వామి వారికి సంస్కృత భాషలో స్వాగత వచనాలను పలికే భాగ్యాన్ని నాకు శ్రీమాన్ వి.పి.రాఘువాచార్యస్వామి వారు కలిగించారు. ఆ సమావేశమందే ఛైర్మన్‌గారు ఉపన్యసిస్తూ, ప్రసంగవశాన "శ్రీరంగనాథ పాదుకాసహస్ర" మనే ఉద్గ్రంథానికి ఆంధ్రభాషలో రమణీయంగా వ్యాఖ్యానాన్ని రచించాలి, 'మాలోలగ్రంథమాలా' పక్షాన మేము ప్రచురిస్తా"మని ప్రకటించారు. వెనువెంటనే జీయర్‌స్వామివారు, దండవత్ ప్రణమిల్లుతున్న దాసునిపై శాలువ గప్పి, అక్షతారోపణ జేసి "వ్యాఖ్యానం సమేధతామ్" అని మంగళాశాసనం చేసిన వైభవం మరపురానిది.

ఇలాగా భగవద్భాగవతాచార్య కృప వర్షించిన నాటినుంచి, తెలుగులో వివరింపబడని దేశికుల స్తోత్రకావ్యాలలో కొన్నింటికి యథామతి 'వ్యాఖ్య' రచింప బడుతున్నది.

శ్రీమద్వేదాన్త దేశికులు రచించిన 'అచ్యుత శతకం' ప్రాకృత భాషలో నున్నది. ఈ శతకానికి "జ్యోతిర్మయీ" అనే వ్యాఖ్య తెలుగులో ఇప్పుడు రచింపబడినది. "సహకారశక్తి విరహిణీ సహజశక్తి రనుపకారిణీ!" కాబట్టి, సహృదయ సుహృద్వరు లిరువురు నాకు సహకరించారు. మొదట విద్వత్కవి శిరోమణి శ్రీమాన్ న.చ.వేదాంతాచార్య స్వామి- సిద్ధిపేట వారు ఈ శతకానికి సంగ్రహంగా సంస్కృత వ్యాఖ్యను రచించిన 'కవి భూషణ' బిరుదాంచితులైన శ్రీమాన్ తి.అ.తి. కుమార తాతాచార్యుల వారి పుస్తకాన్ని కృపజేసి నా రచనకు ప్రేరకులైనారు. తర్వాత రచన ఆరంభమైనదని తెలిసి, పండితరత్న, ప్రవచన వాచస్పతి, వ్యాఖ్యాతృ చక్రవర్త్యాది బిరుదులు కలిగిన డా॥ శ్రీమాన్ ఈ.ఏ. శింగరాచార్య స్వామి- తిరుపతివారు పరిశ్రమలో సాధక బాధకాలెరిగినవారైనందున, వ్యాఖ్యానం సమగ్రంగా ఉండాలనే మనీషతోనూ, ఇటీవల శ్రీరంగంలోని శ్రీమదాండవన్ ఆశ్రమంవారు- సంస్కృతం, మణి ప్రవాళం, తమిళం మరియు ఇంగ్లీషు- నాలుగు భాషలలో క్రమంగా వ్యాఖ్యానించి,

ప్రచురించిన అచ్యుతశతకాన్ని (పేజీలు 525) తామే వందరూపాలు చెల్లించి, నాకు పోస్టుద్వారా పంపించారు. కాబట్టి, ఈ తెలుగు వ్యాఖ్యానం భాషాంతరీకరణమే కాని స్వకపోల కల్పితం కాదని మనవి. రచనకు మూలమైన గ్రంథాలనందించి సహకరించిన ఈ స్వాములకు తొలుత కార్తజ్ఞ్య పురస్సరంగా ప్రణమిల్లుతున్నాను.

భాగవత మంగళాశాసనమే బలవర్ధక రసాయనం కదా! పరమహంస పరివ్రాజకాచార్య శ్రీశ్రీశ్రీ త్రిదండి చిన్న శ్రీమన్నారాయణ రామానుజ జీయర్ స్వామివారు అవ్యాజకృపతో మంగళాశాసనము ననుగ్రహించడమే కాక ప్రతి సంవత్సరం ఒక్కొక్క ప్రబంధం వారి కరకమలాలచే ఆవిష్కృతమవడం అస్మద్భాగ్యమని అధ్యవసిస్తున్నాను. స్వామివారి చరణ సరోజ సన్నిధిలో సవినయంగా సాష్టాంగ ప్రణామాలను సమర్పిస్తున్నాను.

బహుకార్య ధురంధరులైనను కోరిన వెంటనే తమ అమూల్యాభిప్రాయాన్ని ప్రకటిస్తూ, మంగళాశాసనం కృపజేసిన శాస్త్రరత్నాకర, శాస్త్ర విద్వన్మణి డా॥ శ్రీమాన్ సముద్రాల వేంకట రంగరామానుజాచార్య స్వామివారి పాదపద్మాలకు సప్రశ్రయ ప్రణామాలు.

శ్లోక త్రయ రూపంగా వాత్సల్య పూర్ణమైన శుభాశీస్సులను వర్షించిన మహామహోపాధ్యాయ, కవిశాబ్దిక కేసరి, శాస్త్ర రత్నాకర, ఉభయవేదాన్త మహోదధి శ్రీమాన్ డా॥ శ్రీ న.చ.రఘునాథాచార్యస్వామివారి పాదాబ్జ సన్నిధిలో దండవత్ పరస్సహస్ర ప్రణామాల నర్పిస్తున్నాను. పరిచయమైన నాటి నుంచి నా శ్రేయస్సు నభిలషిస్తూ మితహిత సత్య వచనులై నాకు అశ్రాంత సహాయ సహకారాల నందిస్తున్న సౌజన్యమూర్తులు, పాండిత్య పాథోనిధులు ఉ.వే.శ్రీమాన్ డా॥ ఈ.ఏ. శింగరాచార్య స్వామి వారు ఈ శతకాన్ని సమగ్రంగా పరిశీలించి 'జ్యోతిర్మయీ సుధ' అనే శీర్షికతో విపులమైన పీఠికను కృపజేశారు. వారి సన్నిధిలో "తలైయల్లాల్ కైమ్మాఱు లేన్" అనే రీతిలో సవినయంగా ప్రణమిల్లుతున్నాను.

ఈ 'అచ్యుత శతకం' సిద్ధిపేట వాస్తవ్యులు, న్యాయవాదులు, భగవద్భాగవత సేవా పరాయణులు శ్రీమాన్ ఎ.రామరాజుగారు భక్తితో సమర్పించిన పవిత్ర ద్రవ్యంతో ముద్రింపబడినది. వారి కుటుంబ సభ్యులకు తిరువహీంద్రపురమందు వెలసియున్న

దివ్యదంపతులు శెంగమలపల్లి, శ్రీదేవనాథస్వామి- సర్వదా ప్రేయః శ్రేయస్సులను కృప జేయుదురు గాక అని మంగళాశాసనములు.

అక్షరాలంకరణ మొదల్కొని ప్రబంధ రూపకల్పన వరకు శ్రద్ధతో తీర్చిదిద్దిన పుస్తక శిల్పి, ప్రముఖ కవి శ్రీతాళ్ళపల్లి మురళీధరగౌడుగారికి అసంఖ్యాక ధన్యవాదములు.

ఓర్పు-నేర్పులతో డి.టి.పి. చేసిన శ్రీ కె.బి.టి.కొండయ్యగారికి- ముఖచిత్రాన్ని అందంగా రూపొందించిన శ్రీ మల్లేశ్‌గారికి- సకాలమున గ్రంథాన్ని ముద్రించి ఇచ్చిన 'కర్షక్ ఆర్ట్ ప్రింటర్స్' అధినేత శ్రీ జగన్మోహనరెడ్డిగారికి హార్దిక కృతజ్ఞతలు.

సాహిత్య రసికులు, ప్రపన్నులు అందఱు పరమోపాదేయమైన ఈ 'అచ్యుత శతకము'ను దాని వివరణసూ పఠించి, భుక్తి, భక్తి, ముక్తి ప్రదుడైన శ్రియఃపతి యొక్క అనుగ్రహాన్ని పొందగలరని ఆశిస్తున్నాను. స్వస్తి.

ఇట్లు విన్నవించు
భాగవత విధేయుడు

కె. వి. రాఘవాచార్యులు

12-05-2013
హైదరాబాదు- 28

(కె.వి.రాఘవాచార్యులు)

శ్రీమదచ్యుతాయనమః
శ్రీనిగమాన్త మహాదేశికాయనమః

# శ్రీ- అచ్చు అ సలఅమ్- శ్రీఅచ్యుత శతకమ్

## జ్యోతిర్మయీ వ్యాఖ్యా సహితమ్

1. నమత త్రిదశానాం నాథం,
సత్యం దాసానామచ్యుతం స్థిరజ్యోతిః
గరుడ నదీతట తమాలం
అహీంద్ర నగరౌష ధాచలైక గజేన్ద్రమ్॥

2. కింకరసత్య స్తుతిస్తవ
స్వయంభూ గేహినీ విలాస వ్యాహృతిమయీ।
ఫణితా బాలేన మయా,
పంజరశుక జల్పిత మివ కరోతు ప్రసాదమ్॥

3. మలిన మపి భాషితం మమ
కింకర సత్య తవ కీర్తి జ్యోత్స్నా ప్రసరే।
లగ్నం లభతాం విశుద్ధిం
రథ్యాసలిల మివ త్రిపథగా స్రోతో గతమ్॥

4. త్రస్తరి నయేన స్థాపితా
శోభతాం త్రిదశానాం నాథ తవ సమాజే
వందిత్వ మహితానాం
మధ్యే శ్రుతీనాం బాలిశా మమ స్తుతిః॥

5. అస్మద్గురూణా మచ్యుత
జిహ్వాసింహాసనే లబ్ధ ప్రతిష్ఠః।
ప్రతిపాదిత పరమార్థో
వారయ స్యపండితత్వ మస్మాకమ్॥

6. హృదయేషు దేశికానాం
జాహ్నవీ లహరీషు పూర్ణచంద్ర ఇవ స్ఫుటః।
కలుషజలేష్వివ హంసః
కషాయకర్బురేషు తిష్ఠస్యచ్యుత! నక్షణమ్॥

7. ఆగమ మాత్ర ప్రమాణః
ఆగోపీజనం ప్రకాశ నిజమాహాత్మ్యః।
శ్రద్దధద్హృదయ సులభో
దూరం ముంచసి నతసత్య డోలాయమానాన్॥

8. సదాక్షపిత సకలహేయం
శరణాగత సత్య! సత్యజ్ఞానానందమ్
ఉల్లంఘిత త్రివిధాంతం
ఉపనిషదాంశతాని గాయంతి త్వామ్॥

9. కరోషి నక్రియ సేకేనాపి
స్థాపయసి న సంస్థాప్యసేఽనన్య స్థితః।
హరసి నిఖిలం నహ్రియసే
అహీంద్ర నగరేంద్రా నఘజ్యోతిః స్ఫురన్॥

10. అణుప్రమితస్యాప్యచ్యుత,
శక్తి స్తవ సకలధారణాది ప్రభూతా।
తేన ప్రతివస్తు పూర్ణః
శ్రూయసేఽప్రతిహత నిజస్థితిః సర్వగతః॥

11. సకలానాం ధరణ నియమన
స్వామిత్వ నియమ సంస్థితః సర్వతనుః।
శ్రూయసేఽచ్యుత సర్వః
స్వయం దర్శిత కార్యకారణత్వ కర్బురః॥

12. పురుష ప్రధాన శరీరో
భువనానాం భవస్య చ్యుతో పాదానమ్।
నిజసంకల్ప సనాథో
వహసి నిమిత్తత్వమప్య ద్భుత శక్తిః॥

13. విషమ గుణాంకుర ప్రకరే
జలమివ సామాన్య కారణం తవకేళిః।
నిజకర్మ శక్తి నియతాః
అచ్యుత! బ్రహ్మాది స్థావరాంత విశేషాః॥

14. పురుషాస్తవ విభూతిః
అచ్యుత! లక్ష్మ్యాః స్త్రీ సంజ్ఞాః।
నాస్తి పరం యువయోః
సాఽపిశ్రీర్భవతి తవకింపునరితరత్॥

15. న ఖలుతవ సదృశాభ్యధికాః
నాథ! త్వమేవ సర్వలోక శరణ్యః।
ఏ తావత్ జ్ఞానసారం
ఇతి జ్ఞాతుం త్రిదశనాథేతర విచింతా॥

16. భాతి ఫణీంద్ర పురాధిప!
ప్రతిపాలయత్సు ప్రకట ప్రభూత ఫలా।
అపి ద్రుహిణ ప్రముఖై
రాజ్ఞప్తి స్తవాలంఘనీయ ప్రభావా॥

17. నిగమ విధేనాం ప్రవృత్తిః
సర్వేషామపి దాససత్యోద్దిశ్యత్వామ్।
శ్రాద్ధ నిమంత్రిత బ్రాహ్మణ
సమాధి సిద్ధాం లభన్తే త్రిదశా భుక్తిమ్॥

18. ఆరాధ్య త్రిదశ విలయే
అచ్యుత! నిత్యం నతిష్ఠసి యదినామత్వమ్।
కర్మణాం కల్పితానాం
కరిష్యతి కల్పాంతరేషు కో నిర్వేశమ్॥

19. కల్పయసి కాంక్షితాని
కల్పద్రుమ ఇవ శ్రీకాంచనల తాస హితః।
నతసత్య! సదాఫలాని
నిజచ్ఛాయా విశ్రాంత నిత్యతాప త్రిభువనః॥

20. సకలాగమానాం నిష్ఠా
సకల సురాణా మప్యన్తర ఆత్మా।
సకల ఫలానాం ప్రసూతిః
సకల జనానాం సమఃఖలు నతసత్య! త్వమ్॥

21. ఇతి సర్వేషాం సమానః
సత్యస్తితో దాససత్య! సదాపరిపూర్ణః।
కథం వహాసి పక్షపాతం
పాండవ ప్రముఖేషు ప్రేషణ మపి సహమానః॥

22. విషమే కర్మమార్గే
విపరిస్ఖలతాం విహ్వలిత కరణానామ్।
నాథ నిఖిలానా మన్యో
నాస్తిత్వ న్నతసత్య! హస్తాలంబః॥

23. జ్ఞానస్యకోఽ విషయః
అచ్యుత కరుణాయాస్తవ కోదూరస్థితః।
శక్తేః కోఽతి భరః
తస్మాత్ ఖలూపాయ స్త్వమేవ స్వయం సిద్ధః॥

24. సంకల్ప కర్ణధారః
కింకర సత్య! భవసాగరేఽతి గభీరే।
అనఘస్త్వం ఖలు పోతః
ఆత్మనాం కృపాసమీరణేన ప్రవృత్తః॥

25. అచ్యుత నదదతి మోక్ష
మీశ్వర భావేన భావితా ఇతర సురాః।
రాత్రిం పరివర్తయితుం
లక్ష మాలేఖ్య దినకరాణామపి నక్షమమ్॥

26. అమృతరస సాగరస్యేవా
హీంంద్ర పురనాథ! నిర్మల మహోర్ఘాణి।
తీర్యన్తే న విగణయితు
మనన్య సులభాని తవగుణ రత్నాని॥

27. భూషిత శ్రుతి సీమంతో
భుజగేంద్ర పురేశ సర్వగుణ సేమాంతః।
క్షపిత తృషామల మోహో,
మునీనాం హృదయేషు స్ఫురసిశ్యామల మయూఖః॥

28. శుభలక్షణ శ్రీవత్సః
శోభసే నిర్ముక్త విరహక్షణ శ్రీవత్సః।
రణదేవన సవిధగత
ఉద్ధత గరుడ నదీతీరవన సవిధ గజః॥

29. అకుమార యౌవన స్థితం
అహీంంద్ర పురనాథాభిమత మనురూపమ్।
నిత్యం స్వభావసిద్ధం
శ్రూయతే సూరిమహితం సుఖం తవ రూపమ్॥

30. త్రిగుణం తస్య వికారాః
అచ్యుత పురుష ఇత్యాగమ గణ్యమానాః।
అర్థాస్తవఖిలు సమస్తాః
పరస్మిన్ రూపే భూషణాస్త్ర రూపాః॥

31. నిర్యాంతి త్వత్తోఽచ్యుత
నిక్షపిత విపక్ష నిష్ఠుర పరాక్రమణాః।
సంస్థాపిత పరమ ధర్మాః
సాధుపరిత్రాణ సత్ఫలా అవతారాః॥

32. హరిమణి సదృక్ష నిజరుచి
హరితాయమాన భుజగేంద్రపుర పర్యన్తః।
కాలే దాసజనానాం
కృష్ణఘనో భవసి దత్త కారుణ్యరసః॥

33. గరుడ నదీకచ్ఛారణ్యే
లక్ష్యసే లక్ష్మీ మహీకరేణు మనోహరః।
దృశ్యమాన బహుళదానో
దిశా గజేంద్ర ఇవ ఖండిత దను జేన్ద్ర ద్రుమః॥

34. ముఖ చంద్రమౌళి దినకర
మధ్యస్థితస్తవ చికుర భారాంధకారః।
అఘటిత ఘటనాశక్తిం
సత్యం స్థాపయతి దాససత్య! సమగ్రామ్॥

35. పరిహసిత పూర్ణచంద్రం
పద్మ సదృక్ష ప్రసన్న లోచన యుగళమ్।
సంకల్పిత దురితాన్యపి
సంస్మృతం హరతి దాస సత్య! తవ ముఖమ్॥

36. మాహాత్మ్యంతవ మహితం
మాంగళికం తులసీ కౌస్తుభ ప్రముఖానామ్।
అచ్యుత! స్థిర వనమాలం
వత్సం దర్శయతి లక్ష్మీలక్షణ సుభగమ్॥

37. నిర్విశతి నిత్యతాపో
దేవజనో దేవనాయక! విధి ప్రముఖః।
శీతల సాంద్రప్రభూతాం
ఛాయాం తవవిపుల బాహు కల్పద్రుమాణామ్॥

38. సంకల్ప చంద్రక్షోభిత
త్రిగుణోదధి విపుల బుద్బుద ప్రకరైః।
బ్రహ్మాండై రపి భరితం
కింకరసత్య! తవకస్మాన్ను కృశముదరమ్॥

39. నాభిరుహం తవ నళినం
భుజగేశ్వర నగర నాథా! శోభతే సుభగమ్।
మధ్యస్థిత బ్రహ్మా భ్రమరం
వత్సాసన లక్ష్మీపాదపీఠ సదృక్షమ్॥

10. దృఢ పీడిత మధుకైటభ
శోణిత పటల పరిపాట లాంబర ఘటితా।
రాజత్యచ్యుత! ముఖరా
రతినాథ గజేంద్ర శృంఖలా తవరశనా॥

11. దాసానాం సత్య! దృశ్యతే
దానవ వీరాణాం దీర్ఘ నిద్రా శయనమ్।
తవో దరస్థిత త్రిభువన
ప్రాసాద స్తంభ సచ్ఛాయ మూరుయుగమ్॥

12. జానుమణిదర్పణేన చ
జంఘా మరకత కళాచికయా చ ధన్యా।
అచ్యుత! నముంచతి కాంతిః
లక్ష్మీరివ సరోజలాంచనౌ తవ చరణౌ॥

13. శ్రుతి సీమంత ప్రసూనం
శోభతే నతసత్య! తవ సర్వశరణ్యమ్।
క్రమణక్షణ జనిత సురనదీ
ప్రశమిత త్రైలోక్యపాతకం పదపద్మమ్॥

14. ఇతి త్రిభువనైకమూలం
ఆస్వాదయంత్యనఘా అమృత స్వాదు రసమ్।
ఓషధి మహీధర పార్శ్వే
ఉదితం త్వామోషధిమివ దాసరు జామ్॥

45. సిద్ధాంజనమివ శ్యామం (మాం)
తవ తనుం నిజవిలోచనే సుక్షిపంతః।
అచ్యుత! లక్ష్మీ నివాసం
నిత్య నిగూఢం నిధిమివ పశ్యంతి త్వామ్॥

46. విఘటిత నిబిడాంధకారో
ఘట మానజ్యోతిస్త్రి లోకైక గ్రహ (గృహ) పతిః।
దృష్టిగతో యేషాంత్వం
నమత్సుత్య! నఖలు తేషాం మోహాత్రియామా॥

47. విషయరసే స్వపంతో
వికార జననైరపి నఖలు విక్రియ మాణాః।
జీవన్ముక్త సదృశా
అచ్యుత! దృశ్యంతే పావనాస్తవ భక్తాః॥

48. గంధర్వ నగర స్వప్న
సదృక్షాణాం శ్రియాం వన సరితామ్।
నస్మరతి త్వ ద్గృహీతః
శరణాగత సత్య సదామదో జీవగజః॥

49. న మహయంతి జ్ఞానవంతః
తరంగ డిండీర బుద్బుద సదృక్షాణి।
విధి ప్రముఖానాం పదాని
ఘనకందళీ కంద కదళీస్తంభ సమాని॥

50. దృష్ట స్వపర స్వభావాః
పురుషా గృహీత్వా స్వామిన స్తవ శీలమ్।
నాథ! నత సత్య! సఘృణాః
న ముంచంతి కథ మపి సర్వజన సౌహార్దమ్॥

51. మానమదేర్ష్యామత్సర
దంభాసూయా భయామర్షలోభముఖాః।
దృశ్యంతే న మోహసుతాః
దోషాదాసానాం సత్య! తవ భక్తానామ్॥

52. యేషాం మతి రితర ముఖీ
కాలః సకలోఽపి తేషాం కలివిస్తారః।
యే తవ పదే ప్రవణాః
నాస్తి కలిర్నాగపతి నగరపతే! తేషామ్॥

53. అత్యాసన్న వినాశాః
అచ్యుత! పశ్యంతి తావకే భక్తిజనే।
మోక్ష రుచీనాం సుమార్గే
మూఢా దివసకర మండల ఇవ ఛిద్రమ్॥

54. నిస్త్రుటిత (ఖండిత) దుర్మాన ఘనాః
నిర్మలగుణ ఘటిత తారకా ప్రాగ్భారాః।
భాసమాన భక్తి జ్యోత్స్నాః
నతసత్య! స్ఫురంతి నభో నిభాస్తవ భక్తాః॥

55. నఖలు యమవిషయే గతిః
నతసత్య! పదామ్బుజంతవ ప్రపన్నానామ్।
స్ఖలితానామపియథా యోగ్యం
శిక్షా శుద్ధాన్త కిఙ్క రాణామివలక్ష్మ్యా॥

56. కర్మగతి దోష దుఃఖితాః
కృతాంత భ్రుకుటీ భుజంగీ దర్శన త్రస్తాః।
అర్చంతి తవ చరణౌ
అచ్యుత! ప్రభ్రష్ట మన్మథ రసాస్వాదాః॥

57. ఆలగతి తవచరణే
అచ్యుత! విధినాఽ ప్యర్చనాఽ ఽ చరితా।
యైకాంతి ప్రయుక్తా
శేషా మివ స్వయం శిరసా ప్రతిగృహ్ణాసితామ్॥

58. తవ ముఖ జ్యోత్స్నా ద్రావిత
మానస శశికాంత ప్రవాహసన్నిభ బాష్పాన్।
అచ్యుత! నముంచసి భక్తాన్
కదంబ గోళ నిభ కంటకాయమాన నిజాంగాన్॥

59. సర్వేష్వపి నిర్వైరాః
శరణాగత సత్య! గృహీత శాశ్వత ధర్మాః।
గతసంగా స్తవభక్తాః
యాంతిత్వా మేవ దుర్లభమితరైః॥

60. అహి పతి నగరీంద్ర! త్వాం
ఆసన్నమపి గగనమివ సదా దుర్గ్రాహ్యామ్।
విషయేషు విలగంతః
త్వరమాణా అపి న లభంతే డోలాయమాన మనసః॥

61. భక్తాస్తావక సేవా
రసభరితా స్సకల రక్షణోత్సుక రుచినా।
కరణాని ధరంతి చిరం
కాంక్షిత మోక్షా అప్యచ్యుత! త్వయాస్థాపితాః॥

62. స్థిరగుణ గిరిజనిత్యైః
సంతారయసి నతసత్య నిజభక్తైః।
జన్మపరిపాటి జలధిం
జంగమ స్థిరసేతు దర్శనీయైర్జనాన్॥

63. ప్రశమిత భవాంతరభయాః
ప్రాప్తం ప్రాప్తం హితమితి పరిపశ్యంతః।
భావయంతి తవ భక్తాః
ప్రియా తిథిమివ నతసత్య! పశ్చిమ దివసమ్॥

64. ప్రకట తిమిరే భువనే
పాత్ర ప్రతిష్ఠాపిత పరమజ్ఞాన ప్రదీపాః।
నీయంతేఽచ్యుత! త్వయా
నిజం పదం సదా స్వయం ప్రభం కృతకార్యాః॥

65. దృఢ తీవ్ర భక్తి నయనాః
పరిపశ్యన్తోఽహీంద్ర పురనాథ! త్వామ్।
ప్రాప్తాస్తవసాయుజ్యం,
పంక్తిం పూరయన్తి పన్నగేంద్ర ముఖానామ్॥

66.. సన్నతసులభమచ్యుత!
సమాధిసోపాన క్రమ విలంబ విముఖితాః।
శరణం గత్వాత్వాం
ముక్తా ముచుకుంద క్షత్రబంధు ప్రముఖాః।

67. దేవానాం పశుసమానో
జంతుర్గత్వా దేవనాథ! తవ పదమ్।
తైరేవ సర్వైః
సంసర మాణైః భవతిసదా దత్త బలిః॥

68. మోహాంధకార మహార్ణవ
మూర్ఛిత మాయా మహా రజనీ ప్రత్యూషః।
అచ్యుత! తవ కటాక్షో
విముక్తి ప్రస్థాన ప్రథమ పరికర బంధః॥

69. మోక్షసుఖ వృక్షమూలం
మోహజరాతుర మహారసాయన ప్రవరమ్।
సకల కుశలైక క్షేత్రం
కింకరసత్య! తవకీర్తన మమృత నిభమ్॥

70. నాస్త్య భిక్ర మనాశో
విచ్ఛేదేఽపి నప్రత్యవాయ ప్రసంగః।
స్వల్పాఽపి తవ సపర్యా
రక్షత్యచ్యుత! మహత్తరాత్ భయాత్॥

71. అప్రసాదేఽ ప్రసన్నాః
తవ ప్రసాదే దాససత్య! ప్రసన్నాః।
ఆరాధ్యా భవంతి పరే
కింతైః ప్రసంగలంభిత ప్రభావైః॥

72. ఇతర త్రిదశాః ప్రసన్నాః
కింకర సత్య! మమకింను కరిష్యంతి హితమ్।
నీహారఘున శతైః
నఖలు పూర్యతే కథ మపి చాతక తృష్ణా॥

73. అనుగత సుఖమృగతృష్ణా
అచ్యుత! విశ్రామ్యతి తవ మామక తృష్ణా!
ప్రవాహేషు ప్రసృతాయాః
ఆశ్రిత ప్రవహద్ఘన కృపా సరితః॥

74. వికల సకలాంగ విషమాన్
ధర్మాన్ నతసత్య! ధ్వజనిభాన్ ధారయన్।
కాంతార పాంథక ఇవ
స్థల చ్ఛరణోఽస్మి కాతర విశీర్యమాణః॥

75. స్థిర ధర్మ వర్మస్థగితం
అధర్మ ప్రవణానా మగ్రస్కంధ ప్రవృత్తమ్।
అఘటమాన విప్రతీసారం
అచ్యుత! మాంహసని నూనం లక్ష్మీ సమక్షమ్॥

76. తరితు మచ్యుత దురితం
అస్మిన్ దేహ ఏకదివసేఽపి కృతమ్
కాలోఽలం నసకలః
కరుణాయాస్తవ పూర్ణ పాత్రమస్మ్యయమ్॥

77. అచ్యుత! తవగుణా నాం
మమదోషాణా మపి నాస్తికు త్రాపి గణనా।
తథాఽపి జయః ప్రథమానాం
అధికం లీనానాం భవతి నఖలు దౌర్బల్యమ్॥

78. రాత్రిం దివసమచ్యుత!
త్రుటిత పతమానాన్యా యుర్ద్రుమ ఖండాని।
దృష్ట్వాఽపి దృప్తమనసం
బాల మిదానీ మపి భరస్వమా మప్రమత్తః॥

79. నిశ్వాస శంకనీయే
దేహే పటలాంత సలిల బిందు సదృక్షే।
జానాసి నతసత్య! త్వం
జరత్ కరణేఽపి దీర్ఘయౌవన తృష్ణామ్॥

80. అజ్ఞాత నిజకర్తవ్యం
తిలాగ్ర జ్ఞాతేషు మామపిప్రతికూలగతిమ్।
ఇతి నిజస్వభావ వ్రీడితం
హాతుం దాసానాం సత్య! నఖలు తవయుక్తమ్॥

81. కోఽహం కింకరణీయం
పరిహరణీయ మపి కిమితి జానాసి సర్వమ్।
శక్నోషి చ తద్ధితం మమ
త్రిదశేశ్వర! కురుష్వ నిజహృదయ నిక్షిప్తమ్॥

82. ఇదా నీ ముపర్యప్యయం
గుణగృహీతో దారుపుత్రక ఇవ పరవశః।
తస్యాపి మమత్రిదశేశ్వర!
త్రిష్య పి కరణేషు భవ సుఖ సంకల్పః॥

83. నిజకర్మ నిగళ యుగళం
అచ్యుత! కృత్వామమ ప్రియాప్రియవర్గే।
కదా గోర కళేబర
కారాగృహ కుహర నిర్గతం కరిష్యసిమామ్॥

84. హార్దే త్వయి కదా
విశ్రాంతం బ్రహ్మాధమని మార్గ గమిష్యంతమ్।
దినకరదత్తాగ్ర కరం
అచ్యుత! ద్రక్షసి దయిత డింభమివ మామ్॥

85. కదా అమానవాంతా
అగ్ని ముఖా ఆతివాహికాస్తవ పురుషాః।
అతిలంఘ యిష్యంతి మాం
అచ్యుత! తమో గహన త్రిగుణ మరుకాంతారమ్॥

86. లంఘిత విరజాసరితం
లంభిత సదా శుద్ధ సత్వమయ సౌమ్యతనుమ్।
కృత బ్రహ్మాలంకారం
కరిష్యసి నతసత్య! కింకరం కదా మామ్॥

87. సంసార సాగరాత్
ఉక్షిప్తం త్రిదశనాథ! స్ఫురితా లోకమ్।
కదా కరిష్యసి హృదయే
కౌస్తుభమణి దర్పణమివ లక్ష్మీదృష్టమ్॥

88. కదా తవ పద పద్మే
భవిష్యామి నతసత్య! కేళిక్రాంత త్రిభువనే।
మదనరిపు మకుటమండన
సురసరి త్స్రోతస్సూచిత మధు ప్రవాహే॥

89. ఉపనిషచ్ఛిరః కుసుమం
ఉత్తం సయిత్వా తవ పదాంబుజ యుగళమ్।
దయితో భవిష్యామి కదా
దాసోదాసానాం సత్య! సూరి సదృక్షః॥

90. అపునర్నివృత్తి యోగ్యం
అవతార విహార సహచరత్వ ధన్యమ్।
ఆత్మ సమభోగ మాత్రం
అనుభవిష్యసి దేవనాథ! కదా ను మామ్॥

91. ఇతి స఼్ుట మనోరథ మాం
ఏతా దృశ వచన మాత్ర సారం వశగమ్।
కురుష్వ నిజగుణ గణైః
సత్యం దాసానాం సత్య! సదా స్వచ్ఛందః॥

92. బాల ప్లవగ ఇవ తరళో
మారుతి జాతి రితి సాగరం తరితుమనాః।
ప్రార్థయే త్వామచ్యుత!
కాంక్షిత పదపద్మ! క్షమస్వమమకాపేయమ్॥

93. అచ్యుత! విషయాక్రాంతం
భవార్ణవావర్త భ్రమి నిమజ్జంతమ్।
జననీ స్తనంధయ మివమాం
ఉద్ధృత్య సేవస్వ స్వయం పథ్యమ్॥

94. కర్మమయ ఘర్మ తప్తం
సుఖమృగ తృష్ణాభిః కదాఽ ప్య తృష్ణాకమ్।
కారయ నిర్వృతం మాం
కరకాశిశిరై రచ్యుత! కటాక్షైః॥

95. తవ చింతన విముఖానాం
దృష్టి విషాణామివ దర్శనా న్మోచయన్।
అమృత ముఖానా మివమాం
అచ్యుత! భక్తానాం నయస్వ నయనా సారమ్॥

96. విషమిళిత మధునిభేషు చ
తృణ ప్రతిమేషుచ ప్రతిగ్రహేషు ప్రలురితమ్।
అమృత నిధా వివాచ్యుత!
స్థాపయ త్వయి నిర్మమం మమ హృదయమ్॥

97. నిత్యమస్మిన్ కృపణో
నిక్షిప నమత్సత్య! నిధి సదృక్షౌ।
ప్రపహన్నఖ ప్రభాఝర
ప్రశమిత ప్రణమత్సంజ్వరౌ తవ చరణౌ॥

98. శరణాగత ఇతి జనితే
జనవాదేఽపి యద్యచ్యుత! నరక్షసి మామ్।
భవేత్ ఖలు సాగర ఘోషః
సాగర పులినే తాదృశం తవ వచనమ్॥

99. నిక్షిప్తోఽస్మి చాగతిః
నిపుణైస్త్వయి నాథ! కారుణికైః।
తాం స్తవదృష్ట్వా ప్రియాన్
నిభృతం నతసత్య! భరస్వాత్మ నో భరమ్॥

100. నతసత్త్య! పక్కణానీత
గళిత కిరాత భ్రమ నిజకుమార మివ నృపః।
భవిష్యద్యౌవన వధూం
వర ఇవ మాం లభస్వ మంత్రిజన విజ్ఞాపితమ్॥

101. ఇతి కవితార్కిక కేసరి
వేదాన్తాచార్య వేంకటేశ విరచితమ్।
సుభగ మచ్యుత శతకం
సహృదయ హృదయేషు శోభతాం సమగ్ర గుణమ్॥



శ్రీమదచ్యుతాయనమః
శ్రీనిగమాన్త మహాదేశికాయనమః

# శ్రీ- అచ్చుఅ సఅఅమ్- శ్రీఅచ్యుత శతకమ్

## జ్యోతిర్మయీ వ్యాఖ్యా సహితమ్

శ్రీమాన్ వేంకట నాథార్యః కవితార్కిక కేసరీ!
వేదాన్తా చార్య వర్యోమే సన్నిధత్తాం సదాహృది॥

1. ణమహ తిఅసాణ ణాహం
సచ్చం దాసాణ అచ్చు అం ఠిరజోఇమ్
గఉల ణ ఇతడ తమాలం
అహింద ణ అరోసహా అలేక్క గఇన్దమ్॥

ఛాయా॥ నమత త్రిదశానాం నాథం,
సత్యం దాసానామచ్యుతం స్థిరజ్యోతిః
గరుడ నదీతట తమాలం
అహీంద్ర నగరౌష ధాచలైక గజేన్ద్రమ్॥

**అర్థం:** త్రిదశానాం= దేవతలయొక్క- నిత్యసూరులయొక్క; నాథం= నాథుడైన; గరుడ నదీ తట తమాలం= గరుడ నదియొక్క తీరమందున్న కానుగుచెట్టువలె నున్నట్టి; అహీంద్ర నగర+ఔషధ+అచల+ఏక గజేంద్రం= అహీంద్రపురం దగ్గఱ ఉన్న ఔషధ మనే పేరుగల పర్వతమందు అద్వితీయమైన గజేంద్రం వంటివాడైన; స్థిర జ్యోతిః= చలించని తేజస్సుగలిగినట్టి; దాసానాం= భక్తులకు; సత్యం= సత్యమైనట్టి; అచ్యుతం= ఆశ్రయించిన వారిని చేజాఱవిడువనట్టి-సర్వేశ్వరుని గూర్చి; నమత= నమస్కరించండి.

**తా॥** నిత్యసూరులకూ, బ్రహ్మాది దేవతలకూ నాయకుడు అయిన సర్వేశ్వరుడు గరుడ నదీ తటమందలి తమాలతరువు వలెను అహీంద్రపుర సమీపమందున్న ఔషధ గిరియందు అద్వితీయమైన ఒక మహాగజము వలెను గొప్ప మహిమతో ప్రకాశిస్తున్నాడు. ఆ స్వామి మార్పులేని గొప్ప తేజస్సు కలవాడు. దాసులకు సత్యమైనవాడు కాబట్టి ఆశ్రయించిన తన భక్తులను ఎప్పుడు కూడా విడవకుండా రక్షించే దేవనాయకుని సన్నిధిలో సాష్టాంగ ప్రణామం చేయవలెను.

**జ్యోతిర్మయీవ్యాఖ్య:** ఈ స్తోత్రారంభమందు దేవనాయకస్వామికి నమస్కార రూపమైన మంగళాచరణం సుశ్లోకితం.

సర్వతంత్ర స్వతంత్రులు, వేదాన్తాచార్యులు అనే నామాంతరం కలిగిన శ్రీ మద్వేంకటనాథాచార్యులు సంసారమనే దావాగ్నిచే దందహ్యమానులవుతున్న చేతనుల సంరక్షణార్థం, ఔషధాచల ప్రాంతమందు అధివసించిన, అఖిల కల్యాణగుణ నిధానుడైన స్తవప్రియుడైన 'దేవనాథ' భగవానుని గూర్చి అధిక భక్తితో 'అచ్యుత శతక'మును ప్రాకృత భాషలో రచించి స్తుతించారు. దాని ఛాయను కూడా సంస్కృతభాషలో సమకూర్చారు. "తా మర్చయేత్, తాంప్రణయేత్, తాంవదేత్, తాం విచిన్తయేత్"- అర్చామూర్తిని పూజించాలి, దండం సమర్పించాలి, స్తుతించాలి మరియు ఎల్లప్పుడు ఆ దేవనాథుని స్వరూప, రూప, విభవ, గుణ, కర్మలను స్మరించాలి- అనే శౌనక మునీంద్రుని సూక్తి ప్రకారం, దేవనాయకుడైన శ్రియః పతికి నమస్కరించవలెనని ఈ శతకంలో మొదట బోధింపబడింది. "ఉయ్యలల్లాల్ మత్తైయార్క్కు ఉయ్యలాయే" అన్న విధంగా, అర్చావతార ప్రావణ్యమే ఉజ్జీవన హేతువు. ఆళ్వార్లు అందఱు అర్చామూర్తి వైభవాన్ని మనసారా అనుభవించి, శరణాగతి జేసిన వారే కదా! "తొళుదెన్మననే"- (తి.వా.మొ. 1-1-1) అన్నట్లు 'నమత' సర్వచేతనోద్దేశంగా బోధింపబడిన పదమందు స్వీయ నమస్కారమూ అర్థాత్ సిద్ధిస్తుంది. 'ణము-ప్రహ్వత్వే' అను ధాతువు యొక్క 'లోట్' మధ్యమపురుష బహువచనం ఇది.

త్రిదశానాం నాథం:- "అయర్వఱు మమరర్గళదిపతి యవనవన్" మరుపులేకుండా నిత్యసిద్ధమైన పరమాత్మ జ్ఞానం కలిగిన నిత్యసూరులకు అధిపతియైన శ్రీ మన్నారాయణుడే దేవనాయకుడు. "త్రిదశ పరిమాణం వయః యేషాంతే త్రిదశాః"- ఎప్పుడూ, ముప్పది (30) ఏండ్లకు లోబడిన వయస్సు కలవారు అని వ్యుత్పత్త్యర్థం, కాబట్టి 'త్రిదశులు' అంటే దేవతలకు ఆ పేరు కలిగింది. మహామహిమగల బ్రహ్మరుద్రేంద్రాది దేవతలకు కూడా దేవుడైన వాడని, స్తవ్యుడైన దేవనాయకుని పేరు ప్రకాశింపజేయబడింది.

స్థిరజ్యోతి:- జ్యోతి శ్శబ్దానికి తేజస్సు అని అర్థం. నిరతిశయదీప్తి యుక్తమైన జ్యోతిస్సు పరమాత్మయే. ప్రాకృత పురుషులకు గల తేజస్సుకు మార్పు ఉంటుంది. అప్రాకృత పురుషుడైన దేవనాయకునికిగల తేజః ప్రాచుర్యంవల్ల 'స్థిరజ్యోతిః' పరంజ్యోతిః, అంతర్జ్యోతిః అని వేదాన్తశాస్త్రంచే ప్రతిపాదింపబడింది.

"జ్యోతిశ్చరణాభిధానాత్" (బ్ర.సూ. 1-1-25) జ్యోతిశ్శబ్ద వాచ్యుడైన పరబ్రహ్మకు సర్వభూతాలు ఒక్కపాదంగా చెప్పబడింది. "తస్య భాసా సర్వమిదం విభాతి" ఆ దివ్య విగ్రహకాంతిచేత సర్వం ప్రకాశిస్తుంది.

"అథయదతః పరోదివో జ్యోతి ర్దీప్యతే విశ్వతః పృష్ఠేషు సర్వతః పృష్ఠేషా అనుత్తమేషాత్తమేష లోకేష్విదం వావత ద్యదిద మస్మిన్నంతః పురుషేజ్యోతిః"- (ఛాం. 3-13-7) విద్యుల్లోకానికంటే పైన, ప్రాణివర్గం మీదను, భూలోకం మీదను అంతకంటె ఉత్కృష్ట లోకాలమీదను ప్రకాశిస్తున్న జ్యోతిస్సే పురుష శరీరమందును ప్రకాశిస్తున్నది.

"అహం వైశ్వానరోభూత్వా ప్రాణినాం దేహమాశ్రితః"- (భ.గీత) జాఠరాగ్ని భగవదాత్మకమే కదా!

"పాదోఽస్య విశ్వాభూతాని త్రిపాదస్యామృతందివి" (పు.సూక్తం) భూతాది సకల పదార్థాలు ఒక్కపాదం. మిగిలిన మూడు పాదాలు ద్యులోకమందు అమృత స్వరూపమని చతుష్పాత్తుగా చెప్పబడినదైన పరమపురుషునిది "ఆదిత్య

వర్ణం తమసః పరస్తాత్"- అప్రాకృత శరీరమని శ్రుతిచే ప్రతిపాదింపబడింది. ఆయన తేజస్సు కూడా అప్రాకృతమే. అప్రాకృత తేజస్సుతో కూడిన వాడైనందున పరమపురుషుడు జ్యోతిశ్శబ్ద వాచ్యుడని శ్రీ భాష్యం విశదపరచింది. ఆభరణాలతో కూడిన మంగళ విగ్రహం అవిక్రియకాంతిమంతం.

గరుడ నదీ తటతమాలం:- ఔషధాచల పాద ప్రదేశమందు ప్రవహించే గరుడ నదియొక్క తటమందు పెరిగిన పచ్చని కానుగుచెట్టువలె శోభించేవాడు దేవనాయకుడు. తమాల తరువు, దట్టమైన చీకటి క్రమ్మినట్లు ఆశ్రయించిన వారికి చల్లని నీడనిచ్చి, తాపాన్ని శమింపజేస్తుంది. దేహానికిగల నొప్పులను పోగొడుతూ ఉల్లాసాన్ని, ఉత్సాహాన్ని కలిగించి ఉత్తేజితులను చేస్తుంది.

*"వాసుదేవ తరుచ్ఛాయా నాతిశీతా నఘర్మదా। నరకాంగారశమనీ"*- అంతట వసించి ప్రకాశించే వాసుదేవ తరువుయొక్క ఛాయ (కాంతి) ఎక్కువ వేడి, ఎక్కువ చల్లదనం లేనిదై, నరకమనే అగ్నిని ఆర్పివేస్తుంది. కావున "నివాస వృక్షః సాధూనాం"- సజ్జనులు నివసించే వృక్షం పరమాత్మ- అనబడింది. "వరుణో వారునక్ష వృక్షః" - అని శ్రీవిష్ణు సహస్రనామ స్తోత్రంలో వృక్షశబ్ద వాచ్యుడు దేవనాథుడు.

తమాలతరువుతో పోల్చబడినందున దేవనాయకుడు శ్యామలవర్ణ విగ్రహుడన్న భావమూ స్ఫురించును కదా! *"గరుడ సరిదనూపే గంధహాస్తీవదేవ్యన్"* (దే.నా.పం) అన్నారు దేశికులు.

అహీంద్ర నగరౌషధాచలైక గజేంద్రం:- అహీంద్ర నగర సమీపమందున్న ఔషధాచలమందు వేంచేసి, సంచరించే గజ యూథపతి దేవదేవుడు. ఇక్కడ 'ఏక' శబ్దం *'దేవ ఏకో నారాయణః, నద్వితీయోఽస్తి కశ్చిత్. స విష్ణురేవ భవతి'* అనే ఉపనిషదర్థాన్ని ఇస్తుంది. అంతే కాదు. *"నతత్సమశ్చాభ్యధికశ్చదృశ్యతే"*- దేవనాయకునితో సమానుడుగానీ, అధికుడు గానీ కనబడదు- అనే వేదాంత

శాస్త్ర వాక్యార్థమూ ఉంది. "కళిఱు వినవినిత్తీర్" ఏనుగును వెదకి నిల్చినారు- అని శఠకోప నాయకి భగవంతునితో అన్నారు (తిరువిరుత్తం-15).

దాసానాం సత్యం:- తన భక్తుల విషయంలో తాను చేసిన దృఢమైన సంకల్పం యొక్క ఫలాన్ని కృపజేసేవాడు దేవనాయకుడు. 'దాసానాం' అనే పదం 'సత్యం'- 'అచ్యుతం' - అనే రెండు పదాల నడుమ 'దేహళీదీపం'గా (కడపమీద పెట్టిన దీపంవలె) ముందుకు, వెనుకకు కాంతి కల్గునట్లు ప్రయుక్తం. దాసానాం సత్యం, దాసానామచ్యుతం అని అన్వయార్థం.

"అనృతం నోక్త పూర్వం మే న చ వక్ష్యేకదాచన।
ఏతత్తే ప్రతిజానామి సత్యేనైవ శపామ్యహమ్" (రా.కి. 7స. 22)

నేను ఇంతకు ముందు అబద్ధమాడలేదు. ఇక భవిష్యత్తులో కూడా ఎప్పుడు అసత్యం చెప్పను. ఈ సమయంలో నీతో అన్న మాటను పూర్తి చేయడానికి ప్రతిజ్ఞ చేస్తున్నాను. నీకు విశ్వాసం కల్పించడానికి సత్యమైన శపథం చేస్తున్నాను- అని శ్రీరాముడు సుగ్రీవునియెదుట దృఢప్రతిజ్ఞ చేశాడు.

"అప్యహం జీవితం జహ్యాం త్వాం వా సీతే సలక్ష్మణామ్।
నతు ప్రతిజ్ఞాం సంశ్రుత్య బ్రాహ్మణేభ్యో విశేషతః" (రా. అయో. 10స. 18)

ఓ సీతా! నేను నా ప్రాణాన్నైనా త్యజించగలను. నిన్ను మఱియు లక్ష్మణున్ని కూడా పరిత్యజించగలను. కాని నా ప్రతిజ్ఞను, పైగా బ్రాహ్మణులకోసం చేసిన ప్రతిజ్ఞను మాత్రం, నేనెప్పుడు కూడా భంగం చేయజాలను అన్నాడు రాముడు.

"నమే మోఘం వచో భవేత్" నా మాట వ్యర్థం కాజాలదు అన్నాడు శ్రీకృష్ణుడు.

"ఆడియ వర్కు మెయ్యనాకియ దెయ్వ నాయకన్"- (పెరియ తి.మొ. 3ప- 3పా) తన దాసులకు సత్యమైనవాడు- దృఢ ప్రతిజ్ఞ కలవాడు దేవనాయకుడు

అని తిరువయిందిరపురమున వేంచేసియున్న అర్చామూర్తి మహిమను తిరుమంగైయాళ్వార్లు స్తుతించారు.

"త్వత్పాదయుగళం ప్రాప్యయః కశ్చిదిహ సంస్కృతిమ్
నవిందతి చ్యుతందేవ! తస్మాదచ్యుత నామవాన్!"

అచ్యుతం:- నాస్తిచ్యుతం (స్ఖలనం స్వపదాత్) యస్యసః= అచ్యుతః. తన చోటు నుంచి భ్రంశము నొందని వాడు అచ్యుతుడు.

"నమే భక్తః ప్రణశ్యతి" (భ.గీత). నా భక్తుడు నశించడు అని శ్రీకృష్ణుని వాక్సుధ. నాస్తిచ్యుతం (చ్యుతిః) యస్మాత్ సః= అచ్యుతః. ఎవరినుంచి చ్యుతియుండదో అతడు అచ్యుతుడు- అని మరొక వ్యుత్పత్త్యర్థం. నచ్యావయతి ఇతి= అచ్యుతః= జారవిడువనివాడు. అచ్యుతుడు, తాను భ్రంశమునొందదు; తన నాశ్రయించిన భక్తులను భ్రంశమునొందనీయడు. దేశికులు భగవద్గుణాల యందు ఆదరాతిశయం కలవారైనందున అనంత కల్యాణగుణాలుగల అహీంద్ర పురమందలి దేవనాథుని పాద యుగళమందు 'దేవనాయక పంచాశత్' (శ్లో.50) రచించి, హృదయావర్జకమైన ప్రాకృత భాషలో వంద శ్లోకాలు గల శతకాన్ని సమర్పించాను- అని "నవరత్తిన (మణి) మాలై-10)" ప్రబంధమందు చెప్పబడింది. కాబట్టి, వేంకటనాథనాయకి దేవనాయక పంచాశత్ స్తోత్రం తర్వాత ప్రేయసీ భావంతో 'అచ్యుత శతకాన్ని' రచించారు.

దేవనాయకుడు 'దాస సత్యుడు, అచ్యుతుడు' అనే పదాలతో స్వామిని కీర్తించారు. "అన్దమిల్ శీర్ అయిన్దైనగర్ అమర్న్దనాదన్ అడియిణై మేల్ అడియురై *యాల్ ఐమ్ పదు ఏత్తి, శిన్దై కవర్ పిరాకిరుద నూఱు కూఱి*".

'త్రిదశనాథుడు' అనడం వల్ల "నిత్యోనిత్యానాం చేతనశ్చేతనానాం"- నిత్యులలో నిత్యుడు, చేతనులలో పరమచేతనుడు- అనే ఉపనిషదర్థాన్ని ప్రకటిస్తూ, పరత్వ స్వామిత్వాలు ప్రకాశింపజేయబడినాయి. 'దాస సత్య'త్వం చేత ఆశ్రయణ సౌకర్యమూ, ఆశ్రిత కార్య నిర్వహణ క్షమత్వమూ ప్రకటింపబడినాయి. 'స్థిర జ్యోతిష్ట్వం' వల్ల తమో నిబర్హణ స్వభావం స్పష్టీకృతం.

గరుడ నదీ తట తమాలత్వం, అహీంద్ర నగరౌషధాచలైక గజేంద్రత్వం (అనే పదప్రయోగాల) వల్ల సౌలభ్య సుఖసేవ్యత్వం, పదార్థప్రణవత్వం, గాంభీర్య, మంగళాయతనత్వాలు వెల్లడింపబడినాయి.

భక్తులను ఆహ్వానించి, ఇట్టి కల్యాణగుణ మహోదధియైన దేవనాథస్వామికి 'నమత'- నమస్కరించండి- అన్న ప్రరోచకత్వం కావ్య లింగాలంకార లక్షణం.

ఈ స్తోత్ర ప్రబంధారంభమందు ప్రబంధ గతమైన భగవద్భక్తి భావం ప్రధానంగా అభివ్యక్తమవుతున్నది. ఈ శతకంలోని శ్లోకాలన్నీ 'ఆర్యాగీతి' వృత్తంలో రచింపబడినాయి. పూర్వోత్తరార్థాల్లో 12, 18-12, 18 మాత్రలు సామాన్యంగా ఉంటాయి.

2. కింకరసచ్చ ధుఈ తుహ,
స అంభు గేహిణి విలాస వాహిత్తిమ ఈ!
ఫణి ఆ బాలేణ మ ఏ,
పంజరసుతి జప్పితం వకుణ ఉపసా అమ్!!

ఛా॥ కింకరసత్య స్తుతిస్తవ
స్వయంభూగేహినీ విలాస వ్యాహృతిమయీ।
ఫణితా బాలేన మయా,
పంజరశుక జల్పిత మివ కరోతు ప్రసాదమ్॥

**అర్థం:** కింకరసత్య= దాసులకు సత్యభూతుడైన ఓ దేవనాథా! స్వయంభూమయీ! స్వయం భూ= బ్రహ్మదేవుని యొక్క గేహినీ= పత్నియైన సరస్వతీదేవి యొక్క; విలాస= విలాసం చేత; వ్యాహృతిమయీ= పలుకబడిన ప్రాకృతభాషామయమైనట్టి; బాలేన= బాలుడనైన; మయా= నా చేత; ఫణితా= స్తుతింపబడినట్టి; స్తుతిః= ఈ స్తోత్రం; పంజరశుక జల్పితం, ఇవ= పంజరంలో ఉన్న చిలుక పలుకువలె; తవ= నీకు; ప్రసాద= సంతోషాన్ని; కరోతు= చేయుగాక.

**తా॥** నీ సేవలకులకు సత్యభూతుడవైన ఓ దేవనాయకా! బ్రహ్మదేవుని యిల్లాలైన పలుకుల వెలది వినోదంగా పలికిన ప్రాకృతభాషలో పూర్ణ ప్రజ్ఞలేని నేను నీ గుణగణాలను కొనియాడాను. కాబట్టి, ఈ స్తుతి, పంజరంలో బంధింపబడిన చిలుక నేర్పబడిన మాటలను పలుకగా సంతోషం కలిగించునట్లు, నీకు సంతోషం కలిగించుగాక.

**వ్యాఖ్య:** భగవత్ప్రీత్యర్థం చేసే ఈ స్తోత్ర రచనకు తగినంత పారీణత తనకు లేదని నిరూపిస్తూనే, స్తోత్రం చరితార్థత నొందవలెనని దృష్టాంతంగా సుశ్లోకితం.

'కింకరసత్య' అని దేవనాయకుడు సంబోధితుడు. భగవంతుడు తనను కొలిచిన వారికి సత్యభూతుడు. "కించిత్ కుర్వాణాః = కింకరాః" స్వరూపదాస్యం గానీ, గుణదాస్యంగానీ కలిగియుండి ఏ మాత్రం సేవ జేసిననూ అట్టి కింకరులను భగవంతుడు చేజాఱవిడువ నేరడు. "మిత్రభావేన సంప్రాప్తం నత్యజేయం కథంచన"– స్నేహబుద్ధితో తనను ఆశ్రయించిన వ్యక్తిని ఏ విధంగానూ విడువను– అనే దృఢ సంకల్పం కలవాడు కదా భగవానుడు. సత్యసంకల్పుడైనందు వల్ల తనకు సర్వవిధ కైంకర్యం చేసే వారిపట్ల "నస్మరత్యపకారాణాం శత మప్యాత్మ వత్తయా" (రా. అయో. 1–11) దోషాలెన్ని ఉన్ననూ వాటిని తలువకుండా ఆదరించే ప్రీతి, వాత్సల్యం కలవాడు స్వామి.

'ఆత్మవత్తయా' అనడంవల్ల స్వామి మనస్సు–సంకల్పం ఎంతో గొప్పది అని తెలుస్తున్నది కదా! "సత్యం కృతే చ శపథే తథ్యే త్రిషుతు (మేదిని) తద్వతి"

"ఎన్నడియా రదుశెయ్యార్, శెయ్‌దారేల్ నన్ఱు శెయ్‌దార్"– నా దాసులు అపరాధం చేయరు, ఒక వేళ చేసినా అది నాకు ఇష్టమే– అని చెప్పడం వల్ల, ఏ విధంగానూ నా దాసులను విడువక కాపాడుతాను అన్న అభిప్రాయమే కదా! సత్యమంటే యథార్థంగా సర్వేశ్వరుడే అని ఛాందోగ్యోపనిషత్తు (8–3) బోధిస్తుంది. "తానిహవా ఏతాని త్రీణ్యక్షరాణి. సతీయ మితి. తద్యత్సత్త దమృతం. అథ

యత్తన్మర్త్యం. అథ యద్యంతేనోభే యచ్ఛతి"- సత్= అమృతం= చేతనులు. మర్త్యం= అచేతనాలు. యమ్= ఆ రెండింటిని నియమించేది- సత్తియం- సత్యమ్ అని అర్థం.

స్వయంభూ గేహినీ విలాస వ్యాహృతిమయీ:- శ్రీమన్నారాయణుని నాభికమలమందు జన్మించిన బ్రహ్మదేవుని భార్య వాగ్దేవి. ఆమె బాల్యంలో మనోజ్ఞంగా పల్కిన భాషయే ప్రాకృత భాషగా వ్యవహరింపబడింది. వాగ్విసర్గరూపమైనది ప్రాకృతభాష.

"కోవినిందే దిమాం భాషాం భారతీముగ్ధ జల్పితామ్":- సరస్వతీదేవి మనోహరంగా భాషించిన ఈ ప్రాకృత భాషను ఎవడు ఆదరించడు? అని 'శంభురహస్య'మందు చెప్పబడింది.

ఫణితా బాలేన మయా తవస్తుతిః:- ఓ దేవా! నీ గుణగణ సముద్రమందలి ఒక బిందువును కూడా బాలుడనై, అవగాహన చేసుకొనే శక్తిలేని నేను ప్రాకృతభాషలో నిన్ను స్తుతించడానికి సాహసించాను. స్తుతించే ఆశతో యత్నించాను.

పంజరశుకజల్పిత మివ కరోతు ప్రసాదమ్:- లోకంలో విలాసవంతులు- మగువలు, మగవారు- విష్ణుపదమందు స్వేచ్ఛగా విహరించే చిలుకలను పంజరాల్లో బంధించి, ఆహార పానీయాలతో వాటిని పోషిస్తారు. వాటికి విలాసంగా మాటలను, పాటలను నేర్పుతారు. అర్థ జ్ఞానం లేని ఆ చిలుకలు నేర్పబడిన మాటలను అసంబద్ధ ప్రలాపాలుగా ఉచ్చరిస్తాయి.

"మంజు గిరః శుకాః"- చిలుకలు తేనెసోనలవలె మధుర వాక్కులను ఆలపిస్తుంటే విన్న మనుష్యులు ఆనందిస్తుంటారు.

"శెవ్వాయ్ క్కిళి నాన్మఱై ప్పాడుమ్"- ఎఱ్ఱని ముఖం కలిగిన చిలుక నాలుగు వేదాలను గానం చేస్తుంది- అన్నారు తిరుమంగై యాళ్వార్లు.

"ముహురనుకలయంతో మంజువాచః శకుంతాః"- (పాదుకా సహస్రం) దండకారణ్యంలోని మునులు 'అహల్యా శాపవిమోచనం' అనే చరిత్రను తమ గోష్ఠిలో పాడినారు. వారి ఆశ్రమ వాటికలోని తరువులపైనున్న చిలుకలు, మునులు పాడిన చరిత్రను అనుకరించి, అవ్యక్తమధురంగా ప్రతిదినం సుప్రభాతంగా పాడుతుంటాయట- అన్నారు వేదాంతదేశికులు.

దేహమే పంజరం, జీవాత్మయే చిలుక, అంతర్యామిగా ఉన్న దేవనాయకుడే మాటలను నేర్పినవాడు.

శెంగమలవల్లినాచ్చియార్‌తో కూడియున్న ఓ దేవనాయకా! నీవే అవ్యాజానుగ్రహంతో ఆచార్యరూపంగా అవతరించి దాసునికి ఉపదేశించావు. నీవు ప్రసాదించిన వాక్కునే అనుకరించాను. శుక జల్పితమైన మంజు వాక్కులాగా ఉన్న ఈ ప్రాకృత భాషామయమైన స్తోత్రాన్ని అంగీకరించుమని ప్రార్థిస్తున్నాను. ఈ స్తోత్రాన్ని విన్న వెంటనే నీ అంతరంగం అవశ్యంగా లీలా రసతరంగిత మవుతుందని ఆశిస్తున్నాను- అన్నారు దేశికులు. దేవనాథుని ఆనందం కోసమే ఈ స్తోత్రం అనుసంధింపబడిందని అర్థం. శుకజల్పితానికీ, ఈ స్తోత్రానికీ బింబ ప్రతిబింబ భావమేర్పడినందున ఇది దృష్టాంతాలంకారం.

3. మ ఇలం విభాసి అం మహ
కింకర సచ్చతుహకిత్తిజోణ్హా పసరే।
లగ్గం లహ ఉ విసుద్ధిం
రచ్ఛా సలిలం వ తివహ ఆసోత్త గఅం॥

ఛా. మలిన మపి భాషితం మమ
కింకర సత్య తవ కీర్తి జ్యోత్స్నా ప్రసరే।
లగ్నం లభతాం విశుద్ధిం
రథ్యాసలిల మివ త్రిపథగా స్రోతో గతమ్॥

**అర్థం:** కింకర సత్య= కింకరులకు సత్యభూతుడా! దేవనాయకా!; మమ= నా యొక్క; భాషితం= స్తోత్రవాక్కు; మలినం, అపి= దోషం కలదైనను; తవ= నీ యొక్క; కీర్తిజ్యోత్స్నా ప్రసరే= కీర్తి అనే వెన్నెల యొక్క ప్రసరణమందు; లగ్నం= చేరినదై; త్రిపథగా స్రోతః+గతం= గంగానదీ ప్రవాహాన్ని పొందినట్టి; రథ్యా సలిలం, ఇవ= నగర వీధియందలి నీరువలె; విశుద్ధిం= పరిశుద్ధతను; లభతాం= పొందుగాక.

**తా॥** ఓ కింకరసత్య! దేవనాథా! నేను చేసిన స్తోత్రవచనం దోష భూయిష్ఠమైనదే. అయితేనేమి? నీ యశశ్చంద్రికా ప్రసరణమందు కలిసింది కదా! నగర వీథులలో ప్రవహించే మురికినీరు, పవిత్రమైన గంగానదీ జలప్రవాహంలో చేరిపోయి పరిశుద్ధజలమైనందువల్ల లోకంలో పవిత్రంగా వినియోగపడడం మనకంటికి కనబడుతున్న విషయమే కదా!

**వ్యాఖ్య:**– స్తోత్రం మలినమైనదైననూ భగవద్గుణ కీర్తననుబట్టి పవిత్రతను పొందుతుందని వర్ణితం.

ఓ వేంకటనాథసూరీ! నీవు రచించే స్తోత్రం వాత్సల్యాన్ని ఉద్బోధించునదే అగుగాక! కాని, దోషావిలమైన నీ స్తుతివచనం నా గుణాలను ఎట్లు స్పృశిస్తుందని దేవనాయకుడు ప్రశ్నించాడు. ఆయన శంకను దేశికులు పరిహరిస్తూ ఇలాగా సుశ్లోకించారు. "ఉక్తం భాషితముదితం జల్పితం" (అమరం) 'త్రిపథగా' అంటే గంగానది. విష్ణుమూర్తి– త్రివిక్రముని యొక్క వామపాదాంగుష్ఠం నుంచి ఉద్భవించిన గంగా తీర్థం స్వర్గ, మర్త్య, పాతాళములు అనబడే మూడు లోకాలలో అవిచ్ఛిన్నంగా ప్రవహించడంవల్ల గంగానదికి 'త్రిపథగ' అనే పేరు వచ్చింది. గంగానదీ తీరాన ఉండే నగరాలలో వానకురిసినప్పుడు ఆ వీథులలో పారే మురికినీరు గంగా ప్రవాహంలో చేరిపోతుంది. గంగాజలంలో కలిసిన రథ్యోదకానికి గల మాలిన్యం– రంగుగానీ, గుణంగానీ– మారిపోయి శుద్ధజల మవుతుంది. "రథ్యా ప్రతోళీ విశిఖా" (అమరం)– గంగా ప్రవాహంలో మురికినీరు

కలిసిన తర్వాత ఇది మలిన జలమనీ, అది పరిశుద్ధ జలమనే భేదమేర్పడదు. రెండు సమాన స్థితిని పొందుతాయి. గంగాప్రవాహ జలపరిమాణం అధిక మవుతుంది. 'గంగానదీజలం స్వీకరించరాదు' అనజాలం కదా!

"త్రీన్ పథో భావయంతీతి తస్మాత్ త్రిపథగా స్మృతా"- గంగా ప్రవాహంలో చేరిన ఏ జలమైనా పునీతమవుతుంది. ఇతరులను పావనం చేసే శక్తి కూడా ఆ జలానికి అవశ్యంగా సిద్ధిస్తుంది. దేశికుల సూక్తి రథ్యోదకం లాంటిది. అచ్యుతుని కల్యాణ గుణగణౌఘం గంగా ప్రవాహం వంటిది.

దేశికుల స్తోత్రం దోషభూయిష్ఠమైనదైనా భగవద్గుణాలను కీర్తించడం వల్ల ఆ దోషం తొలగిపోయి, పావిత్ర్యాన్ని పొందక తప్పదు. కీర్తిని చంద్రిక-వెన్నెలతో పోల్చడం కవి సమయం కదా! వెన్నెలకు ధావళ్యం, తాపహరణం నైసర్గికమే.

"యథా ప్రహ్లాద నాచ్చంద్రః"- ప్రకృతిరంజకం, ప్రహ్లాదకరమైన చంద్రికను ప్రసరింపజేస్తున్నందువల్ల చంద్రుడు అనబడుతున్నాడు. దివ్యమంగళ విగ్రహం కలిగి హేయగుణ ప్రత్యనీక కల్యాణగుణైకతానుడై, ఆశ్రయించిన వారిని చేజారి విడిచిపెట్టనివాడైనందువల్లనే కదా భగవానుడు "అచ్యుతా! అడియవర్కు మెయ్యనే" అని స్తుతింపబడుతున్నాడు.

"కవే రల్పాపి వాగ్వృత్తి ర్విద్వత్కర్ణావతంసతి।
నాయకో యది వర్ణ్యేత లోకోత్తర గుణోత్తరః॥"

కవియొక్క వాగ్వ్యాపారం స్వల్పమైనదైననూ, లోకోత్తర గుణోత్తరుడైన నాయకుడు వర్ణింపబడినట్లైతే, అది పండితుల చెవులకు ఇంపైన భూషణంగానే ఉంటుంది- అనడం సామాన్యరూపం.

"తద్వాగ్విసర్గో జనతాఘ విప్లవో యస్మిన్ ప్రతిశ్లోకమబద్ధవత్యపి।
నామాన్యనంతస్య యశోంకితాని యత్శృణ్వంతిగాయంతి గృణంతి సాధవః॥"

(భాగ. 12-12-53). ప్రతి శ్లోకం అమంజులమైన, వ్యాకరణ దోషజుష్టమైన శబ్దాలతోనున్నప్పటికీ, భక్తజనుల పాపాలను క్షాళనం చేసే మాటలు భగవానుని కీర్తిని సూచిస్తున్నందువల్ల, సత్పురుషులు వాటిని వింటారు, గానం చేస్తారు, స్తోత్రం చేస్తారు అనడం విశేషరూపం. కాబట్టి, భగవద్గుణాలను కీర్తించడం పవిత్రమే అని నిరూపింపబడింది.

నగర వీథిలోని మురికినీటి కాలువ మందాకినిలో కలిసినట్లే దోషదూషితమైననూ నా స్తోత్రం, భగవానుని గుణౌఘమందు మగ్నమైనందువల్ల అనిర్వచనీయమైన శుద్ధిని సంపాదిస్తుంది. అచ్యుత స్తోత్రానికి ఇష్టప్రాప్తి, అనిష్ట నివృత్తి రూపమైన శక్తి సిద్ధిస్తుంది- అనే అధ్యవసాయాన్ని ప్రకటించారు దేశికులు.

*"ధత్తే ముకుంద మణిపాదుకయోర్ని వేశాత్*
*వల్మీక సంభవగిరా సమతాం మమోక్తిః।*
*గంగా ప్రవాహ పతితస్య కి యానివస్యాత్*
*రథ్యో దకస్య యమునా సలిలాద్విశేషః"* (శ్లో. 6)

నా వాక్కు ముకుందుని మణిపాదుకలను కీర్తించడం వల్ల వాల్మీకి వాక్కుతో సామ్యాన్ని పొందుతుంది. గంగా నదీప్రవాహంలో చేరిన రథ్యోదకానికి యమునా సలిలం కంటే ఏమంత భేదముంది? అని 'పాదుకా సహస్రం'లో వర్ణించారు దేశికులు.

ఈ శ్లోకమందు 'కీర్తిజ్యోత్స్నా' అన్న చోట రూపకాలంకారం, బింబ ప్రతిబింబ భావంవల్ల దృష్టాంతాలంకారం. 'భాషితం' అనే నపుంసకునితో 'జ్యోత్స్నా' అనే స్త్రీ సంసర్గం 'విరోధాభాసం' అలంకారంచేత అలంకార ధ్వని.

4. *తత్థరి ణ ఏణ రవిఆ,*
*సోహ ఉ తి అసాణణాహ తుజ్ఝ సమా ఏ*
*వందిత్తణ మహి ఆణం*
*మజ్ఝమ్మిసు ఈణ బాలిసా మజ్ఝథు ఈ॥*

ఛా. త్రస్తరి నయేన స్థాపితా
శోభతాం త్రిదశానాం నాథ తవ సమాజే
వందిత్వ మహితానాం
మధ్యే శ్రుతీనాం బాలిశా మమ స్తుతిః॥

**అర్థం:** త్రిదశానాం, నాథ= ఓ దేవనాయకా!; తవ= నీ యొక్క; సమాజే= సభయందు; వందిత్వ మహితానాం= మంగళస్తుతిచే పొగడబడునట్టి; శ్రుతీనాం= వేదాలయొక్క; మధ్యే= నడుమ; బాలిశా= జ్ఞానహీనమైన; మమ= నా యొక్క; స్తుతిః = స్తోత్రం; త్రస్తరినయేన= వికటకవి భాషణగా; స్థాపితా= స్థాపింపబడినదై; శోభతాం= శోభించుగాత.

**తా॥** ఓ దేవనాయకా! నీ సభలో మంగళగానంగా సంభావింపబడే శ్రుతుల మధ్య నేను చేసే ప్రాగల్భ్యంలేని చిన్న స్తోత్రం వికటకవి భాషణ లాగా నీకు వినోదాన్ని కల్గించి శోభించుగాక.

**వ్యాఖ్య:-** తాను జేసే ఈ చిన్న స్తోత్రాన్ని వికటకవి మాటలవలె దేవనాథుడు వినియోగించుకొని వినోదించవలెనని దేశికుల విజ్ఞప్తి.

దేవనాయకుని సభలో నిత్య సూరులు, ముక్తపురుషులు నిత్యం వేదవాక్కుల చేత స్తోత్రం చేస్తారు. "తద్విష్ణోః పరమం పదం. సదా పశ్యంతి సూరయః- తద్విప్రాసో విపన్యవః, జాగృవాంసః సమింధతే" పరమపదమందు పూర్ణ జ్ఞానులైన నిత్య, ముక్తపురుషులు భగవంతుణ్ణి సర్వదా సేవిస్తూ, గోష్ఠిలో వేదనాదంతో స్తుతిస్తూ, జాగరూకులై ప్రకాశిస్తుంటారు- అన్నది వేదవాణి. వేదవాక్కులు భగవంతుని స్వరూప, రూప, గుణ, విభవ, ఐశ్వర్య శీలాదులను ప్రతిపాదించేవి- నిరూపించేవి. వేదాలు మంగళకరమైనవని ప్రశస్తిని పొందినాయి.

వేదగాన ప్రియుడైన భగవానుణ్ని మిడిమిడి జ్ఞానంగల మానవులు చేసే స్తోత్రంలో స్వారస్యం ఏముంటుంది? అని భావించకుండా, కల్యాణ గుణగణ

సముద్రుడైన శ్రియఃపతిని యథామతి స్తోత్రం చేయడం జీవ వర్గలక్షణం. ఆత్మయొక్క స్వరూపం శేషత్వమే. భగవంతుడు స్తవప్రియుడు. కాబట్టి సర్వశేషిని స్తుతించకుంటే ఆత్మ నిలువదు.

"అమ్మా నాశిప్పిరాన్ అవనెవ్విడత్తాన్? యాన్ యార్?"- సుదర్శన చక్రధారియైన భగవానుడెక్కడ? నేనెక్కడ? అని నమ్మాళ్వార్లు భగవానుని ఉత్కృష్టతను, తన నికృష్టతను తలచుకొని ఆశ్చర్యపడుతూ "పుగ షోమ్, పశియోమ్"- మనం స్తుతించలేము, స్తుతించకుండా ఉండనూ లేము అన్నారు.

మహామహిమగల దేవతల స్తుతి కులపర్వతం వంటిదే కావచ్చు, సామాన్య మానవులు చేసే స్తుతి చాలా చిన్న అణువుగా ఉండవచ్చు. "కోమజ్జతో రణుకులాచల యోర్విశేషః?" (స్తో.రత్నం) భగవానుని గుణ సముద్రమందు అణువుగానీ, కులపర్వతంగానీ రెండూ మునిగిపోయినప్పుడు వాటికి భేద మేముంటుంది? రెండింటికి సమాన స్థితియే కలుగుతుంది కదా!

*సమాజే శ్రుతీనాం మధ్యే బాలిశాస్తుతిః త్రస్తరినయేన స్థాపితా శోభతాం:- "బాలే వృద్ధిం శ్యతి- ఇతి బాలిశా", "బాలిశస్తు శిశౌమూర్ఖే"* (మేదిని).

'సమాజం' అంటే 'సభ'. "సమాజస్తుసభా" (హేమచంద్రః)

*"విద్వాంసః కవయోభట్టాః గాయకాః పరిహాసకాః।*
*ఇతిహాసః పురాణంచ సభా సప్తాంగ లక్షణమ్॥"*

పండితులు, కవులు, వందిమాగధులు, గాయకులు, పరిహాసకులు, ఐతిహాసకులు, పౌరాణికులు అనే ఏడు అంగాలు కలది సభ. సభయందు పలు కళలలో నిపుణులైన వ్యక్తులు ఉండడం సభారంజకం కదా! పరిహాసకులకు కూడా సభాంగత్వం పరిహరింపరానిదనడం సుస్పష్టం. "వందంతే- ఇతివందిన్యః - *తాసాంభావః 'వందిత్వం'. ఆవశ్యకార్థేణినిః"-*

త్రస్తరులు-వికటకవులు, విదూషకులు, విడంబనైకోద్యమం కలవారు (Clowns). ఆయా కళాపారీణుల మధుర ప్రసంగాలలో మధ్య మధ్య విదూషక ప్రహసనాలు వినడం, మధుర పదార్థాలను భుజించునప్పుడు నడుమ నడుమ ఆవకాయను నంచుకొన్నట్లుగా ఉంటుంది.

దేశికులు నిరుపమానవైదుష్యం కలవారే అయినా, ఈ స్తోత్రం పూర్ణజ్ఞానం లేని తమచేత రచింపబడుతున్నదని నైచ్యాను సంధానం చేస్తున్నారు.

దేవనాయకుడు సభలో మంగళగానంగా కీర్తింపబడే వైదిక స్తుతులను వింటున్నప్పుడు మధ్యమధ్యన విదూషకుని పరిహాసోక్తులవలె తనను వినోదపరచే స్తుతిగా వినియోగించుకొనడానికి స్వీకరించవలెనని దేశికులు ప్రార్థించారు.

త్రస్తరి= కృత్రిమ పాంచాలిక-ఉపవనాలలో దృష్టిదోషం తగులకుండా నిర్మింపబడిన బొమ్మ- అని అర్థం. దివ్యదేశ ఉత్సవాలలో భూతవేషధారి. వికటకవి మాటలు ఆపాత రమణీయమని భావం.

5. అహ్మాగురూణం అచ్చు అ
జీహాసీహాసణమ్మి లద్ధ ప ఇ ట్ఠో
పడివా ఇ అ పరమట్ఠో,
వారేసి అపండి అత్తణం అహ్మాణమ్॥

ఛా. అస్మద్గురూణా మచ్యుత
జిహ్వాసింహాసనే లబ్ధ ప్రతిష్ఠః।
ప్రతిపాదిత పరమార్థో
వారయ స్వపండితత్వ మస్మాకమ్॥

**అర్థం:** అచ్యుత= ఆశ్రయించిన వారిని చేయిజాఱవిడువని ఓ దేవనాయకా! అస్మత్+గురూణాం= (నీవు) మా ఆచార్యుల యొక్క; జిహ్వాసింహాసనే= నాలుక అనే

సింహాసనమందు; లబ్ధప్రతిష్ఠః= వెలసియున్నవాడవు; ప్రతిపాదిత పరమార్థః= అనుగ్రహింపబడిన పరమార్థం కలవాడవు; అస్మాకం= మాయొక్క; అపండితత్వం= అజ్ఞానాన్ని; వారయసి= తొలగిస్తుంటావు.

**తా॥** ఆశ్రితులను విడువలేని ఓ దేవనాథా! మా గురువుల రసన-నాలుకను సింహాసనంగా చేసుకొని దానియందు స్థిరంగా ఉన్నావు. నీవే నీ స్వరూప స్వభావాలను ఉపదేశించావు. కాబట్టి, మా అజ్ఞానాన్ని నీవే తొలగిస్తుంటావు. అందువల్ల నీ స్తుతి రచనకు పూనుకొన్నాను.

**వ్యాఖ్య:-** తన అశక్తతను విన్నవించి, స్తోత్ర రచన యొక్క దోషాన్ని భంగ్యంతరంగా దేశికులు నివారించుమనే శ్లోకం.

'అచ్యుత' అనే సంబోధన, ఈ శ్లోకమందు సాభిప్రాయంగా ఉన్నది. దేవనాయకుణ్ణి ఆశ్రయించి ఆయన గుణాలను కీర్తిస్తున్న తననూ, తన స్తోత్రాన్ని దోషజుష్టమని త్యజించక కృపతో స్వీకరించి కటాక్షించే స్వామీ! అనే అర్థాన్ని ప్రకటిస్తున్నది.

అస్మత్ గురూణాం:- అజ్ఞాత జ్ఞాపనం- తెలియని విషయాలను బోధించడం చేత మహోపకారులైన వాది హంసాంబుదాచార్యులు మొదలైనవారు మాకు గురువులు అని మొదట వారిని స్మరించి దేశికులు తమ ఆశయాన్ని విశదం చేయడం గమనీయం.

గురూణాం జిహ్వా సింహాసనే లబ్ధప్రతిష్ఠః:- లబ్ధాప్రతిష్ఠా స్థితిఃయేనసః= లబ్ధప్రతిష్ఠః, హ్వాయతే రసవద్వస్తూని ఇతి= జిహ్వా అని వ్యుత్పత్త్యర్థం. మంచిరుచిగల వస్తువులను, ఘనరసంగల శబ్దాలను కోరునట్టిది జిహ్వా. "తురీయం వాచో మనుష్యావదంతి"- (శ్రుతి). మానవుల వైఖరి- వ్యాహారం, ముఖ్యమైన ఈ అంగం - రసన మీదనే ఆధారపడి యున్నది. ఇది రుచినీ, మాటనూ రెండింటిని ప్రకటిస్తుంది అనడం పునరుక్తి.

"జిహ్వారసజ్ఞా రసనా"- (అమరం): జగద్రక్షణ యోగ్యమైన భద్ర పీఠమే సింహాసనమనబడుతుంది. లోకోపకారులైన ఆచార్యుల నాలుక అనే సింహాసనాన్ని అధిష్ఠించి శాసించేవాడు భగవానుడు. 'జిహ్వాసింహాసనం' అనడం రూపక సమాస పద లక్షణం. "జిహ్వాగ్ర సింహాసన మభ్యుపేయాః" (హయగ్రీవ స్తో. 28).

ఇక్కడ 'గురువులు' అని బహువచనాన్ని ప్రయోగించి 'జిహ్వా సింహాసనం' అని జాత్యభిమానంతో ఏకవచనం ప్రయోగింపబడింది. జాత్యభిప్రాయంతో ఏకవచనం ప్రయుక్తం. 'గురువుయొక్క జిహ్వాసింహాసనమందు' అంటే బాగుండేది అని మనకు తోచడం యుక్తమే. ఒక్కొక్కప్పుడు ఈ అంగాలు ఇష్టప్రకారం చెప్పబడును.

"*ఇమాన్యే వాంగాని కదాచిత్ స్వాతంత్ర్యేణ వివక్షితాని భవంతి*"- అనే మహాభాష్యకారుల వాక్యంవల్ల దేశిక ప్రయుక్త వాక్యం కమనీయంగా గమనీయం.

('పాణిని' రచించిన వ్యాకరణ (శాస్త్ర) సూత్రాలకు 'పతంజలి' మహర్షి భాష్యం రచించారు. ఈ గ్రంథానికే 'మహాభాష్యం' అని పేరు. వ్యాసమహర్షి రచించిన బ్రహ్మసూత్రాలకు భగవద్రామానుజులు రచించిన భాష్యగ్రంథానికి 'శ్రీభాష్యం' అని పేరు).

*ప్రతిపాదిత పరమార్థః:* - నిరతిశయమైన ఉత్కర్షంచేత ఒప్పియుండే అర్థాన్ని ప్రతిపాదించినవాడవు నీవే స్వామీ! "ఆచార్య దేవోభవ"- గురువే దేవుడుగా కలవాడవగుము- అనే శ్రుత్యర్థమందు ప్రవర్తింపజేసిన వాడవు నీవే కదా!

తెలియదగిన తత్త్వాన్ని, ఆచరించదగిన హితాన్ని, పొందదగిన పురుషార్థాన్ని, ఒకటేమిటి? సకలార్థాల (వస్తువుల) స్వరూపాన్ని నీవే కృపతో ప్రసాదించావు- అని దేశికులు విన్నవించుకొన్నారు.

ఏమయ్యా! నన్ను బాగా స్తుతింపనారంభించావు. ఇంతకు, నీ అభిలషితార్థమేమిటి? అని దేవనాయకుడు అడిగాడు.

అస్మాకం అపండితత్వం వారయసి: – పదాచార్య రూపంలో ఉన్న నీ చేతనే నాతోపాటు అనుశిష్టులైన– నీ అధీనంలో ఉండి సుశిక్షితులైన వారెందఱో ఉన్నారు. వారు నాతో సమానమైన దశ– అవస్థను కలవారే. మేము పరతంత్రులం; పామరులమే (తనవంటి వారిని కలుపుకొన్నందున 'అస్మాకం' అని బహువచనం ప్రయుక్తం). ఇంక మమ్ములను సంస్కరించవలసిన వాడవు నీవే.

తత్త్వ హిత పురుషార్థాది స్వరూపాన్ని బోధించి, నాకు రచన, ప్రవచనాది కౌశలాన్ని సామర్థ్యాన్ని కలిగించినవాడవు నీవే. ఇంక సముచితజ్ఞానం లేనందువల్ల నా అజ్ఞానాన్ని కూడా తొలగించి నీ గుణరూపాదులను వర్ణించే సామర్థ్యాన్ని నీవే కలిగించాలి. ముఖ్యంగా నీ కృపయే నా ప్రవృత్తి నిర్వహణాదులకు హేతువు కాబట్టి, నీకు పరతంత్రుడనైన నా యొక్క గుణదోషాలకు నీవే ప్రమాణమని దేశికులు అగ్గలంగా ఉగ్గడించారు.

6. హి అఏసు దేసి అణం
జహ్ణ ఇ లహరీసు పుణ్ణచందో వ్వ ఫుడో,
కలుస జలేసు వ హం సో
కసా అ కబురేసు ఠాసి అచ్చు అ ణఖణమ్॥

ఛా. హృదయేషు దేశికానాం
జాహ్నవీలహరీషు పూర్ణచంద్ర ఇవ స్ఫుటః,
కలుషజలేష్వివ హంసః
కషాయకర్బురేషు తిష్ఠస్యచ్యుత! నక్షణమ్॥

**అర్థం:** అచ్యుత= చ్యుతిలేని దేవనాయకా!; జాహ్నవీలహరీషు= గంగానదీ ప్రవాహాలయందు; పూర్ణచంద్రః; ఇవ= నిండు చంద్రునిలాగా; దేశికానాం= ఆచార్యుల యొక్క; హృదయేషు= డెందములందు; స్ఫుటః= శుభ్రంగా ఉంటావు; కలుష జలేషు= మురికినీళ్ళయందు; హంసః, ఇవ= అంచలాగా; కషాయ కర్బురేషు= విషయేచ్ఛచే

దూషితాలైన (జనుల) హృదయములందు; క్షణం= కొద్దికాలమైనను; న, తిష్ఠసి= ఉండలేవు.

**తా॥** ఓ అచ్యుతా! గంగానదీ జలం చాలా స్వచ్ఛంగా ఉంటుంది. కాబట్టి, గంగాజల తరంగములందు పూర్ణచంద్రుడు మిక్కిలి ధవళంగా ప్రకాశిస్తుంటాడు. ఆ విధంగానే నీవు గురు జనుల పవిత్రమైన అంతరంగాలందు సకల విభవాలతో ఎల్లప్పుడు నెలకొని యుంటావు. మలిన సలిలాలందు మరాళం క్షణకాలము కూడా స్థిరంగా నిలిచియుండజాలదు. అట్లే, దోషదూషితాలైన వ్యక్తుల హృదయాలలో కొద్దికాలం కూడా నీవు నిశ్చలంగా ఉండజాలవు. కాబట్టి, పరిశుద్ధ మనస్సును కలవారు మాత్రమే నిన్ను ధ్యానింపసమర్థులు.

**వ్యాఖ్య:–** కళంకిత హృదయంగల వ్యక్తులయందు భగవానుడు ఆనందంగా ఉండలేడు అని వర్ణితం.

ఓ దేశికా! ఆచార్యుల జిహ్వాసింహాసనమందలి స్థితిరసికతనే ప్రస్తావించావు. సద్వారకంగా అనుగ్రహాన్ని పొందాలని వర్ణించడమే నీకు సంతోషమా? నీ హృదయమందు కూడా భగవంతుని ఉనికిని అద్వారకంగా నేరుగా ఎందుకు వర్ణింపలేకున్నావు? నీడెందమందు భగవంతుడు తృప్తిగా నివసించి యుండలేడా యేమి? అనే దేవనాథుని శంకను పరిహరించే శ్లోకమిది.

అచ్యుతా! నీకు చ్యుతి లేదు. ఆశ్రితులకు చ్యుతిని కలిగించనూ లేవు. తుదకు పాపాత్ములనైనను విడువకుండా, పట్టుకొని కాపాడుతుంటావు. 'జాహ్నవి' అని గంగకు పేరు. ఆకాశం నుంచి భూమికిచేరిన గంగా ప్రవాహం జహ్ను మహర్షి ఆశ్రమాన్ని ముంచివేసింది. ఆ మహర్షి ఆగ్రహోదగ్రుడై ఆ ప్రవాహ జలాన్ని పూర్తిగా పానం చేశాడు. భగీరథుడు తన ప్రయత్నమంతా విఫలమయ్యేనని తపిస్తూ, జహ్నుమహర్షిని ప్రార్థించాడు. జగత్త్రయానికి మహోపకారం చేసే భగీరథ మహారాజు యొక్క కృత్యానికి ప్రసన్నుడైన జహ్నుమహర్షి తన కుడిచెవి నుంచి గంగాజలాన్ని బయటకు జాలువిడిచాడు. కాబట్టి, గంగకు 'జాహ్నవి', 'జహ్నుతనయ' అనే నామం వ్యవహరింపబడుతున్నది.

'లహరి' అంటే తరంగం (అల), ప్రవాహం అని కూడా అర్థం. "లహరీ తరంగః ప్రవాహో వా" (దేశీయసూత్రం).

స్వచ్ఛమైన జాహ్నవీలహరులందు చంద్రుడు ఎంతో నిర్మలంగా ప్రకాశిస్తాడు.

"అకర్దమం ప్రసన్నాంబు సన్మనుష్య మనోయథా" (రామా)- సజ్జనుల మనస్సు బురదలేని తేటనీరువలె ఉంటుంది అని ఎట్లు చెప్పినా, స్వచ్ఛమైన సలిలానికి సత్పురుషుని స్వాంతానికి సాదృశ్యాన్ని వాల్మీకి వర్ణించడం అత్యంత రమణీయం కదా!

ఆచార్యుల హృదయ నైర్మల్యం భగవంతునికి ప్రసాద సుముఖమైనది, ఆనందావహమైనది కాబట్టి, గురుజనుల డెందమందు షోడశ కళాపూర్ణుడైన చంద్రునిలాగా భగవన్! నీవు స్ఫుటంగా వెలసియుంటావు.

తెల్లని వన్నెగల హంస మురికి నీటిగుంటల్లో క్షణకాలమైనా ఉండజాలనట్లే, దివ్యమంగళ విగ్రహుడవైన నీవు పాపాత్ముల యందు క్షణకాలమైనా సత్సంప్రదాయ సిద్ధపురుషులయందు వెలసియున్న ఆకారంతో ఉండలేవు- అని స్తుతించారు దేశికులు.

"అంతర్బహిశ్చ తత్సర్వం వ్యాప్య నారాయణః స్థితః" (శ్రుతి). నారాయణుడు ప్రపంచంలోని ప్రతి వస్తువునందు లోపల, బయట వ్యాపించియున్నాడు. "సర్వస్య చాహం హృది సన్నివిష్టః" (భ.గీత).

నేను చేతనాచేతన వస్తువులన్నిటి లోపల చేరియున్నాను అని శ్రుతి స్మృతులు చెబుతున్నట్లు, భగవానుడు నివసించని వస్తువే లేదు కదా! అనవచ్చు. భగవానుడు తన గీతను దాటలేదు. కాబట్టి దుశ్చరితుల హృదయాలలో భగవానుడు "కంటకాగ్ర ఇవ స్థితః". ముండ్లమీద నిలిచినట్లు ఉంటాడు- అని శాస్త్రం బోధిస్తుంది కదా!

"అనుక్తం అన్యతో గ్రాహ్యం"- ఇక్కడ చెప్పనప్పుడు మఱొకచోట చెప్పిన మాటను అవశ్యంగా గ్రహించవలెనని నొక్కిచెప్పింది శాస్త్రం.

"దేవవత్స్యాదుపాస్యః"- ఆచార్యుడు దేవునివలె ఉపాసింపదగినవాడు, అనడానికి మార్గదర్శివి నీవే కదా స్వామీ!

"భగవద్వంద నాత్ పూర్వం గురువందన మాచరేత్"- ఆచార్యుని సన్నిధిలో భగవానుడు ప్రత్యక్షంగా నిల్చియున్నప్పుడు ఆచార్యునికి దండవత్ ప్రణామం చేసిన తర్వాతనే దేవునికి దండం సమర్పించవలెనని నియమం కలదు. "అణ్ణిక్కుమము దూరు మెన్నావుక్కె" మధురకవులన్నట్లు, మా బోటివారికి సద్వారకానుగ్రహ వర్ణనమే శ్రేయస్కరం. ఆచార్యోపదేశమే శరణ్యం- అని విశదంగా స్తుతించారు. "కషాయన్తు వరే న స్త్రీనిర్యాసే రంజకాత్మని। సురభావపటే రాగే భావ నాయూంచ విప్లవే" (కేశవః), "పూర్ణచంద్ర ఇవ" అనేది అన్వయ దృష్టాంతం. దేశికహృదయస్థత్వాన్ని తెలిపే "కలుష జలేష్వివ హంసః" అనేది వ్యతిరేకాన్వయ దృష్టాంతం.

7. ఆ అమ మేత్త పమాణో
ఆగోవిఅణం ప ఆసణి అమాహప్పో।
సద్దహి అహిఅఅసులహో
దూరం ముఅసి ణ అసచ్చడోలా అంతే॥

ఛా. ఆగమ మాత్ర ప్రమాణః
ఆగోపీజనం ప్రకాశ నిజమాహాత్మ్యః।
శ్రద్ధధద్హృదయ సులభో
దూరం ముంచసి నతసత్య డోలాయమానాన్॥

**అర్థం:** నతసత్య= నమస్కరించే వారికి సత్యమైన దేవనాథా!; ఆగోపీజనం= గోప గోపీజనుల పర్యంతం; ప్రకాశ నిజమాహాత్మ్యః= వెల్లడించునట్టి నీదైన వైభవం కలవాడవు; ఆగమ మాత్ర ప్రమాణః= వేదం ఒక్కటే ఆధారం కలవాడవు; శ్రద్ధధత్+హృదయ సులభః= శ్రద్ధ ఉన్న హృదయంగల జనులకు సుఖంగా పొందదగిన వాడవు; దోలాయమానాన్= మనస్సు ఊగుతున్న జనులను; దూరం= దూరస్థాన మందు; ముంచసి= వదలిపెడుతుంటావు.

**తా॥** నిన్ను సేవించు ప్రాణులకు సత్యమైనవాడా! దేవనాయకా! నీవు తెలివిలేని గొల్లవారికి, గొల్లపడతులకు కూడా నీ మహిమను ప్రదర్శించినప్పటికీ, నిన్నూ నీ వైభవాన్నీ తెలిపే వేదం మాత్రమే ప్రమాణం కలవాడవు. శ్రద్ధతో నిన్ను ధ్యానించే మనస్సుగల భక్తులకు నీవు సులభుడవు కాని, చంచలమనస్సుగల జీవరాశిని దూరంగా వదలివేసి ఊరకుంటావు. నిన్ను భజించే నన్ను మాత్రం నీవు విడిచిపెట్టి దూరంగా ఉండలేవయ్యా స్వామీ!

**వ్యాఖ్య:-** చపలాత్ములకు భగవానుడు తన వైభవాన్ని ప్రదర్శింపలేదని వర్ణితం.

భో నతసత్య! శ్రద్ధాతిశయ పూర్వకంగా నిన్ను సేవించేవారికి నీ మహిమను తెలియజేసే స్వామీ! అని సంబోధన.

*ఆగోపీజనం ప్రకాశ నిజమాహాత్మ్యః:-* ఆగోపీజనం- "ఆఙ్ మర్యాదాభివిధ్యోః"- అని అవ్యయీభావం. ప్రకాశః- విశ్వరూప ప్రదర్శనం, శకటాసుర భంజనాది రూపం ప్రత్యక్షభూతం. నిజమాహాత్మ్యః- గోపీజనులకు కూడా పరత్వ సౌలభ్యాది కల్యాణ గుణాలతో ప్రయుక్తమైన సర్వోత్తమ రూప మహిమతో కూడినవాడు.

జ్ఞానం ఏ మాత్రంలేని వారనడానికి నిదర్శనంగా ఉండేవారు గోపకులు అనడం లోకపరిపాటి. కుడియెడమలు కూడా వారికి తెలియవనీ, పశువులే

వారికి మార్గదర్శకంగా ఉంటాయని ప్రసిద్ధి. 'అరివొన్ఱు మిల్లాద ఆయ్‌క్కులం'- లోకజ్ఞానంగానీ, పారమార్థిక జ్ఞానంగానీ లేనిది గొల్లజాతి అని 'గోదా' వాగ్విన్యాసం ఆ గొల్లజాతిలో కూడా అబలలకు (కృష్ణావతారంలో) భగవానుడు పలు విధాలుగా తన మాహాత్మ్యాన్ని చూపి, వారిని ఆనందింపజేస్తూ తానూ ఆనందించాడు.

*ఆగమ మాత్ర ప్రమాణః* – వేదమొక్కటే ప్రమాణంగా కలవాడు భగవానుడు. భగవద్రూపగుణ విభవాదులను ప్రకాశింపజేసేది వేదమే. శాస్త్రమందు ప్రమాణాలు ఎనిమిది ఉన్నా మూడు ప్రమాణాలు ముఖ్యమైనవి. ప్రత్యక్ష ప్రమాణం, అనుమాన ప్రమాణం, శబ్ద (వేద) ప్రమాణం. "శబ్దయోనిత్వాత్" (బ్ర.సూ.).

> *"ప్రత్యక్షేణానుమిత్యా వా వస్తూపాయో నబుధ్యతే।*
> *ఏనం విదంతి వేదేన తస్మా దేతస్య వేదతా॥"*

కన్ను, చెవ్వు, ముక్కు మొదలైన ఇంద్రియాలచే తెలియదగిన వస్తువులను చూపేది ప్రత్యక్ష ప్రమాణం అనబడుతుంది. నైజాన్ని ఊహించగలిగితే అనుమితి ప్రమాణమవుతుంది (ప్రత్యక్ష ప్రమాణాన్నిబట్టి అనుమితి ప్రమాణం నిలుస్తుంది).

ప్రత్యక్ష, అనుమానాలు అనబడే ఈ రెండు ప్రమాణాలకు కూడా అతీంద్రియ విషయాలను గోచరింపజేసే శక్తి లేదు. పరోక్ష వస్తువులను– భగవన్మహిమనూ మనం తెలుసుకోవడానికి ఆధారం ప్రమాణం వేదమే అని భావం. స్వయంగా భగవానుడే తన మహిమను ప్రకాశింపజేయువాడని చెప్పి ఒక్క వేదం చేతనే ఆయన మహిమ ప్రకాశింపజేయతగినవాడు అనడం విరోధమే కదా! అనవచ్చును. కాని, భగవానుడు నిరంకుశ స్వతంత్రుడు. ఎక్కడనో, ఒకప్పుడు నిరుపాధికమైన ఆయన దయవల్లనే ఆయన వైభవం ప్రకాశింపజేయ బడుతుంది అనుకొంటే విరోధం తొలగిపోతుంది. ఇట్టి మాటనే 'విరోధాభాసాలంకారం' అంటారు.

శ్రద్దధత్ హృదయ సులభః:- అంబుజోదర దివ్య పాదార విందచింత నామృత పాన విశేష మత్తచిత్తులకు సులభుడు. భక్తులు భగవంతుణ్ని సర్వదా ధ్యానిస్తుంటారు. పాపం నశిస్తుంది. తత్ఫలితంగా భక్తుల పట్ల అనుగ్రహం కలుగుతుంది. భక్తుల మనస్సులో తాను సాక్షాత్కరించాలి- అని భగవానుడు సంకల్పించుకొన్న క్షణంలోనే వారికి సులభుడవుతాడు (శ్రత్-అవ్యయానికి 'దధత్' పరమైనది= శ్రద్దధత్).

"యమేవైష వృణుతేతేన లభ్యః"- అన్నది ఉపనిషద్వాణి. భగవానుడు ఎవనిని వరిస్తాడో వానిచేతనే పొందదగినవాడు.

"పత్తుడైయడియ వర్ క్కెళియవన్" (తి. వా.మొ. 1-3-1). భక్తి కలిగి ఆశ్రయించినవారికి భగవానుడు సులభుడు అని శఠకోప దివ్యసూరి సూక్తి సుధ. శ్రద్ధాళువులకు సులభుడు ('శ్రద్ధిత హృదయ సులభః' అని పాఠాంతర మున్నది).

దోలాయమానాన్ దూరం ముంచసి:- గురువు ఉపదేశించిన విషయాల యందు విశ్వాసం లేనందువల్ల ఫలించునో ఫలించదో అని మనస్సు నిలకడ లేక ఇటు అటు ఊగుతుండే వారు దోలాయమానులు, సంశయాత్ములు అని అర్థం. సంశయాత్ములను భగవానుడు దూరంగా ఉంచుతాడు. సందిగ్ధ చిత్తులకు సర్వేశ్వరుడు దుర్లభుడు అని భావం.

"స సంశయాన్ హేతుబలా న్నాధ్యావసతి మాధవః।
నిస్సంశయేషు సర్వేషు నిత్యం వసతి వై హరిః॥"

"అజ్ఞశ్చా శ్రద్దధానశ్చ సంశయాత్మా వినశ్యతి।
నాయం లోకోఽస్తి నపరో నసుఖం సంశయాత్మనః॥" (భ.గీ. 4-40)

జ్ఞానం లేనివాడు, కొంచెం జ్ఞానమున్నా శ్రద్ధలేనివాడు, శ్రద్ధ ఉన్నను సిద్ధించునో సిద్ధించదో అని సందేహపడేవాడు నశిస్తాడు. అజ్ఞుడు, అశ్రద్ధధానుడు,

సంశయాత్ముడు ఈ ముగ్గురు భ్రష్టులే. ఈ ముగ్గురిలోను సందిగ్ధ చిత్తునికి ఈ లోకంలేదు, పరలోకంలేదు. సుఖం కూడా కలుగదు. అన్ని విధాలా నష్టపడుతాడు- అని నరునికి నారాయణునిచే ఉపదిష్టం కదా!

ఆశ్రిత సౌలభ్యం, అనాశ్రిత దుర్లభత్వం ఈ శ్లోకమందలి సారాంశం.

8. *స ఇ ఖవి అస అలహేఅం*
*సరణాగఅ సచ్చ సచ్చణా ణా ణందమ్*
*ఉల్లంఘి అ తివిహంతం*
*ఉవణి స ఆణం స ఆఇ గా అన్తి తుమమ్॥*

ఛా. *సదాక్షపిత సకలహేయం*
*శరణాగత సత్య! సత్యజ్ఞానానందమ్*
*ఉల్లంఘిత త్రివిధాంతం*
*ఉపనిషదాంశతాని గాయంతి త్వామ్॥*

**అర్థం:** శరణాగత సత్య= శరణాగతులకు సత్యమైన దేవనాయకా!; ఉపనిషదాం, శతాని= వందలకొలది ఉపనిషత్తులు; సదా= ఎల్లప్పుడు; క్షపిత సకల హేయం= నశింపబడిన సమస్త దోషాలు కలిగినట్టి; సత్య, జ్ఞాన+ఆనందం= సత్యం, జ్ఞానం, ఆనందం కలిగినట్టి; ఉల్లంఘిత త్రివిధ+అంతం= అతిక్రమింపబడిన (దేశం, కాలం, వస్తువు అనే) మూడు విధములుగా నున్న వాటిచే నియమింపబడే పరిచ్ఛేదం కలిగినట్టి; త్వాం= నిన్ను; గాయంతి= కీర్తిస్తుంటాయి.

**తా॥** ఓ శరణాగత సత్య! దేవనాథా! అనేక ఉపనిషత్తులు నీవు సదా దోషాలు లేనివాడవనీ; సత్యం, జ్ఞానం, ఆనందం కలవాడవనీ; సర్వదేశ, కాల, వస్తువులందు సర్వదా వ్యాపించి యున్నావని-నిన్ను నీ వైభవాన్ని పొగడుతుంటాయి. ఈ విధంగా ఉపనిషత్తులు స్తుతించే నిన్ను అల్పుడనైన నేను స్తుతింప బూనుకొన్నాను.

వ్యాఖ్య:- భగవానుని వైభవాన్ని ఉపనిషత్తులు వర్ణిస్తుంటాయని ప్రమాణత్వం సుశ్లోకితం.

శరణాగత సత్య:- దేహధారులు దైన్యంతో బద్ధాంజలులై భగవంతుణ్ని వేడుకొంటారు. భగవానుడు శరణాగతవత్సలుడు.

*"అహమస్మ్య పరాధా నా మాలయోఽ కించనోఽ గతిః।*
*త్వమే వో పాయభూతో మే భవతి ప్రార్థనామతిః॥*
*శరణాగతి రిత్యుక్తా, సాదేవేఽ స్మిన్ ప్రయుజ్యతామ్॥"*

"ఓ దేవదేవా! నేను పాపాలపుట్టను. ఏమీ స్థితి, గతి లేనివాడను. నీవే నన్ను రక్షింపుము" అని మహా విశ్వాసంతో దేవుని ప్రార్థించడమే 'శరణాగతి' అనబడుతుంది.

"మామేకం శరణం వ్రజ"- నన్ను మాత్రమే శరణు పొందండి; అని భగవానుడే చెప్పినాడు కదా! ఇతరులను వేడుకొనరాదని నొక్కిచెప్పాడు. పాపాలనన్నిటినీ తొలగించి రక్షిస్తాను 'నేను నీ సేవకుడను' అని శరణుపొందే ప్రాణులనన్నిటినీ కాపాడుతాను. "ఏతద్వ్రతం మమ" ఇది నా వ్రతం- సత్యమైన నియమం అని దృఢ ప్రతిజ్ఞను భగవానుడు జేశాడు. కాబట్టి, భగవానుడు శరణాగతులపట్ల నాటికి నేటికి మార్పులేని మాట కలవాడైనందువల్ల "శరణాగత సత్య" అని సంబోధింపబడినాడు.

ఉపనిషదాంశతాని:- "ఆదౌ వేదాః ప్రమాణం"- భోగమోక్ష ప్రదమైన సిద్ధోపాయ రూప భగవానుణ్ణి విశదంగా తెలిపే మొదటి ప్రమాణం వేదమే. పురుషులు రచించే వాటిలో ఉండే భ్రమ, విప్రలంభం, ప్రమాదం, అశక్తి అనే నాలుగు దోషాలు లేనిదై భగవానుని శ్వాసరూపంగా వెలువడినందువల్ల వేదం అపౌరుషేయం' అనబడుతుంది. శ్రియః పతిని తెలియజేసే విలక్షణమైన ప్రమాణం ఆధారం వేదమే. అందువల్ల "శుదర్ మికు శురుతి"- ఉజ్జ్వలంగా ప్రకాశించే జ్యోతి 'శ్రుతి' అని ఆళ్వార్ల శ్రీసూక్తి. శబ్దరాశినిబట్టి 'వేదాః' అని బహువచనం.

"అనంతావై వేదాః" అని ప్రసిద్ధి.

వేదశాస్త్రం పూర్వభాగం, ఉత్తరభాగం అని రెండు భాగాలుగా ఉంది.

"త్వదర్చా విధి ముపరి పరిక్షీయతే పూర్వ భాగః।
ఊర్ధ్వో భాగస్త్వదిహ గుణ విభవ పరిజ్ఞాపనైస్త్వ త్పదాప్తౌ॥"

పూర్వభాగం భగవదారాధనా స్వరూపమైన కర్మను తెల్పుతుంది. కర్మ స్వరూపం, అంగాలు, ఫలం మొదలైన వాటికి 'సకల శాఖా ప్రత్యయ' న్యాయాన్ని బట్టి అర్థ నిర్ణయం చేయబడుతుంది.

ఉత్తరభాగం భగవత్స్వరూప రూపగుణ విభూతులను తెల్పుతుంది. ఉత్తర భాగాన్ని 'వేదాంతం' అంటారు. ఇందు చాలా ఉపనిషత్తులు ఉన్నాయి. ఉపనిషత్ప్రతిపాదితమైన అర్థం "సకల వేదాంత ప్రత్యయ" న్యాయం చేత నిర్ణయింప బడుతుంది.

ఉప నిషీదన్తి ఇతి= ఉపనిషదః. భగవానుని సమీపమందు సాక్షాత్తుగా ఆయన స్వరూప, రూప, గుణాది వైభవాన్ని ప్రకాశింప జేయునట్టివి- అని సాధారణమైన అర్థం కలవి ఉపనిషత్తులు.

"శతాని"- బహువచనం. అనేక వేదశాఖలకు సంబంధించినవి చాలా ఉన్నాయి. సర్వకర్మ సమారాధ్యుడైన భగవానునికి, పూర్వభాగమందు చెప్పబడిన క్రియా కలాపం- కైంకర్యం సమర్పించే విషయంలో 'గతి సామాన్య' న్యాయంగా ఉపనిషత్తులలో కొన్ని అన్యపరమైనవి కాక, అన్ని ఉపనిషత్తులు కూడా భగవత్పరమైన ప్రవృత్తి కలవియే- అని సంగ్రహంగా తెల్పుతున్నది.

క్షపిత సకల హేయం:- సకల దోషాలను భగవానుడు నశింపజేసేవాడు. 'హేయ' శబ్దానికి విడువదగినది- దుర్గుణం- అని అర్థం. దుర్గుణాలు భగవానునికి వాసన మాత్రంగా కూడా ఉండవు. కాబట్టి, హేయ ప్రత్యనీకుడు, అస్పృష్టదోష

గంధుడు. మంచి గుణాలన్ని భగవంతుని దివ్య స్వరూపాన్ని ఆశ్రయించి శోభించడం వల్ల, అనంత కల్యాణ గుణైకతానుడు- అని ఉపనిషత్తులు భగవంతుణ్ని గానం చేస్తుంటాయి.

ఇక్కడ 'సదా, క్షపిత సకల హేయం' అనుటకు బదులు "(సంఖవిఅ) సంక్షపిత సకల హేయం" అనే పాఠం ఉంది. జీవరాశులకు తాముచేసిన కర్మల ఫలం అనుభవింపక తప్పదు. భగవానునికి ఏదైన ఫలం పొందదగిన కర్మ చేయవలసిన అవసరమే ఉండదు. లోకకల్యాణం కోసం భగవానుడు చేయని కర్మలున్నాయా? ఎన్ని కర్మల నాచరించినా అవి భగవానునికి అంటుకోజాలవు. "*నమే కర్మాణి లింపంతి*" (భ.గీత. 4-14)- కర్మలు నన్ను స్పృశింపవు అన్నాడు కదా శ్రీకృష్ణ భగవానుడు.

భక్తుల దోషాలను సవాసనగా తొలగించేవాడవు అని కూడా ఉపనిషత్తులచేత భగవానుడు కీర్తింపబడుతుంటాడు.

సత్యజ్ఞానానందం:- సత్యం, జ్ఞానం, ఆనందం అనే శబ్దాలచే పేర్కొన దగినవాడు పరబ్రహ్మ. భగవానుడు వీటిని తపః ప్రముఖ శ్రమచే ఆర్జించుకోలేదు. ఇవి భగవానునికి స్వభావసిద్ధమైనవి.

"*ఆనందో బ్రహ్మేతి వ్యజానాత్*"- "*సత్యం జ్ఞానమనంతం బ్రహ్మ*" అని ఉపనిషత్తులు భగవంతుణ్ని స్తుతిస్తుంటాయి.

పరిశుద్ధ జీవాత్మలకు కూడా జ్ఞానానందామలత్వాలున్నాయి. ప్రకృతి తిరోధానకరి కదా! ప్రకృతి సంబంధంచేత జీవులకు జ్ఞానానందాలు ఒక్కొకప్పుడు సంకోచిస్తుంటాయి. పరమాత్మకు జ్ఞానంగానీ, ఆనందంగానీ జీవులవలె సంకోచించడం, లోపించడమనే ప్రసక్తియే ఉండదు. అవి భగవత్సంబంధం కలవి. "తేనైవపూర్ణం పురుషేణ సర్వం"- ఆ సర్వేశ్వరుని కృపచేతనే మరపులేని జ్ఞానమూ. చ్యుతిలేని ఆనందమూ లబ్ధమైన పూర్ణజ్ఞానులు, పూర్ణానందులు ఈ లీలావిభూతిలో విరాజమానులై యున్నారు. కాబట్టి ఇక్కడ 'సత్య' శబ్దానికి

ఎప్పుడూ మార్పులేనివి- అని అర్థం చెప్పనగును. సతతం ఏకరూపంగా ఉండే జ్ఞానానందములు కలవాడు దేవదేవుడు అని ఉపనిషత్తులు పొగడుతున్నాయి.

ఉల్లంఘిత త్రివిధాంతం:- (ఉల్లంఘితాః త్రివిధాః అంతాః యేన సః; తం). 'త్రివిధ' శబ్దానికి ఇక్కడ దేశకాల వస్తువులు అని అర్థం. దేశకాల వస్తువులు తాము మారుతూ, ఇతరములను మార్చుతుండడం ప్రాకృతిక నియమం. ఈ ఉపాధి త్రయంచేత నియమింపబడింది పరిచ్ఛేదం- అంతం. అంటే వ్యక్తుల స్వరూప స్వభావాలకు భంగం కలుగుతుందన్నమాట. దేశకాల వస్తు పరిచ్ఛేదాన్ని భగవానుడు ఒక్కడే ఉల్లంఘించి- మీఱి యున్నాడు. అపరిచ్ఛేద్యుడు అని అర్థం.

1. దేశంచే అపరిచ్ఛేద్యుడు- అంటే 'ఇందుగలడు, అందులేడు' అనే మాట స్వామి విషయంలో చెల్లదు. 'చక్రి సర్వోపగతుడు' అని అర్థం.

2. కాలం చేత అపరిచ్ఛేద్యుడు- అంటే 'నిన్న ఉన్నాడు, నేడు లేడు అనడం చెల్లనివాడు.

3. వస్తువుచే అపరిచ్ఛేద్యుడు- ఎంతో అందమైన రూపం, ఇంత వికారంగా కనబడుతున్నదేమి? అని పలుకదగనివాడు.

సర్వదేశములందు, సర్వకాలములందు, సమస్త వస్తువులందు పచ్చిపాలలో చమురు ఉన్నట్లు భగవానుడు సర్వత్ర వ్యాపించి యున్నాడని ఉపనిషత్కాంతలు పరమ పురుషుణ్ని అద్భుతంగా వర్ణిస్తుండడం నిర్వివాదాంశం.

"సర్వవ్యాపిన మాత్మానం క్షీరే సర్పిరివార్పితమ్" (శ్వేతా. ఉప.) పాలలో నేయివలె సర్వత్ర వ్యాపించియున్నవాడు పరమాత్మ అని ఉపనిషత్తులు ఘోషిస్తున్నాయి.

"కఱన్ద పాలుళ్ నెయ్యేపోల్ ఇవత్తు ఎంగుమ్ కండుగొళ్ ఇఱున్దు నిన్ఱ పెరుమాయా!" (తి.వా.మొ. 8-5-10).

అప్పుడు పిండిన పాలలో నెయ్యి వలె సర్వత్ర వ్యాపించి యున్నప్పటికీ నీవు నా కంటికి కనబడని అద్భుతశక్తికల వాడవయ్యా! అని సర్వేశ్వరుని లీలను గానం చేశారు నమ్మాళ్వార్లు. వికారాస్పదమైనది ప్రకృతి. వికారాశ్రయమైనది ప్రాకృత జీవవర్గం. కాబట్టి "క్షరాక్షర విలక్షణుడు భగవానుడు"– సర్వేతర విలక్షణునిగా భగవంతుణ్ని ఉపనిషత్తులు గానం చేస్తున్నాయి– అని వర్ణితం.

9. కుణసి ణ కీరసి కేణ వి
రావేసి ణ సంఠవిజ్జసి అణణ్ణ ఠి ఓ।
హరసి ణి హిలం ణ హీరసి
అహిందణ అరింద అణహజోఇ ఫురన్తో॥

ఛా. కరోషి నక్రియసేకేనాపి
స్థాపయసి న సంస్థాప్యసేఽనన్య స్థితః।
హరసి నిఖిలం నహ్రియసే
అహీంద్ర నగరేంద్రా నఘజ్యోతిః స్ఫురన్॥

**అర్థం:** అహీంద్రనగర+ఇంద్ర= అహీంద్రపురనాథా!; అనఘజ్యోతిః= మార్పులేని సంకల్పమయు జ్ఞాన, ఆనందం కలవాడవై; స్ఫురన్= ప్రకాశిస్తున్న నీవు, అనన్య స్థితః= వేరొక ఆధారం లేనివాడవై; నిఖిల= సమస్త వస్తువులను; కరోషి= సృజిస్తున్నావు (నీవు); కేన+అపి= మరొకనిచేత; న, క్రియసే= సృజింపబడుతు లేవు; స్థాపయసి= రక్షిస్తున్నావు; న, సంస్థాప్యసే= రక్షింపబడుతులేవు; హరసి= లయం చేస్తున్నావు; న, హ్రియసే= నీవు హరింపబడుతులేవు.

**తా॥** అహీంద్రనగరాధీశా! నీయొక్క సంకల్పం వేఱొకనిచేత చెనకబడదు. నీ సంకల్పం జ్ఞానానందభరితం. కాబట్టి నీ సంకల్పం చేతనే నీవు సకల కార్యాలను నెరవేరుస్తున్నావు. నీవే వస్తువులన్నిటికీ ఆధారమై నిల్చియున్నావు. నిన్ను ధరించి నిలిచిన వస్తువు నీకంటే వేఱు కాదు. నీవు సమస్త ప్రపంచాన్ని సృజిస్తున్నావు.

కాని నీవు మాత్రం మరొకనిచేత సృజింపబడుతులేవు. నీవు నీ సంకల్పంచేతనే ఈ ప్రపంచాన్ని కాపాడుతున్నావు. కాని నిన్ను కాపాడేవాడు మరొకడు లేడు. ఆ విధంగానే, నీ సంకల్పంచేతనే ప్రళయాన్ని కల్పించి విశ్వాన్ని హరిస్తున్నావు. కాని, నిన్ను హరించే వాడెవడూ విశ్వమందు లేడు కదా! అని తాత్పర్యం.

**వ్యాఖ్య:-** సర్వశేషియైన శ్రియః పతియే పరంధాముడని వర్ణితం.

అహీంద్రనగరేంద్రా! దేవనాయకా! అనితరసాధ్యమైన నీ మహిమ ఎల్లలేనిది, ఎన్నరానిది. అఖిల భువన స్థేమ భంగాది లీలలకు కారణమైనవాడవు నీవే సుమా!

*అనన్యస్థితః:-* నీ ఉనికికి నీవే ఆధారం. కాని వేరొకని యందు ఆధారపడి యుండవు. "స్వేమహిమ్ని ప్రతిష్ఠితః" (శ్రుతి). భగవానుడు తన మహిమయందే తాను ప్రతిష్ఠితుడు. కాని ఇతరులచే ప్రతిష్ఠితుడు కాడు, ప్రభావితుడు కాడు - అన్నది వేదవాణి.

*నిఖిలం కరోషి,కేనాపి నక్రియసే:-* నీవు అద్భుతమైన నీ సంకల్పంచేత సకల కార్యభూత ప్రపంచాన్ని సృజిస్తున్నావు. నీవు మాత్రం వేఱొకనిచేత సృజింపబడవు. అందువల్ల "సత్యకాముడవు, సత్యసంకల్పుడవు" అని ఉపనిషత్తు నిన్ను పొగడుతున్నది.

*నిఖిలం స్థాప యసి, కేనాపి న సంస్థాప్యసే:-* నీ సంకల్పంచేతనే నీవు ప్రపంచాన్ని రక్షిస్తున్నావు. కాని ఎవరిచేతనూ నీవు రక్షింపబడవు. విశ్వాన్ని ధరించేవాడవు నీవే– నీవు మాత్రం దేనిచేతనూ ధరింపబడుతులేవు. 'విశ్వాత్ముడవు' నీవు అని కీర్తిస్తున్నది ఉపనిషత్తు.

*నిఖిలం హరసి, కేనాపిత్వం న హ్రియసే:-* ప్రళయానికీ కారణమైన నీ సంకల్పంచేతనే సకల ప్రపంచాన్ని నీవు నీ పొట్టలో పెట్టుకొంటున్నావు. అందువల్ల నిన్ను మరొకడు తన కుక్షిలోన నిక్షేపించుకొన జాలడు కదా!

"భర్తాసన్ భ్రియమాణోబిభర్తి"- విశ్వాన్ని భరిస్తున్నాడు అన్నది ఉపనిషత్తు.

అనఘజ్యోతిః స్ఫురన్:- రజస్తమో గుణశూన్యమైన శుద్ధసత్త్వగుణంచే ప్రకాశిస్తున్నావు. నీ జ్ఞానానందాలు నీ సంకల్పమయమైనవి. సర్వసమర్థకమైన నీ సంకల్పమందే నీ కర్తృత్వ స్వాచ్ఛంద్యం- కార్యాన్ని నిర్వహించే స్వేచ్ఛ అప్రతిహతంగా ఉన్నది. కాని కర్మఫలమైనది కాదు- అని సుస్పష్టం. కాబట్టి, విశ్వానికి స్రష్టవు, త్రాతవు, సంహర్తవు నీవే. ఈ సృష్టి స్థితి లయ కార్యాలను నిర్వహించే శక్తిమంతుడు మఱొకడు లేదు.

"తస్యభాసా సర్వమిదం విభాతి":- సంకోచవికాసాలు ఇతరుల అధీనమందు ఉండే క్లేశంచేత స్పృశింపబడనిది భగవంతుని తేజస్సు. కాబట్టి, అట్టి పరబ్రహ్మతేజస్సుచేతనే ఉభయ విభూతులు- ఈ లోకం, ఆ లోకం- ప్రకాశిస్తున్నాయని ఉపనిషత్తులు ఉగ్గడిస్తున్నాయి.

సమష్టి సృష్టిచేసి, వ్యష్టి సృష్టిని కూడా చతుర్ముఖునికి అంతర్యామివై నిఖిల సృష్టిని చేసే పరమాత్మవు నీవే "అత్తాచరాచర గ్రహణాత్" (బ్ర.సూ.) ప్రళయాన్ని చేయువాడవు నీవే- అని ఉపనిషత్ప్రతిపాదితమైన అర్థంచేత స్తుతింపబడింది.

10. అణుపమి అస్స విఅచ్చు అ
సత్తీ తుహ సఅలధారణా ఇ వహుత్తా।
తేణ పడివత్తు పుణ్ణో
సువ్వసి అపడిహ అ ణిఅఠి ఈ సవ్వగ ఓ॥

ఛా. అణుప్రమితస్యాప్యచ్యుత,
శక్తి స్తవ సకలధారణాది ప్రభూతా।
తేన ప్రతివస్తు పూర్ణః
శ్రూయసేఽప్రతిహత నిజస్థితిః సర్వగతః॥

**అర్థం:** అచ్యుత= దాసులను విడువని ఓ దేవనాథా!; అణుపరిమితస్య. అపి= అణువంత వస్తువులో ప్రవేశించియుండునట్టి వాడవైననూ; తవ= నీ యొక్క; శక్తిః= శక్తి; సకల ధారణ+ఆది ప్రభూతా= అన్ని వస్తువులను ధరించడం మొదలైన వాటియందు గొప్పదైనది; తేన= ఆ కారణంచేత; అప్రతిహత నిజస్థితిః= ఆటంక పరచబడని నీదైన ఉనికిని కలవాడవు; సర్వగతః= అంతట వ్యాపించియున్నవాడవు నైన నీవు; ప్రతివస్తు పూర్ణః= ఒక్కొక్క వస్తువునందు నిండియున్నవాడవుగా; శ్రూయసే= శ్రుతులచే బోధింపబడుతున్నావు.

**తా॥** ఓ అచ్యుతా! దేవనాయకా! నీవు అణువైన వస్తువులలో చేరి నిల్చియున్నావు. ప్రతి వస్తువులోపల సూక్ష్మంగా నివసించావు. నీవులేని చోటు లేదు. ఈ దశలో నీ స్వరూపం ప్రతివస్తువులో నిల్చియున్నప్పుడు, సకల వస్తువులను ధరించియుండడం గొప్పశక్తిమంతునికే చెల్లును. ఇట్లు ఉండడం వల్ల ప్రతి వస్తువునందు నీవు పూర్ణుడవై యున్నావని వేదాలు బోధిస్తున్నాయి. ఒక్కొక్క వస్తువులో ఇట్లుచేరి యున్నందున నీకు ఎట్టి అడ్డు- ఆటంకమూ లేదు. నీ తేజస్సుచే ప్రతివస్తువు ఉత్తేజితమై ప్రకాశిస్తున్నది.

**వ్యాఖ్య:-** భగవానుడు అణురూపవస్తువు లోపలకూడా చేరి ప్రకాశిస్తున్నాడని స్తుతించే శ్లోకమిది.

అచ్యుతుడు- ఏ వస్తువునందు కూడా చ్యుతి- భ్రంశము నొందకుండా నిల్చియున్నాడు. అణుపరిమాణంలో ఉండే జీవాత్మ మనస్సుచేతనే తెలుసుకోదగినదని "ఏషోఽణురాత్మా చేతసా వేది తవ్యః" - (శ్రుతి) బోధిస్తున్నది. 'అణుపరిమితమైన జీవాత్మ లోపల అను ప్రవేశించి యున్నావు' అంటే జీవాత్మకంటే సూక్ష్మంగా ఉన్నావని కూడా నీ వైభవాన్ని వేదాన్తం బోధిస్తున్నది.

"అణోరణీయాన్ మహతో మహీయాన్"- (శ్రుతి). అణువుకంటే మిక్కిలి సూక్ష్మంగానూ, పెద్ద వస్తువుకంటె చాలా పెద్దగానూ ఉండేవాడు పరమాత్మ అని వివరిస్తున్నది.

అట్టి విభవం కలవాడవైనను నీ శక్తి త్రివిధ చేతనాచేతనాలను ధరించడం, రక్షించడం మొదలైన కృత్యములందు చాలా గొప్పదైనది.

వస్తువులు మొదట రెండు విధాలుగా చెప్పబడినాయి. చేతనం, అచేతనం అని వస్తువులు రెండు విధాలు.

1. 'చిత్' అంటే జ్ఞానం. జ్ఞానమొక గుణంగా (ధర్మభూతజ్ఞానం) గల జీవాత్మ 'చేతనుడు' అనబడతాడు.
2. 'అచిత్' అంటే జ్ఞానంలేని (జడ) వస్తువు 'అచేతనం' అనబడుతుంది. భగవానుని సంకల్పంవల్ల చేతనుడు అచేతనం చేత ఏర్పడిన ఫలాన్ని అనుభవిస్తుంటాడు.

చేతనులు – జీవాత్మలు మూడు విధాలు:–

1. బద్ధాత్మలు:– కర్మసంబంధంచేత సంసారమనే చక్రమందే పరిభ్రమిస్తుండే వారు.
2. ముక్తాత్మలు:– సంసారమందు కొంతకాలం ఉండి, సదాచార్యుల సంబంధం వల్ల మోక్షోపాయాన్ని అనుష్ఠించి ముక్తిని పొందినవారు.
3. నిత్యాత్మలు:– కర్మబంధం వాసనకైనా లేకుండా, పరమపదమందు శ్రియఃపతి సన్నిధిలో సకల విధ కైంకర్యమందు మగ్నులై యుండే ఆదిశేషుడు, గరుత్మంతుడు, విష్వక్సేనుడు మొదలైనవారు నిత్యాత్మలు.

'అచేతనం' కూడా మూడు విధాలు:–

1. ప్రకృతి:– 'త్రిగుణం' అంటే సత్త్వగుణం, రజోగుణం, తమోగుణం కలిగి అనేక తత్త్వాలుగా మారుతుంటుంది.
2. కాలం:– ఇది జడవస్తువైనా విభువుగా ఉంటుంది. కాలం చేతనే అనేక మార్పులు ఏర్పడుతాయి. వైకుంఠంలో మాత్రం కాల ప్రభావం ఉండదు.

"నతత్ర సూర్యోభాతి న చంద్ర తారకం"- నిత్య విభూతిలో భగవానుని ప్రకాశమే తప్ప, సూర్యచంద్ర నక్షత్రాలు ప్రకాశింపవు.

3. శుద్ధసత్త్వం:- ఇది కేవలం సత్త్వగుణమనే విలక్షణద్రవ్యం. శుద్ధ సత్త్వమయమైన లోకం ఒక్క వైకుంఠమే కదా!

మూడేసి విధాలుగా ఉన్న చేతనాచేతనాల స్వరూప, స్థితి, ప్రవృత్తులను నియమించేది భగవానుని సంకల్పమే. అవి భగవానుని అధీనమందున్నాయని భావం.

కాబట్టి, చేతనాచేతన వస్తువుల లోపల అణువుకంటే సూక్ష్మంగా ఉండి అనుప్రవేశం చేసినా, భగవానుని శక్తి ఆ వస్తువుల ధారణ, రక్షణాదుల యందు మాత్రం పర్యాప్తమైనది. అణువుకంటె అణీయుడైయున్ననూ, అప్రతిహతమైన శక్తి కలవాడైనందు వల్ల సకల వస్తువులందు భగవానుడు వ్యాపించియున్నాడు, పరిపూర్ణుడైయున్నాడు.

"పరాఽస్య శక్తిర్వివిధైవ శ్రూయతే స్వాభావికీ జ్ఞానబల క్రియాచ" (శ్రుతి). స్వభావసిద్ధమైన భగవానుని శక్తి అనేక విధాల గొప్పది. జ్ఞానం, బలం, క్రియలను కూడా అది కలిగియున్నది అన్నది వేదం. కాబట్టి, "అంతః ప్రవిష్టః శాస్తా జనానాం సర్వాత్మా" - సర్వాత్ముడైన భగవానుడు జనుల హృదయాలలో చేరి నియమంగా శాసిస్తున్నాడు- అన్నది ఉపనిషద్వాణి.

"ఆత్మని తిష్ఠ న్నాత్మనోఽంతరో యమాత్మానవేద యస్యాత్మా శరీరం"- ఆత్మ లోపల భగవానుడు నివసించియున్నప్పటికీ, ఆత్మ భగవానుణ్ణి తెలుసుకోవడం లేదు. అందువల్ల పరమాత్మకు శరీరంగా ఉన్నది జీవాత్మ- అని ఉపనిషత్తు బోధిస్తున్నది.

"చింతయ సర్వం చిదచిద్రూపం తను రితి తస్యహరేరను రూపం"- చేతనాచేతనాత్మకమైన ఈ జగత్తు భగవానుడైన హరికి అనురూపమైన శరీరంగా

ఉన్నదని భావించి, జగచ్ఛరీరుడైన హరిని స్మరించడం ప్రేయస్కరం, శ్రేయస్కరమని 'స్మృతి' నొక్కిచెబుతున్నది. "తేనేదంపూర్ణం పురుషేణ సర్వం" అనే ఉపనిషదర్థం ఈ శ్లోకమందు ప్రస్తుతింపబడింది.

"పరన్దతణ్ పరవైయుళ్ నీర్ దొఱుమ్ పరన్దుళన్"- (తి.వా.మొ. 1-1-10) అనే పాశురమందు నమ్మాళ్వార్లు, ఘానభోంతరాళమందలి పరమాణువు లన్నిటిలో వ్యాపించియున్ననూ తదితరులకు అగోచరుడై యున్నాడు సర్వేశ్వరుడు అని ప్రకటించిన భావశబలత దేశికులచేత ఉగ్గడింపబడింది.

*11.* స అలాణ ధరణ ణి అమణ
సామిత్త ణ ణిఅమసంఠి ఓ సవ్వత ణూ।
సువ్వసి అచ్చు అ సవ్వో
స అ దంసిఅ కజ్జకారణత్తణ కబురో॥

భా. సకలానాం ధరణ నియమన
స్వామిత్వ నియమ సంస్థితః సర్వతనుః।
శ్రూయసేఽచ్యుత సర్వః
స్వయం దర్శిత కార్యకారణత్వ కర్బురః॥

**అర్థం:** అచ్యుత= చ్యుతిలేని వాడా!; సకలానాం= వస్తువులనన్నిటిని; ధరణ-సంస్థితః/ ధరణ= ధరించడమందు (స్థాపనమందు); నియమన= శాసించడమందు; స్వామిత్వ= నాయకత్వమందును; నియమ= ఎప్పుడూ కట్టుబాటుతో; సంస్థితః= బాగా నిల్చియున్నవాడవు; సర్వతనుః= వస్తువులన్నీ (నీకు) దేహంగా కలవాడవు; స్వయం= స్వయంగా; దర్శిత-కర్బురః/ దర్శిత= చూపబడిన; కార్య కారణత్వ= కార్యంగానూ, కారణంగానూ ఉండడంచేత; కర్బురః= కలిసి చిత్రంగా ఉన్నవాడవు; (అత ఏవ= ఈ కారణం చేతనే, నీవు); సర్వః= 'సర్వం' అనబడుతున్నావు అని; శ్రూయసే= వేదం చేత బోధింపబడుతున్నావు.

**తా॥** ఓ అచ్యుతా! దేవనాయకా! సకల లోకాలనన్నిటిని స్థాపించడం, శాసించడం, ఆధిపత్యం వహించడం అనే ఈ కార్యాలయందు దీక్షతో నిల్చియున్నావు. జగత్తంతా నీకు శరీరమైయున్నవాడవు. నీవే కార్యవస్తువుగానూ, కారణవస్తువుగానూ కలిసి యుండి చిత్రమైన వాడవుగా కనబడుతున్నందువల్ల వేదాలు నిన్ను 'సర్వ'శబ్దంతో వ్యవహరిస్తున్నాయి.

**వ్యాఖ్య:-** భగవానుడు 'సర్వః' అను నామం కలిగియుండే కారణాన్ని శ్రుత పరచే శ్లోకమిది.

"సృగతౌ" అను ధాతువు మీద 'వన్' ప్రత్యయం చేరినందున 'సర్వః' అను రూపమేర్పడింది. గత్యర్థక ధాతువులు బుద్ధ్యర్థకాలు కదా! భగవానుడు అచ్యుతుడు. వస్తువులను తాను విడిచియుండడు, వాటిని కూడా తన నుంచి విడిపోనీయడు. కాబట్టి చేతనాచేతన విశిష్టుడు నారాయణుడు. ఎన్ని అవతారాలెత్తినా, తన స్వభావాన్ని విడువక ప్రవర్తించేవాడు. సకల వస్తువులను ధరిస్తున్నవాడు– అంటే భగవానుని స్వరూపంచేతనే వస్తువుల స్వరూపం నిల్చియుండడం వల్ల 'సర్వం' తానే అయి ఉన్నాడు. 'నియమనం' అంటే సర్వం తన అధీనమందుంచుకొని శాసించడం.

జగత్తును స్థాపించడమే కాక, భగవానుని సంకల్పంచేత– ఏ రెండు వస్తువులు రూపంలోనూ, గుణంలోనూ, ఒకే విధంగా ఉండక భవ్యంగా ప్రకాశిస్తున్నాయి. భగవత్సంకల్పమే నియమనం– శాసనం– ఆజ్ఞ. 'స్వామిత్వం' అంటే వస్తువులన్నీ 'నావి' అనే అభిమానం కలిగి, వాటిని కాపాడుకొనే బాధ్యతను వహించడమూ, వాటిని తన ఇష్టం ఉన్నట్లు వినియోగించుకొనే అర్హత, ఆధిపత్యం కలిగియుండడం. నియమ సంస్థితుడు– భగవత్సంకల్పానికి తిరుగులేదు. సత్య సంకల్పుడు కాబట్టి జగద్రక్షణాది వ్యాపారమందు ఎల్లప్పుడు స్థిరముగా నుండువాడని భావం.

సర్వతనుః– చేతనాచేతన పదార్థాలన్ని భగవానునికి శరీరంగా ఉండడమూ, ఆ పదార్థాలకు తాను శరీరి– ఆత్మగా నున్నవాడని సుస్పష్టం. "యస్యపృథివీ

శరీరం" (బృహ.ఉ.). "జగత్సర్వం శరీరంతే" (రా.యు. 120-25) కార్యకారణత్వ కర్బురుడు:- స్థూలవస్తువులన్నీ భగవానుని కార్యరూపాలు. సూక్ష్మమైనవన్ని ఆయన కారణరూపాలే. భగవానుని స్థూలరూపమే జగత్తు. సృష్టికి ముందున్న సూక్ష్మరూపం కారణరూపమని అర్థం. కాబట్టి కార్యకారణ రూపాలతో కలసి చిత్రంగా ఉన్నవాడు సర్వేశ్వరుడని సారాంశం. "కారణంతు ధ్యేయః" (అధర్వ.)

సర్వః:- సకల వస్తువులను గూర్చి చెప్పే శబ్దాలు భగవానుని గుఱించి చెప్పుతున్నవే. తత్ఫలితంగా 'సర్వః' అనే పేరు భగవానునికే చెల్లుతున్నదని వేద నాదం వినిపిస్తున్నది.

"సకారణం కరణాధిపాధిపో నచాస్యకశ్చిజ్జనితా నచాధిపః" శ్వే.ఉ.6-6) ఇంద్రియాధిపతియైన జీవునికి అధిపతియైనవాడు కారణభూతుడు. ఆయనను పుట్టించిన వాడు గానీ, నియమించినవాడుగానీ వేరొకడు లేడు. సర్వేశ్వరుడు కారణావస్థ కార్యావస్థలు కలవాడై సూక్ష్మస్థూల చేతనాచేతన పదార్థములను శరీరముగా కలవాడైనందువల్ల ఎల్లప్పుడు సర్వాత్మ భూతుడు. ప్రకారభూతమైన శరీర దోషములు ప్రకారియైన- శరీరియైన పరమాత్మకు అంటవు- అని విశదమవుతున్నది.

"సర్వత్ర ప్రసిద్ధోపదేశాత్"- (బ్ర.సూ.) హేతువును చెప్పి నిర్ణయిస్తున్నది. "సర్వం ఖల్విదం బ్రహ్మ, తజ్జలానితిశాంత ఉపాసీత"- (ఛా. ఉపనిషత్తు) పరిదృశ్య మాన ప్రపంచమంతా పరబ్రహ్మనుంచి పుట్టి, జీవించి, పరబ్రహ్మయందే ప్రవేశించడం వల్ల బ్రహ్మాత్మకమనబడుతున్నది. కాబట్టి శాంతచిత్తుడై ఉపాసింపవలెను- అని శ్రీభాష్యం.

"సర్వం సమాప్నోషి తతోఽసి సర్వః" - సర్వం భగవానుని యందే చెందుతున్నందువల్ల ఆయన 'సర్వ' శబ్దం చేత అనుసంధింపబడుతున్నాడని ఉపనిషత్తులు బోధిస్తున్నాయి.

'సఅ-స్వయం' అనుచోట 'స ఇ- సదా' అను పాఠాంతరం ఉన్నది.

12. పురిస పహాణ సరీరో
భువణాణంహోసి అచ్చుఅ ఉవాఆణమ్
ణిఅ సంకప్ప సణాహో
వహసి ణిమిత్తత్తణం విఅబ్భుఅ సత్తీ॥

ఛా. పుర్షుష ప్రధాన శరీరో
భువనానాం భవస్య చ్యుతో పాదానమ్।
నిజసంకల్ప సనాథో
వహసి నిమిత్తత్వమప్య ద్భుత శక్తిః॥

**అర్థం:** అచ్యుత= విడువనివాడా! దేవనాయకా!; అద్భుతశక్తిః= విచిత్రమైన శక్తిని కలిగియున్న నీవు; పురుష, ప్రధాన శరీరః= జీవులనూ, ప్రకృతినీ శరీరంగా కలవాడవు; భువనానాం= లోకాలకు; ఉపాదానం= ఉపాదాన కారణంగా; భవసి= అవుతున్నావు; నిజసంకల్పసనాథః= నీదైన సంకల్పంతో కూడిన వాడవై; నిమిత్తత్వం, అపి= నిమిత్త కారణాన్ని కూడా; వహసి= వహించి యున్నావు, ధరిస్తున్నావు.

**తా॥** ఓ అచ్యుతా! నీ శక్తి చాలా విచిత్రమైనది. వేరేచోట ఎక్కడా కానరాకున్నది. కాబట్టి ఆశ్చర్యంగా గోచరిస్తున్నది. కార్యవస్తువులకు లోకంలో రెండు కారణాలుంటాయి. ఒకటి ఉపాదాన కారణం, రెండవది నిమిత్తకారణం. ఒక కుండను కుమ్మరి మన్నుచేత చేస్తుంటాడు. ఆ మన్నే- మట్టియే- కుండ ఆకారాన్ని పొందుతుంది. ఈ కుండకు మన్ను ఉపాదానకారణం అవుతున్నది. కుండను చేసే కుమ్మరివాడూ, అతడు గ్రహించిన సాధనాలు- పనిముట్లూ (దండకఱ్ఱ–చక్రం) నిమిత్త కారణమనబడును. ఇట్లు లోకంలో వేర్వేఱు వస్తువులకు ఈ రెండు కారణాలు ఉండడం ప్రసిద్ధం. నీ విషయం మాత్రం చిత్రంగా ఉన్నది.

చేతనాచేతన ప్రపంచమంతా నీకు శరీరమైయున్నది. సూక్ష్మచేతనాచేతన వస్తువులను శరీరంగా ధరించి, వాటికి అంతర్యామివైనందువల్ల నీవు వాటికి

ఉపాదానకారణమవుతున్నావు. ఆ సూక్ష్మవస్తువులే స్థూలమైన కార్యవస్తువులుగా కావడానికి "నేను పలువస్తువులుగా మారుతాను" అని సంకల్పించి, కార్య వస్తువులుగా మార్పునొందడం చేత, అట్టి సంకల్పాన్ని కలిగియున్న నీవు నిమిత్త కారణంగానూ అవుతున్నావు. ఈ విధంగా, ఒక్కవస్తువే రెండు విధాలైన కారణాలై యుండడమనే అద్భుతం నీ విషయాననే మాకు కనబడుతున్నది.

**వ్యాఖ్య:**- భగవానుడే రెండు కారణాలైయున్నాడని వర్ణితం.

ఈ విషయం వేదాంత శాస్త్ర ప్రతిపాదితం. "పరాస్యశక్తిర్వివిధైవ శ్రూయతే"- సర్వేశ్వరుని శక్తి నానావిధాలుగా ఉండును- అని శ్రుతి బోధిస్తున్నది. అనితర సాధారణమైె ఆశ్చర్యాన్ని గొల్పే శక్తి కలవాడు సర్వేశ్వరుడు. 'పురుషుడు' అంటే జీవుడు. 'ప్రధానం' అంటే ప్రకృతి. ఈ రెండు భగవానునికి సర్వదా- సృష్టి స్థితి లయాలు అనబడే మూడు దశలయందు కూడా అవినాభూతాలైనందు వల్ల శరీరంగా ఉన్నాయి. వీటిని విడదీసి చూపసాధ్యం కాదు. "యస్యాత్మా శరీరం, యస్య పృథ్వీ శరీరం"- అని ఉపనిషద్వాక్యాలు శ్రుతపరుస్తున్నాయి.

తనయందు లీనమైన అపరాప్రకృతి యనబడే భూమి మొదలైన జడ ప్రకృతి, పరాప్రకృతి యనబడే జీవవర్గం- అపరా, పరాప్రకృతులు అనే రెండు విధాలైన చిదచిద్రూప సూక్ష్మప్రకృతుల ద్వారా తాను ఈ స్థూల దృశ్య ప్రపంచాన్ని సృష్టిస్తాను- అని శ్రీకృష్ణభగవానుడు భగవద్గీతయందు (7 అధ్యా. 4, 5, 6) తెల్పినాడు. అందువల్ల భగవానుడు పురుష ప్రధాన శరీరుడనడం సుస్పష్టం.

భువనానాం భవసి ఉపాదానం:- "భవతీతి భువనం"- దీనియందు అన్ని కలుగుతాయి కాబట్టి 'భువనం' అని జగత్తుకు పేరు. "విష్టపంభువనం జగత్" (అమరం) 'భువనానాం' అని బహువచనం చేత 'కొన్ని లోకాలకు వేరొక ఈశ్వరుని కార్యత్వమున్నదని సంకోచింప రాదని తెల్పబడుతున్నది. అన్ని లోకాలకు సర్వేశ్వరుడే ఉపాదాన కారణమని వెల్లడిస్తున్నది.

'ఉపాదానం' అంటే సవికారకారణం అని అర్థం.

నిత్య నిర్వికారుడైన సర్వేశ్వరునికి ఉపాదానత్వం ఎట్లు కలుగుతుంది? అనే శంకను 'పురుష ప్రధాన శరీరుడు' అన్న పదమే పరిహరిస్తున్నది.

ఉపాదాన లక్షణం విశేషంగా తెలుసుకోదగినది కదా!

"భావిస్థూలావస్థా వతః పూర్వభావి సూక్ష్మావస్థా యోగి యత్ కారణం తత్ ఉపాదానం"- ఇకపైన స్థూలావస్థను పొందడానికి ముందు సూక్ష్మావస్థను కలిగియున్న కారణ వస్తువేదో అది ఉపాదాన కారణమనబడును.

నీటితో మెత్తగా మెదుపబడిన మట్టిముద్దయే కడవ, చిప్ప మొదలైన స్థూలరూపాలను పొందుతున్నది. కడవ, చిప్ప మొదలైన స్థూలరూపాలను పొందడానికి ముందు ముద్దగా నున్న మట్టియే ఆ కడవ, చిప్పలకు ఉపాదాన కారణమవుతున్నది.

సూక్ష్మ చిదచిత్తులతో కూడియున్న సర్వేశ్వరుడు స్థూల చిదచిత్తులతో కూడిన జగద్రూపంగా పరిణమించాడు. రూపాంతరాన్ని పొందినాడు అన్నమాట. మట్టిముద్దయే కడవగా రూపాంతరాన్ని పొందింది కదా! అనే దృష్టాంతాన్ని ఉపనిషత్తులే చెబుతున్నాయి. ఈ స్థూల చిదచిదాత్మకమైన జగత్తుకు, ముందు సూక్ష్మ చిదచిత్తులతో కూడియున్న సర్వేశ్వరుడే ఉపాదాన కారణమని వెల్లడించాయి.

అయితే, ఉపాదానకారణం నిమిత్తం కారణాధీనమైనదే కదా! అనగా మృత్పిండం- మట్టిముద్ద- కడవగా వికృతిని పొందడానికి కుమ్మరి నిమిత్తకారణమైనాడు కదా! కాబట్టి, నిమిత్త కారణం వేరే ఒకటి ఉండాలి కదా! అని అడుగవచ్చు.

మట్టిముద్ద అచేతనం. చేతనుడైన కుమ్మరిచేత ఆ మట్టిముద్ద కడవగా మలచబడింది. కాని లోకంలో వస్తూత్పత్తికి రెండు కారణాలున్నట్లు, జగదుత్పత్తికి రెండు కారణాలు లేవని, ఉపాదాన కారణమేదో, అదే నిమిత్తకారణమని దృష్టాంతంతో ఉపనిషత్తులు తెల్పుతున్నాయి.

"యథోర్ణనాభిః సృజతే గృహ్ణాతేచ"- సాలెపురుగు తన శరీరమందు ఉన్న ఊర్ణయనే దారాన్ని ఇతర నిమిత్త కారణ సహాయం లేకుండా, స్వేచ్ఛగా ముఖంనుంచి బయటకు విస్తరింపజేస్తుంది. కొంతసేపు విహరించిన తర్వాత తిరిగి ఆ దారాన్ని తానే గ్రహిస్తున్నది- తనలో చేర్చుకొంటుంది. అట్లే సర్వవిధ శక్తియుక్తుడైన సర్వేశ్వరుడు నిమిత్త కారణాపేక్షలేకుండానే "తదైక్షత- బహుస్యాం ప్రజాయేయ"- నేను అనేక విధాలుగా అవుతాను అని సంకల్పించి ఈ జగత్తును సృష్టించాడు.

*నిజ సంకల్పసనాథో వహసి నిమిత్తత్వమపి:* - తనదైన సత్యసంకల్పంచేతనే భగవానుడు తానే ఉపాదానకారణం, తానే నిమిత్తకారణమూ అయినాడు అని నిర్ద్వంద్వంగా సుశ్లోకితం.




13. *విసమగుణం కుర పఅరే*
*జలంవ సామణ్ణకారణం తుహకేళీ,*
*ణి అ కమ్మసత్తి ణి అఆ*
*అచ్చుఅ బహ్మాఇ ఠావరన్త విసే సా॥*

ఛా. *విషమ గుణాంకుర ప్రకరే*
*జలమివ సామాన్య కారణం తవకేళిః।*
*నిజకర్మ శక్తి నియతాః*
*అచ్యుత! బ్రహ్మాది స్థావరాంత విశేషాః॥*

**అర్థం:** అచ్యుత= అచ్యుతుడవైన దేవనాయకా!; విషమగుణ+అంకుర ప్రకరే/ విషమ= పరస్పరం హెచ్చుతగ్గులుగా నున్నట్టి; గుణ= సత్త్వ రజస్తమోగుణాలుగల; అంకుర= మొలకలవంటి వాటియొక్క ప్రకరే= సమూహమందు; తవ= నీ యొక్క; కేళిః= లీల; జలం, ఇవ= నీరువలె; సామాన్యకారణం= సాధారణ కారణంగా ఉన్నది; బ్రహ్మ+ఆది, స్థావర+అంత విశేషాః= చతుర్ముఖ బ్రహ్మ మొదల్కొని స్థావరం వరకున్న వస్తువుల యొక్క అసాధారణమైన ఆకారాలు; నిజకర్మ శక్తి నియతాః= తమ కర్మల శక్తి చేత కట్టుబడి యున్నాయి.

**తా॥** ఓ అచ్యుతా! నీ యొక్క సంకల్పంచేత జగత్తును సృజించావు. సృష్టియందు పలు విభాగాలున్నాయి. నీచే సృజింపబడిన బ్రహ్మ మొదల్కొని స్థావరం వరకున్న వస్తువుల విభేదాలు గణింపశక్యం కాదు. ఇట్లు సృష్టిజేయదానికి ప్రయోజనం నీ లీలయే. ఈ లీల నీ సృష్టికి సామాన్యకారణమే. ఈ సృష్టియందు సత్త్వరజస్తమస్సులు అనే గుణాల యొక్క విభాగంచేత సృజింపబడిన వస్తువుల యొక్క స్వభావాలు, కార్యాలు వేర్వేరుగా ఉన్నాయి. లోకంలో పలురీతుల సస్యాలు, కాయలు, పండ్లతో వివిధంగా ఉంటున్నాయి. వాటికన్నిటికి జలం సామాన్యకారణమై యున్నది. వాటి విభేదాలకు ఆయా విధానాలయందున్న విచిత్ర శక్తి కారణంగా ఉన్నది. అట్లే నీ విచిత్ర సృష్టికి నీ లీలయే సామాన్య కారణమైయున్నది.

ఆయా వ్యక్తులు చేసిన పూర్వకర్మలే విశేష కారణమవుతున్నది. విశేష పుణ్యకర్మ నాచరించిన వ్యక్తి బ్రహ్మగా భాసిల్లుతున్నాడు. స్వల్పంగా పుణ్యంచేసిన వారు తమ విభిన్న కర్మలకు ఫలంగా వేర్వేరు జన్మలను పొందుతున్నారు. ఆ విధంగా స్థావరజన్మలను కూడా పొందుతుండడం గమనింపదగినది. చేతనాచేతన ప్రపంచమంతా కర్మల శక్తికి కట్టుబడి వివిధ జన్మకర్మలను కలిగియున్నది. కాబట్టి ఓ దేవదేవా! నీ పక్షపాతంవల్లనో, నిర్దయవల్లనో ఉచ్చనీచ స్థితిగల ఈ జగత్తు సృష్టింపబడినదనడానికి అవకాశమే లేదు.

వ్యాఖ్య:- జంగమ స్థావరాల జన్మలు కర్మవల్ల కలిగినవని వర్ణితం.

ప్రకృతి త్రిగుణాత్మకమై పరివర్తన శీలం కలది. సత్త్వరజస్తమో గుణాలు విషమంగా ఉంటాయి. అంటే వ్యక్తిగతాలై సమానస్థితిలో ఉండక ఎక్కువ తక్కువగా ఉంటాయని భావం. ఈ మూడు గుణాలు ఒకటికంటే మరొకటి చిన్నగానో, పెద్దగానో ఉండే మొలకలవంటివి. ఆ మొలకలు తమ స్వభావాన్ని బట్టి పెరిగి పూలు పండ్లతో శోభించడానికి జలమే సామాన్య కారణం. వేర్వేఱు ధాన్యాదులను ఉత్పత్తి చేసే సస్యాదులైన మొక్కలకు నీరు కారణం. అట్లే, కర్మలు అనే కందమూలాలకు- బ్రహ్మాది స్థావరాలకు నీ క్రీడయే సలిలం.

*"బ్రహ్మాది స్తంబ పర్యన్త విచిత్రాంకురశాలినామ్।*
*సలిలం కర్మకందానాం క్రీడైవ తవకేవలమ్॥"*

(యాదవాభ్యుదయం 1-50)

భగవంతుని లీల జలంవలె సామాన్యకారణమై యున్నది. 'లీల' అంటే క్రీడ, విలాసమని అర్థం.

"లోకవత్తు లీలాకైవల్యమ్"- (బ్ర.సూ. 2-1-33). లోకంలో ఒక సార్వభౌముదు సంపూర్ణ శౌర్యవీర్య పరాక్రమ యుక్తుడైనప్పటికీ, విలాసం కోసం 'టెన్నిస్' వంటి బంతులాటల నాడునట్లే, భగవానుడు కేవలం లీలయే ప్రయోజనంగా కలవాడై సంకల్పమాత్రంచేత పరిణామాన్ని చెందునట్టి విచిత్రమైన- స్థావర జంగమాత్మకమైన జగత్తును సృజించాడు.

జీవులు శరీరంలో ఉండేవారు. ప్రకృతిధర్మాలను తమయందు ఆరోపించడం చేత దాని మార్పులకు కారణమైనవారు. అనాది పుణ్యాపాపకర్మ వశులు. జీవుల కర్మానుగుణంగానే, జన్మస్థితి ధ్వంసాదులు గల జగత్తును సృజించాడు. అయినా జీవులు తమ భోగ్యవస్తువులను, అందుకు కావలసిన ఉపకరణాదులను స్వయంగా కలుగజేసుకో జాలరు. కావున జీవులు తమ కర్మలకు తగినట్లు పరమదయాళుడైన సర్వేశ్వరునిచే సృజింపబడిన దానినంతటినీ అనుభవిస్తున్నారు.

"ప్రకృతిం పురుషంచైవ విద్ధ్యనాదీ ఉభావపి"- అని భగవద్గీత ప్రకృతి పురుషులను అనాదిగా చెబుతున్నది. కాబట్టి జీవుల కర్మలు కూడా 'అనాది' యని అంగీకరింపబడింది. కాబట్టి, జీవుల అనాది కర్మలను బట్టి విషమ సృష్టి చేయబడింది. కాని, భగవల్లీల తారతమ్య సృష్టికి కారణం కాదు.

"*వైషమ్య నైర్ ఘృణ్యే నసాపేక్షత్వాత్ తథాహి దర్శయతి*" (బ్ర.సూ. 2-1-34) జీవుల ధర్మాధర్మాల అపేక్ష కలదు. కాబట్టి, విషమ సృష్టికి సృజింపబడిన ఆయా ప్రాణుల పుణ్యపాప రూపకర్మలే కారణాలుగాని సర్వేశ్వరునికి పక్షపాతంగానీ నిర్దయగానీ లేనందువల్ల, అవి కారణాలు కావు అని సూత్రార్థం.

"సాధుకారీ సాధుర్భవతి, పాపకారీ పాపోభవతి"- పుణ్యకర్మలను చేసినవాడు గొప్పజన్మను, పాపకర్మలను చేసినవాడు నీచజన్మను పొందుతాడు. "పుణ్యః పుణ్యేన కర్మణా భవతి పాపః పాపేన కర్మణా"- పుణ్యకర్మను అనుష్ఠించినవాడు పుణ్యాత్ముడు, పాపకర్మలను చేసినవాడు పాపాత్ముడు అవుతున్నాడు అని శ్రుతులు బోధిస్తున్నాయి.

"*నిమిత్తమాత్రమేవాసౌ సృజ్యానాం సర్గ కర్మణి।*
*ప్రధానకారణీ భూతా యతో వైసృజ్య శక్తయః॥*" (వి.పు. 1-4-50)

ఇక్కడ 'శక్తయః' అంటే కర్మలు- అని అర్థం. సృజింపబడే జీవుల విషయమై సర్వేశ్వరుడు నిమిత్త మాత్రుడు. ఆయా జీవుల ప్రాచీనకర్మలే విచిత్రమైన దేవ మానవ తిర్యక్ స్థావర రూప జన్మలు కలుగడానికి ప్రధాన కారణాలు- అని శ్రీ పరాశరమహర్షి నొక్కి చెప్పినాడు.

బ్రహ్మాది స్తంబపర్యంతమున్న విషమాకారాలను పొందడానికి కర్మలే కారణాలు. కాబట్టి, పరమకారుణ్యం గల శ్రియః పతి విషమ సృష్టిని చేసినాడు. పక్షపాత, నిర్దయలు అచ్యుతునికి లేవని సుశ్లోకితం.

"సాధారణ్యేన హేతుః సలిలమివ విభుః సర్వకార్యాంకురాణామ్"- (అధికరణ సారావళి. 237) భగవత్కేళిని జలంతో పోల్చి జగత్సృష్టికి కారణ మనడంవల్ల పరిణామాలంకారం.

14. పురిసాతుజ్ఝ విహూ ఈ
అచ్చుఅ లచ్ఛీఅ ఇత్థిఆ సణ్ణాఓ।
ణత్థి పరం తుజ్ఝాణం
సా వి సిరి హోఇ తుజ్ఝకిం ఉణ ఇ అరమ్॥

ఛా. పురుషాస్తవ విభూతిః
అచ్యుత! లక్ష్మ్యాః స్త్రీ సంజ్ఞాః।
నాస్తి పరం యువయోః
సాఽపిశ్రీర్భవతి తవకింపునరితరత్॥

**అర్థం:** అచ్యుత!= ఓ అచ్యుతా!; పురుషాః= పురుషులు; తవ= నీకు; స్త్రీ సంజ్ఞాః= స్త్రీ వాచ్యులు; లక్ష్మ్యాః= లక్ష్మీదేవికి; విభూతిః= కలిమిగా నున్నది; యువయోః = మీ యిద్దఱికంటె; పరం= వేరైన వస్తువు; న, అస్తి= లేదు; సా= ఆ; శ్రీః, అపి= లక్ష్మీదేవి కూడా; తవ= నీదే; భవతి= అవుతున్నది; ఇతరత్= వేరే వస్తువు; కిం పునః = మళ్ళీయేమున్నది?

**తా॥** ఓ అచ్యుతా! ప్రపంచమందు ఉన్నట్టి మగవాళ్ళందఱు నీ యొక్క విభూతియే. ఇక ఆడవాళ్ళందఱు లక్ష్మీదేవియొక్క విభూతి. మీరు ఇర్వురు కాక ప్రపంచాన్ని తమ అధీనమందు ఉంచుకొని నియమించేవారెవరున్నారు? అంశములన్నీ నీ వశమందు ఉన్నవే కదా! లక్ష్మీదేవి కూడా నీచే నియమింపబడి నీకు తగినట్లు ప్రవర్తిస్తున్నది. ఇక వేరే మిగిలిందేమున్నది? అని తాత్పర్యం.

**వ్యాఖ్య:-** ప్రపంచం దివ్యదంపతుల విభూతి- అని వర్ణితం.

పురుష ప్రపంచం శ్రియః పతియొక్క విభూతి అంశమే. 'విభూతి' అంటే ఐశ్వర్యం. శాసనానికి లోబడి యుండే నియమం కలది. కాబట్టి పురుష వాచ్యులందఱు నియమించే సామర్థ్యంగల భగవానునిచే అధిష్ఠింపబడియున్నారు- అని అర్థం.

స్త్రీ వాచ్యులందఱికి అధిష్ఠాత్రి లక్ష్మీదేవి. జగత్తుకు అధిష్ఠాతృలైన శ్రీ శ్రియః పతులకన్న మరొకవస్తువు వేరే ఉన్నదా? లేనేలేదు. భగవానునిచే అధిష్ఠింపబడని వస్తువు ప్రపంచమందు లేదు, అనడం నిర్వివాదాంశం.

*"దేవతిర్యఙ్మనుష్యేషు పున్నామా భగవాన్ హరిః।*
*స్త్రీ నామ్నీ శ్రీశ్చ విజ్ఞేయా నానయోర్విద్యతే పరమ్॥"*

(శ్రీవి.పు. 1-8-35)

దేవతలలోనూ, మనుష్యులలోనూ పశుపక్ష్యాదులలోనూ పురుష వాచ్యుడు నారాయణుడే. 'స్త్రీ' యనదగినవాటియందు స్త్రీ వాచియై లక్ష్మీదేవి అధిష్ఠించి యున్నది. పుంలింగ పదార్థాలన్నీ నారాయణునికి చెందినవి. స్త్రీలింగ పదార్థాలన్నీ లక్ష్మియొక్క విభూతిలోనివే అని భావం. ఈ లక్ష్మీనారాయణులకంటే వేరే వస్తువే లేదు అని శ్రీ పరాశరమహర్షి సూక్తి. శ్రీ శబ్దం యొక్క వ్యుత్పత్తినిబట్టి చూడగా, శ్రీదేవి కూడా 'నీదే' యని నిరూపింపబడుతున్నది.

శ్లో॥ 1) *శ్రితా స్యన్యై స్సర్వైః*= ఇతరులందఱిచేత ఆశ్రయింపబడి యున్నావు.

2) *శ్రయసి రమణం*= ప్రియుడైన విష్ణుమూర్తిని ఆశ్రయిస్తున్నావు.

3) *సంశ్రిత గిరః శృణోషి*= ఆశ్రితుల వాక్కులను వింటున్నావు.

4) *ప్రేయాంసం శ్రితజనవచః శ్రావయసిచ*= ఆశ్రితుల ఆర్తిని, ప్రియునికి వినిపిస్తున్నావు కూడా.

5) *శృణాస్యే తద్దోషాన్ జనని! నిఖిలాన్*= ఓ తల్లీ! ఆశ్రితుల సకల దోషాలను పోగొట్టుతున్నావు.

6) సర్వజగతీం గుణైః శ్రీణాసి త్వం= నీవు ప్రపంచాన్నంతటిని గుణాలతో ఆశ్రయించి ఉన్నావు.

తదిహ భవతీం శ్రీరితి విదుః= అందువల్ల నిన్ను "శ్రీః" అని పేర్కొన్నారు.

శ్రీ శబ్దానికిగల వ్యుత్పత్తి షట్కంచేత, చేతనులచే ఆశ్రయింపబడుతున్నదై, తాను నారాయణమూర్తిని ఆశ్రయించి యున్నదని ముఖ్యంగా పేర్కొనబడినది. కాబట్టి, లక్ష్మీదేవియు నారాయణునికి సంబంధించినదే "సాఽ శ్రీర్భవతి తవ"- అన్న మాటవల్ల స్పష్టమవుతున్నది. "మచ్ఛేషభూతా సర్వేషా మీశ్వరీ మమ వల్లభా"- అని నీవే అన్నట్లు "అస్యే శానాజగతో విష్ణుపత్నీ"- ఈ జగత్తుకు విష్ణుపత్నియే మహారాజ్ఞి (శ్రుతి). ఆ లక్ష్మికూడా అందరికీ ఈశ్వరియైననూ, నీకు శేషభూతయే కదా!

"శ్రియః శ్రీశ్చ భవేదగ్ర్యా"- లక్ష్మికి లక్ష్మియైన సర్వోత్తమ సంపన్నుడు. "కః శ్రీః శ్రియః"- లక్ష్మికి ఆశ్రయ భూతుడు నారాయణుడు. "త్వాం హి శ్రియః శ్రియము దాహు రుదారవాచః"- ఇతరులకు ఆశ్రయం కలిగించే శ్రీదేవికి ఆశ్రయణీయుడైన లక్ష్మీపతివని ఋషుల సూక్తి. ఇత్యాది ప్రమాణాలవల్ల దివ్యదంపతుల వైభవం ప్రకటితం.

కింపునరితరత్? - భగవానుని మహిమయందు చెప్పదగిన వేరే వస్తువు ఇంక ఏమి మిగిలియున్నది? లేనేలేదు కదా!

15. ణ హు తుహ సరిసబ్భహి అ,
ణాహ తుమం ఏవ్వ సవ్వలో అ సరణ్ణో!
ఏఆవ ణాణసారం
ఇఅ ముణి ఉం తిఅసణాహ ఇఅర విఇంతా॥

ఛా. న ఖలుతవ సదృశాభ్యధికాః
నాథ! త్వమేవ సర్వలోక శరణ్యః।
ఏ తావత్ జ్ఞానసారం
ఇతి జ్ఞాతుం త్రిదశనాథేతర విచింతా॥

**అర్థం:** త్రిదశనాథ= ఓ దేవనాయకా!; నాథ= ఓ లోకనాథా!; తవ= నీకు; సదృశ+అభ్యధికాః= సమానులు, అధికులు; న, ఖలు= లేరు; త్వం, ఏవ= నీవే; సర్వలోక శరణ్యః= సమస్త లోకాలకు రక్షకుడవై యున్నావు; జ్ఞానసారం= తెలియవలసిన విషయం యొక్క స్థిరమైన అంశం; ఏతావత్= ఇంత మాత్రమే; ఇతి= అని; జ్ఞాతుం= తెలుసుకోవడానికి; ఇతర విచింతా= వేరే శాస్త్రాల విమర్శ; భవతి= అవుతున్నద.

**తా॥** ఓ దేవనాయకా! నీతో సమానులుగానీ, నీకంటే గొప్పవారుగానీ ఎవరు లేరు. నీవే సకల లోకాలను కాపాడేవాడవు. ఒకడు, తాను సద్గతిని పొందడానికి తెలుసుకోవలసిన ముఖ్యమైన సారాంశమిదే కదా! ఇతర శాస్త్రాలను, వేదాంత విషయాలను విమర్శించగా, యథార్థ విషయమిదే యని స్పష్టమవు తుంది.

**వ్యాఖ్య:** – దేవనాయకుడే సర్వశరణ్యుడని సుశ్లోకితం.

అఖిల భువనాలను అసాధారణంగా నియమించే దేవనాయకునికి సాటివారూ లేరు, ఆయనను మించిన వారూ లేరు. "నతత్సమశ్చాభ్యధికశ్చ దృశ్యతే"– అని శ్రుతి పల్కినట్లు, శ్రియః పతికి సమానుడే లేడు, ఇక ఆయనకంటే అధికుడు ఎక్కడనూ కనబడడు కదా! సర్వలోకాలకు శరణ్యుడు తానే తప్ప మఱొక్కడెక్కడ లేనే లేడు. "శరణేసాధుః= శరణ్యః" 'తత్ర సాధుః'– అనే సూత్రం చేత 'యత్' ప్రత్యయం వచ్చినందువల్ల 'శరణ్య' శబ్దమేర్పడినది. రక్షించడమందు లెస్సగా ఉపకరించువాడని అర్థం. లోకాతిశయమైన సామర్థ్యమున్నవాడు.

"ఏతావత్ జ్ఞానసారం"- స్వరూప పరరూప విషయాన్ని గూర్చి తెలుసుకోదగిన సారం-స్థిరమైన అంశం ఇదే సుమా!

"ఏషహ్యేవానందయాతి"- (ఆనందవల్లి) సర్వరక్షకుడైన శ్రియః పతియే ఆనందింపజేయును అని ఉపనిషద్వాక్యార్థం.

"సకల ఫలప్రదోహి విష్ణుః"- స్మృతి పలికినట్లు, వివిధ శాస్త్రతత్త్వ నిరూపణకు ఫలం కూడా ఇదే. 'జ్ఞానసారమిది' అని యథార్థం తెలిసిన తర్వాత, నిరీశ్వర సాంఖ్యాది శాస్త్రాల తత్త్వగుణ చింత నిష్ఫలమని 'ఇతర విచింతా'- అన్నమాట వల్ల విశదమవుతున్నది. భగవానుడు నిస్సమాభ్యధికుడు, సర్వలోక శరణ్యుడు, ఇత్యాది విషయక జ్ఞానం శ్రుతిమౌళిక శాస్త్ర ప్రమాణాలచేత సంసిద్ధమైనది. ఇక్కడ 'ద్రమిడోపనిషతత్తాత్పర్య రత్నావళి' యందలి శ్లోకం అనుసంధేయం.

"కల్పాంతేఽపిస్థితత్వాత్ సకల సురగణ (సృష్ట) భావాజ్జనానాం రక్షాద్యాపాతకత్వాత్ శివ విధి భరణాత్ సర్వదేవాత్మ భావాత్। తత్తత్ కర్మాను రూపం ఫల వితరణతో వైనతేయధ్వజత్వాత్ మార్కండేయా వనాదేః ప్రభుమథ శఠజిత్ ప్రాహ సర్వామరోచ్చమ్"- ఒత్తార్ మిక్కారై ఇలయాయ మాయా యా" (తి.వా.మొ. 2-3-2) సమానాధికులను లేనివాడు, ఆశ్చర్యభూతుడు శ్రియఃపతి అని దివ్యసూరి సూక్తి.

16. భా ఇ ఫణింద ఉరాహివ
పడి వాలేంతేసుపా అడ వహుత్త ఫలా।
అవి దుహిణప్పముహే హిం
ఆణత్తీ తుహ అలంఘణిజ్జ పహోవా॥

ఛా. భాతి ఫణీంద్ర పురాధిప!
ప్రతిపాలయత్సు ప్రకట ప్రభూత ఫలా।
అపి ద్రుహిణ ప్రముఖై
రాజ్ఞప్తి స్తవాలంఘనీయ ప్రభావా॥

**అర్థం:** ఫణీంద్రపుర+అధిప= అహీంద్రనగర నాథా!; తవ= నీ యొక్క; ఆజ్ఞప్తిః = ఆజ్ఞ; ప్రతిపాలయత్సు= అనుకూలంగా పాటించే వారి విషయంలో; ప్రకట ప్రభూత ఫలా= ప్రకటించే అధిక ఫలాలు కలది; ద్రుహిణ ప్రముఖైః, అపి= బ్రహ్మాది దేవతల చేత కూడా; అలంఘనీయ ప్రభావా= మీర రాని మహిమ గలదిగా; భాతి= ప్రకాశిస్తున్నది.

**తా॥** ఓ అహీంద్రనగరేంద్రా! బ్రహ్మాది దేవతలచేతనూ ఉల్లంఘించరాని ప్రభావంగల నీ ఆజ్ఞ, చక్కగా పాటించే వ్యక్తులకు గొప్ప ఫలాలను ఇచ్చునట్టిదై శోభిస్తున్నది.

**వ్యాఖ్య:-** భగవదాజ్ఞ ఉల్లంఘించరానిదని వర్ణితం.

సాధారణంగా నాయకుని మాటను అతని అనుయాయులు విని నడుచుకోవడం లోకపరిపాటి. దేవనాయకుని ఆజ్ఞను ప్రపంచమందు ఎవ్వరైననూ పాలించవలసిందే. 'ద్రుహిణుడు' అంటే ద్రోహం చేసేవాడు- బ్రహ్మ అని అర్థం.

"ద్రుహ జిఘాంసాయాం"- అని ధాత్వర్థం. ద్రుహ్యాతి అసురేభ్యః- అసురులకు హింస చేయువాడు- 'ద్రుహిణః' అని వ్యుత్పత్త్యర్థం- కర్మవశ్యు లవడంవల్ల బ్రహ్మాది దేవతలకు కూడా భగవదాజ్ఞారూపమైన శ్రుతిస్మృతులను పాలించక అతిక్రమిస్తే, నరకప్రాప్తి తప్పదు. ఇక వేరే వారి విషయం చెప్పేదేమి? కాబట్టి, విధి నిషేధ శాస్త్రరూపమైన భగవానుని ఆజ్ఞను చక్కగా పాలించిన వ్యక్తులకు సమస్త ఫలాలను పొందే అర్హత ఉంటుంది. కోరిన దానికంటె ఎక్కువ ఫలమిచ్చే ప్రభావం కలది భగవానుని ఆజ్ఞానుపాలనం.

"శ్రుతిః స్మృతిర్మమైవాజ్ఞా యస్తాముల్లంఘ్య వర్తతే।
ఆజ్ఞాచ్ఛేదీ మమద్రోహీ, మద్భక్తోఽపి న వైష్ణవః॥"

వేదాలు, స్మృతులు భగవానుని శాసనాలు- ఆజ్ఞారూపమైనవి. కాబట్టి విధి నిషేధరూపమైయున్న భగవదాజ్ఞను ఉల్లంఘించి, తమ ఇష్టప్రకారం నడిచే వ్యక్తి భగవానునికి ద్రోహంచేసినవాడు- 'ద్రోహి' అవుతాడు. అతడు భగవంతుని పట్ల భక్తి కలిగియున్న వాడైనప్పటికీ వైష్ణవుడు కాదు. అంటే, భగవానుడు మాత్రమతనిని తన భక్తునిగా భావించడట- అని భగవానుడే స్వయంగా శాసించి చెప్పిన శ్లోకం యొక్క భావమిది.

యథార్థంగా భగవన్మహిమ 'సర్వం కష' కదా!

(ప్రా) 'అలంఘణీఅ' 'అలంఘణిజ్జ' అని పాఠాలున్నాయి.

17. ణి అమ విహీణ ప ఉత్తీ
సవ్వాణ విదా ససచ్చఉద్విసి అతుమమ్।
సద్ధ ణిమంతి అ బంహణ
సమాహి సిద్ధం లహన్తితి అసాభుత్తిమ్॥

ఛా. నిగమ విధీనాం ప్రవృత్తిః
సర్వేషామపి దాససత్యోద్దిశ్యత్వామ్।
శ్రాద్ధ నిమంత్రిత బ్రాహ్మణ
సమాధి సిద్ధాం లభన్తేత్రిదశా భుక్తిమ్॥

**అర్థం:** దాససత్య= దాసులకు సత్యమైన దేవనాయకా!; సర్వేషాం= సమస్తమైన; నిగమ విధీనాం= వేదోక్త కర్మలయొక్క; ప్రవృత్తిః అపి= అనుష్ఠానం కూడ; త్వాం= నిన్ను; ఉద్దిశ్య= ఉద్దేశించి, ఆచరింపబడుతున్నది; త్రిదశాః= దేవతలు; శ్రాద్ధ-సిద్ధాం/

శ్రాద్ధ= శ్రాద్ధ (తద్దిన) మందు; నిమంత్రిత= ఎన్నుకొని పిలువబడిన; బ్రాహ్మణ= బ్రాహ్మణులయందు; సమాధి= ఆవహించిన ధర్మంచేత; సిద్ధాం= సంపన్నమైన; భుక్తిం= హవిర్భోగాన్ని; లభంతే= పొందుతున్నారు.

**తా॥** దేవనాయకా! నీ దాసులకు నీవు సత్యభూతుడవు. వేదశాస్త్రాలు యాగం, హోమం, శ్రాద్ధం మొదలైన కర్మలను విధించాయి. ఆ కర్మలను అనుష్ఠించునప్పుడు అగ్ని, ఇంద్రుడు, రుద్రుడు మొదలైన దేవతలను ఉద్దేశించి హవిస్సులు అర్పింపబడుతాయి. ఆ హవిస్సులన్నీ దేవతలకు అంతర్యామివైయున్న నీవే గ్రహించి ఆచరించిన కర్మలకు తగిన ఫలాలను నీవే ప్రసాదించేవాడవని నిన్ను గూర్చి కర్మలు జనులచే అనుష్ఠింపబడుతాయి.

పితృదేవతలకు లోకులు శ్రాద్ధకర్మ నాచరిస్తారు. ఆ శ్రాద్ధమందు బ్రాహ్మణులను పిలిచి, వారిని పితరులుగా ఆవాహనచేసి, భోజనం పెట్టి భుజింపజేస్తారు. ఆ శ్రాద్ధంచేత తృప్తిని పొందువారు పితృదేవతలే. అయినా, మధ్యన వచ్చిన బ్రాహ్మణులు భోజనం చేసి తృప్తి పడతారు. అదే రీతిగా, ఆయా దేవతల పేర్లతో హవిస్సులను సమర్పించిననూ, అవన్నీ నిన్ను గూర్చి సమర్పింపబడినవే, కాగా నడుమ ఉన్న దేవతలు తృప్తిపడుతారు. కాబట్టి వేదశాస్త్ర నియమాలు సర్వకర్మ సమారాధ్యుడవైన నిన్ను ఉద్దేశించి విధింపబడి యున్నాయని తాత్పర్యం.

**వ్యాఖ్య:** – సర్వకర్మలకు భగవానుడే లక్ష్యభూతుడని సుశ్లోకితం.

'నిగమ' అనే చోట 'నియమ' అనే పాఠమూ ఉన్నది. వేదశాస్త్ర నియమాలు శ్రీమన్నారాయణుని ఉద్దేశించే సర్వకర్మలను అనుష్ఠించి, నియంతయైన ఆ స్వామి యొక్క అనుగ్రహాన్ని పొందడానికే ఏర్పడి యున్నాయి.

*యేయజంతి పితౄన్ దేవాన్ బ్రాహ్మణాన్ సహుతాశనాన్।*
*సర్వభూతాంత రాత్మానం విష్ణుమేవ యజంతితే॥"*

(భారతం. శాన్తిపర్వం 346-29)

పితృదేవతలను, బ్రహ్మాది దేవతలను నిత్యాగ్ని హోత్రులైన బ్రహ్మజ్ఞానులను పూజించేవారు, సర్వప్రాణులందు అంతర్యామిగా ఉన్న విష్ణుభగవానుణ్ని ఆరాధించినవారుగా భావింపబడుతారు.

"హవ్యకవ్యభుక్ ఏకస్త్వం, పితృదేవ స్వరూపధృక్"- (వి.పు. 1-19-73). శ్రీహరియే దేవతల రూపంతో (హవ్యం) యజ్ఞమందలి హవిస్సును, పితృదేవతల రూపంతో (కవ్యం) తద్దినాగ్నియందలి హవిస్సును భుజిస్తాడు.

అయితే, వేదమంత్రాలలో అగ్ని, వరుణ, రుద్రేంద్రాది దేవతల పదాలు పేర్కొనబడినవి కదా! ఒక్క దేవదేవునినే ఉద్దేశించి కర్మలననుష్ఠించే నియమం ఎట్లు పొసగుతుంది? అంటే దీనికి సమాధానమే ఉత్తరార్ధం.

పితృదేవతలను ఉద్దేశించి చేయబడే కర్మానుష్ఠానం శ్రాద్ధమనబడుతుంది. చిత్తశుద్ధితో పరిశుద్ధమైన ద్రవ్యాలను సేకరించి, అధిక శ్రద్ధకలవారై ఆచరించ వలసిన పైతృకకర్మకు 'శ్రాద్ధం' అని పేరు. దేవతల పేర్లు మంత్రాలలో పఠింపబడుతాయి. ఒకరోజు ముందే సదాచారులైన శ్రోత్రియులైన బ్రాహ్మణులను వరించి, భోజన వ్యాపారంకోసం ఆహ్వానిస్తాడు కర్త. పితృదేవతలు వసు, రుద్ర, ఆదిత్య రూపంలో ఉంటారు.

"ఆప్య తైజస వాయవ్యాని లోకాంతరే శరీరాణి"- వేరే లోకాలలో ఉన్న వారు నీరు, అగ్ని, గాలి రూపాలను కలిగియుంటారు కాబట్టి, మన కంటికి కనబడరు.

*"నియంత్రితాని పితరః ఉపతిష్ఠంతి తాన్ ద్విజాన్।*
*వాయువచ్చాను గచ్ఛంతి తథాఽఽసీనా నుపాసతే॥"* (మను. 3-18-9)

శ్రాద్ధమందు పితృదేవతలు వాయురూపంతో వచ్చి బ్రాహ్మణులందు ఆవహిస్తారు. "సమాధిర్ హృదయైకాగ్ర్యే వైద్య భేద ప్రకారయోః" (అమరశేషం).

"ఆనీద వాతం స్వధయా తదేకమ్"- ఈ బ్రాహ్మణులు ఆ పిత్ృదేవతల ప్రాణతుల్యులు అని శ్రుతి. వేదోక్త విధానంగా పిత్ృదేవతల గూర్చి హోమం చేస్తూ హవిస్సు నర్పించగా, వారికి అంతర్యామియైన శ్రీమహావిష్ణువు స్వీకరిస్తాడు. బ్రాహ్మణులు భోజనం చేస్తారు. పిత్ృదేవతలు తృప్తిపడుతారు.

లోకంలో పిత్ృదేవతలనుద్దేశించి శ్రాద్ధం పెడుతారే కాని నిమంత్రిత బ్రాహ్మణుల నుద్దేశించి ఎవ్వరు శ్రాద్ధం పెట్టరు. అయినా, భోజనం బ్రాహ్మణులకే కదా! దేవతలకు హవిర్భోజనం మాత్రమే కాగా, శ్రాద్ధకర్మయందు సుసంపన్నమైన భోజనం చేయడానికి నిమంత్రితులైన బ్రాహ్మణులే అర్హులైనట్లు, సర్వకర్మలచే ఆరాధింపబడడానికి శ్రీమహావిష్ణువే అర్హుడని పిండితార్థం.

18. *ఆరజ్ఝ తి అసవిలఏ*
*అచ్చుఅ ణిచ్చం ణరాసి జఇణామతుమమ్।*
*కమ్మాణ కప్పి ఆణం*
*కాహీ కప్పంతరేసు కో ణివ్వేసమ్॥*

ఛా. *ఆరాధ్య త్రిదశ విలయే*
*అచ్యుత! నిత్యం నతిష్ఠసి యదినామత్వమ్।*
*కర్మణాం కల్పితానాం*
*కరిష్యతి కల్పాంతరేషు కో నిర్వేశమ్॥*

**అర్థం:** అచ్యుత!= ఓ అచ్యుతా!; ఆరాధ్య త్రిదశవిలయే= పూజింపబడునట్టి దేవతలకు ప్రళయం- నాశం కలిగిన సమయమందు; త్వం= నీవు; నిత్యం= ఎల్లప్పుడు; యది, నామ, న, తిష్ఠసి= ఉండకపోతే; కల్పితానాం= చేయబడిన; కర్మణాం= కర్మలకు; నిర్వేశం= ఫలదానాన్ని; కల్పాంతరేషు= రాబోయే కల్పాలలో- కాలమందు; కః= ఎవడు; కరిష్యతి= చేయగలడు?

**తా॥** ఓ అచ్యుతా! దేవనాయకా! చేతనులు చేసే యాగాది కర్మలచే నీవే పూజింపబడుతుంటావు. నీవే ఆ కర్మల ఫలాన్ని ప్రసాదించేవాడవు. అట్లు గాక, ఇతర దేవతలు ఆయా కర్మలచేత ఆరాధింపబడిన వారే ఫలదాతలుగా ఉండి, ప్రళయకాలమందు వారందఱు (దేవతలు) నశించిపోతారు. అప్పుడు దేవతలను గూర్చి ఆశించి చేసిన కర్మలకు ఫలాన్ని ఎవరిస్తారు? పూర్వం చేసిన కర్మలు ఫలమిచ్చే సామర్థ్యం లేనివై క్షీణించిపోతాయి. మఱి నీవో, ఇతర దేవతలు ప్రళయకాలమందు నశించిననూ, ఎల్లకాలం నశించకుండా ప్రకాశిస్తుంటావు. యాగాది క్రతువులచేత ఇతర దేవతలు పూజింపబడిన వారైనను, వారికి అంతర్యామివైన నీవే ఆ కర్మలచే పూజింపబడినవై యున్నావు. కాబట్టి, పూర్వం చేయబడిన కర్మలకు ప్రళయం తర్వాత వచ్చే కల్పాల (కాలం)లో నీవే ఫలాన్ని అనుగ్రహిస్తావు కదా! అని స్తుతింపబడినది.

**వ్యాఖ్య:-** భగవానుడు ప్రళయకాలమందు కూడా తన మహిమయందు ప్రతిష్ఠితుడై ప్రకాశిస్తుంటాడని వర్ణితం.

సర్వేశ్వరుడు సమాధికదరిద్రుడు. అయినా స్వాతంత్ర్యగుణ విశిష్టుడై నందున ఆశ్రితుల కోరికను అవశ్యంగా నెరవేరుస్తాడని 'అచ్యుత!' అనే సంబోధన వివరిస్తున్నది.

భగవంతుణ్ణి బహుకాలం ఆరాధించిన సుకృతాత్ములు ఆయన అనుగ్రహం చేత దేవతలుగా జన్మించి, ఉన్నత పదవులను పొంది, జనులచేత పూజింప బడుతున్నారు. చేతనులు దేవతల నుద్దేశించి యజ్ఞాది కర్మల నాచరించి, ఆయా కర్మల ఫలాన్ని పొందుతున్నారు. ప్రళయకాలమందు "న బ్రహ్మా నేశానః"- బ్రహ్మగానీ, రుద్రుడుగానీ లేదు అని శ్రుతి పలికినట్లు, దేవతలూ నశిస్తారు.

ప్రళయకాలంలోనూ సర్వేశ్వరునియొక్క ఉనికి లేకపోతే పూర్వం చేతనులు చేసిన కర్మలకు ప్రళయానంతరం వచ్చే కల్పాలయందు ఎవడు ఫలాన్ని అనుభవింప

జేయగలిగేవాడో? అని కవికేసరి స్తుతిస్తున్నాడు. అన్యేకల్పాః= కల్పాంతరాణి; తేషు. "సంవర్తః ప్రళయః కల్పః" - (అమరం).

ఇదొక శాస్త్ర చర్చ:- "యదాగ్నేయోఽష్టాకపాలోఽ మావాస్యా యాంచ పౌర్ణమా స్యాంచ"- అనే మాట పూర్వ మీమాంసా శాస్త్రమందున్నది.

దర్శపూర్ణమాసాది యజ్ఞాలు తమసాధనాలతో 'అపూర్వం' అనే దాన్ని జనింపజేస్తాయి (పూర్వమీమాంస).

'దర్శేష్టి'- ఒక్క అమావాస్యనాడే ఆగ్నేయ యాగం, ఐంద్రపయో యాగం, ఐంద్ర దధియాగం అనే యాగత్రయం చేయడం విధి. అట్లే పున్నమనాడు ఆగ్నేయ యాగం, అగ్నీషోమీయ యాగం, ఉపాంశుయాగం చేయడం శాస్త్రవిధి. ఈ ఆఱు కలిసి 'సముదాయాపూర్వం' అనే దాన్ని జనింపజేస్తాయి. "గౌరవత్వేన సర్వేషాం పదానాం, ఏక ఏవ అపూర్వః స్వీకర్తవ్యః"- (పూ.మీ.) ఆఱు యాగాలవల్ల కలిగిన అపూర్వాలన్ని కలిసి ఒక 'మహాపూర్వం'గా స్వీకరింప బడింది.

'అపూర్వ'మే స్వర్గఫలాన్ని ప్రసాదిస్తుంది అని కల్పితం (ఉత్తర మీమాంసలో). "ధర్మంజైమిని రత ఏవ"- (బ్ర.సూ. 3-2-39). యాగ దానహోమరూప కర్మమే స్వతంత్రంగా ఫలాన్ని ఇస్తుందని 'జైమిని' భావిస్తున్నాడని 'ఫలాధికరణ'- (3-2-8) మందు తెల్పబడింది.

"పూర్వంతు బాదరాయణో హేతువ్యపదేశాత్"- (3-2-40) జైమిని చెప్పినట్లు 'అపూర్వం' ఫలాన్ని ఇవ్వదు. శ్రుతులు ఫలహేతువును నిర్దేశించినందు వల్ల సర్వేశ్వరుణ్ణి ఫలదాతగా బాదరాయణులు అభిప్రాయపడుతున్నారు. శ్రుతుల యందెక్కడ చెప్పబడని అపూర్వకల్పనను ప్రామాణికులెవ్వరు కూడా అంగీకరింపరు.

"వాయుర్వై క్షేపిష్ఠాదేవతా"- అనే వాక్యం వాయుదేవతను గూర్చి యాగం చేయడంవల్ల, వాయువుకు అంతరాత్మగా నున్న సర్వేశ్వరుడే ఆ కర్మచేత ఆరాధింపబడి, కర్మఫలాన్ని ఇచ్చేవాడు.

"స తయా శ్రద్ధ యా యుక్తః తస్యారాధన మీహతే।
లభతేచ తతః కామాన్ మయైవ విహితాన్ హి తాన్॥" (7-22)

భక్తుడు శ్రద్ధాళువై ఆ దేవత నారాధించ గోరుతాడు. ఆ యారాధన వల్ల సంతుష్టుడనై తాను కోరిన ఫలాలను, నేనే ఆ దేవత ద్వారా పొందునట్లు చేస్తాను అని గీతాచార్యుల సూక్తి. కాబట్టి, అచేతనమైన, క్షణధ్వంసియైన కర్మ, కాలాంతర భావియైన ఫలాన్ని ఇస్తుందనడం అసంభవమనీ, సర్వేశ్వరుడు నిత్యుడనీ, కర్మవశ్యులైన దేవతలకు కూడా కర్మఫలమొసగే శక్తి లేదనీ, సర్వకర్మ సమారాధ్యుడైన భగవానుడే ఐహికాముష్మిక భోగాలను, స్వప్రాప్తి రూపమోక్షం కూడా ఇచ్చేవాడనీ, అనంతగరుడ విష్వక్ సేనాది సూరులకూ, ప్రకృతికి కూడా నిత్యత్వం భగవత్సంకల్పంచేత ప్రయోజ్యమనీ శ్రీ భాష్యంవల్ల తేటతెల్లమవుతున్నది. శరణాగతి దీపికలో-

శ్లో॥ విష్వం శుభాశ్రయ వదీశవపుస్త్వదీయం
సర్వాగిరస్త్వయి పతంతి తతో౽సి సర్వః।
సర్వేచ వేద విధయః త్వదనుగ్రహార్థాః
సర్వాధికస్త్వ మితితత్త్వ విదస్తదాహుః॥" (7) అని వివరించబడింది.

19. కప్పేసి కంఖి ఆ ఇం
కప్పదుమో వ్వసిరికంచణ లఆసహిఓ।
ణ అసచ్చ స ఇఫలాఇం
ణి అఛాహి ణి వు (హి)ణ్ణణిచ్చతావ తిహువణో॥

ఛా. కల్పయసి కాంక్షితాని
కల్పద్రుమ ఇవ శ్రీకాంచన లతాసహితః।
నతసత్య! సదాఫలాని
నిజచ్ఛాయా విశ్రాంత నిత్యతాప త్రిభువనః॥

**అర్థం:** నతసత్య= నమస్కరించినవారికి సత్యమైనవాడా!; శ్రీకాంచన లతా సహితః= లక్ష్మీదేవి అనే బంగారు తీగతో కూడియున్న, నీవు; కల్పద్రుమః, ఇవ= కల్పవృక్షంవలె; నిజచ్ఛాయా-త్రిభువనః/ నిజ= స్వకీయమైన; ఛాయా= పాలనచేత, నీడచేత; విశ్రాంత= బాగా తొలగింపబడిన శ్రమగలిగిన; నిత్య తాప= ఎల్లప్పుడు తాపం కలిగియున్న; త్రిభువనః= మూడు లోకాలను కలిగిన వాడవై; కాంక్షితాని= కోరబడినట్టి; ఫలాని= ఫలాలను; సదా= ఎల్లప్పుడు; కల్పయసి= ప్రసాదిస్తావు.

**తా॥** ఓ నతసత్య! దేవనాయకా! కనకమయమైన లతవంటి లక్ష్మీదేవితో కూడియున్న కల్పవృక్షం వంటివాడవు. నీ పాలనయందు మూడులోకాలకున్న శ్రమతొలగిపోయింది. నీ నీడయందు సంసారంలో ఎడతెగక ఉండే తాపమంతా తీరిపోయింది. అట్టి నీవు కల్పతరువువలె ప్రార్థించినవారికి సర్వదా అభీష్ట ఫలాలను ప్రసాదిస్తున్నావు.

**వ్యాఖ్య:-** దివ్య దంపతులే కామిత ఫలాలను ఇచ్చేవారని స్తుతి.

'నతసత్య' అనడంవల్ల ప్రాణులు భగవంతునికి 'ప్రాప్య ప్రాపకాలు తానే' అని వినయంగా నమ్రులౌతారు. ఈ ప్రాణులకే 'సత్యములు' అని పేరు. "అథనామధేయం సత్యసత్యమితి, ప్రాణావైసత్యం తేషా మేష సత్యం"- (బృ. 4-3-6) అనే శ్రుతి వాక్యం వల్ల భగవంతునికి 'సత్యములకూ సత్యం' అని పేరు. జీవులు ఎల్లప్పుడు ప్రాణాలతో కూడియుండేవారు కాబట్టి జీవులే ప్రాణాలు అనబడుతారు. ఆకాశాదులవలె స్వరూప వికారంలేని వారు కాబట్టి, జీవులు 'సత్యములు' అని వ్యవమరింపబడుతారు.

జీవులవలె కర్మానుగుణంగా జ్ఞానసంకోచ వికాసాలను పొందక అపహత పాప్మత్వాది కల్యాణగుణ పరిపూర్ణుడైనందువల్ల సర్వేశ్వరుడే 'సత్యము' లనబడే జీవులకంటె సత్యమని చెప్పబడుతున్నాడు- అని శ్రీ భాష్యం వివరిస్తున్నది.

కల్పద్రుమ ఇవ శ్రీకాంచనలతా సహితః:- లక్ష్మీదేవి ఒక స్వర్ణలత- కల్పలత. దేవనాయకుడు కల్పతరువు. లక్ష్మీదేవి అనే హేమలత ఎల్లప్పుడు

క్షణమైనను విడువకుండా- చుట్టుకొని ఉండడంవల్ల కల్పతరువు అనే దేవనాయకుడు నవయౌవనం కలిగియున్నాడు. భక్తులను సంరక్షించడానికి దివ్యాయుధాలను ధరించిన నాలుగు భుజాలు పత్ర, పుష్ప, ఫలాలతో కూడిన కల్పద్రుమ శాఖల (కొమ్మల) వలె శోభిస్తుంటాయి. ఇంత శోభాయమానంగా ఉండడానికి కారణం దివ్యదంపతుల నిత్యయోగమే అని స్పష్టమవుతున్నది.

"శంగొడు శక్కరమ్ విల్ ఒణ్మైయుడైయ వుల్లక్కై యొళ్వాల్ తండుకొండు"- (తి.వా. 3-10-1) శంఖచక్రాది దివ్యాయుధాలతో కూడియున్న స్వామియొక్క రూపం అనేక కొమ్మలలో ఒక్కొక్క రెమ్మ పుష్పించి, ఫలించి యున్న ఒక కల్పద్రుమం లాగా శోభిస్తున్నది అనే మనోజ్ఞమైన 'ఈడు' వ్యాఖ్య గమనీయం.

*నిజచ్ఛాయా విశ్రాంత నిత్య తాపత్రి భువనః*:- 'ఛాయా' శబ్దానికి పాలనమనీ, నీడయని నానార్థాలున్నాయి.

*"ఛాయాస్యా దాత పాభావే ప్రతిబింబార్కయోషితోః।*
*పాలనోత్కోచ యోర్దీప్తి సచ్ఛాయా పంక్తి షుస్త్రి యామ్॥"*

(మేదినీ నిఘంటువు)

(నీ నీడలో/ పాలనలో చల్లగా బ్రతుకుతున్నామనడం లోక వ్యవహారమే) ఎండలో నడచి వచ్చిన బాటసారులు పెద్ద చెట్టుకింద దట్టమైన నీడకు చేరి 'ఆహా! తాపమూ, బడలిక అంతా తీరిపోయింది కదా!' అని సంతోషిస్తారు. అట్లే మూడు లోకాలయొక్క సాంసారికమైన దుఃఖమూ, తాపమూ కల్పవృక్షచ్ఛాయ వంటి భగవత్పాలనలో తొలగిపోతుంది. కల్పవృక్షం తన నీడకు చేరిన వ్యక్తులు యాదృచ్ఛికంగా మనస్సులో కోరుకున్న కోరికలనన్నీ క్షణకాలంలోనే ఫలింప జేస్తుంది. అట్లే దేవనాయకుడనే కల్పవృక్షం తన నాశ్రయించిన భక్తుల యొక్క నానా విధాలైన వాంఛితార్థ ఫలాలను కాలనియమం లేకుండా వెంటనే ప్రసాదిస్తుంది.

"వాసుదేవ తరుచ్ఛాయా నా తిశీతా నఘర్మదా।
నరకాంగారశమనీ సా కిమర్థం నసేవ్యతే॥"

వాసుదేవుడనే చెట్టునీడ మిక్కిలి చల్లగానూ, వేడిగా ఉండదు. మీదు మిక్కిలి, నరకమనే అగ్గిని బుగ్గిజేస్తుంది. అట్టి ఛాయ ఎందుకు సేవింపబడదు? అవశ్యంగా సేవింపబడుతుంది- అనే శ్లోకార్థం ఈ శ్లోక భావానికి ఉత్తంభకం;

"పితృ పథ ఘటీయంత్రారోహావరోహ పరిభ్రమైః
నిరయ పదవీయాతా యాతక్రమైశ్చ నిరంతరైః
అధిగత పరిశ్రాంతీన్ ఆజ్ఞాధరై రతివాహ్యనః
సుఖ యతి నిజచ్ఛాయా దాయీ స్వయం హరి చందనః॥"

లక్ష్మీదేవితోనున్న నారాయణుడు రాటపు బావిబొక్కెనలవలె నరకానికి పోయి వచ్చి తిరిగి పుట్టుతూ, ఇటు-అటూ తిరుగుతూ కష్టపడుతున్న మనలను, నీడనిచ్చే హరిచందన తరువువంటి స్వభావుడై అర్చిరాది మార్గంగా పరమ పదానికి తీసుకొనిపోయి సుఖపెట్టుతాడు ('రహస్యత్రయ సారం'లోని శ్లోకమిట అనుసంధేయం).

శ్లేషాను ప్రాణితమైన ఉపమాలంకారం. 'శ్రీకాంచనలతా' అనుచోట ఉపమా రూపకాలంకారాల సంకరం. 'కల్పద్రుమ ఇవ' అనే ఉపమవల్ల కోరిన ఫలాలనిస్తుందని సమర్థించడం కావ్యలింగాలంకార లక్షణం.

రసభావాది తాత్పర్యాల నాశ్రయించిన ఆలంకారిక వాక్యాలతో దేశికులు తమ భక్తి భావాన్ని భగవంతుని పట్ల ప్రకటించారు.

20. స అలా అమాణ ణిట్ఠా
సజలసురాణం వి అంతరో అప్పాణో।
స అల ఫలాణ పసూఈ
సఅల జణాణం సమోఖు ణఅసచ్చ తుమమ్॥

శ్లో. సకలాగమానాం నిష్ఠా
సకల సురాణా మప్యన్తర ఆత్మా।
సకల ఫలానాం ప్రసూతిః
సకల జనానాం సమః ఖలు నతసత్య! త్వమ్॥

**అర్థం:** భో నతసత్య= ఓ నతసత్యా!; త్వం= నీవు; సకల+ఆగమానాం= సమస్త వేదశాస్త్రాలకు; నిష్ఠా= సీమగా నిల్చియున్నావు; సకల సురాణాం= దేవతలందటికి; అంతరః= లోపలనున్న; ఆత్మా= ఆత్మగా ఉన్నావు; సకల ఫలానాం= ఫలాలకన్నిటికీ; ప్రసూతిః= ఉత్పత్తి స్థానమై యున్నావు; సకల జనానాం= సమస్త జీవులకు; సమః ఖలు= సమానుడవు కదా!

**తా॥** నమస్కరించే ప్రాణులకు సత్యమైన దేవనాయకా! నీవు సకల వేదశాస్త్రాలయందున్న విషయాలకు ఎల్లగా- సీమాభూమివై ఉన్నావు. సర్వదేవతలకు అంతర్యామివై యున్నావు. సకల ఫలాలను నిన్ను ప్రార్థించు వారికి, ప్రదానం చేసేవాడవు. నీ వొక్కడవే లోకనాయకుడవు. ఎవరియందు కూడా పక్షపాతం లేకుండా సమభావనతో ప్రవర్తిస్తూ, చరాచర ప్రపంచాన్ని నియమంగా పాలించేవాడవు నీవే కదా!

**వ్యాఖ్య:-** సర్వం దేవనాయకుని యందే పర్యవసించడం వర్ణితం.

నతసత్య:- సత్సుసాధుః= సత్యః. సత్పురుషుల విషయమై మేలు చేయువాడు అని 'సత్య' శబ్దానికి అర్థం. శరణాగతి జేసిన వారికి ఉపాయమూ, ఉపేయమూ భగవానుడే. కాబట్టి, 'నతసత్య' శబ్దవాచ్యుడు కదా!

సకలాగమానాం నిష్ఠా:- సకలవేదాల, శాస్త్రాల తాత్పర్యాలకు విషయ భూతుడు నారాయణుడే. సకల కర్మల చేతనూ ఆరాధింప తగిన స్వరూపం కలవాడు; ఆరాధనస్వరూప నిరూపణ పరత్వాన్ని వేదశాస్త్రాలు నారాయణుని యందే పర్యవసింపజేస్తున్నాయి. విచిత్రమైన మన దేహసంపద భగవదారాధన

కోసమే అనుగ్రహింపబడినదని సారస్వత సారం. "వేదైశ్చ సర్వైరహమేవ వేద్యః"- సకలాగమాలచే నేనే ప్రతిపాద్యుడను. "సర్వేవేదా యత్రైకం భవంతి"- వేదాలన్నీ నారాయణుని యందే ఏకీభవిస్తున్నాయి- అని శ్రుతపరచాయి.

సకల సురాణా మపి అంతర ఆత్మా:- సకల దేవతలకు అంతరాత్మ నారాయణుడే. 'అపి' అనడంవల్ల చరాచర వస్తువులు తనకు శరీరాలై వాటికి తాను అంతరాత్మగా ఉన్నట్లే, భగవానుడు ఇంద్ర, వరుణ, వాయురాది దేవతలకు కూడా అంతర్యామియై వెలుగుతున్నాడని అర్థం. ఆత్మయే కదా దేహం లోపల ఉండి దేహాన్ని నిల్పుతున్నది, సకల కర్మల యందు వినియోగిస్తున్నది. అట్లే, నారాయణుడు దేవతలకు అంతర్యామియై వారి స్థితికి, ప్రవృత్తులకు కారణుడై యున్నాడు. బ్రహ్మాది దేవతాగణాన్ని నియమిస్తున్నాడు, శాసిస్తున్నాడు.

"స ఆత్మా అంగాన్యన్యాదేవతాః"- నారాయణునికి ఇతర దేవతలు శరీరాలు కాగా, వాటిలోపల నారాయణుడే ఆత్మగా ఉన్నాడు. వేదశాస్త్రాలు బ్రహ్మ, శివుడు మొదలైన దేవతల వైభవాన్నీ ప్రతిపాదిస్తున్నాయి కదా! అనే శంకను పరిహరిస్తున్న వాక్యమే ఇది.

"అంతః ప్రవిష్టః శాస్తాజనానాంసర్వాత్మా"- సకల జంతువుల దేహాల లోపల చేరిన నారాయణుడే (బ్రహ్మాదులకు కూడా) అన్నిటికి ఆత్మగా ఉండి శాసిస్తున్నాడు. అభిమత కర్మలయందు వినియోగిస్తున్నాడు. వేదాలలో బ్రహ్మేంద్రాదుల పేర్లకు అర్థం కూడా నారాయణ పరంగానే నిరూపింపబడడం ముఖ్యంగా గమనింపదగినది.

వ్యాసభగవానుడు "ఇంద్రప్రాణాధికరణం"లో అధ్యాత్మ సంబంధ బాహుళ్యాన్ని విశదీకరించాడు. ప్రతర్దనుడు మనిషికి చాలా హితమైనదేదో చెప్పుమని ఇంద్రుణ్ణి అడిగాడు. ఇంద్రుడు 'ప్రాణస్వరూపుడను, ప్రజ్ఞగల ఆత్మను కాబట్టి నన్నే అమృత స్వరూపునిగా ఉపాసింపుము' అని బోధించాడట.

మనిషికి చాలా హితమైనది మోక్షం. ఇంద్రునికి మోక్షమునిచ్చే శక్తిలేదు. సర్వభూతాలకు అంతరాత్ముడు ఒక్క నారాయణుడే. కాబట్టి 'నన్నే ఉపాసింపుము' అంటే నాకు అంతర్యామిగా ఉన్న నారాయణున్నే ధ్యానం చేయుమని ఇంద్రుడు ప్రతర్దనునికి ఉపదేశించాడని ప్రామాణికంగా నిర్ణయింపబడింది.

ఇంద్రాది జీవవాచకాలన్నీ నారాయణుని యందే పర్యవసిస్తాయని స్పష్టమవుతున్నది కదా!

*సకల ఫలానాం ప్రసూతిః*:- 'ఏ దేవతను ఆరాధించిననూ, ఆ యారాధన నాకే చెందుతుంది. అందుకు ఫలప్రదాతను కూడా నేనే' అని గీతాచార్యుడు నరునికి ఉపదేశించిన వాక్యం స్మరణీయం. "సర్వలాభాయ కేశవః"- "సకల ఫలప్రదోహి విష్ణుః"- అంతేకాదు, ఆర్తుడు, జిజ్ఞాసువు, అర్థార్థీ, జ్ఞాని- వీరు ఉదారులు. 'ధర్మార్థ కామమోక్షాలు' అనే నాలుగు పురుషార్థాలను ఇచ్చే వాడను నేనే' అన్నాడు కృష్ణభగవానుడు. "దాతాదేవశ్చ తుర్భుజః".

*సకల జనానాం సమః*:- నాకు ప్రియమైనవాడుగానీ, ద్వేషింపదగిన వాడుగానీ లేనే లేడు అన్నాడు. అందఱియందు సమభావన కలవాడు నారాయణుడు. అయితే భగవానుడు తనను ఆశ్రయించని వారిని దండిస్తాడు కదా! "*వినాశాయచ దుష్కృతాం; సంభవామి యుగే యుగే*" పాపాత్ములను నశింపజేయడానికి ప్రతియుగమందు అవతరిస్తాను అని కూడా శ్రీకృష్ణుడే నొక్కి చెప్పినాడు కదా! అవును నిజమే. అది ద్వేషం కాదు. సాధు రక్షణకోసం ప్రతిబంధకాన్ని తొలగించడమనేది శాసనం యొక్క అనుగ్రహ రూపమైన కార్యమే కదా! కారణత్వం, అంతర్యామిత్వం, ఈ రెండింటికి అన్యోన్యమైన ఆశ్రయత్వం ఉన్నది. కాబట్టి భగవత్తత్వం ఒక్కటే.

"*ఐతదాత్మ్య మిదం సర్వం*" ప్రపంచమంతా నారాయణుడే ఆత్మగా కలిగి యున్నది. "*దివ్యోదేవ ఏకోనారాయణః*"- "*ఏక మే వాద్వితీయం బ్రహ్మ*"- ఒక్క

నారాయణుడే దేవుడు. ఆయన అద్వితీయుడు. అంటే, అతనికి సాటియైన మఱొక వ్యక్తియే లేదు అనడం నిర్వివాదాంశం.

21. ఇఅ సవ్వాణ సమాణో
సచ్చఠి ఓ దాస సచ్చ స ఇ పరిపుణ్ణో।
కహ వహసి పక్ఖవా అం
పండవ పముహేసు పేసణం వి సహన్తో॥

ఛా. ఇతి సర్వేషాం సమానః
సత్యస్థితో దాససత్య! సదాపరిపూర్ణః।
కథం వహసి పక్షపాతం
పాండవ ప్రముఖేషు ప్రేషణ మపి సహమానః॥

**అర్థం:** దాససత్య!= భృత్యులకు సత్యమైనవాడా!; ఇతి= ఇట్లు పైన చెప్పిన విధంగా; సర్వేషాం= అందఱి విషయంలోనూ; సమానః= సమానుడవు; సత్యస్థితః= సత్యమందే నిల్చియుండు వాడవు; సదా= ఎల్లప్పుడు; పరిపూర్ణః= పరిపూర్ణుడవైన నీవు; పాండవ ప్రముఖేషు= పాండవులు మొదలైన వారి విషయమై; ప్రేషణం, అపి= (దూతగా) పంపబడడం కూడా; సహమానః= సహించుకొన్నవాడవై; పక్షపాతం= దయా పక్షపాతాన్ని; కథం= ఏవిధంగా-ఎట్లు; వహసి= వహిస్తున్నావు?

**తా॥** దాసులపట్ల సత్యమైనవాడా! ఓ అచ్యుతా! నీవు సకల ప్రాణులయందు సమానంగా ప్రవర్తించేవాడవు. నీ దాసుల విషయంలో నీవు చెప్పిన మాటను మార్చకుండా నిలబెట్టుకొనేవాడవు. నీవు కోరి పొందని వస్తువు ఒక్కటి కూడా లేనందువల్ల ఎల్లప్పుడు పరిపూర్ణుడవు కదా! ఇట్టి నీవు కొందఱి విషయంలో పక్షపాతం వహిస్తుంటావేమి? ముఖ్యంగా పాండవుల విషయమై వారు చెప్పిన రీతిగా ప్రవర్తించావు. చివరకు వారు నిన్ను కౌరవుల వద్దకు దూతగా పంపించగా,

నీవు ఎంతో ఓపికగా ఆ పనిని నిర్వహించావు కదా! సర్వసముడవైన నీవు పాండవుల మీద ఎక్కువ దయను చూపుతూ పక్షపాతాన్ని ఎట్లు వహించావు? పక్షపాతం లేనివాడవని ఎలా సమర్థించుకొంటావు? అని తాత్పర్యం.

**వ్యాఖ్య:**- సర్వ స్వతంత్రుడైన భగవానుడు ఆశ్రితులకు పరతంత్రుడని పరోక్షార్థ దర్శనమైన శాస్త్ర ప్రమాణాన్ని తెలిపే శ్లోకమిది.

ఇతి సర్వేషాం సమానః- ప్రపంచమందు ఎవరి విషయంలోనూ పక్షపాతం లేకుండా సమభావనతో ప్రవర్తించేవాడు భగవానుడు.

దాససత్య! సత్యస్థితః సదాపరిపూర్ణః- ఆశ్రితుల విషయంలో తానిచ్చినమాటను సత్యంగా పాటించేవాడు. తాను సత్యంగా మెలగుతూ లోకాలను, లోకేశులను సత్యప్రవర్తకులుగా చేసే సత్తా కలవాడు భగవానుడు. అవాప్త సమస్త కాముడు కాబట్టి, భగవానుడు సదా పరిపూర్ణుడు.

ఓ వాక్యాలు భగవానుడు చెప్పినవే కదా! చెప్పిన మాటలను చేసి చూపించాడు. పాండవులు తమ దూతగా ఉపయోగించుకొంటే శ్రీకృష్ణుడు ఒర్చుకొన్నాడు. తన స్వామిత్వాన్ని తగ్గించుకొని పార్థుని రథసారథిగానూ ప్రవర్తించాడు కదా! ఇది పాండవుల యెడ పక్షపాతం వహించడం కాదా! అని మన మనడంలో సంశయమేమీ లేదు అనిపిస్తుంది.

వేంకటనాథనాయకి పల్కిన మాటల్లో- సర్వసమత్వాది గుణాలను కలవాడ వైనను "నహి ప్రకృష్టా ప్రేష్యంతే ప్రేష్యంతే హీతరే జనాః"- పాండవ ప్రముఖులు (ప్రముఖ శబ్దంవల్ల) 'చతురులను పంపరు, అప్రకృష్టులను పంపుతారు' అనే న్యాయముండగా, పశువులను మేపే గొల్లవైన నీవు అప్రకృష్టుడవై దూత కృత్యానికీ, (అపి) రథసారథ్యం వంటి నీచకృత్యాలకూ ఒప్పుకొని నిర్వహించి దుర్యోధనాదులను ఉపేక్షించి, పాండవ పక్షపాతివయ్యావు కదా! ఈ మాటలను విని దేవనాయకుడు

'ప్రేయసీ! నీవు పక్షులను దూతలుగా పంపితివే. మఱి నేను రావాలా? రావద్దా? అని అడిగితే "దౌత్యం, సారథ్యం వంటి నీచకృత్యాలను ఇష్టపడే వ్యక్తికి ఉచితానుచితాలు కూడా తెల్యవు కదా!" అన్నది నాయకి. స్వాపదేశార్థమూ ప్రకటితం.

కాని, శాస్త్రం సంశయాలనన్నిటిని తొలగిస్తుంది; ప్రత్యక్షాది ప్రమాణాలచే కనబడని పదార్థాలను ప్రదర్శిస్తుంది కదా! భగవానుడు సత్యస్థితుడు. పైగా నిరంకుశ స్వతంత్రుడు. అయినా, నిత్యం తనను శ్రద్ధాభక్తులతో కొలిచే వారిపట్ల నిరతిశయ వాత్సల్యం కలవాడు. స్వాతంత్ర్య కాష్ఠారూఢమైన పారతంత్ర్యాన్ని కూడా అభిమానించేవాడు భగవానుడు. తన గీతను తాను ఆదరించేవాడు కదా!

"తేషాం నిత్యాభియుక్తానాం యోగక్షేమం వహామ్యహమ్"– ఎడతెగని భక్తితో నన్ను సేవించేవారి యోగక్షేమాలను నేనే నిర్వహిస్తాను. "జ్ఞానీత్వాత్మైవ మే మతమ్"– జ్ఞానియైన వ్యక్తియే నాకు 'ఆత్మ' అని నా అభిప్రాయం– అన్నాడు శ్రీకృష్ణ భగవానుడు. "మమ ప్రాణాహి పాండవాః"– పాండవులు నా ప్రాణాలు. "యస్త్వాం ద్వేష్టి సమాంద్వేష్టి యస్త్వామను సమామను"– ఎవడు నిన్ను ద్వేషించునో అతడు నన్ను ద్వేషించినవాడే, నీకు అనుకూలమైనవాడు నాకు కూడా అనుకూలమైనవాడే అవుతాడని, భగవానుడే ఆశ్రితుల విషయమై తన పరతంత్రతను కృపతో ప్రకటించాడు.

కాబట్టి కొందఱి పట్ల దయకలవాడు, కొందఱిపట్ల నిర్దయనూ కలవాడు అని భగవానుణ్ణి 'పక్షపాతి' యనడం సమంజసం కాదు అనే రహస్యాన్ని పూర్వార్ధం సమర్థిస్తున్నది.

ఈ శ్లోకంలోని పూర్వార్ధంలో ఉన్న విశేషణ పదాలు సాభిప్రాయాలు. పరికరాలంకారం.

22 విసమమ్మి కమ్మమగ్గే
విపరి ఖలంతాణ విహ్వాలి అ కరణాణమ్।
ణాహ నిహిలాణ అణ్ణో
ణత్థి తుమాహి ణఅసచ్చ హత్థాలంబో॥

ఛా. విషమే కర్మమార్గే
విపరిస్ఖలతాం విహ్వాలిత కరణానామ్।
నాథ నిఖిలానా మన్యో
నాస్తిత్వ న్నతసత్య! హస్తాలంబః॥

**అర్థం:** నతసత్య!= నమ్రులకు సత్యమైనవాడా!; నాథ= సర్వేశ్వరా!; విషమే= సుఖంగా నిర్వహించరానట్టి,/ ఎచ్చు తగ్గులు కలిగినట్టి; కర్మమార్గే= 'కల్పం' అనే మార్గమందు,/ కర్మలను ఆచరించడమందు; విపరిస్ఖలతాం= తడబడుతున్నవారికి,/ గతి తప్పి మనస్సు చలిస్తున్నవారికినీ; విహ్వలిత కరణానాం= వ్యాకులపడుతున్న ఇంద్రియాలు కలిగినట్టి,/ వశపడని ఇంద్రియాలు కలిగినట్టి; నిఖిలానాం= సకల చేతనులకు; త్వత్= నీ కంటే; అన్యః= మరొకడు; హస్త+ఆలంబః= చేయూతనిచ్చేవాడు; న, అస్తి= లేదు.

**తా॥** నతసత్య! నాథ! కర్మమార్గం విచిత్రమైనది. ఆ కర్మలను ఆచరించడం కష్టతరమైనది. ఆ మార్గానుయాయులు దారితప్పి మనోవ్యాకులాన్ని పొందే అవకాశమున్నది. పైగా, ఇంద్రియాలు స్వాధీనమందు లేనందువల్ల చపలచిత్తు లవడమూ కలదు. ఇట్లు వైక్లబ్యాన్ని పొందిన సకల జీవులకు నీవు తప్ప మఱొకడు వేరే సహాయపడువాడు లేడు (ఈ శ్లోకంలో "ద్రౌపద్యా సహితాః సర్వే నమశ్చక్రుర్జ నార్దనం"- పాండవులు ద్రౌపదితో పాటు జనార్దనునికి నమస్కరించారు. కాబట్టి శ్రీకృష్ణుడు పాండవ పక్షపాతి అని సమర్థింపబడింది).

వ్యాఖ్య:- భగవదారాధన రూపమైన కర్మపథమందు నడిచేవారికి స్ఖాలిత్యం ఏర్పడినప్పుడు భగవానుడే సహాయ పడుతాడని వర్ణితం.

వేదాంగాలు ఆఱు ఉన్నాయి. శిక్ష, వ్యాకరణం, ఛందస్సు, నిరుక్తం, జ్యోతిషం, కల్పం అనే షడంగాలలో 'కల్పం' అనే శాస్త్రం కర్మాచరణాన్ని బోధిస్తుంది. 'మార్గం' ఎత్తు పల్లాలతో ఉన్నట్లే, కర్మమార్గం కూడా సుగమమై యుండదు. కల్పమే మార్గం- కర్మ అనే మార్గం విషమంగా ఉండడం వల్ల ఆ దారిని పోయే వారు కాలుజాఱి పడే అవకాశముంది. విధి నిషేధాలు తెలియక కర్మానుష్ఠాన పరులు స్ఖాలిత్యాన్ని పొందుతారు. అంతే కాదు, కర్మను ఆచరించే శ్రమ చేతనైనా 'లేదా, పాపంచేతనో ఇంద్రియాలు తమ వశమందు ఉండనందువల్ల చిత్త చాంచల్యమేర్పడుతుంది.

ఇట్టి కర్మమార్గమందు నడిచేవారు- కర్మానుష్ఠాన పరులు గతితప్పి పడిపోకుండా వారికి చేయూతనిచ్చేవాడు- సహాయపడేవాడు భగవానుడే తప్ప మరొకడెవ్వడూ లేడు. కాబట్టి ఆశ్రితులైన పాండవుల పక్షపాతి కదా! కేవలం, కర్మానుష్ఠానమందు కృతకృత్యులైన వారికి ఫలమివ్వడమే కాదు, భగవంతుని అనుగ్రహాన్ని పొందడానికి కర్మలను ఆచరించేవారి యొక్క అజ్ఞానాన్ని, ఆలస్యాన్ని తొలగించి, వారికి సహాయపడేవాడు కూడా భగవానుడే. "అవిక్కోర్ పత్తుక్కొమ్బు నిన్నలా లఱిగిన్ద్రి లేన్"- (తి.వా.మొ.) స్వామీ! నా ఆత్మకు ఒక పట్టుకొమ్మ- అవలంబం- నిన్ను తప్ప నేనెరుగను, కాబట్టి నన్ను అంగీకరింపుమని నమ్మాళ్వార్లు ప్రార్థించారు. సర్వేశ్వరుని అవ్యాజమైన కృపను ఎట్లు, ఏమని వర్ణించగలం? అని దేశికులు దేవనాయకుని స్తోత్రం చేశారు.

ఇందు "నతసత్య, నాథ" అనే రెండు సంబోధన పదాలచేత రక్షించే వానియొక్క రక్షణైకాంత్యం నిర్వహింపబడుతున్నదని సూచితం. శ్లేషచే అనుప్రాణితమైన రూపకాలంకారం.

23. ణాణస్సకో అవి స ఓ
అచ్చుఅ కలుణా ఏ తుజ్ఝ కోదూరఠి ఓ।
సత్తీ అ కో అ ఇ భరో
తా ఖు ఉవా ఓ తుమంచి అ సఅంసిద్ధో॥

ఛా. జ్ఞానస్యకోఽవిషయః
అచ్యుత కరుణాయాస్తవ కోదూరస్థితః।
శక్తేః కోఽతి భరః
తస్మాత్ ఖలూపాయ స్త్వమేవ స్వయం సిద్ధః॥

**అర్థం:** భో అచ్యుత!= తవ= నీయొక్క; జ్ఞానస్య = జ్ఞానానికి; అవిషయః= గోచరించని వస్తువు; కః= ఏది? (ఏదిలేదు); కరుణాయాః= దయకు; దూరస్థితః= దూరంగా ఉన్నవాడు; కః= ఎవడు? (ఎవడు లేదు); శక్తేః= శక్తికి; అతిభరః= మించిన భారం;కః= ఏమున్నది? (ఏమీలేదు); తస్మాత్= అందువల్ల; త్వం, ఏవ= నీవే; స్వయం సిద్ధః= తనంత తానేర్పడినట్టి; ఉపాయః, ఖలు= ఉపాయం కదా!

**తా॥** ఓ అచ్యుతా! నీ జ్ఞానానికి తెలియని వస్తువే లేదు. నీ దయకు పాత్రుడు కాని వాడెవడున్నాడు? నీ శక్తికి నిర్వహించరాని బరువైన దేమున్నది? ఏది లేదు. ఈ విషయంలో ఎవ్వరూ ఆక్షేపించే అవకాశం లేదు. అందువల్ల నీవే స్వయం సిద్ధమైన ఉపాయం కదా! కర్మజ్ఞాన భక్తియోగాలు ప్రపత్తియు సాధ్యోపాయం. జ్ఞానం, దయ, శక్తి కలిగియున్న శ్రీహరి సిద్ధోపాయం.

**వ్యాఖ్య:-** భగవానుడే సిద్ధోపాయమని ప్రతిపాదితం.

కర్మలను అనుష్ఠించేవారు పతనం చెందకుండా కరావలంబంగా, సహాయంగా ఉండేవాడు భగవానుడని గత శ్లోకం స్పష్టపరచింది. కర్మాది ఉపాయాలకు ఫలప్రదానం పట్ల భగవానునికి తప్ప మఱొకరికి శక్తి లేనందు

వల్ల, జీవులకు భగవంతుని సంకల్పం లేకుండా ఉపాయ-సాధనానుష్ఠానమందు సామర్థ్యం లేనందువల్లనూ, భగవానుడే సాక్షాత్తుగా ఉపాయమవుతాడు.

భగవానుడు 'సర్వజ్ఞః, సర్వవిత్' అనే శ్రుతిప్రకారం, సమస్తం తెలిసినవాడు అన్నిటినీ పొందినవాడు కదా! కాబట్టి సర్వేశ్వరుని జ్ఞానానికి అజ్ఞాత వస్తువు లేనే లేదు, ఒకే సమయాన అన్నిటినీ కనుగొనగలడు.

తవకరుణాయాః కోదూరస్థితః- సర్వేశ్వరుని కృపకు పాత్రుడు కాని వాడెవడు? పాపిష్ఠుని పాపం ప్రతిబంధకంగా ఉండడం వల్ల భగవత్కృపను పొందే కాలమెప్పుడో కలిసి వస్తుందని కాలాన్ని ఎదిరి చూడవలసిందే కాని, భగవంతుని దయకు దూరంగా ఎవడు ఉండదు కదా! భగవద్దయా పాత్రుడవడం జీవుని స్వరూప లక్షణమే అనడం పునరుక్తి.

"పరాస్య శక్తిర్వివిధైవ శ్రూయతే"- అని శ్రుతి పలుకుతుంది. పరమాత్మ యొక్క స్వాభావికమైన శక్తి వివిధమైనదిగానే వినబడుతున్నదని అర్థం. అట్టి శక్తికి నిర్వహింపరాని ద్రవ్యమే ఉండదు. ప్రతి వస్తువు భగవచ్ఛక్తికి అణగి యుంటుంది అనడం స్వభావోక్తియే. ఈ మూడు గుణాలున్నవాడు కాబట్టి, అచ్యుతుడే స్వయం సిద్ధోపాయం. ఇతరులు సాధ్యోపాయాలే కాని, సిద్ధోపాయత్వం కలవారు కారు అని సారాంశం.

"త్వత్ జ్ఞానశక్తి కరుణాసు సతీషు నేహ పాపం పరాక్రమితుమర్హతి మామకీనమ్"- (61- అమానుషస్తవం) రక్షణీయుడనుకోవడానికి జ్ఞానం, కేవలం రక్షణకోసమే దయ, రక్షణకు అడ్డుగా నున్నదాన్ని తొలగించడానికి శక్తి ఉపయోగపడుతుంది. కాబట్టి ఈ మూడు గుణాలు నీకు ఉండగా, నా పాపం ఫలప్రాప్తికి ప్రతిబంధకంగా ఉండ దగదు. రక్షణీయుడనని భావం.

జ్ఞానశక్తికరుణలు అనే గుణాలకే ఉపాయత్వ నిర్వాహకత్వం శ్రీవత్సాంకమిశ్రులచే సూచింపబడింది.

24. సంకప్పకణ్ణ హారో
కింకరసచ్చ భవసా అరే అఇగహిరే।
అణహోతుమంఖుపోఓ,
అప్పాణ కి వాసమీరణేన పవట్టో॥

ఛా. సంకల్ప కర్ణధారః
కింకర సత్య! భవసాగరేఽతి గభీరే।
అనఘస్త్వం ఖలు పోతః
ఆత్మనాం కృపాసమీరణేన ప్రవృత్తః॥
(ప ఉత్తో= ప్రయుక్తం, అని పాఠాంతరమున్నది)

**అర్థం:** కింకరసత్య= దాసులకు సత్యమైన దేవనాథా!; త్వం= నీవు; ఆత్మనాం= జీవులకు; అతిగభీరే= మిక్కిలి లోతైన,/ అంతం కనబడని; భవసాగరే= సంసారమనే సముద్రమందు; కృపా సమీరణేన= కరుణ అనే వాయువుచేత; ప్రవృత్తః= ప్రవర్తింపబడునట్టి,/ చలింపబడునట్టి; సంకల్ప కర్ణధారః= సంకల్పమనే చుక్కానిని ధరించినట్టి; అనఘః= దోషరహితమైన,/ ఛిద్రాలు లేనట్టి; పోతః, ఖలు= నావవుకదా!

**తా॥** సేవకులకు సత్యమైన దేవనాయకా! చేతనులకు అంతుతెలియని సంసారమందు/ చాలా లోతైన సముద్రమందు, కృపచేత అభిముఖంగా చేయబడినట్టి/ గాలిచే నడుపబడునట్టి;నీవు సంకల్పమనే నావికుడు కలిగినట్టి; దోషంలేని/ రంధ్రాదులు లేనట్టి నావగా ఉన్నావు కదా! "శ్రీమతఃపూర్వ సిద్ధత్వాత్సిద్ధోపాయం విదుర్బుధాః".

**వ్యాఖ్య:-** భగవానుడు సంసార సాగరమందు నావగా ఉన్నాడని వర్ణితం.

సంసారమనేది ఒక మహాసముద్రం. దాని అడుగు భాగం కనబడనంత లోతు కలది. అందు మునుగుతూ తేలుతూ కొట్టుమిట్టాడుతున్నవారు జీవులు. వారు ఆ సముద్రంలో మునిగిపోకుండా భగవానుడు ఓడగా నిల్చి గట్టుకు

చేరుస్తుంటాడు. నీరు లోతుగా ఉన్నచోటనే ఓడ అవసరపడును. భగవత్సంకల్పమే చుక్కానియై ఓడను నడుపుతుంది. అంటే సంకల్పమే కర్ణధారియైన నావికుడుగా కలది ఓడ. "యాన పాత్రస్తు పోతః" (అమరం)- జీవ సంరక్షణ ప్రావణ్యం కలిగిన భగవత్సంకల్పమే కర్ణధారునిగా కలది నావ అని భావం. గాలివీచిన మార్గంలోనే నావ పయనిస్తుంది. భగవత్కృపయే గాలి. ఆయన కృప ఎటువైపు ప్రసరిస్తే అటువైపు తాను అభిముఖుడై ప్రవర్తిస్తుంటాడు. భగవానునికి భ్రమ, వంచన మొదలైన దోషాలు లేవు. అలాగే రంధ్రాలు పగుళ్ళు లేనిది ఆ నావ. కాబట్టి, శరణాగతులైన చేతనులను సంసారం అనే దుస్తరమైన మహాసముద్రం నుంచి దరికి జేర్చే- మోక్షఫలాన్ని ప్రసాదించే భగవానుడే- ఒక నావగా భాసిల్లుతున్నాడు. "కర్ణధారస్తు నావికః" (అమరం).

"విష్ణుపోతం వినా నాన్యత్ కించిదస్తి పరాయణమ్"- విష్ణువు అనే నావ తప్ప, పారం- ఆవలిగట్టుకు, ఉత్కృష్టస్థానానికి జేర్చేది వేఱే ఒక వస్తువు ఏదీ లేదు- అని శాస్త్ర ప్రమాణవాక్యమున్నది.

శ్లేషతో కూడిన రూపకాలంకారం (ఇందు 'సిద్ధోపాయం' సాధింప బడింది).

25. అచ్చు అ ణదేంతి మోక్ఖం
ఈ సరభావేణ భావి ఆ ఇఅర సురా।
రత్తిం పరివట్టే ఉం
లక్ఖం ఆలేక్ఖదిణ అరాణవి ణ ఖమమ్॥

ఛా. అచ్యుత నదదతి మోక్ష
మీశ్వర భావేన భావితా ఇతర సురాః।
రాత్రిం పరివర్తయితుం
లక్ష మాలేఖ్య దినకరాణామపి నక్షమమ్॥

**అర్థం:** భో అచ్యుత!= ఓ అచ్యుతా!; ఈశ్వరభావేన= ఈశ్వరులు అనే ఆశయంచేత; భావితాః= భావింపబడినట్టి; ఇతర సురాః= (నీకంటే) వేరైన దేవతలు; మోక్షం= ముక్తిని; న, దదతి= ఇవ్వలేరు; ఆలేఖ్య దినకరాణాం= చిత్రపటమందు చిత్రింపబడిన సూర్యుల యొక్క లక్షం, అపి= (సంఖ్య) లక్ష ఉన్ననూ; రాత్రిం= రాత్రిని; పరివర్తయితుం= మార్చడానికి; న, క్షమం= శక్తం కాదు.

**తా॥** ఓ అచ్యుతా! ఈశ్వరులు అనే బుద్ధితో భావింపబడిన ఇతరులైన దేవతలెవ్వరు కూడా మోక్షము నొసగువారు కారు. చిత్రపటమందు లక్ష సూర్యులు చిత్రింపబడినప్పటికీ, ఆ సూర్యప్రతిబింబాలు రాత్రిని మార్చివేయడానికి సమర్థమైనవి కావు.

**వ్యాఖ్య:-** శ్రియః పతికంటే ఇతరదేవతలకు మోక్షమిచ్చే సామర్థ్యం లేదు అని సుశ్లోకితం.

బ్రహ్మ, శివుడు, ఇంద్రుడు మొదలైన దేవతలు జగదీశ్వరులని జనులచేత భావింపబడుతుంటారు, పూజింపబడుతుంటారు. అయితే ఆ భావనచేత ఏమి లాభం? శ్రీహరికంటే ఇతర దేవతలకు మోక్షమిచ్చే శక్తి లేదు కదా! బ్రహ్మరుద్రేంద్రాదులు స్వతః ప్రకృతి బద్ధులు కాబట్టి, వారు మరొక జీవునికి మోక్షమిచ్చే అధికారం లేనివారు. "ధ్యాత వ్యోనిత్యలోకస్థో భుక్తిముక్తి ఫలప్రదః" - ఉత్తరార్థంలో ఇందుకు దృష్టాంతం చెప్పబడుతున్నది.

శిల్పులు లక్షసూర్యుల ప్రతిబింబాలను చిత్రిస్తారు. ఈ ప్రతిబింబాలు లక్ష సంఖ్యలో ఉన్నప్పటికీ రాత్రిని పగలుగా మార్చగలవా? వాటికి ఆ శక్తి లేదు కదా! ఒక్క ప్రత్యక్ష సూర్యునిచేతనే రాత్రి తొలగింపబడి, పగలుగా మార్చ బడుతున్నది.

సాక్షాత్తుగా ఒక్కనిచేతనే నిర్వర్తించదగిన ప్రయోజనం, తత్ప్రతి బింబాలెన్ని ఉన్నా వాటిచేత ఎట్లు సాధింపబడదో, అట్లే ఒక్క శ్రీమన్నారాయణునిచేతనే

ప్రసాదింపదగిన పరమ పురుషార్థం సమస్త దేవతలచేత కూడా ఇవ్వడానికి శక్యం కాదు. "క్షమం శక్తే హితే త్రిషు" అని నిఘంటువు.

దృష్టాంతాలంకారం.

('దదతి' అనే పదం ప్రాకృత భాషలో 'దన్తి' అని పాఠాంతరం ఉన్నది. " 'పాలఙ్లోట్ ఛత్వృషు' ఇతి అత ఏత్వే "దేంతి"'- అనే రూపమేర్పడును అని వ్యాఖ్యాతం).

26. అమ అరస సా అరస్సవ
అహిందవురణాహ ణిమ్మలమహ గ్ఘాఇమ్।
తీరంతి ణ విగణే ఉం
అణణ్ణసులహా ఇ తుజ్ఝ గుణరఅణా ఇమ్॥

ఛా. అమృతరస సాగరస్యేవా
హీంద్ర పురనాథ! నిర్మల మహార్ఘాణి।
తీర్యన్తే న విగణయితు
మనన్య సులభాని తవగుణ రత్నాని॥

**అర్థం:** భో అహీంద్రపురనాథ!= ఓ అహీంద్రపురనాయకా!; అమృతరస సాగరస్య, ఇవ= అమృతరసంయొక్క సముద్రం వలె ఉన్నట్టి; తవ= నీ యొక్క నిర్మల మహార్ఘాణి= దోషంలేని, గొప్ప వెలను కలిగినట్టి; అనన్య సులభాని= ఇతరులకు పొందశక్యం కానట్టి; గుణరత్నాని= గుణాలు అనే రత్నాలను; విగణయితుం= లెక్కించడానికి; న, తీర్యంతే= తరంకానట్టివి.

**తా॥** అహీంద్ర పురానికి నాయకుడవై ప్రకాశించే ఓ దేవనాథా! నిన్ను అనుభవించగా, ధ్యానించగా తృప్తిలేని ఆనందం కలుగుతుంది. నీవు అమృతరసం కలిగిన సముద్రం వలె ఉన్నావు. సముద్రమందు పరిశుద్ధమైన ఆణిముత్యాలు, రత్నాలు లభిస్తాయి. నీ వద్ద దోషరహితమైన అమూల్యమైన రత్నాల వంటి

కల్యాణగుణాలు ఉన్నాయి. ఈ గుణాలు వేరే దైవతం వద్ద కనబడవు. ఇతర దేవతలు ఈ గుణాలను కోరినా, వారిచే పొందశక్యం కానట్టివి. లోకులకుగానీ, వేదాలకుగానీ, ఈ నీ కల్యాణ గుణాలను లెక్కింపతరం కాదు.

**వ్యాఖ్య:-** భగవానుని అనంత కల్యాణ గుణాలు గణింపతరం కాదని స్తుతి.

అమృతరససాగరస్యేవ స్థితస్య తవ నిర్మల మహార్ఘాణి గుణ రత్నాని- "అమృతం మోక్షే దేవాన్నే" - అని నిఘంటువు. అమృతం అంటే మోక్షం. రసమంటే రుచి, అనురాగం. మోక్షమందుండే అనురాగమే అమృతరసం. అమృత ద్రవంయొక్క సాగరాన్ని పోలియున్నవాడు భగవానుడు. సాగరమందు నిర్మలమైన అంటే దోషంలేనివి, మలినంలేనివి, (మహార్ఘాణి) గొప్ప వెలగలవి, పూజగలవియైన గుణాలనే రత్నాలు ఉన్నాయి. ఉజ్జ్వలంగా ప్రకాశించేవి కాబట్టి, గాంభీర్య, మార్దవ, దయా, ధృతి, దక్షత మొదలైన కల్యాణ గుణాలే రత్నాలుగా పేర్కొనబడే అర్హత కలవి.

అనన్య సులభాని- శ్రీహరికంటే వేరైన బ్రహ్మరుద్రేంద్ర వరుణాది దేవతల కెవరికి కూడా, వారు కోరుకున్ననూ, పొందశక్యం కానివని అర్థం. "ఉయర్వఱ ఉయర్నలముడైయవన్" అని కదా శఠకోప దివ్యసూరి శ్రీసూక్తి. "సత్యం జ్ఞాన *మనంతం బ్రహ్మ"*- *"ఆనందో బ్రహ్మ"*- *"సకల కల్యాణ గుణామృతో దధిః"*- అని ఉభయ వేదాన్త వాక్యాలు బోధిస్తున్నాయి.

గుణరత్నాని విగణయితుం న తీర్యంతే- సర్వేశ్వరుని గుణరత్నాలను ఎవ్వరు కూడా లెక్కింపశక్యం కాదు. హేయగుణాలు లేనే లేవు కాబట్టి లెక్కపెట్టలేరు. ఇక ఉన్న కల్యాణ గుణాలు అనంతమైనవి, కాబట్టి లెక్కింపతరం కాదు కదా! *"బహవోతవ కల్యాణ గుణాః పుత్రస్య సంతితే"*- ఓ దశరథ మహారాజా! నీ పుత్రుడైన రామునికి కల్యాణ గుణాలు చాలా ఉన్నాయి అన్నారు పౌరులు.

"యథా రత్నాని జలధేః అసంఖ్యేయాని పుత్రక!
తథా గుణాశ్చ దేవస్య త్వ సం ఖ్యే యాహి చక్రిణః॥"

సముద్రంలో నున్న రత్నాలు ఎట్లు లెక్కింపరానివో- లెక్కకు మిక్కిలిగా నున్నవో, అట్లే చక్రపాణియైన విష్ణుమూర్తి యొక్క గుణాలు లెక్కింప రానన్ని ఉన్నాయని శ్లోకార్థం.

"వర్షాయుతైర్యస్య గుణా నశక్యావక్తుం సమేతైరపి సర్వదేవైః"- దేవతలందరు కూడి దేవదేవుని గుణాలను పెక్కేండ్లు లెక్కించి చెప్పదలచు కొన్ననూ, వారిచేత కూడా 'ఇన్ని గుణాలున్నాయి' అని చెప్ప శక్యం కాదు.

"సర్వభూతాత్మ భూతస్య విష్ణోః కోవేదితుం గుణాన్?"- సకల ప్రాణులకు ఆత్మయైన విష్ణువు యొక్క గుణాలను తెలుసుకొనే సమర్థుడెవడు? ఎవడూ తెలుసుకోలేడని సారార్థం.

అమృతరస సాగరపదం చేత స్వరూపానికి భోగ్యత్వం, రత్న శబ్దం చేత గుణాలకు భోగ్యత్వం వ్యంజితం. ఈ రెండింటికి పరస్పరాతిశయం సూచితం. వీటివల్ల భగవంతునికీ ప్రపన్నుని హృదయానికీ మధ్యనున్న ఘనిష్ఠ సంబంధం ప్రకటితం.

*నతీర్యంతే:*- తామస ప్రకృతికల వారిచేత కూడా తిరస్కరింపతరం కాదు. భగవద్గుణాల యొక్క స్వభావం అనాశ్రితుల చేతనూ, శత్రువుల చేతనూ అపలపింప శక్యం కానిది కదా!

"తరుణౌ రూప సంపన్నౌ సుకుమారౌ"- అని శూర్పణఖ రామలక్ష్మణులను పొగడింది.

"త్వ మప్రమేయశ్చ దురాసదశ్చ"- అని స్తుతించింది వాలి భార్య తార.

"శత్రోః ప్రఖ్యాత వీర్యస్య రంజనీయస్య విక్రమైః"- అని రావణుడు రాముని పరాక్రమాన్ని శ్లాఘించాడు.

శత్రువుల భావన కూడా, గుణాతిశయంచే ఆపాదింపబడిన స్తుతిగానే ఉన్నది కదా! స్వరూప గుణాల ప్రశంస ఉపాయ ఫలప్రాప్తికి హేతువు. రూపకానువిద్ధమైన ఉపమాలంకారం.

(ప్రాకృత శ్లోకమందు 'తీరంతి' అని ఉండగా 'ఛాయ'లో 'శక్నువంతి' అనే పాఠమూ ఉన్నది. 'త్వీరహ్యకృత్యర్జామ్' ఇతి తరతేః కర్మణి ఈ రాదేశః అని వ్యాఖ్యానం).

27. భూసి అసు ఇ సీమంతో
భు అఇంద ఉరేస సవ్వగుణసీమంతో।
ఖవి అ తిసామల మోహో
ముణీణ హి అ ఏసు ఫురసి సామల మోహో॥

ఛా. భూషిత శ్రుతి సీమంతో
భుజగేంద్ర పురేశ సర్వగుణ సీమాంతః।
క్షపిత తృషామల మోహో,
మునీనాం హృదయేషు స్ఫురసిశ్యామల మయూఖః॥

**అర్థం:** భుజగేంద్ర పుర+ఈశ= అహీంద్రపురనాయకా!; భూషిత శ్రుతి సీమంతః = అలంకరింపబడిన శ్రుతుల సీమంతాలు-ఉపనిషత్తులు- కలిగినట్టి; సర్వగుణ సీమ+అంతః= సకల గుణాలకు అవసాన భూమియైనట్టి; క్షపిత తృషామలమోహః= తొలగింపబడిన ఆశ, పాపం, అజ్ఞానం కలిగినట్టి; శ్యామల మయూఖః= నీల వర్ణ కిరణకాంతులు కలిగినట్టి, నీవు; మునీనాం= మనన శీలురయొక్క హృదయేషు= హృదయాలలో; స్ఫురసి= ప్రకాశిస్తున్నావు.

**తా॥** శ్రుతి సీమంతాల యందు అలంకరింపబడియున్నవాడు భగవానుడు. సకల కల్యాణగుణాలకు చివరి హద్దుగా ఉన్నవాడు. ఆశ, దోష, అజ్ఞానాలను

నశింపజేసేవాడు. శ్యామలమైన కాంతిచే ప్రకాశిస్తూ మునుల హృదయాలలో నివసించి, ధ్యానింపబడుతున్నాడు. ఆ భగవానుడే అహీంద్రపురాధిపతిగా విరాజమానుడై యున్నాడు.

**వ్యాఖ్య:-** సర్వేశ్వరుడు మునుల హృదయాలయందు వెలసియున్నాడని వర్ణితం.

*భూషిత శ్రుతిసీమంతః:-* శ్రుతులంటే వేదాలు. వేదాలు పూర్వభాగమని, ఉత్తరభాగమని రెండు విధాలు. పూర్వభాగమందు భగవంతుణ్ణి ఆరాధింపదగిన కర్మకలాపం శ్రుతపరచబడింది. శ్రుతి సీమంతాలు అంటే శ్రుతికాంతల (తల) పాపటలు అని అర్థం. వేదాలయొక్క ఉత్తరభాగం శ్రుతిశిరస్సు- వేదాంతం అనబడుతుంది. వేదాంతమంటే ఉపనిషత్తులని అర్థం. ఉపనిషత్తులు భగవానుని స్వరూపం అంటే దివ్యాత్మను, రూపం అంటే దివ్యమంగళ విగ్రహాన్ని, గుణాలను, వైభవాన్ని విశేషంగా ప్రకటిస్తున్నాయి. "సీమంతః కేశ వేశే" (కౌముది).

జీవునికి సంసారచక్రమందు పరిభ్రమించడం పలు జన్మలలో తాను జేసిన పుణ్యపాప రూపకర్మలను బట్టి జరుగుతున్నది. ఈ సంసార చక్రపరివర్తనం అనాదియైనప్పటికీ అంతం లేనిది కాదని, భగవానుని కృపను భక్తి ప్రపత్తులచేత సంపాదించుకొన్నట్లైతే ఈ చక్రబంధం నుంచి జీవుడు విముక్తిని పొందగలడు అనే తత్త్వరహస్యాన్ని బోధించేవి ఉపనిషత్తులు. భగవానుడు ఉపనిషత్తులలో ఉండడం చేత- ప్రతిపాద్యుడవడం చేత శ్రుతిసీమంతాలయందు భగవానుడు అలంకరింపబడి యున్నాడనే రమణీయార్థక శబ్దమిది.

*సర్వగుణసీమాంతః:-* దయాది సర్వధర్మాలయొక్క సీమలకు అంతమైనవాడు భగవానుడు. సకలగుణాలకు చివరి హద్దు- అవసాన భూమి- అన్నమాట. గుణాలను బట్టి గుణవంతుడని లోకం వ్యవహరిస్తున్నది. కాని "గుణాస్సత్యజ్ఞాన ప్రభృతయ ఉతత్వద్గతతయా శుభీభూయం యాతాః"- (వరదరాజస్తవం-11). సత్యజ్ఞానాది సకల గుణాలు భగవానుని ఆశ్రయించి శోభను పొందాయి.

"జ్యోతిషాం జ్యోతిః"- "మంగళానాంచ మంగళమ్" అనే శ్రుతిస్మృతులు పల్కినట్లు, కల్యాణ ప్రదుడైన భగవానుణ్ణి చేరిన గుణాలన్ని కల్యాణ గుణాలుగా శోభిస్తున్నాయి- అని శ్రీకూరేశుల శ్రీసూక్తి.

"బృహత్వంచ స్వరూపేణ గుణైశ్చ యత్రానవధికాతిశయం, సోఽస్య ముఖ్యార్థః". సర్వవ్యాపియైన స్వరూపాన్నిబట్టి, నిస్సమాభ్యధిక గుణాలనుబట్టి, రెండు విధాలా పెద్దదైనందువల్ల బృహచ్ఛబ్దం పరమాత్మ వాచకమని శ్రీభాష్యకారులు బ్రహ్మశబ్ద నిర్వచనాన్ని తెల్పినారు. కాబట్టి దేశికులు గుణాలచేత నిరతిశయ బృహత్వాన్ని ఈ పద ప్రయోగంతో ప్రకటించారు.

క్షపిత తృషా మలమోహః:- "క్షీయంతే చాస్య కర్మాణి తస్మిన్ దృష్టే పరావరే"- (ముం. ఉపనిషత్) పరులైన అధికులైన బ్రహ్మాది దేవతలు ఎవరికంటే అవరులో తక్కువ వారో, అతడు పరావరుడు- సర్వోత్కృష్టుడైన పరమాత్మ అని అర్థం. పరావరే దృష్టే:- ఉపాసన దశయందు, దర్శన సమానాకారమైన ధ్యానమందు పరావరుడు చూడబడినప్పుడు అనాది కాలంగా ఆవరించియున్న రాగద్వేషాది చిత్తమలినాలు తొలగిపోతాయి. దుఃఖసాధ్యాలైన క్షణికభోగాలపైన ఆశలు అణగిపోతాయి. అనుభవిస్తేగాని నశించనట్టి పుణ్యపాపకర్మలన్ని క్షయమొందుతాయి. మోహం అంటే దేహాత్మభ్రమ- అజ్ఞానం తొలగిపోయి, మనస్సుకు జ్ఞానానుకూలమైన నైర్మల్యమేర్పడును. బ్రహ్మజ్ఞానమే కల్గును.

మునీనాం హృదయేషు శ్యామల మయూఖః స్ఫురసి- "ఏషోఽణు రాత్మాచేతసావేదితవ్యః"- అణుపరిమాణం కలవాడైన ఈ జీవాత్మజ్ఞానయోగ పరిష్కృతమైన మనస్సు చేత తెలుసుకోదగినవాడు అని ఉపనిషద్వాణి. అంటే అణురూపంగా ఉండేది జీవాత్మ స్వరూపం. పరమాత్మ "అణోరణీయాన్"- అణువు కంటే అణుతముడు కదా! అట్టి పరమాత్మను "ధ్యానావస్థిత తద్గతేన మనసా పశ్యంతి యం యోగినః"- (భాగవతం) యోగులు- మునులు ధ్యానమగ్నమైన మనస్సుచే దర్శిస్తారు. "స్వరూపాత్ స్వామి నోరూపం ఉపాదేయతమం విదుః"-

భగవానుని దివ్యాత్మకంటే దివ్య మంగళవిగ్రహం- అర్చామూర్తి- ధ్యాన, అర్చన, వందనాదులకు మిక్కిలి యోగ్యమైనది, శుభాశ్రయమైనది.

"అంగుష్ఠ మాత్రః పురుషోజ్యోతిరివ అధూమకః।
ఈ శానో భూతభవ్యస్య స ఏ వాద్య స ఉ శ్వః॥"

బొటన వ్రేలంత పరిమాణంతో భగవానుడు హృదయంలో పొగలేని దీపకళికవలె ఎల్లప్పుడు ప్రకాశిస్తుంటాడు. కాబట్టి మునుల హృదయాలలో చల్లని నీలోజ్జ్వల మూర్తిగా ప్రకాశిస్తాడు పరమాత్మ.

"నీల తోయదమధ్య స్థా విద్యుల్లేఖేవ భాసురా"- (శ్రుతి). (సీమంత సీమాంతశబ్దాలకు ప్రాకృతభాషయందు "సంయోగే" ఇతి యుక్తాత్ ప్రాక్ హ్రస్వవిధానాత్- రూపభేదం లేదని వ్యాఖ్య). ప్రాకృత శ్లోక పూర్వార్ధమందు 'సీమంతో' అని, ఉత్తరార్ధమందు 'తిసామలమోహో', సామల మోహో' అని స్వర, వ్యంజనా ఆవృత్తిచే యమక భేదమైన శబ్దాలంకార సజ్జిత శ్లోకమిది.

28. సుహ లక్ఖణ సిరి వచ్ఛో
సోహసిణిమ్ముత్త విరహక్ఖణసిరివచ్ఛో।
రణదేవణ సవిహగ ఓ
ఉద్ధణగలుల ణ ఇతీర వణ స విహగ ఓ॥

ఛా. శుభలక్షణ శ్రీవత్సః
శోభసే నిర్ముక్త విరహక్షణ శ్రీవత్సః।
రణదేవన సవిధగత
ఉద్ధత గరుడ నదీతీరవన సవిధ గజః॥

**అర్థం:** శుభలక్షణ శ్రీవత్సః= శుభ లక్షణాలుగల 'శ్రీవత్సం' అను చిహ్నాన్ని కల్గినట్టి; నిర్ముక్త విరహక్షణ శ్రీవత్సః= విడువబడని వియోగం యొక్క క్షణకాలం

శ్రీదేవి నివసించిన వక్షస్థలం కలిగినట్టి; రణదేవన సవిధ గతః= యుద్ధమనే క్రీడయందు దగ్గరగా నున్నట్టి నీవు; ఉద్ధత గరుడ నదీతీరవన సవిధగజః= దరులు దొర్లే ప్రవాహంగల గరుడనది యొక్క తీరమందున్న వనమందు సంచరించే ఏనుగుగా; శోభసే= ప్రకాశిస్తున్నావు.

**తా॥** ఓ దేవనాయకా! అచ్యుతా! నీవు శుభలక్షణాలుగల శ్రీవత్సమనే చిహ్నం కలవాడవు. క్షణకాల విరహాన్ని కూడా సహించని శ్రీదేవి నీ ఉరః స్థలమందు ఉన్నవాడవు. యుద్ధక్రీడయందు సన్నిహితుడవైన నీవు, పొంగిప్రవహించే గరుడ నదీతీరమందలి వనమందు ఉండే గజంగా శోభిస్తున్నావు.

**వ్యాఖ్య:**- భగవానుని రూపం మహాగజంవలె శోభిస్తుంటుందని వర్ణితం.

భగవానుడైన విష్ణువుయొక్క వక్షఃస్థలమందు ఒక ప్రక్కన శ్రీవత్సం అనే తెల్లని పుట్టుమచ్చ ఉంటుంది. "శ్రీవత్స సంస్థానధర మనంతేన సమాశ్రితం ప్రధానమ్"- (శ్రీవి.పు. 1-22అ. 69) భగవానుడు తన మంగళ విగ్రహమందు 'ప్రధానం' అంటే ప్రకృతికి ఆశ్రయ మిచ్చాడు. ఆ ప్రకృతి 'శ్రీవత్సం' అనే పేరుగల పుట్టుమచ్చ రూపంగా ప్రకాశిస్తూ ఉంటుంది. "శ్రీవత్సేన ప్రథిత విభవం"- (భగవద్ధ్యాన సోపానం-6) శ్రీవత్సం, వక్షఃస్థలమందు ఒక గుర్తుగా ఉండడంవల్ల భగవద్వైభవం వ్యాప్తమై చాలా ప్రసిద్ధిని పొందింది- అని దేశికులు భగవానుని ఉరఃస్థలవర్ణన చేశారు. ఇక్కడ అనేక శుభలక్షణాలను కల శ్రీవత్సాన్ని ధరించిన దివ్యమంగళ విగ్రహుడని స్తుతింపబడినాడు. సాముద్రిక శాస్త్ర రీతిగా, గజం సర్వసంపత్సమృద్ధిని సూచించే సుడి-మచ్చ-చిహ్నం కలది.

*నిర్ముక్త విరహక్షణశ్రీవత్సః*:- క్షణకాలమైనా విరహాన్ని సహించని శ్రీదేవిని వక్షఃస్థలమందు కలవాడు భగవానుడు. కలశోదధికన్యయైన కమలవాసిని; లక్ష్మీదేవి, దేవతలందఱు చూస్తుండగా ఏనాడు విష్ణువుయొక్క వక్షఃస్థలమందు చేరి నివసించినదో, నాటినుంచి తృటికాలంకూడా పతిని విడిచి యుండనిది కదా! "ఉరో వత్సంచ వక్షశ్చ"- (అమరం).

"అగలకిల్లేన్ ఇఱైయు మెన్ఱు అలర్మేల్ మంగై యుఱైమార్బా"-(తి.వా.మొ. 6-10-10). "ఒక్క క్షణం కూడా ఎడబాసి ఉండడానికి ఓర్వలేను-అని పుష్పం మీద నివసించియున్న యువతి లక్ష్మీదేవి నీ వక్షఃస్థలమందు చేరి నిత్యనివాసం చేయడం వల్ల నిరతిశయ భోగ్యభూతుడవైన ఓ శ్రీమన్నారాయణా!" అని నమ్మాళ్వార్లు ఆర్తితో ప్రార్థిస్తూ 'శరణాగతి' జేశారు. గజం కూడా ఆడ యేనుగుతో కూడి యున్నది.

*రణదేవన సవిధగతః*- రామావతారమందు, రావణయుద్ధమందు ముందు నిల్చి, ఆ మహావీరుణ్ణి చంపదలచి కూడా, అతడు అలసిపోయినాడని జాలి, దయను కలవాడై "ఇప్పుడింటికి పోయి సుఖంగా నిద్రించు; రేపు ఈ రాముని ప్రతాపం చూతువుగాని, పొమ్ము" అని ప్రబల శత్రువును ఎలయించాడు. యుద్ధం ఒక వినోద రూపమనీ భావించిన మహా వీరుడు. ఆహవపుంగవుడు భగవానుడు.

"*రాఘవోరక్షసాంసైన్యం లీలయాఽభి జఘాన హ*"- శ్రీరాముదు రాక్షస సైన్యాన్ని లీలగా సంహరించెను. కాబట్టి 'రణదేవను'దంటే శ్రీరాముడు రామాలయానికి దగ్గఅనే దేవనాయకాలయం ఉండడం వల్ల 'రణదేవన సవిధ గతః' అనబడినది.

"*ఉత్తరత్ర చైత్ర రథేనలింగాత్*"-(బ్ర.సూ. 1-3-35). క్షత్రియుడైన చైత్ర రథునితో కూడి సంవర్గ విద్యాభ్యాసం చేయడంవల్ల 'జానశ్రుతి' కూడా క్షత్రియుదని చెప్పబడినట్లే, రఘువీరుని సమీపమందు ఉన్నందువల్ల అచ్యుతునికి వీరత్వం సూచింపబడింది. వీరగజం కూడా శూరసమాజంలోనే ఉంటుంది తప్ప, క్షుద్రమృగ సమజమందు ఉండదు కదా! (సమజం= పశువులమంద).

*సవిభగతః*- అనే పాఠమూ ఉంది. విభయాసహవర్తంతే ఇతి సవిభాః; సవిభాన్ గతః= సవిభగతః- యుద్ధమనేది వీరులకు వినోదం- ఒక ఆట. ఆ

రణదేవనమందు విభతో, ఉత్సాహంతో కూడియుండేవారిలో ప్రశస్తులైన వారిని తనతో సమాన ప్రకారులని భావించియుండేవాడు భగవానుడు.

భగవానుడు కృష్ణుడుగా అవతరించినప్పుడు "పెరియపారదమ్ కై శెయ్దు, ఇవర్కు త్తిరంగళ్ కాట్టి యిట్టు చ్చెయ్దు పోన మాయంగళుమ్"- (తి.వా.మొ. 5-10-1). మహా భారతయుద్ధాన్ని లీలగా చేబట్టి, భీష్మద్రోణాదుల వధకోసం పాండవులకు అనేక ఉపాయాలను నేర్పి పోయిన ఆశ్చర్య చేష్టలు కలవాడు కదా! "మమప్రాణాహి పాండవాః" అన్నాడు. యుద్ధమందు పాండవుల విజయం కోసం వారికి దగ్గరగా ఉన్నాడు. కారణం-

"యద్య ద్విభూతిమత్సత్వం శ్రీమదూర్జిత మేవవా।
తత్తదేవావగచ్ఛత్వం మమతేజోంశ సంభవమ్॥" (భ.గీ. 10-41)

నాకు నియమించదగినదై, మిక్కిలి కాంతికలిగినదై, శుభకార్యాలయందు ఉద్యుక్తమైనట్టిదైన ప్రతిప్రాణి, వస్తువు- గుట్టలను ఊపగల గాలికి, గడ్డిపరకను కదలించడానికి కావలసినంత మాత్రపు శక్తివలె- నా నియమనశక్తియొక్క స్వల్ప భాగంవల్ల పుట్టునదిగా తెలుసుకొమ్ము; అని తానే చెప్పినాడు.

ఉద్ధత (ఉద్భట) గరుడ నదీతీరవన సవిధ గజః శోభసే- గొప్ప ప్రవాహం గల గరుడ నదీతీరమందలి అరణ్య సమీపమందున్న ఏనుగుగా ప్రకాశిస్తున్నాడు భగవానుడు. 'వనసవిధగజః'- "విధానర్ధి ప్రకారేషు గజాన్నే వేధనే విధా" (రుద్ర నిఘంటువు). 'విధా' అంటే ఏనుగు తినే ఆహారం. విధయాసహావర్తతే, ఇతి= సవిధః. గరుడ నదీతీరమందలి అడవిలో నీకిష్టమైన ఆహారాన్ని తినడంవల్ల మదగజం లాగా సంచరిస్తూ మాకు ఆనందాన్ని కలిగిస్తున్నావు దేవనాయకా! అని దేశికులు వర్ణించారు.

ఉచ్చల-ఉద్భట- లేదా ఉద్ధత శబ్దం గజానికి విశేషణంగానూ అన్వయించ నగును. అచ్యుతుడు, ఆ వన సమీపమందు విజృంభించి సంచరించే మహా గజంగా శోభిస్తున్నాడు అని స్తుతి.

'శుభలక్షణ శ్రీవత్సః'- అనడంవల్ల భగవంతునియొక్క నిత్య సామ్రాజ్యం, నిర్ముక్త విరహక్షణ శ్రీవత్సః' అనడంచేత తాను ఆశ్రయమిచ్చినప్పటికే తనకే నిత్య సంతుష్టిమత్త్వం; 'రణదేవనసవిధగతః' అనే పదంచేత తన ఆశ్రితులను రక్షించడమందు త్వరాతిశయం; 'ఉద్ధత గరుడ నదీతీర వనసవిధగజః' అనడం వల్ల ఆ దేశవాసులకు గజాంతైశ్వర్యమూ సూచింపబడినాయి. తత్ఫలితంగా, ధ్యానించే వారికి ఐహికాముష్మిక సమస్త పురుషార్థాలు ఘటించే సూచనవల్ల ధ్యాన ప్రవృత్తియొక్క అతిశయం విశదమవుతున్నది.

నమ్మాళ్వార్ల వలె దేశికులు తనయందు స్త్రీత్వాన్ని ఆరోపించుకొని నాయికా భావాన్ని ప్రకటించిన రీతి ఈ శ్లోమందు ఇలా ఉంది.

ఓ దేవనాయకా! ఏనుగు ఆడయేనుగుతో చేరి యుండే విధంగా నన్ను నీతో చేర్చుకొని యుండవలదా? నీవు వీరుడవై యుండగా నేను వీరపత్నిగా యుండ కూడదా?

"దీయమానాం నతు తదా ప్రతిజ గ్రాహరాఘవః।
అవిజ్ఞాయ పితుశ్ఛంద మయోధ్యాధిపతేః ప్రభోః॥"

తండ్రియైన దశరథమహారాజు యొక్క అభిప్రాయాన్ని తెలుసుకోకుండా, శ్రీరాముడు సీతాదేవిని పెండ్లాడలేదు- అన్నట్లు, రామునివలె నీవు పరతంత్రుడవా? మావటీనికి అణగియుండే గజంవలె యుండక, వనగజంలాగా నీవు స్వతంత్రుడవు కావా? శకుంతలయొక్క గాంధర్వ వివాహానికి మాలినీ తీరంవలె గరుడ నదీతీరం, నన్ను నీవు గాంధర్వ వివాహమాడుటకు యోగ్యమైనది కాదా? పంపాసరస్తీరమందు సీతను యెడబాసియున్న నీవు పడిన పాట్లన్నీ గరుడ నదీతీరమందు నన్ను ఎడబాసియున్న నీవు (పాటు) పడవలసి యుండగా, వన గజంవలె బాగా భాసిస్తున్నావు. ఇది నా పాపమేమో! - అని ఆర్తితో ప్రార్థించారు.

ఈ (ప్రాకృత) శ్లోకం కూడా యమకభేదమైన శబ్దాలంకారంతోనే ఉన్నది. ఇంకను, కావ్యలింగాలంకారం, రూపకాలంకారం, ఈ రెండింటియొక్క సంసృష్టి.

29. అకుమార జోవ్వణఠిఅం
అహింద ఉరణాహ అహిమ అం అణురూవమ్।
ణిచ్చం సహావసిద్ధం
సువ్వహ సూరిమహి అం సుహం తుహరూవమ్॥

ఛా. అకుమార యౌవన స్థితం
అహీంద్ర పురనాథాభిమత మనురూపమ్।
నిత్యం స్వభావసిద్ధం
శ్రూయతే సూరిమహితం సుఖం తవ రూపమ్॥

**అర్థం:** అహీంద్ర పురనాథ!= భుజగేంద్రపురప్రభూ!; తవ= నీయొక్క; రూపం= శరీరం; అకుమార యౌవనస్థితం= కుమారదశలేని యౌవనదశ యందున్నట్టిది; నిత్యం= శాశ్వతమైనట్టిది; స్వభావసిద్ధం= ఇతరుల యత్నంచేత నిర్వర్తింపరానిది; అభిమతం= నీ సంకల్పంచేతనే గ్రహింపబడినట్టిది; అనురూపం= నీ మహిమకు తగినట్టిది; సూరిమహితం= విద్వాంసులచే పూజింపబడినట్టిది; సుఖం= నీ మనస్సుకు భోగ్యమైనదిగా; శ్రూయతే= శ్రుతిచే స్పష్టపరచబడుతున్నది.

**తా॥** అహీంద్రపురనాథా! దేవనాథా! నీ రూపం కుమారదశకు యౌవన దశకు మధ్యనున్నట్లు వినబడుతున్నది. శాశ్వతమైనది. నీ సంకల్ప ప్రభావంచేతనే నీ రూపమేర్పడినది. పరులకిట్టి రూపం దాల్చరానిది. నీ మహిమకు అనురూపమైనది. నిత్యసూరి బృందంచేత స్తుతింపబడుతున్నది. నీ హృదయాన్ని ఉల్లసింపజేయునట్టిదిగా వేదం తెల్పుతున్నది.

**వ్యాఖ్య:–** భగవానుని దివ్యమంగళ విగ్రహం వర్ణితం.

లోకంలో జన్మించినవారికి కౌమారదశ తర్వాత యౌవన దశ కలుగడమనేది ఒక క్రమం ఏర్పడియున్నది. భగవద్విగ్రహం కుమారావస్థలోగానీ, నిండు

యౌవనావస్థలోగానీ ఉండక, ఎల్లప్పుడు ఈ రెండింటికి మధ్యన ఉండే తరుణ యౌవనరూపంలోనే ఉంటుంది. "యువాకుమారః"- అని వేదం నిరూపిస్తున్నది. భగవద్రూపం కర్మవశమై వచ్చిన రూపం కాదు, భగవానుడు తన సత్య సంకల్పంచే తానే ఏర్పరచుకొన్నట్టిది కాబట్టి శాశ్వతమై, ఇతరులెవ్వరు కూడా యత్నించిననూ నిర్వర్తింపరానట్టిదై, సతతం ఏకరూపమై, తన మహిమకు అనుగుణంగా ఉండి సర్వదా ఉల్లాసాన్ని కలిగించే మంగళ విగ్రహం.

"ఇచ్ఛాగృహీతాభిమతో రుదేహః" అని పూర్వాచార్యుల సూక్తి.

సూరి మహితం- అనంత గరుడ విష్వక్సేనాది నిత్యసూరులచేత, ముక్తపురుషులచేత పూజింపబడునట్టిది. స్తుతింపబడునట్టిది; వారు ఎంత కాలం సేవించిననూ తృప్తిని కలిగించక, ఇంకను సేవించే ఆశను వారికి వృద్ధిపొందించు నట్టి దివ్య సుందరరూపమది. 'సుఖం' అనడంవల్ల భగవానుని చిత్తాన్ని రంజింప జేయు రూపం. శిశుపాలాది శత్రువులకు కూడా భోగ్యమైన రూపం. ఆనంద జనకమైనదనడం అతిశయోక్తి కాదు.

"ఆ ప్రణఖాత్ సర్వ ఏవ సువర్ణః"- అని ఉపనిషత్తు, నఖశిఖా పర్యంతం బంగారు వన్నెతో ప్రకాశించే రూపమని స్పష్టపరచినది. సుఖత్వ, అనురూపత్వాదులచేత లావణ్యం, ఔజ్జ్వల్యం, సౌకుమార్యం మొదలైన రూపసౌందర్యం వలె దయాది గుణసౌందర్యం చేతను అనితర సదృశమైనదని శ్రుతపరచినది.

30. తి ఉణం తస్స వి ఆరా
అచ్చుఅ పురిసోత్తి ఆఅమగణిజ్జంతా।
అత్థా తుహాఖు సమత్తా
పరమ్మి రూవమ్మి భూసణత్థ స్వరూవా॥

ఛా. త్రిగుణం తస్య వికారాః
అచ్యుత పురుష ఇత్యాగమ గణ్యమానాః।
అర్థాస్తవఖలు సమస్తాః
పరస్మిన్ రూపే భూషణాస్త్ర స్వరూపాః॥

**అర్థం:** అచ్యుత!= ఆశ్రయించినవారిని వదలని ఓ దేవనాయకా!; త్రిగుణం= సత్త్వరజస్తమస్సులు అనే మూడు గుణాలుగల ప్రకృతి; తస్య= ఆ ప్రకృతియొక్క; వికారాః= మార్పుజెందిన మహదహంకారాది రూపాలు; పురుషః= జీవాత్మ; ఇతి= అని; ఆగమగణ్య మానాః= శాస్త్రాలచేత గణింపబడుతున్న; సమస్తాః= సకలమైన; అర్థాః= పదార్థాలు-వస్తువులు; తవ= నీయొక్క; పరస్మిన్; రూపే= పరవాసుదేవ రూపమందు; భూషణ+అస్త్ర, స్వరూపాః ఖలు= ఆభరణాలయొక్క, ఆయుధాలయొక్క రూపం కలవి కదా!

**తా॥** అచ్యుతా! శాస్త్రాలు లెక్కపెట్టిన సకల వస్తువులు నీ పర వాసుదేవ రూపమందు ఆభరణాలుగానూ, ఆయుధాలుగానూ ప్రకాశిస్తున్నాయి. మూల ప్రకృతి శ్రీవత్సం అనే పుట్టుమచ్చగా నున్నది. ప్రకృతియొక్క వికారమైన మహత్తత్త్వం కౌమోదకి అనబడే (నీ) గదా, రూపంగా శోభిస్తున్నది. అలాగే అహంకారతత్త్వం శార్ఙ్గం అనబడే ధనుస్సుగానూ, పాంచజన్యం అనే శంఖంగానూ, మనస్సు సుదర్శన చక్రంగానూ ప్రకాశిస్తున్నాయి. ఐదు జ్ఞానేంద్రియాలు, ఐదు కర్మేంద్రియాలు ఈ పది నీకు బాణాలుగా నున్నాయి. జ్ఞానం నందకం అనే ఖడ్గంగానూ, అజ్ఞానం ఆ ఖడ్గాన్ని కప్పియుంచే ఒర-కోశంగా ఉన్నది. పంచభూతాలు, పంచతన్మాత్రలు వైజయంతి అనబడే వనమాలగా శోభిస్తున్నది. జీవాత్మ కౌస్తుభం అనే అనర్ఘ మణియై ప్రకాశిస్తున్నది. ఈ విధంగా తత్త్వాలన్నీ నీ పరవాసుదేవమూర్తి యందే లక్షణంగా అమరి యున్నాయి.

**వ్యాఖ్య:-** తత్త్వ పదార్థాలన్ని పరవాసుదేవ రూపమందు భూషణ, అస్త్రాల స్థానాన్ని పొంది భాసిస్తున్నాయని సుశ్లోకితం.

త్రిగుణం-సత్త్వం, రజస్సు, తమస్సు అనే మూడు గుణాల సమాహారమైనది 'ప్రకృతి' అని అర్థం. ప్రకృతియొక్క వికారాలు సాంఖ్యశాస్త్రమందు ఈ విధంగా చెప్పబడినాయి.

"మూల ప్రకృతి రవికృతిః మహదాద్యాః ప్రకృతి వికృతయః సప్త।
షోడశకస్తు వికారో నప్రకృతిర్నవి కృతిః పురుషః॥" (సాం.త.కౌ.3)

ప్రకృతి సృష్టికర్త్రి. ప్రకృతి వికృతులు ఏడు (7). మహత్తు, అహంకారం, పంచతన్మాత్రలు. కేవల వికృతులు (16) పంచభూతాలు, పంచజ్ఞానేంద్రియాలు, పంచకర్మేంద్రియాలు, అంతఃకరణం. (24) చతుర్వింశతి తత్త్వాలు అని, ఇవి వ్యవహరింపబదుతుంటాయి. ప్రకృతీ, వికృతీ కానివాడు పురుషుడు-జీవుడు. ద్రష్ట '25'వ తత్త్వం.

*"పంచార్ణానాంతుపంచానాం వర్ణాణాం పరమేశ్వరః।
సంస్థితః కాదిమాంతానాం సర్వాత్మత్వేన సర్వదా॥"*

కకారం మొదల్కొని మకారం వరకు గల ఇరువది యైదు అక్షరాలలో, ఐదు ఐదు అక్షరాలను ఐదు వర్గాలుగా విభజింపగా ఏర్పడిన 'కచటతప' వర్గాలచే తెల్పబడు తత్త్వాలలో అంతరాత్మగా భగవానుదున్నాడు.

*"భూతానిచకవర్గేణ, చవర్గేణేంద్రియాణిచ।
టవర్గేణ, తవర్గేణ జ్ఞాన గంధా దయస్తథా॥
మనః పకారేణైవోక్తం, ఫకారేణత్వహం కృతిః।
బకారేణ భకారేణ మహాన్ ప్రకృతి రుచ్యతే॥
ఆత్మాతు సమకారోఽయం పంచవింశః ప్రకీర్తితః॥"*

క ఖ గ ఘ ఙ= క వర్గం (5). వరుసగా పృథివి, జలం, తేజస్సు, వాయువు, ఆకాశం అనే పంచభూతాలను తెల్పుతున్నది.

చ ఛ జ ఝ ఞ = చ వర్గం (5). క్రమంగా వాక్, పాణి, పాద, పాయు, ఉపస్థలనే కర్మేంద్రియాలను తెల్పుతుంది.

ట ఠ డ ఢ ణ= ట వర్గం (5). జ్ఞానేంద్రియాలు అనబడే త్వక్, చక్షుః, శ్రోత్ర, జిహ్వా ఘ్రాణేంద్రియాలను తెల్పును.

త థ ద ధ న= త వర్గం (5). గంధ, రస, రూప, స్పర్శ, శబ్దాలు అనే జ్ఞానేంద్రియ విషయాలను తెల్పును.

ప కారం మనస్సును; ఫ కారం అహంకారాన్ని; బ కారం మహత్తును; భ కారం ప్రకృతిని తెల్పును. ఈ (24) ఇరువైనాలుగు అచేతనాలు.

ఇరువై యైదవ (25) మ కారం- "పంచవింశోఽయం పురుషః"- పురుషుణ్ని, జీవాత్మను తెల్పును.

మన జ్ఞానే, మను అవబోధనే అను ధాతువులనుంచి పుట్టిన మకారం జ్ఞాన వాచకం. "విజ్ఞానాత్మా పురుషః"- జీవుడు, పురుషుడు, చేతనుడు అంటే జ్ఞానం కలవాడు.

పురుష-జీవాత్మ వాచకమైన ఈ 'మ'కారం బద్ధులు, ముక్తులు, నిత్యులు అని మూడు విధాలైన జీవాత్మ సమూహాలకు 'జాత్యేక వచనం'గా ఉన్నది.

ఆగమ గమ్యమానాలైన సమస్త పదార్థాలు కూడా భగవంతుని సంకల్ప సిద్ధమైన స్వస్వరూపమందు అసాధారణ భూషణాస్త్రాల స్థానంగా వెలసి యున్నాయి.

*"ఆత్మా నమస్య జగతో నిర్లేపమగుణామలం।*
*బిభర్తి కౌస్తుభమణి స్వరూపం భగవాన్ హరిః॥*

*శ్రీవత్స సంస్థానధరం అనంతే చ సమాశ్రితమ్।*
*ప్రధానం బుద్ధి రప్యాస్తే గదారూపేణ మాధవే॥*

*భూతాద మింద్రియాదించ ద్విధాఽహంకార మీశ్వరః।*
*బిభర్తి శంఖరూపేణ శార్‌ఙ్గరూపేణచ స్థితమ్॥*

బలస్వరూపమత్యంతం జవనాంతరితా నిలమ్।
చక్రస్వరూపంచ మనోధత్తే విష్ణుః కరే స్థితమ్॥

పంచరూపాతు యామాలా వైజయంతీ గదాభృతః।
సాభూత హేతు సంఘాతా భూతమాలాచ వైద్విజ॥

యానీంద్రియాణ్య శేషాణి బుద్ధి కర్మాత్మ కానివై।
శరరూపాణ్య శేషాణి తాని ధత్తే జనార్దనః॥

బిభర్తి యచ్చాసిరత్నం అచ్యుతోఽ త్యంత నిర్మలమ్।
విద్యామయంతు తత్జ్ఞానం అవిద్యాచర్మ సంస్థితమ్॥"

(శ్రీ విష్ణుపురాణం- ప్రథమాంశం- 22వ అధ్యాయం)

సంగ్రహంగా అర్థమిది- ఆత్మ (పురుషుడు) కౌస్తుభమణి. ప్రధానం (ప్రకృతి) శ్రీవత్సం. బుద్ధి (మహత్తు) గద, భూతాది (తామసాహంకారం) శార్ఙ్గం. ఇంద్రియాది (సాత్వికాహంకారం) శంఖం. మనస్సు చక్రాయుధం. స్థూల సూక్ష్మ పంచభూతాలు (ముత్యాలు, మాణిక్యాలు, మరకతాలు, ఇంద్రనీలాలు, వైదూర్యాలు అనే ఐదు వర్ణాలతో కూడిన) వైజయంతి అనే వనమాల. జ్ఞాన కర్మేంద్రియాలు బాణాలు. నిర్మలమైన జ్ఞానం నందకమనే ఖడ్గమై, అజ్ఞానం (అవిద్య) అనే 'ఒర'చే ఆచ్ఛాదింపబడియున్నది.

శ్రీ పరాశరమహర్షి చెప్పిన ఈ విషయాన్నే శ్రీ వేదాంత దేశికులు 'అధికార సంగ్రహం' అనే తమ గ్రంథమందు 'పురుడన్ మణివరమాగ' అనే 41వ పాశురమందు విశదపరచారు.

ఇట్లు పరవాసుదేవుడు చిత్తు, అచిత్తు అనే తత్వాలను అస్త్రభూషణాది రూపంగా ధరించియున్నాడని సుశ్లోకింపబడింది.

31. ణిన్తి తుమాఓ అచ్చుఅ
ణిక్ఖవిఅ విపక్ఖ ణిట్ఠుర పరక్కమణా।
సంఠవిఅ పరమధమ్మా
సాహుపరిత్తాణ సప్ఫలా ఓ ఆరా॥

ఛా. నిర్యాంతి త్వత్తో౽చ్యుత
నిక్షపిత విపక్ష నిష్ఠుర పరాక్రమణాః।
సంస్థాపిత పరమ ధర్మాః
సాధుపరిత్రాణ సత్ఫలా అవతారాః॥

**అర్థం:** అచ్యుత!= నిక్షపిత-పరాక్రమణాః/ నిక్షపిత= సమూలంగా ధ్వంసం చేయబడిన; విపక్ష= శత్రువులయొక్క; నిష్ఠుర= క్రూరమైన; పరాక్రమణాః= ప్రతాపాలు కలిగినట్టి; సంస్థాపిత పరమధర్మాః= స్థాపింపబడిన ఉత్తమ ధర్మాలు కలిగినట్టి; సాధు పరిత్రాణ సత్ఫలాః= సత్పురుషుల యొక్క రక్షణమే పరమ ప్రయోజనంగా కలిగినట్టి; అవతారాః= విభవావతారాలు; త్వత్తః= నీ నుంచే; నిర్యాంతి= వెలకివచ్చినాయి.

**తా॥** అచ్యుతా! దేవనాయకా! శత్రువుల తీవ్ర ప్రతాపాలను నిరసించినట్టి, పరమ ధర్మాలను ప్రతిష్ఠించినట్టి; సజ్జనులను రక్షించడమే ముఖ్యప్రయోజనం కలవియైన రామకృష్ణావతారాలు నీ సంకల్పం వల్లనే సంభవించాయి.

**వ్యాఖ్య:-** దేవనాయకుడే పరవాసుదేవుడని, అవతారాలకు మూలకందం దేవనాయకుడని సుశ్లోకితం.

గత శ్లోకమందు తత్త్వపదార్థాలన్ని అర్చామూర్తిగా వెలసియున్న దేవనాయకునియందు చేరియున్నాయని వర్ణితం. ఈ శ్లోకంలో విభవాద్యవ తారాలు అర్చారూపంగా వేంచేసియున్న పరవాసుదేవుడనే వ్యూహమూర్తి నుంచి నిర్గమించినవని వర్ణింపబడుతున్నది.

అవతారాల ప్రయోజనం మూడు విధాలుగా చెప్పబడింది. శత్రు పరాక్రమాన్ని నశింపజేయడం మొదట జేయబడింది. శ్రీ రామావతారమందు పితృవచనపాలనార్థం అడవిలోకి వెళ్ళి, విరాధుడు మొదల్కొని రావణుని వరకు వెదకి వెదకి సంహరించినవాడు నరశార్దూలమని ప్రశంసింపబడినవాడు శ్రీరాముడు. అందుకే ఆళ్వార్లు "కఱ్పారి రామ పిరానై యల్లాల్ మత్తుం కఱ్పరో!" (తి.వా.మొ.)

"ఛిన్నం భిన్నం శరైర్దగ్ధం ప్రభగ్నం శస్త్ర పీడితమ్"- అన్నట్లు ప్రతి పక్షులను- విరోధులను సంహరించిన పరాక్రమవంతుడు శ్రీరాముడు. కాబట్టి, ఇతర దేవతలను సేవించడం కన్న మహోపకారియైన శ్రీరామచంద్రస్వామినే ఉపాసించడం మేలు- అన్నారు. పరవాసుదేవుడు మధుకైటభుల పరాక్రమాన్ని సమూలంగా నశింపజేశాడనే అర్థమూ ఉంది.

సంస్థాపిత పరమధర్మాః:- పితృవచన పాలన రూప ధర్మం, వర్ణాశ్రమ ధర్మాలు, శరణాగత రక్షణం- ఇత్యాది ఉత్తమ ధర్మాలను స్థాపించడానికే సకల మనుజనయన విషయ గతులైన రామకృష్ణులుగా విభవావతారాన్ని ధరించినవాడు ఈ దేవనాథుడే అని ప్రస్తుతించారు దేశికులు.

సాధుపరిత్రాణ సత్ఫలాః- సాధువులను- ఉపాసకులను- భక్తులను రక్షించడమే ముఖ్యమైన ప్రయోజనం. శత్రునిరసనం ఆనుషంగిక ఫలమని వ్యక్తం చేయబడింది.

విభవావతారాలు ఈ దేవనాయకుని సంకల్పం వల్లనే ఆవిర్భవించాయని, ఇప్పుడు సర్వసులభమైన అర్చామూర్తిగా ఆరాధింపబడుతూ, అహీంద్ర పురాధీశుడై భక్తులకు ఇహపరసౌఖ్యాలను కలుగజేస్తున్నాడని స్తుతింపబడినాడు. "పరిత్రాణాయ సాధూనాం" (గీత). శ్లోకం స్మరణీయం. "ఆదియంశోదియై అంగువైత్తు ఇంగుప్పిరందు" (తి.వా.మొ. 3-5-5) ఆ పరమపదమందున్న అప్రాకృత

విగ్రహంతోనే ఈ లోకమందు అవతరించి కంసుని సంహరించిన శ్రీకృష్ణుని గుణాలను స్తుతించడం పరమ ప్రయోజనమని అర్థం.

32. హరిమణి సరిచ్ఛ ణి అరుఇ
హరి ఆ అంత భుఅఇంద ఉరపేరంతో।
కాలేదాసజణాణం
కణ్హఘణోహోసి దిణ్ణకాలుణ్ణరసో॥

ఛా. హరిమణి సదృక్ష నిజరుచి
హరితాయమాన భుజగేంద్రపుర పర్యన్తః।
కాలే దాసజనానాం
కృష్ణఘనో భవసి దత్త కారుణ్యరసః॥

**అర్థం:** త్వం= నీవు; హరిమణి సదృక్ష నిజ రుచి హరితాయమాన భుజగేంద్ర పుర పర్యంతః/ హరిమణి= ఇంద్రనీలమణితో; సదృక్ష= సమానమైన; నిజ= స్వీయ; రుచి= కాంతిచేత; హరితాయమాన= పచ్చగా జేయబడుతున్న; భుజగేంద్రపుర= అహీంద్రపురమందలి; పర్యంతః= సమీపభూమిని కలదైనట్టి; దాసజనానాం= భక్తులైన జనులకు; కాలే= తగిన కాలమందు, వర్షాకాలమందు; దత్తకారుణ్య రసః= ఇవ్వబడిన కృపయనే జలం కలిగియున్నట్టి; కృష్ణఘనః= కృష్ణుడు అనే నీల మేఘంగా; భవసి= ఉన్నావు.

**తా॥** ఓ దేవనాయకా! నీవు ఇంద్రనీలమణితో సమానమైన నీ దివ్యమంగళ విగ్రహ కాంతిచేత అహీంద్ర పురప్రాంతభూములను పచ్చగా చేస్తున్నావు. నీ దాసజనులయొక్క పుణ్యం పండిన సమయాన నీ సౌందర్య, ఔదార్య, కారుణ్య గుణ ప్రవాహాన్ని వారిపట్ల ప్రసరింపజేస్తున్నావు కనుక, వర్షాకాలమందు జలాన్ని వర్షించే నీలమేఘంగా భాసిస్తున్నావు.

**వ్యాఖ్య:-** అర్చామూర్తియైన దేవనాథుడు భక్తులకు సముచిత సమయంలో తన కృప అనే జలాన్ని వర్షించే నీలమేఘంగా ప్రకాశిస్తున్నాడని సుశ్లోకితం.

హరిమణి సదృక్ష- పర్యంతః:- అహీంద్రపురాధీశుడైన దేవనాయకుడు ఇంద్రనీల మణికాంతులతో సమానమైన దివ్యమంగళ విగ్రహ సౌందర్యం కలవాడు.

*"శోభయన్ దండకారణ్యం దీప్తేన స్వేన తేజసా"*- తన దేహకాంతి చేత దండకారణ్యాన్ని ప్రకాశింపజేసినాడు.

*"శోభయన్ నిజయా దీప్త్యా యమునా తీరకాననమ్"*- తన నీలోజ్జ్వల శరీర లావణ్యంచేత యమునా నదీతీర ప్రాంతవనాలను శోభింపజేసినాడు. ఇట్లు రామకృష్ణావతారాలలో తాను సంచరించిన ప్రదేశాలకు సమీపంగా నున్న భూములను కూడా శాద్వలభూములవలె శోభింపజేసినవాడు దేవనాయకుడు. ఇప్పుడు అహీంద్రపురోప కంఠమందు ఇంద్రనీలమణివర్ణం గల దివ్యావయవ సౌందర్య విశిష్టుడై అర్చామూర్తిగా వెలసియున్న దేవనాయకుడు ఆ నగర పరిసర ప్రదేశాలను కూడా తన దివ్య రూపతేజస్సుచే శ్యామల వర్ణం కలవిగా శోభింప జేస్తున్నాడు. సౌందర్యాతిశయమిది. ఈ వాక్యం తద్గుణాలంకార లక్షణ లక్షితం.

దాసజనానాం కాలే దత్త కారుణ్య రసః:-

*"ఏవంసంసృతి చక్రస్థే భ్రామ్య మాణే స్వకర్మ భిః*
*జీవే దుఃఖాకులే విష్ణోః కృపాకాల ప్యుప జాయతే॥"*

అన్నట్లు తన కర్మలచేత సంసార చక్రమందు పరిభ్రమిస్తూ దుఃఖపడుతున్న జీవునియందు భగవానుని అనిర్వాచ్యమైన దయ అవశ్యంగా కలుగుతుంది. దాసుడు-భగవంతుణ్ని ఆశ్రయించినవాడు ఒక్కడే అయినా అతనికి సంబంధించిన వారి సంబంధులు అనే అర్థం కల పదం 'దాసజనులు'. దాసునికి సంబంధించిన జనులు= దాసజనులు అని అర్థం.

"కాలే- తత్తత్కాలే విపక్తిర్భవతిహి వివిధా సర్వసిద్ధాన్త సిద్ధా"- ఒక వ్యక్తికి తాను చేసిన యాదృచ్ఛిక, ఆనుషంగిక, ప్రాసంగిక సుకృత్యాలు- పుణ్యకార్యాలు- సముచిత సమయాన పరిపక్వమవుతాయని సిద్ధాంతం. పుణ్యం పండిన కాలాన భగవానుని కృపారస ప్రవాహం దాసజనులయందు ప్రవహిస్తుందని భావం.

"చాతకస్త్రి చతురాన్ పయః కణాన్ యాచతే జలధరం పిపాసయా।
సోఽపి పూరయతి విశ్వమంభసా హన్త! మహతాముదారతా॥"

మహాత్ముల ఔదార్యగుణం ప్రశంసనీయం కదా! చాతకపక్షి దప్పిగొని మేఘం నుంచి మూడో నాలుగో నీటి చుక్కలను అపేక్షిస్తే, మేఘం జగమంతట జలాన్ని వర్షించినట్లు భగవంతుణ్ణి ఆశ్రయించి ప్రార్థించే వాడు ఒక్కడే అయినా, భగవానుడు ఆ యాశ్రితునికి సంబంధించిన (దాస) జనులందఱి మీద దయా రసాన్ని కురిపిస్తాడు.

'కేశవన్తమర్ కీష్ మేలెమరేషేషు"- అనే పాశురమందు భక్తులు, సాక్షాత్తుగనో, పరంపరగానో నాతో సంబంధం గల వారందఱు భగవదేక భోగులైరి అని నమ్మాళ్వార్ల శ్రీసూక్తి.

కాలే దత్తకారుణ్యరసః, అత ఏవ కృష్ణ ఘనః భవసి:- ('కృష్ణ' అని సంబోధించనూ వచ్చు) 'కృష్ణ' శబ్దం వర్ణవాచకం కాబట్టి 'కృష్ణఘనః' అంటే నీలమేఘమని ఒకే పదమవుతుంది. వర్షాకాలమందు కృప యనేజలాన్ని ఏకధారగా వర్షించే వాడవు కాబట్టి నీవు నీలమేఘంగా ఉన్నావని అర్థం.

"కరిశైల కృష్ణజలదః- కాంక్షాధికం వర్షతి" అని వరదరాజు అనే నీలమేఘం కోరిన దానికంటే ఎక్కువ కరుణారసాన్ని వర్షిస్తాడన్నారు దేశికులు.

"మరౌ వామేరౌ వా భగవతి సమం వర్షతి ఘనః"- ఎడారిలోగానీ, మేరు పర్వతం మీదగానీ, మంటికి మింటికి ఏకధారగా వర్షించే ఘనాఘనం వలె

నీచోచ్చ భేదం లేకుండా అందఱియందు కృష్ణ భగవానుడు కృపాజలాన్ని వర్షిస్తాడు, వారి వారి కోరికలను నెరవేరుస్తాడు.

'కృష్ణఘనః' అనడంవల్ల, ఏక పత్నీవ్రతుడైన రామచంద్రునివలె కాక, రుక్మిణీ సత్యభామా ద్యష్టపత్నులయందు, రాధ, కుబ్జ, గోపికల యందును శృంగార రసాన్ని సమంగా ఏర్పరచి వారి అంతరంగాలను రసతరంగితం చేసిన ఘనుడు కృష్ణుడే కదా! ఆ విధంగానే, ఈ దేశికులనే నాయకి యందు కూడా దయారస ప్రవాహాన్ని ప్రసరింపజేసేవాడు నీలమేఘశ్యామ వర్ణుడైన దేవనాయకుడని సారార్థం.

"దత్తకారుణ్యరసః"- అనే చోట సావయ వశ్లిష్టరూపకాలంకారం. తద్గుణ, రూపకాలచేత ఉత్థాపితమైన రూపకాలంకృత శ్లోకమిది.

*33. గలుల ణఇకచ్ఛరణ్ణే*
*లక్ఖిజ్జసి లచ్ఛి మహీకణేరు మణహరో।*
*దీసంత బహుళదాణో*
*దిసాగఇందో వఖుడి అ దణు ఇందదుమో॥*

ఛా. *గరుడ నదీకచ్ఛారణ్యే*
*లక్ష్యసే లక్ష్మీ మహీకరేణు మనోహరః।*
*దృశ్యమాన బహుళదానో*
*దిశా గజేంద్ర ఇవ ఖండిత దనుజేన్ద్ర ద్రుమః॥*

**అర్థం:** ఖండిత దనుజ ఇంద్ర ద్రుమః= నరకబడిన రాక్షస వరులు అనే వృక్షములు కలిగినట్టి; దృశ్యమాన బహుళదానః= కనబడుతున్న అధిక వితరణం, మదజలం కలిగినట్టి; లక్ష్మీమహీకరేణు మనోహరః= శ్రీదేవి, భూదేవి అనే ఆడ యేనుగుల మనస్సును అపహరించినట్టి; గరుడ నదీ కచ్ఛ+అరణ్యే= గరుడ నదీ జలప్రాయ ప్రదేశారణ్యమందు; దిశాగజ+ఇంద్రః, ఇవ= గొప్ప దిగ్గజంవలె; త్వం= నీవు; లక్ష్యసే= కనబడుతున్నావు.

**తా॥** ఓ దేవనాయకా! నీవు గరుడ నదీజలం అధికంగా ప్రవహించే ప్రాంతమందలి అడవియందున్న దిగ్దంతిలాగా కనబడుతున్నావయ్యా! నీవు మధుకైటభులను, హిరణ్య రాక్షసులను సంహరించావు. దిగ్గజం వృక్షాలను విరుగగొట్టి పెకలించి వేస్తుంది. నీవు అందఱు చూస్తుండగా ఆశ్రితులకు అనేక వస్తువులను దానం చేస్తావు. దిగ్దంతి చెక్కిళ్ళ నుంచి మద-దాన-జలం స్రవిస్తుంది. నీవు శ్రీదేవిని, భూదేవిని ఇద్దఱిని చెరియొక ప్రక్కన చేర్చుకొన్నావు. దిగ్గజం రెండు వైపుల ఆడ యేనుగులను కల్గియున్నది.

నీవు శ్రీభూ పిరాట్టుల మనస్సును బహుళదానం చేత అపహరించావు. దిగ్దంతి తన దాన-మద-జలధారలచేత కరేణువుల మనోహరి. నీవు గరుడ నదీతీర వనమందు వెలసి యున్నావు. కాబట్టి, దిగ్గజం గరుడ నదీతీర జలప్రాయస్థలమందలి అడవియందున్నట్లే కనబడుతున్నావు.

**వ్యాఖ్య:-** దేవనాథుడు దిగ్గజంవంటి వాడని వర్ణితం.

దేవనాథుడు గజం వంటివాడని వర్ణించడం ఇది మూడవసారి. మొదటి శ్లోకంలో "అహీంద్రనగరౌషధా చలైక గజేంద్రం" అని దేశికులు ప్రతి వ్యక్తిని నమ్రతతో దండం సమర్పించండి- 'నమత' అని ఆదేశించారు.

ఇరవై ఎనిమిదవ (28) శ్లోకమందు "గరుడ నదీతీర వన సవిధ గజః" అని స్తుతించారు. ఈ శ్లోకంలో, రెండు ఆడయేనుగులతో కూడియున్న దిగ్గజంవలె, శ్రీ భూపిరాట్టులు ఉభయ పార్శ్వములందున్న దేవనాయకుడు గరుడ నదీకచ్ఛారణ్యమందు మనకు కనువిందు చేస్తున్నాడు- అన్నారు.

ఈ శ్లోకం 'దేవనాయక పంచాశత్'లోని 52వ శ్లోకాన్ని స్మరింపజేస్తున్నది.

*"జయ విబుధపతే! త్వందర్శితాభీష్టదానః*
*సహసరసిజవాసా మేదినీ భ్యాం వశాభ్యామ్।*
*నళవనమివ మృద్నన్ పాపరాశిం నతానాం*
*గరుడ సరిదనూపే గంధహస్తీవ దీవ్యన్॥"*

అని దేశికులు స్తుతించారు. ఖండిత దనుజేంద్ర ద్రుమః- రాక్షసేంద్రులు అనే మహావృక్షాలను ఖండించి యుండడం ఒక లీల. దేవనాథుడు లోక కంటకులైన గొప్ప రాక్షసులను వధించాడు. మదగజం అడవిలోని పెద్ద పెద్ద చెట్లను విరిచివేయడం, నిర్మూలించడం దానికి వినోదం. "ద్రుద్రుమాగమాః" (అమరం) రాక్షసులే వృక్షాలు అనడం రూపక సమాసం. భగవానుడు అలవోకగా అసురులను నిరసించునట్లే ఆశ్రితుల పాపాలను పటాపంచలు చేయువాడు అని భావం.

దృశ్యమాన బహుళదానః- 'దాన' శబ్దానికి యోగ్యులకు తన వస్తువులను త్యాగం చేయడం దానమీయడం అని ఒక అర్థం. "మదో దానం"- (అమరం) ఏనుగు యొక్క గండస్థలం నుంచి కారే మదం అని మరొక అర్థం. కాబట్టి, 'దానం' శ్లిష్టపదం. దానం "గజమదే త్యాగే" (విశ్వః).

భగవానుడు ఆశ్రితులకు సర్వస్వదానం చేయడం ప్రసిద్ధం. కల్పవృక్షం కూడా తన నాశ్రయించిన వారికోరికలనన్నిటిని నెరవేర్చుతుంది. కాని తనను మాత్రం ఇచ్చుకోదు కదా!

"తన్నైత్తన్ద కఱ్పగమ్"- భగవానుడు తనను కూడా ఇచ్చుకొనే కల్పతరువు. ఆశ్రితులకు సర్వస్వదానం చేయడమే కాక, తనను అనుభవించి వారు ఆనందపడునట్లు తనను ఇచ్చుకోవడమనే విషయం పురాణాలలో వినబడుతున్నదనే కాదు, అహీంద్రపురమందు సాక్షాత్తుగా కనబడుతున్నది. 'దృశ్యమాన' పదం తెల్పే అర్థమిది.

*"జీవన్ముక్త సదృశాః అచ్యుత! దృశ్యంతే పావనాస్తవ భక్తాః"*:- నీయొక్క అనుభవాన్ని పొంది, ఓ అచ్యుతా! నీ భక్తులు పావనులై జీవన్ముక్తులతో సమానులుగా ప్రత్యక్షంగా కన్నులముందే వర్తిస్తున్నారని 'దృశ్యమాన' పదం వివరిస్తున్నది.

దిగ్గజం కూడా బహుళదానం అధికమైన మదజలం కలిగియున్నది.

లక్ష్మీ మహీ కరేణు మనోహరః:- శ్రీ భూపిరాట్టులే కరేణువులు- ఆడ యేనుగులు (రూపకం). "కరేణు రిభ్యాం స్త్రీ నేభే"- (అమరం). 'కరేణు' శబ్దం, ఆడయేనుగు అనే అర్థమందు 'స్త్రీలింగం' గానూ, మగయేనుగు అనే అర్థమందు 'పుంలింగం' గానూ వర్తిస్తుంది.

ఆశ్రితుల యొక్క విరోధులను నిరసించి, వారి యభీష్టాన్ని ప్రదానం చేయడం- ఆశ్రితుల కోరికలన్నిటినీ నెరవేర్చడం చేతనే శ్రీదేవి, భూదేవి అనే దేవేరుల యొక్క మనస్సును చూరగొన్నాడు. గోపికల మనస్సును ఆకర్షించడానికి వేణుగానం చేసినట్లు దేవేరుల మనస్సును వశపరచుకోవడానికే ఆశ్రితులకు అభీష్ట ప్రదానం చేశాడు.

లక్ష్మీదేవి పురుషకారిణి. భూదేవి సుఖదాయిని. ఆశ్రితులకు అభీష్టదానం చేసి వారిని రక్షించకుంటే దేవేరులు దేవనాథునికి ముఖాన్ని చూపనే చూపరు కదా! దేవేరులను విడిచి వేరుగా తాను ఉన్నట్లైతే పూర్వం పంపాతీరమందు సీతాదేవి యొక్క వియోగం చేత తాను విరహబాధను పొందినట్లే, ఈ గరుడ నదీతీరమందు కూడా అంత బాధను పొందవలసి యుండునని భావించి, దేవేరుల మనస్సును ఆకర్షించడం కోసమే దేవనాథుడు ఆశ్రితాభీష్ట ప్రదానం చేశాడని పిండితార్థం. మత్తగజం యొక్క గండస్థలం నుంచి స్రవిస్తున్న మద- దాన- జలాన్ని చూచి ఆడయేనుగులు- రెండు కరేణువులు పురుష గజం వెంటబడినాయి- అనుసరించాయి.

*గరుడ నదీకచ్ఛారణ్యే:*- 'కచ్ఛః' అంటే నీరు తటుచుగా ఉండే స్థలం. "జలప్రాయ మనూపం స్యాత్ పుంసి కచ్ఛస్తథా విధః"- (అమరం). సాధారణంగా, నదీ సరస్సులకు సమీపమందున్న ప్రదేశమని అర్థం. దేశికులు- నాయికా భావం- అన్యాపదేశం ఇలా ఉన్నది- ఓ దేవనాయకా! సంభోగ యోగ్యమైన శీతల సుభగ సుగంధి గరుడ నదీతీర వనమందు నీవు నివసించకుండా మరొకచోట ఉంటే నేను విశ్లేషం వల్ల కలిగిన బాధను ఓర్చుకొనే దానిని కదా! నిన్ను ఎడబాసి యుండడం నాకు ఈ స్థలం సహించరానిదై యున్నది. అదీ కాక, నీవు ఈ

ప్రదేశమందు కనబడకుంటేనైనా కొంత భరించేదాన్నేమో! ఆ విధంగానూ లేదు కదా!

లక్ష్యసే:- రెండు కన్నులకూ విషయుమైయున్నావు. నీ వెంట శ్రీభూపిరాట్టులను చేర్చుకొని యుండడం నాకు దుస్సహంగా నున్నది.

"యదేషా శిఖినీ కామాత్ భర్తారం రమతేఽన్తికే"-(రా.కి.ప్ర.స.42) పంపాతీరమందు ఆడనెమలి తన భర్త పురివిప్పి నృత్యం చేస్తుంటే కామమోహితయై తాను కూడా దగ్గఱజేరి క్రీడిస్తున్నది (మయూరాల జంటకు శరీర సంపర్కం ఉండదు. మగనెమలి పింఛం విప్పి ఆడుతున్నప్పుడు ఆడనెమలి దానిచుట్టూ తిరుగుతూ ఉంటే, మగనెమలి కన్నీరు కార్చగా రెండు చుక్కలను పానం చేసిన ఆడనెమలి తృప్తినిజెంది గర్భవతి అవుతుంది. గ్రుడ్లుపెట్టి, పొదిగి పిల్లలను జేస్తుంది. మయూర ద్విజాతి పవిత్రమైనది కాబట్టి శ్రీకృష్ణుడు నెమలితోక ఈకను తన శిరస్సునందు భూషణంగా అలంకరించుకొన్నాడు). ఓ దేవనాథా! రామావతార మందు ఆ ప్రేయసీ ప్రియులైన నెమళ్ళ క్రీడను జూచిన నీకు దుస్సహంగా ఉండలేదా? అని ఆర్తి ప్రకటింపబడింది.

భూదేవితో కూడి లక్ష్మీదేవి యున్నది. ఉభయ నాచ్చియార్లతో కూడి యున్నాడు దేవదేవుడు. భోగంకోసమే పురుషకారం. పురుషకారం చేత ప్రపత్తి సఫలమవుతుంది. 28వ శ్లోకమందు "నిర్ముక్త విరహక్షణ శ్రీవత్సః" అని చెప్పబడిన ఉపాయ భావం క్రమంగా చెప్పినందువల్ల ప్రపన్నులకు దేవేరులతో కూడియున్న దేవనాథుణ్ని శరణాగతి చేయడమే ఆనంద దాయకమని తెల్పబడినది. రూపక శ్లేషాలంకారాలచే ఉత్థాపితమైన ఉపమాలంకారం.

'ఖండిత' శబ్దమందు- ప్రాకృత భాషలో "చంద ఖండితేణావా"- అని ణకారంతో కూడా 'పక్షికం ఆదేః' అ వర్ణానికి ఉత్వమ్. ఖుడిఅ- 'ఖండిత' అనే చోట 'త్రుటిత' అని పాఠాంతరం ఉంది. 'త్రుటిత' 'రపలామధశ్చ' అని 'ర' లోపించి 'టోడ' అనే సూత్రంచేత 'ట'కు 'డ' వచ్చి 'తుడిఅ' అయింది. కరేణు- రణోరితి రణ యోర్వ్యత్యయః (కణేరు).

34. ముహచందమోళిదిణఅర
మజ్ఝఠిఓతుజ్ఝ చిహుర భారంధారో।
అఘడిఅ ఘడణాసత్తిం
సచ్చం ఠావే ఇ దాస సచ్చ సమగ్గమ్॥

ఛా. ముఖ చంద్రమౌళి దినకర
మధ్యస్థితస్తవ చికుర భారాంధకారః।
అఘటిత ఘటనాశక్తిం
సత్యం స్థాపయతి దాససత్య! సమగ్రామ్॥

**అర్థం:** హే దాససత్య!= ఆశ్రయించినవారి పట్ల సత్యంగా ఉండే ఓ దేవనాథా!; ముఖచంద్ర మౌళి దినకర మధ్యస్థితః/ ముఖచంద్ర= ముఖమే చంద్రుడు; మౌళి దినకర= కిరీటమే సూర్యుడు; ఈ రెండింటియొక్క; మధ్య= నడుమ; స్థితః= ఉన్నట్టి; చికుర భార+అంధకారః= కేశపాశం అనే కటిక చీకటి; తవ= నీ యొక్క; సమగ్రాం= పరిపూర్ణమైన; అఘటిత ఘటనాశక్తిం= ప్రకృతిచే సమకూర్చబడని వస్తువులను సమకూర్చడమందలి సామర్థ్యాన్ని; స్థాపయతి= స్థాపిస్తున్నది; సత్యం= నిజం.

**తా॥** దాసులయందు సత్యంగా వర్తించే ఓ దేవనాయకా! నీ ముఖమే చంద్రబింబం, నీ కిరీటం సూర్యమండలం, నీ ముంగురుల సమూహమే అంధకారం. ముఖానికి, కిరీటానికి నడుమ కేశపాశమున్నది. కేశపాశం నల్లగా ఉంటుంది కాబట్టి కటిక చీకటిగా రూపింపబడింది. గొప్పగా ప్రకాశించే చంద్రసూర్యుల మధ్య కటిక చీకటి యుండడం ఆశ్చర్యమే. ఈ దృశ్యం ఇతరులచేత ఘటింపశక్యం కాని పదార్థాలను ఘటింపజేసే నీ శక్తిని స్థిరం చేస్తున్నది. ఇది నిశ్చయం సుమా!

**వ్యాఖ్య:–** అర్చామూర్తియైన దేవనాథుని దివ్యావయవసౌందర్యాన్ని వేర్వేరుగా వర్ణింపదలచి, మొదటి చికుర భారాన్ని ఇందు వర్ణించారు.

తిరుప్పాణాళ్వార్లు 'అమలనాదిపిరాన్' అనబడే ప్రబంధమందు భగవద్దివ్య మంగళవిగ్రహ శోభను 'పాదాది కేశాంతం'గా వర్ణించారు. శ్రీశంకర భగవత్పాదులు 'విష్ణుపాదాది కేశాంత స్తోత్రం' అనే ప్రబంధాన్ని రచించారు. ఈ దేశికస్వామి వారే 'భగవద్ధ్యాన సోపానం' అనే స్తోత్ర ప్రబంధమందు పాదాది కేశాంతం వర్ణించియుండగా, ఇక్కడ కేశాది పాదాంతంగా వర్ణించడానికి కారణం ఏమై యుండును? అంటే, దూరం నుంచి వచ్చే భక్తునికి మొదట కనబడేది శ్రీముఖమండలమే కదా! దేశికులకు నాయికా భావంతో నున్నందువల్ల "కుటిల *కుంతలం శ్రీముఖంచతే నీల కుంచిత మూర్ధజః*"- అన్నట్లు, అందమైన నల్లని ముంగురులు, ఉన్నతమైన కిరీటంతో కూడిన సొబగైన మొగమే మొదట మనో నయన గోచరమైనది.

*"నరకే పచ్యమానస్తు యమేన పరిభాషితః।*
*కింత్వయా నార్చితో దేవః కేశవః క్లేశ నాశనః॥"*

నరక బాధను అనుభవించే వ్యక్తిని యమధర్మరాజు "ఏమయ్యా! నీవు క్లేశనాశనంచేసే కేశవుణ్ణి పూజించలేదా?" అని అడిగాడట. అంటే "అవిద్య, అస్మిత, రాగం, ద్వేషం, అభినివేశం" అనే క్లేశపంచకం- చిత్తమాలిన్యం- నశించి, నరక లోకాన్ని పొందకుండా చేసేది కేశవార్చన. ఇంత విలక్షణమైన కేశవుని- దేవనాథుని- కేశపాశమే సంశ్లేషాభిలాషియైన నాయికకు మొదట నయన గతవిషయమైనది.

ఆముక్తమాల్యద తాను ముడుచుకొని ఇచ్చిన పూలమాలిక శిరస్సున ధరింపబడినది. కాబట్టి స్వామి కేశపాశం, మొదట ఈ వేదాంత నాయికను ఆకర్షించింది.

*"త్వామయ మా బద్ధాంజలిర్ద్వా సజనస్త్వామిమర్థ మర్థయతే"*- ప్రణయ కోపంతోనున్న దేవేరిని 'దోసిలొగ్గి ఈ ఒక్క కోరికను దీర్చుమని ప్రార్థిస్తున్నాను' అన్నప్పుడు ఆమె ఎడమ కాలుతో తన్నగా, ఆ కాలియందు పూయబడిన పారాణి

స్వామి అలకలకు అంటుకొన్నది. కాబట్టి ఆయన ముంగురుల సమూహం- చికుర భారం- నిగమాంతనాయకి యొక్క దృష్టిని మొదట చూరగొన్నది.

తిరుమంగైయాళ్వార్లు *"మైవణ్ణ నఱుంగుంజికుషల్ పిన్ తాష్"* (తిరునెడు న్దాణ్డకమ్-21) అని సర్వేశ్వరునియొక్క కిరీటం మొదల్కొని పాదాల వరకు అనుభవించారు కదా! దేశికులు దేవనాథుని అర్చామూర్తి యొక్క దివ్యమైన అవయవాల ప్రత్యేక సౌందర్యాన్ని అనుభవించారు. ముఖచంద్రమౌళి దినకర మధ్యస్థితః చికుర భారాంధకారః- దేవనాథుని ముఖం అనే చంద్రునికీ, కిరీటం అనే సూర్యునికీ మధ్య ముంగురుల సమూహం అనే చీకటి వ్యాపించి యున్నది.

దేవనాథుని ముఖమండలం గుండ్రంగానూ, చల్లని ఆహ్లాదకరమైన వెలుగుతో చంద్ర బింబంలాగా ప్రకాశిస్తున్నది. *"కతిరాయిర మిరవికలందు ఎఱిత్తాల్ ఒత్తనీళ్ముడి యన్"*- (పెరియాతి. మొ. 4ప. 1) అన్నట్లు, దేవనాథుని మహోన్నత కిరీటం శిరస్సుపైన వేయి సూర్యుల కాంతివలె ప్రకాశిస్తున్నది. *"చూడా కిరీటం కేశాశ్చ సంయతామౌళ యస్త్రయః"*- (అమరం) దేవనాథుని శిరోజాలు కటిక చీకటిలాగా ముఖానికీ, కిరీటానికీ నడుమ నల్లగా శోభిస్తున్నాయి. చికుర శబ్దానికి తలవెంట్రుకలు అని అర్థం.

*"కొళ్ గిన్ద కోళిరుళైచ్చు గిర్న్దిట్ట కొషుమ్ శురుళిన్*
*ఉళ్ కొండ నీల నన్నూల్ తషైకొల్, అన్టు మాయన్ కుషల్"*-

(తి.వా.మొ. 7-7-9) లోకాలను కప్పుతున్న కటిక చీకటి. చీకటి ఉండలో నుంచి తీసిన నల్లని మంచిదారాల సమూహం అని భావిస్తున్నారా? కాదు; ఇది లీలామానుష విగ్రహుడైన శ్రీకృష్ణుని కేశపాశమే అన్నారు నమ్మాళ్వార్లు. *"చికురః కుంతలో వాలః కచః కేశశ్శిరోరుహః"*- (అమరం) కింద మీద, తేజోమండలాలైన చంద్రసూర్యుల కాంతుల నడుమ గాఢాంధకారం ఉండడం ప్రకృతి విరుద్ధమైన విషయం కదా! ఇక్కడ చీకటి వెలుగులు పరస్పరంగా కలిసి యున్నాయి. ఇదెట్లు

సంభవం? అని ఆశ్చర్యపడడం సహజమే. కవితార్కిక కేసరి కూడా చాలా ఆలోచించాడు.

ఒండొంటితో విరోధంగా ఉండే ఆదిశేషుడు, నాగాంతకుడైన గరుత్మంతుడు కూడా తమ శత్రుత్వాన్ని విడిచిపెట్టి, భగవత్కైంకర్యమందే నిరంతరం నిమగ్నులైనారు కదా! "అరవుం కరుడనునమ్ అన్బుడన్ ఏన్దుమ్"- (అమృతాస్వాదిని. 32).

"మధురై రవశానిలంభయన్ అపి తిర్యంచి శమం నిరీక్షితైః"- (కిరా. 2-56) తపోధనుల ఆశ్రమవాటికలో పరస్పర వైరంగల జంతువులు, మృగాలు కూడా తగవు లేకుండా ప్రశాంతంగా ఉంటాయి. కారణమేమి? "పరితః పటుబిభ్రదేనసాం దహనం ధామ విలో కనక్షమమ్"- (పూర్వార్ధం) పాపాలను దహించే తేజస్సు కలిగియున్ననూ, చంద్రకాంతివలె చూడదగిన మూర్తులు కదా! తాపసులు. తపోమహిమ అట్టిది.

"తపోమేహృదయం సాక్షాదాత్మాఽ హం తపసోఽ నఘ"- (భాగవతం) తపస్సు భగవానుని హృదయం, తాను తపస్సుకు ఆత్మయైనవాడు. అంటే, తపస్సు అనేది భగవానుని అఖండశక్తి అన్నమాట.

"ఇరవు అన్ఱి రవియన్ కాలత్తు అషైత్త ఎషిల్పడైయోన్"- (అమృతాస్వాదిని) భారతయుద్ధమందు సూర్యుడు ప్రకాశించే పగటిపూటనే ఉజ్జ్వలమైన చక్రాయుధం చేత రాత్రిని సృష్టించినవాడు కృష్ణభగవానుడే కదా!

"నల్గురవుమ్ శెల్వుమ్ నరగుమ్ శువర్కము మాయ్"
కైదవమ్ శెమ్మై కరుమై వెళుమైయు మాయ్"- (తి.వా.మొ. 6. 3పత్తు)

దారిద్ర్యం-సంపత్తు; నరకం-స్వర్గం; కపటం-ఆర్జవం; నలుపు-తెలుపు; ఒకటేమిటి? నికృష్ట-ఉత్కృష్ట రూపాలైన స్వభావాలన్నిటిని విభూతిగా కలవాడు శ్రియఃపతియే అని విరహబాధను అనుభవిస్తున్న నమ్మాళ్వార్లు భగవంతుని గుణాలను అనుభవించారు.

ఇట్లు రెండు వైపుల కాంతివలయాలుండగా వాటినడుమ చీకటి యుండడం అపూర్వ ఘటనకు ఉదాహరణం. రెండు విరోధ వస్తువులను ఒకేచోట, ఒకే సమయాన కలిసి యుంచడమనేది అసాధ్యం కదా! సాధ్యం కాని వస్తువులను సాధించే సామర్థ్యం ఒక్క దేవనాథునికే యున్నది అని నిశ్చయించారు దేశికులు. "అరియ దెళిదాగుమ్ ఆత్తల్"- (ఇరండాన్తిరువన్దా-22) అని పూదత్తాళ్వార్లు ఈ విరోధ పరిహారాన్ని 'అఘటిత ఘటనాసామర్థ్యం' అన్నారు.

కాబట్టి, దేవనాయకుని ముఖచంద్ర కిరీట భాస్కరుల మధ్యనున్నట్టి చికుర భారాంధకారం సమగ్రంగా అతని అఘటన ఘటనా శక్తిని స్థాపిస్తున్నదన్నారు దేశికులు. 'సత్యం' అనే పదం 'నూనం' అన్నట్లు ఉత్ప్రేక్షను తెల్పుతున్నది.

'చికుర' శబ్దమందు ప్రాకృతంలో 'క'కు 'హ' ఆదేశమయినది. 'అంధకార' పదమందు "ప్రాయోలుక్" ఇత్యాదిచేత 'క' కారం లోపించి "సంధస్స్వపదే" అని సంధియందు 'అన్ధారో' అనే రూపమేర్పడింది.

35. పరిహాసిఅ పుణ్ణ అందం
ప ఉమ సరిచ్ఛ ప్పసణ్ణలో అణ జు అళమ్।
సంకప్పి అ దురి ఆఇ వి
సమ్హరి అం హర ఇ దాస సచ్చ తుహ ముహమ్॥

ఛా. పరిహాసిత పూర్ణచంద్రం
పద్మ సదృక్ష ప్రసన్న లోచన యుగళమ్।
సంకల్పిత దురితాన్యపి
సంస్మృతం హరతి దాస సత్య! తవ ముఖమ్॥

**అర్థం:** దాససత్య!= కింకరులకు సత్యమైనవాడా! దేవనాయకా!; పరిహాసిత పూర్ణచంద్రం= గేలిచేయబడిన నిండు కళలతో ఉన్న చంద్రుడుగల; పద్మ సదృక్ష-

యుగళమ్/ పద్మ= తామరపూలతో; సదృక్ష= సమానమైన; ప్రసన్న= స్వచ్ఛమైన; లోచన యుగళం= కన్నుల జంటను కల్గియున్నట్టి; తవ= నీ యొక్క; ముఖం= వదనం; సంస్మృతం= స్మరింపబడగా; సంకల్పిత దురితాని, అపి= బాగా చేయబడిన పాపాలను కూడా; హరతి= తొలగిస్తుంది.

**తా॥** ఓ దేవనాయకా! నిండుకళలతో ఆహ్లాదకరమైన చంద్రబింబాన్ని ధిక్కరించేదీ, పద్మంలాగా మనస్సును ఆకర్షించే కనుగవ కలదీ, అయిన నీ ముఖాన్ని తలచుకోగానే అది బుద్ధి పూర్వకంగా చేసిన పాపాలను కూడా నశింపజేస్తుంది.

**వ్యాఖ్య:-** దేవనాథుని ముఖమండలం వర్ణితం.

చికురభారాన్ని అనుభవిస్తున్నప్పుడు "లోచనాభ్యాం పిబన్నివ"- అన్నట్లు ఆశ్రితుణ్ణి కటాక్షించే స్వామియొక్క కన్నులు, సర్వానందకరమైన ముఖమండలం తన ఇంద్రియాలను ఆకర్షించడం చేత దేశికులు ముఖసౌందర్యాన్ని అనుభవిస్తున్నారు. నల్లని ముంగురులచే ఆవరింపబడిన ముఖం కంటే ముందు ముంగురుల సమూహాన్ని వర్ణించినారు. ఇందు, పరిహసిత పూర్ణచంద్రం- భగవానుని ముఖం పూర్ణచంద్రునికంటే అధిక సౌందర్యం కలది. ఎంతోకాలం నుంచి కనబడకుండా ఎక్కడికో పోయి తిరిగి వచ్చిన పుత్రుణ్ణి చూచిన తండ్రియొక్క ఆనందం వలె ఆశ్రితుడైన తనను చూచిన ఆనందంతో, శరత్కాల చంద్ర మండలాన్ని హేళన చేస్తున్నంత అందంగా, ఆహ్లాదకరంగా ప్రకాశిస్తున్నది దేవనాథుని ముఖమండలం.

పద్మసదృక్ష ప్రసన్న లోచన యుగళం- 'సదృక్ష' శబ్దానికి సమానమని అర్థం. 'యుగళ' శబ్దానికి రెండు, జంట అని అర్థం. "వాచ్యలింగాః సమస్తుల్య స్సదృక్ష స్సదృశ స్సదృక్, సాధారణః సమానశ్చ"- "యుగ్మంతు యుగళం యుగమ్"-. (ఉభయత్ర అమరం).

"యథా కప్యాసం పుండరీకమేవాక్షిణీ"- (ఛాం.ఉ.). "గంభీరాంభః సంభూత సుమృష్టనాళ రవి కర వికసిత పుండరీక సదృశం"గా భగవానుని కన్నులున్నవి (శ్రీభాష్యం). విరిసిన తామర పూలతో సమాన సౌందర్యం కలిగి, మనస్సులో కాలుష్యం లేకుండా, ఆశ్రితులపట్ల ప్రీతిచేత చల్లని కటాక్షాన్ని ప్రసరింపచేసే కందోయిని కలిగియున్న ముఖమండలం అది.

సంకల్పిత దురితాన్యపి తవ ముఖం హరతి:- చేతనులు చేసిన కర్మలకు ఫలమిచ్చేవాడు సర్వేశ్వరుడు. ఆయన నిగ్రహానుగ్రహాలే పాపపుణ్యాలు.

"ననిందితం కర్మ తదస్తిలోకే సహస్ర శోయన్న మయా వ్యధాయి"- (ఆళ్వందార్ స్తోత్రం). లోకులు నిందించే వేలకొలది కార్యాలను నేను చేయకున్న వాడను కాను అని అర్థం. తెలిసో తెల్యకయో చేసిన అనేక పాపాలు కూడా భక్తితో భగవన్ముఖమండలాన్ని స్మరించిన వెంటనే నశించిపోతాయి.

భగవంతుని ఆశ్రయించిన పాపాత్ములకు రాజు రాకుమారునికి అల్పదండన విధించినట్లు, స్వల్పదండనను విధించి వారి పాపాలను పోగొట్టి, ఇహపర సుఖాలను కల్పిస్తాడు భగవానుడు.

"హరి ర్హరతిపాపాని దుష్టచిత్తై రపి స్మృతః"- అన్నట్లు, శ్రుతి స్మృతులు భగవానుని ఆజ్ఞారూపాలే కదా! శాస్త్ర నియమాన్ని భగవదాజ్ఞను ఉల్లంఘించి ప్రవర్తించిన ద్రోహుల పాపాలను కూడా వారు భగవన్ముఖాన్ని సాక్షాత్తుగా సేవించినా లేదా మానసికంగా స్తుతించినా చాలు (వారి పాపాలను) పంచబంగాళం చేస్తుందని సారాంశం. "తమర్గళ్ కూట్ట వల్వినై యై నా శమ్ శెయ్యుమ్ శదుమూర్తి"- (తి.వా.మొ. 8-10-9) భక్తబృందం యొక్క ప్రబల పాపరాశిని నాశం చేసే వాడు చతుర్వ్యూహమూర్తిగా అవతరించిన భగవానుడు అని దివ్యసూరి శ్రీసూక్తి. (దేశికుల భావం ఇలా ఉంది) ముఖంతో ముఖం జేర్చి సంశ్లేషించడానికి విరోధం- అడ్డు-గా నిల్చియున్న తన పాపాలనన్నిటినీ నశింపజేయలేదా నా స్వామి అని నాయకి యొక్క ప్రణయ వాక్యాకం ఇది.

ఉపమాలంకారంతో కూడిన అతిశయోక్త్యలంకారం.

(సంస్కృతం- సమ్మరి అం) స్మృధాతువుకు "శ్మ ష్మ స్మ హ్మో మస్మర రశమౌమ్మః" అనే సూత్రం చేత 'స్మ'కు 'మ' ఆదేశం కాగా, 'ఋ' కారానికి 'అరివృషామ్'- 'అరడః' అని ఋదంత ధాతువుకు 'అర' ఆదేశమై 'మ్మర' అనే రూపమేర్పడింది.

36. మాహప్పం తుహమహిఅం
మంగళి అం తుళసి కోత్థుహ ప్పముహాణమ్।
అచ్చు అ థిరవణమాలం
వచ్ఛం దంసేఇ లచ్ఛిలక్ఖణ సుహఅమ్॥

ఛా. మాహాత్మ్యంతవ మహితం
మాంగళికం తులసీ కౌస్తుభ ప్రముఖానామ్।
అచ్యుత! స్థిర వనమాలం
వత్సం దర్శయతి లక్ష్మీలక్షణ సుభగమ్॥

**అర్థం:** హే అచ్యుత!= ఆశ్రితులను విడిచియుండని వాడా! ఓ దేవనాయకా!; లక్ష్మీ లక్షణ సుభగం= శ్రీదేవిచేతను, శ్రీవత్సమనే చిహ్నం చేతను మనోజ్ఞమైనట్టి; తులసీ కౌస్తుభ ప్రముఖానాం= తులసీ మాలిక, కౌస్తుభం అనే మణిమొదలైన భూషణాలకు; మాంగళికం= భద్రగృహమైనట్టి; స్థిర వనమాలం= క్షణం కూడా విడిచి యుండని 'వైజయంతి'ని కల్గియున్నట్టి; తవ= నీ యొక్క వత్సం= వక్షఃస్థలం; మహితం= ప్రశస్తమైన; మాహాత్మ్యం= వైభవాన్ని; దర్శయతి= చూపుతున్నది.

**తా॥** ఓ అచ్యుతా! లక్ష్మీదేవిచేత, శ్రీవత్సం చేత సుందరమైనట్టి, తులసీ కౌస్తుభమణి మొదలైన భూషణాలకు శుభాశ్రయమైనట్టి; స్థిరంగా ఉండే వనమాలచే విరాజమానమైన నీ ఉరఃస్థలం పూజింపదగిన వైభవాన్ని ప్రదర్శిస్తున్నది.

**వ్యాఖ్య:-** దేవనాథుని వక్షఃస్థలం సుశ్లోకితం.

లక్ష్మీ లక్షణ సుభగం (వత్సం వక్షఃస్థలం)- లక్ష్మి, లక్షణం అంటే శ్రీవత్సం అనే పుట్టుమచ్చ- వీటిచేత సుందరమైనది దేవనాథుని ప్రశస్తమైన ఉరఃస్థలం. *"చకర్థ యస్యా భవనం భుజాంతరం"*- (స్తోత్రరత్నం). ఇందిర యొక్క మందిరం అన్నారు శ్రీయామునమునులు.

> *"ఐశ్వర్యం మహదేవ వాఽల్పమథ వాదృశ్యేత పుంసాంహి*
> *యత్ తల్లక్ష్మ్యాః సముదీక్షణాత్ తవ యతః సార్వత్రికం వర్తతే"*-

(శ్రీస్తవం-6). ఈ లోకంలోనూ, పరలోకంలోనూ అన్నిచోట్ల ఎక్కువనో తక్కువనో లభించే ఐశ్వర్యం లక్ష్మీదేవి యొక్క కటాక్షం వల్లనే కలుగుతున్నది. తనకు తానే ప్రభువైన శ్రీమన్నారాయణుడు కూడా లక్ష్మీకటాక్ష వీక్షణాలచేతనే తనను ధన్యునిగా భావిస్తున్నాడు అన్నారు శ్రీకూరేశులు. కలిమికి కాణాచి.

శ్రీవత్సం అనే పుట్టుమచ్చ తెల్లని రోమాలతో కూడిన సుడి. విచిత్రమైన మూల ప్రకృతికి సంకేతం ఇది. సకలసామ్రాజ్య సూచకమై వైశ్వరూప్య వైభవాన్ని చాటుతున్నది. కాబట్టి, *"శ్రీవత్సేన ప్రథిత విభవం"* (భగవద్ధ్యాన సోపానం-6) అన్నారు దేశికులు. లేదా 'లక్ష్మీ లక్షణం' అంటే పృథివికి గంధంవలె పరమాత్మకు గుర్తు లక్ష్మీదేవి అని కూడా చెప్పవచ్చును.

*"లక్ష్మీ చరణ రాజీవ లాక్షా లక్షిత వక్షసే"*- (లక్ష్మీ సహస్రం-1). శ్రీదేవి పాదపద్మాలయందున్న లత్తుక- పారాణి చేత గుర్తింపబడే వక్షఃస్థలం కలవాడు. ఈ చిహ్నమే పరత్వాన్ని సూచిస్తుంది అన్నారు శ్రీ వేంకటాధ్వరి అనే కవిశేఖరులు. శ్రీ పదన్యాసం చేత ధన్యమైనది భగవానుని ఉరఃస్థలం అన్నవారు నిగమాంత దేశికులు. కాబట్టి లక్ష్మీ లక్షణ సౌభాగ్యం కలది దేవనాథుని వక్షఃస్థలం.

*తులసీ కౌస్తుభ ప్రముఖానాం మాంగళికం:-* విష్ణుమూర్తికి ప్రియమైనది చిత్తం మెత్తపడునట్లు పరిమళించే పచ్చని తరుణ తులసీ దళాలతో మనోజ్ఞంగా

అల్లిన మాలికయే కదా! కమనీయమైన కాంతిని ప్రసరించే కౌస్తుభమణీ కూడా భగవానుని యెదలో ఆభరణంగా వెలసింది.

"కాశినియిల్ మణియనైత్తుమ్ కాయావణ్ణన్, కదైత్తెదుత్త కౌత్తువత్తిన్ శీర్త్తై క్కొళ్ళా"- ప్రపంచంలో ఉన్న ఎన్ని మణులైనా కౌస్తుభమణికి సరితూకవు. సాటికి రాజాలవు అన్నారు దేశికులు. చిత్కళా చైతన్య చిహ్నమే కౌస్తుభమణి. 'ప్రముఖ' శబ్దం చేత 'ముత్తుత్తామముమ్'- చల్లని వెన్నెలను కురిపించి, ఉల్లం పల్లవించునట్లు చేసే ముత్యాల హారాన్నీ సూచించారు దేశికులు. దేవనాథుని వక్షఃస్థలం (మాంగలికం) తులసీ కౌస్తుభ ముక్తాదామాది భూషణాలకు భూషణమై శోభిస్తున్నది.

స్థిరవనమాలం:- 'స్థిర' శబ్దం తులసీ కౌస్తుభాదులకూ ఉపలక్షణమే. "లసత్తు లస్యా వనమాలయోజ్జ్వలమ్" అన్నారు ఆళ్వందార్. "అమ్లాన లక్ష్మ్యా వనమాల యాంచితః" (భాగ. 2-2-10). విడవకుండా ఎల్లప్పుడు ధరించిననూ వాడిపోకుండా శోభిస్తూ సువాసనగల వనమాలచే విరాజితుడు అని శ్రీశుక సూక్తి సుధ.

"వాట్టమిల్ వనమాలై మార్బన్" (పెరుమాళ్ తి. 2-1).

"వనమాలై మినుంగనిన్ను విళైయాడ"- (నాయ్చ్చి. తి. 14-2). వనమాలతో కూడిన స్వామి శోభను గోదాదేవి కూడా అనుభవించింది.

"ఆ పాదపద్మం యా మాలా వనమాలేతి సామతా"- పాదపద్మాల వరకు వ్రేలాడే మాలకు వనమాల అని పేరు. (కళింగవచనం) వనమాలకు మఱొక పేరు 'వైజయంతి'.

"పంచరూపాతు యామాలా వైజయంతీగదాభృతః।
సా భూతహేతు సంఘా తా భూతమాలాచవై ద్విజ" (వి.పు.)

పంచతన్మాత్రలు మఱియు పంచభూతాలయొక్క సంఘాత రూపమైన వనమాల ముత్యాలు, మాణిక్యాలు, మరకత, ఇంద్ర నీలమణులు, వజ్రాలు అనే పంచరూపాలు కలది.

*"తులసీ కుంద మందార కరవీర సరోరుహైః।*
*పంచభీరచితామాలా వనమాలేతి కీర్తితా॥"*

అనే గోపాల సహస్ర నామస్తోత్ర వ్యాఖ్యలోని శ్లోకం వల్ల, అయిదు (5) రకాల పూలతో నిర్మితమైన మాల 'వనమాల'గా కీర్తింపబడినది.

*తవ వత్సం మహితం మాహాత్మ్యం దర్శయతి:-* త్రైలోక్య ప్రశంసితమైన దేవనాథుని వక్షఃస్థలమందు- *"వక్షఃస్థల్యాం తులసి కమలా కౌస్తుభైర్వైజయంతీ సర్వేశ్వరత్వం కథయతి తరాం"*- (శ్రీరంగరాజస్తవం. పూ.శ. 113). తులసి మాలిక, లక్ష్మి, కౌస్తుభమణితోపాటు వనమాల కూడా ప్రకాశిస్తున్నందువల్ల ఆయన ప్రాభవ వైభవాలను, సర్వేశ్వరత్వాన్ని బాగా తెలుపుతున్నది. ఇట్లు 'అచ్యుత' అనే సంబోధన శ్లోక భావాన్ని ఆవరించింది కదా! అనన్య సాధారణమైన నీ సుభగ వక్షఃస్థలమందు నన్ను కూడా అత్తుకొని యుండునట్లు చేర్చుకొనలేవా? స్వామీ! అని ఆశించే దేశిక నాయకి యొక్క ప్రార్థన.

*37. ణివ్విస ఇ ణిచ్చతావో*
*దేవఅణో దేవణా అఅ విహిప్పముహో,*
*సీ అల సందవహుత్తం*
*ఛాహిం తుహ విఉల బాహుకప్ప దుమాణమ్॥*

*ఛా. నిర్విశతి నిత్యతాపో*
*దేవజనో దేవనాయక! విధి ప్రముఖః।*
*శీతల సాంద్రప్రభూతాం*
*ఛాయాం తవవిపుల బాహు కల్పద్రుమాణామ్॥*

**అర్థం:** హే దేవనాయక!= దేవతలకు నాథుడవైన ఓ అచ్యుతా!; నిత్యతాపః= ఎల్లప్పుడు తాపం కలిగియున్నట్టి; విధి ప్రముఖః= చతుర్ముఖ బ్రహ్మ మొదలైన; దేవజనః= దేవతల గణం; శీతల సాంద్ర ప్రభూతాం= చల్లని, దట్టని, అధికమైన; తవ= నీ యొక్క; విపుల బాహు కల్పద్రుమాణాం= విస్తారమైన; బాహువులు అనే కల్పవృక్షాల యొక్క; ఛాయాం= నీడను; నిర్విశతి= సేవిస్తున్నది.

**తా॥** దేవతలకు ప్రభువైన దేవనాయకా! నిత్యం సాంసారిక తాపం కలిగియున్న బ్రహ్మేత్యాది దేవతల బృందం నీ ఆజానుబాహువులు అనే కల్ప తరువుల యొక్క శీతలమూ, నిబిడమూ, ప్రచురమూ అయిన ఛాయను పొంది సుఖిస్తున్నది.

**వ్యాఖ్య:-** దేవనాయకుని బాహువులను వర్ణించే శ్లోకం.

దేవతలకు కూడా దిక్కూ చక్కీ తానే కాబట్టి దేవనాయకుడు తనను ఆశ్రయించిన వారి తాపాన్ని చేతులార దీర్చి వారిని సుఖంగా పోషిస్తాడు. అట్టి భగవానుని బాహువులను దేశికులు ప్రణుతిస్తున్నారు.

*విధి ప్రముఖః దేవజనః నిత్యతాపః:-* బ్రహ్మరుద్రేంద్రాది దేవతలందరు ప్రకృతిమండలంలోనే ఉన్నవారు. కర్మాధీనులే. కాకపోతే, కొంచెం తేజశ్శక్తులు ఎక్కువ కలవారు. కాబట్టి, దేవాసుర యుద్ధంవలన గానీ, రావణుని ఉపద్రవం వలనగానీ వారికి కలిగిన సంతాపం జీవన్మరణ సమస్యగా బాధించింది. సాంసారిక బాధా సంతప్తులైన అమరుల బృందం దేవనాయకుని బాహుచ్ఛాయను అవలంబించిననేగాని తాపం తీరలేదు. దేవనాయకుడు చతుర్భుజుడు. ఆజానుబాహుడు.

*విపుల బాహు కల్పద్రు మాణాం శీతల సాంద్ర ప్రభూతాం ఛాయాం నిర్విశతి:-* నాల్గు బాహువులు కల్పతరువులుగా చెప్పబడినాయి. బాహువులు విలపుమైనవి, అంటే బలిసి మోకాళ్ళవరకు విస్తరించియున్నవి. సకల కార్యాలను నిర్వహించే సామర్థ్యం కలవి. కొన్ని చెట్లు నీడనిస్తాయి, మరికొన్ని ఫలాలను

ఇస్తాయి. కాని కల్పతరువులు నీడను. కోరిన ఫలాలను రెండింటినీ ఇస్తాయి. విపుల బాహువులు అంటే ఉదారమైన చేతులు. లోకంలో కోరినవాటికంటే ఎక్కువగా తృప్తిని కలిగించే రీతిగా ఇస్తే అతనిది 'పెద్ద చెయ్యి' అంటారు కదా! భగవానుడు ఆశ్రితులకు త్రివర్గఫలం అంటే ధర్మార్థ కామ ఫలపురుషార్థాలనే కాక మోక్ష ఫలపురుషార్థాన్ని కూడా ఇచ్చేవాడు.

కల్పవృక్షచ్ఛాయ శీతలమైనది. చల్లగా లేకుంటే తాపం- వేడిమి పోదు. సాంద్రం- నీడ దట్టంగా లేకపోతే దేహమందలి ఉష్ణం తొందరగా చల్లబడదు (ప్రభూతాం). నీడ బాగా వ్యాపించి యుండక కొద్దిగా ఉంటే తాపం నివృత్తి కాదు. త్రివర్గ పరులైన దేవతల నుద్దేశించి చెప్పబడినందువల్ల వేరే దృష్టాంతం లభించనందువల్లనూ భగవానుని బాహువులకు కల్పవృక్ష సామ్యం కల్పించబడింది.

"కట్టురైక్కిల్ తామరై నిన్ కణ్ పాదమ్ కైయొవ్వా"- (తి.వా.మొ. 3-1-2). నిజంగా చెప్పినట్లైతే ఉత్కృష్టమైన తామరపూవు భగవానుని నేత్రపాదహస్తాలకు ఉపమానం గాదు. "ఒట్టురైత్తివ్వులగున్నై పృగష్వెల్లామ్ పెరుమ్బాలుమ్ పట్టురైయాయ్"- ఈ లోకం భగవానుని దివ్యావయవాలకు ఉపమానంగా చెప్పి కీర్తించడం, అంతకంటే చాలా మంచి వస్తువు కనబడనందువల్ల, అదే తోచినట్లు చెబుతున్నది. కాని యథార్థం కాదు కదా! అని నమ్మాళ్వార్లు అనుగ్రహించారు.

ఛాయా శబ్దం నానార్థకం. ఇక్కడ కల్పతరువు పరంగా నీడ అని, బాహువు పరంగా పాలన, పోషణ అనే అర్థాన్ని గ్రహించాలి.

"ఛాయాస్యాదాత పాభావే ప్రతిబింబార్కయోషితోః, పాలనోత్కోచయోః"- (మేదినీని).

"నిర్వేశో భృతి భోగయోః"- (అమరం). దేవతలు సంకట సమయమందు భగవానుని బాహువులచేత పోషింపబడి సుఖాన్ని పొందినారని సారాంశం.

"బాహుచ్ఛాయా మవష్టబ్ధో యస్య లోకో మహాత్మనః"- (రామాయణం) సుమంత్రుడు అడవినుంచి తిరిగివచ్చి కౌసల్యా దశరథులతో -"సీతాదేవి అరణ్యంలో సింహశార్దూలాలకూ భయపడడం లేదు. ఆమె రాముని బాహువులను ఆశ్రయించి యున్నది. మహాత్ముడైన రాముని యొక్క భుజబలంచేత లోకమే రక్షింపబడుతున్నది" అని విన్నవించాడు.

ఇందు 'ఛాయా' శబ్దం స్త్రీ లింగం. 'దేవజనః' పుంలింగం. ఏకవచనం. ఒక స్త్రీని అనేక పురుషులుగానీ, ఒక్క స్త్రీ అనేక పురుషులనుగానీ అనుభవించడం వైరస్యం. ఛాయ అనే స్త్రీని (ఏకవచనమైన) దేవజన మనుభవించడ మనేది సరసమైన ధ్వని.

ఓ దేవనాథా! నీడనిచ్చే కల్పతరువుల వంటి నీ బాహువుల నవలంబించిన బ్రహ్మాది దేవతలు నివృత్తతాపులై సుఖంగా జీవిస్తుండగా, నీవే ముఖ్య ప్రయోజనం గల నేను నీ బాహువులచే కౌగిలింపబడి తాపం తీరి, సుఖాన్ని అనుభవించేది ఎప్పుడో! అని దేశిక నాయకి యొక్క ఆశయం.

'బాహు కల్పద్రుమాలు' అనడం రూపకాలంకారం.

'ఛాయా' శబ్దం అనేకార్థకమైనందువల్ల శ్లేషాలంకారం.

'విపుల' అనే విశేషణపదం సర్వాశ్రయణీయతా సమర్థకమైనందువల్ల పదార్థహేతుక కావ్యలింగాలంకారం.

ణింతతాపో- నిర్యత్తాపః అని 'గచ్ఛత్తాపః' అని పాఠాంతరాలున్నాయి. ఉభయత్ర తాపనివృత్తి పూర్వకంగా సుఖిస్తున్నది అని అర్థం.

సంత-శాంత అనే పాఠం (సాంద్ర 'సంద' అనే చోట) ఉన్నది. ('ణిచ్చతావో- నిత్యతాపః అనే పాఠమే మేలు అనిపించింది.)

'వహుత్తం'- 'ప్రభూతే వః' అనే సూత్రంచేత 'ప' కు 'వ' 'భ' కు 'హ' ఆదేశమై 'దైవాదిత్వాత్' నియమంచేత 'త'కు 'ద్విత్వం' హ్రస్వం ఏర్పడింది.

38. సంకప్ప అంద ఖోహిఅ
తి ఉణో అహి విఉల బుబ్బుఅ ప్పఅరేహిమ్।
బమ్హండే హి వి భరి అం
కింకరసచ్చ! తుహ కిసిణు కి సం ఉ అరమ్॥

ఛా. సంకల్ప చంద్రక్షోభిత
త్రిగుణోదధి విపుల బుద్బుద ప్రకరైః।
బ్రహ్మాండై రపి భరితం
కింకరసత్య! తవకస్మాన్ను కృశముదరమ్॥

**అర్థం:** హే కింకరసత్య!= సేవచేసేవారికి సత్యం చెప్పే ఓ దేవనాయకా!; సంకల్ప-ప్రకరైః/ సంకల్ప చంద్ర= సంకల్పం అనే చంద్రుని చేత; క్షోభిత= క్షుబ్ధమైన; త్రిగుణ+ఉదధి= ప్రకృతి అనే సముద్రమందలి; విపుల= అధికమైన; బుద్బుద ప్రకరైః = బుడగల సమూహాలుగల; బ్రహ్మాండైః= బ్రహ్మాండాలచేత; భరితం, అపి= నింపబడినప్పటికీ; తవ= నీ యొక్క; ఉదరం= కడుపు; కస్మాత్, ను= ఎందువల్లనో; కృశం= సన్నగిలియున్నది?

**తా॥** దాసులకు సత్యాన్ని ప్రకటించే ఓ దేవనాథా! నీ సంకల్పమనే చంద్రునిచేత వికృతిచెందిన ప్రకృతి అనే సముద్రమందు ఎక్కువగా కలిగిన బుడగల సమూహాలను పోలియున్న బ్రహ్మాండాలచే నిండియున్ననూ నీ ఉదరం చిక్కిపోయి సన్నగా నున్నదేమి? అని అడిగితే, సమాధానం లభించని దేశిక నాయకి, ఇట్టి నీ అచింత్యాద్భుత శక్తిని నా విషయమై ఉపయోగించి అతృప్తిని కలిగించావు కాదా! అని ఉదరం యొక్క అనుభవాన్ని పొందుతున్నది.

**వ్యాఖ్య:-** దేవనాయకుని ఉదరం సుశ్లోకితం.

ఆశ్రితులకు సత్యం చెబుతాడనే ఆశయంచేత 'కింకర సత్య' అని సంబోధింపబడినాడు దేవనాయకుడు.

కుమ్మరి కష్టపడి ఘటాలను చేసినట్లు. భగవానుడు బ్రహ్మాండాలను సృజించాడా? కాదు. "తదైక్షత, బహుస్యామ్"- 'నేను ఒక్కడనే అనేక విధాలుగా- ప్రకారాలుగా అవుతాను అని సంకల్పించాడు' అని ఉపనిషత్తు బోధిస్తున్నది. భగవానుడు సంకల్పంచేతనే బ్రహ్మాండాలను సృజించాడు.

"అత ఏవ ససర్జాదౌ తా సువీర్య మవాసృజత్।
తదండ మభవ ద్ధైమం సహస్రాంశు సమప్రభమ్।
తస్మిన్ జజ్ఞే స్వయం బ్రహ్మా సర్వలోక పితామహః"- (మనుస్మృతి)

పరమాత్మ మొదట ఉన్న జలమందు సృష్టికి కారణమైన వీర్యాన్ని- తన బీజాన్ని ఉంచాడు. ఆ బీజమే హేమాండమయింది. దానియందే లోకాలను సృజించే బ్రహ్మదేవుడు ఉదయించాడు (బ్రహ్మయొక్క అండం- బ్రహ్మాండం). సంకల్పమే చంద్రుడు. సృష్టికాలమందు భగవానుని సంకల్పం చల్లనిది, ఆహ్లాదకరమైనదని భావం. 'త్రిగుణం' అంటే సత్త్వరజస్తమస్సులనే గుణాలు మూడు కలది ప్రకృతి.

ప్రకృతియే సముద్రం-

"అన్యూనా నతిరిక్తాశ్చ వర్ధంత్యాపోహ్రసంతిచ।
ఉదయాస్తమనేష్వింద్యోః పక్షయోః శుక్లకృష్ణయోః॥" (వి.పు.)

సముద్రములోని నీరు పెరుగక తరుగక ఉన్ననూ, శుక్ల కృష్ణపక్ష తిథుల యందు చంద్రుడు ఉదయించినప్పుడు నీరు పొంగుతుంది, అస్తమించినప్పుడు క్రుంగుతుంది. వీటిని పోటు పాటులంటారు. చంద్రోదయం కాగానే ప్రకృతి వికారం చెందుతుంది. సముద్రం క్షోభపడుతుంది. అల్లకల్లోలమవుతుంది.

చంద్రుని ఉదయంచేత సముద్రం క్షుబ్ధమవునట్లే భగవంతుని సంకల్పంచేత ప్రకృతియొక్క స్వభావం మారుతుందని భావం. సముద్రం కల్లోలితమైనప్పుడు

నీటినుంచి గాలితాకిడివల్ల లెక్కలేనన్ని బుడగలు పుడతాయి. క్షణకాలంలోనే అణగిపోతాయి. సృష్ట్యాదిలో భగవత్సంకల్పంచేత, సముద్రంలో నీటిబుడగలు పుట్టినట్లే, ప్రకృతిలో అసంఖ్యాతమైన బ్రహ్మాండాలు ఉద్భవించాయి. బ్రహ్మాండాలు నీటిబుడగలవంటివని భావం. ఒక్క బుడగ ఒక్క బ్రహ్మాండం. ప్రళయకాలమందు ఈ బ్రహ్మాండాలన్నీ భగవంతుని బొజ్జలో చేరి ఉంటాయి. బ్రహ్మాండాలచేత భరితమైనది రక్షకుని కుక్షి.

కింకరసత్య:- నాకు ఒక సందేహం. నా సందేహాన్ని సత్యంగా తీర్చి చెప్పవయ్యా స్వామీ! అని దేశికులు కోరినారు. దేవనాయకా! ఆకలితోనున్నట్లు నీవు బ్రహ్మాండాలను మ్రింగినావు. బ్రహ్మాండాలచే నిండియుండినసూ, నీ ఉదరం ఇంత కృశించి యుండడానికి కారణమేమి? అని అడిగినాడు. సమాధానం లభించనందువల్ల, ఇది అచింత్యమైన అద్భుతమైన నీ శక్తిచేతనే కదా! నీ బొజ్జ సన్నగిల్లియున్నది అని నిశ్చయించుకొన్నాడు.

బ్రహ్మాండ భరితమైన భగవానుని కడుపు ఎంత తిన్ననూ వెలితిగా నుండడానికి కారణం తృప్తిలేకపోవడమే కదా! "కారేష్ కడలేష్ మలైయేష్ ఉలగుండుమ్ ఆరావయిత్తాన్"- (తి.వా.మొ. 10-8-2) సప్తమేఘాలను సప్త సముద్రాలను, సప్తకులాచలాలను కల్గియున్న లోకాలను మ్రింగిననూ, ఉదరమందు ఒక మూలకు సరిపోనందువల్ల, అసంతృప్తి చేతనే కృశించియున్నది సర్వేశ్వరుని కడుపు- అన్నారు నమ్మాళ్వార్లు.

"కియాన్భరో మమ జగదండ మండలీ త్యతృప్తితః క్రశిత మివోదరం విభోః"- (శ్రీరంగరాజస్తవం. పూ.శ. 114). బ్రహ్మాండాల సమూహం నాకు ఒక భారమా? ఎంతో పెద్ద పొట్ట కలిగియున్న నాకు ఈ బ్రహ్మాండాలన్నీ ఒక ఆహారమా? నాకు సరిపడునంత ఆహారం లేదు అనే అసంతృప్తిచేత భగవానుని ఉదరం చాలా కృశించి యున్నది- అని శ్రీ పరాశర భట్టర్ శ్రీసూక్తి.

దేశిక నాయకి, తనను పొందినట్లైతే, భగవానునికి తృప్తికలిగి ఆయన కడుపునిండుగా ఉండేది. తనను స్వీకరించనందువల్ల భగవానునికి తృప్తిలేదు. తనకూ తృప్తిలేకుండా చేశాడు; అని తహతహ పడుతున్నది.

బ్రహ్మాండాల రూపమైన పుష్కలకారణం ఉన్నప్పటికీ ఉదరం నిండుగా నుండే కార్యరూపాన్ని ఉత్పత్తి చేయనందువల్ల విశేషోక్త్యలంకారం.

పూర్వార్ధంలో రూపకాలంకారం. బ్రహ్మాండాలను ప్రకృతి అనే సముద్రం యొక్క నీటి బుడగలుగా చెప్పడం వల్ల అధికాలంకారం. బ్రహ్మాండ భరితమైననూ ఉదరం కృశించి యుండడమనే భావం భగవానుని జగద్రక్షణాభినివేశాన్ని ప్రకటిస్తున్నదనే ధ్వని ఈ శ్లోకమందున్నది.

*39.* *ణా హి రుహం తు హ ణళిణం*
*భు అఈసర ణఅర ణాహ సోహ ఇ సుహఅమ్।*
*మజ్ఝఠి అ బమ్హ భమరం*
*వచ్ఛాసణ లచ్ఛిపా అవీఢ సరిచ్ఛమ్॥*

ఛా. *నాభిరుహం తవ నళినం*
*భుజగేశ్వర నగర నాథ! శోభతే సుభగమ్।*
*మధ్యస్థిత బ్రహ్మ భ్రమరం*
*వత్సాసన లక్ష్మీపాదపీఠ సదృక్షమ్॥*

**అర్థం:** హే భుజగ+ఈశ్వర నగరనాథ!= అహీంద్రపురనాథా!; తవ= నీయొక్క నాభిరుహం= పొక్కిలియందు పుట్టినట్టి; మధ్యస్థిత బ్రహ్మభ్రమరం= నడుమ కర్ణిక యందు ఉన్న చతుర్ముఖ బ్రహ్మ అనే తుమ్మెద కలిగినట్టి; సుభగం= సుందరమైన; నళినం= కమలం; వత్స+ఆసన లక్ష్మీపాద పీఠ సదృక్షం= వక్షఃస్థలమే కూర్చొని యుండు స్థానం కలిగిన లక్ష్మీదేవియొక్క పాదపీఠంతో సమానమైనదిగా; శోభతే= శోభిస్తున్నది.

**తా॥** అహీంద్రపురనాథా! దేవనాయకా! నీ నాభియందు పుట్టిన కమలం యొక్క మధ్యనున్న కర్ణికయందు బ్రహ్మ అనే భ్రమరం విహరిస్తున్నది. కాబట్టి ఆ నాభీ పద్మం ఎంతో సుందరమైనది. నీ వక్షఃస్థలం లక్ష్మీదేవి కూర్చుండే పీఠమయితే, నీ నాభికమలం లక్ష్మియొక్క పాదన్యాసం కోసం కల్పించబడిన పీఠంగా ప్రకాశిస్తున్నది.

**వ్యాఖ్య:-** దేవనాయకుని నాభి వర్ణితం.

భగవానుని నాభి ఒక అగాధమైన సరస్సు. ఆ సరస్సులో కందనుంచి మొలచిన తామరకాడ సరస్సు పైకి తేలివచ్చి పుష్పించింది. 'నీరు కొలది తామర' అనేది నానుడి కదా! ఆ నాభి కమలం యొక్క నడుమ అంటే కర్ణిక యందు మకరందాన్ని పానం చేస్తూ మధుర నాదంతో విహరిస్తున్న ఒక తుమ్మెద ఉన్నది. ఆ తుమ్మెద ఎవరో కాదు. సామవేదగానంతో పద్మనాభునికి ఆనందాన్ని కలిగిస్తూ, కాంచనవర్ణుడైన చతుర్ముఖ బ్రహ్మాయే.

"యన్నాభినాళాదరవింద కోశాత్ బ్రహ్మాఽఽ విరాసీద్యత ఏ షలోకః"- (భాగవతం) విష్ణుమూర్తి యొక్క నాభి కమలంనుంచి బ్రహ్మ ఉద్భవించాడు. కాబట్టి 'సుభగం'- ఆ కమలం సుందరమైనది. 'సుఖదం' అనే పాఠమూ ఉంది. సకల జీవులకు వారి కర్మలకు తగిన శరీరాలను కల్పించిన చతుర చతుర్ముఖుని యొక్క ఉత్పత్తి స్థానమైనందువల్ల భగవానుని నాభీరుహ నళినం మిక్కిలి సుఖప్రదమని సారాంశం.

శ్రీ శంకర భగవత్పాదులు నాభీపద్మాకర భవమైన నాళీకం 'గాయత్ స్వయంభూ మధుకర భవనం' అని 'విష్ణుపాదాది కేశాంత స్తోత్రం' (24) చేశారు (గానం చేసే బ్రహ్మ అనే తుమ్మెదకు గూడు). భగవానుని వక్షఃస్థలం లక్ష్మీదేవి కూర్చుండే పీట కదా! ఆయన నాభీకమలం జగజ్జననియైన లక్ష్మీదేవికి తన చరణాలను అర్పించడానికి ఉపయోగపడే పీటవంటిదై ప్రకాశిస్తున్నదని దేశికుల కవితా చమత్కారం [illegible]హుక్తి.

చతుర్ముఖుడు-భగవానుని నాభీ నళినమందు నివసించి మధు రసానుభవం చేయడం-ఎంత భాగ్యవంతుడో! నేను అంగన నయ్యి కూడా అట్టి భాగ్యం పొందలేకపోతినే అని దేశిక నాయకి యొక్క ఆశయం. ఉపమా రూపకాలంకార సంకీర్ణం.

40. దిఢ పీడి అ మహు క ఇఢ వ
సోణిఅ పడల పరిపాదలం బర ఘడిఆ।
రాఅఇ అచ్చుఅ ముహలా
ర ఇణాహ గ ఇంద సింకలా తుహరసణా॥

ఛా. దృఢ పీడిత మధుకైటభ
శోణిత పటల పరిపాట లాంబర ఘటితా।
రాజత్యచ్యుత! ముఖరా
రతినాథ గజేంద్ర శృంఖలా తవరశనా॥

**అర్థం:** హే అచ్యుత!= ఓ అచ్యుత!; దృఢపీడిత-ఘటితా/ దృఢ= బాగా-లెస్సగా; పీడిత= మర్దింపబడిన; మధు కైటభ= మధువు, కైటభుడు అనే అసురులయొక్క; శోణితపటల= రక్త సమూహం చేత; పరిపాటల= అంతా ఎఱ్ఱగానైనట్టి; అంబర= పీతాంబరంమీద; ఘటితా= కట్టబడినట్టి; ముఖరా= ధ్వనించునట్టి; తవ= నీయొక్క రశనా= కాంచి-మొలనూలు; రతినాథ గజేంద్ర శృంఖలా= రతీదేవికి భర్తయైన మన్మథుడు అనే మహాగజానికి సంకెలగా; రాజతి= శోభిస్తున్నది.

**తా॥** దేవదేవా! మధువు, కైటభుడు అనే ఇద్దరు అసురులను సంహరించావు. వారి రక్తంచేత నీవు ధరించిన పచ్చని కట్టు పుట్టం తడిసి ఎఱ్ఱబడింది. ఆ పీతాంబరం మీద కట్టబడిన బంగారు మొలతాడు మణుల, మువ్వల సవ్వడి చేస్తుంది. రతీదేవికి పతియైన మన్మథుడు అనే ఏనుగు కాళ్ళకు వేసిన గొలుసు-సంకెలగా రశన-కాంచి- ప్రకాశిస్తున్నది.

**వ్యాఖ్య:**– దేవనాయకుని రశనను వర్ణించే శ్లోకం.

సృష్ట్యాదిలో విష్ణుమూర్తి మధుకైటభులనే దైత్యులను సంహరించాడు. దైత్యుల గణమందు పేర్కొనబడినారు. కాని మధుకైటభులు దితికి పుట్టినవారు కారు. సముద్రజలంలో నుంచి ఉద్భవించి, మృదువైన దేహమూ, స్వభావమూ కలవాడు కాబట్టి 'మధువు' అని, అట్లే కఠిన శరీరమూ, స్వభావమూ కలిగిన వానిని 'కైటభుడు' అని బ్రహ్మ పేర్లు పెట్టాడు.

*"నా మనీ తు తతశ్చక్రే స విభుః సలిలోద్భవః।*
*మృదుః స్వయం మధుర్నామ కఠినః కైటభః స్వయం॥"*

*"తౌ ప్రహృత్య మృధే దైత్యౌ దోర్భ్యాంచ సమపీడయత్।*
*ఊరుభ్యాం నిధనం చక్రే తావు భౌ మధుకైట భౌ॥"*

యుద్ధమందు మధుకైటభులనే అసురులను విష్ణుభగవానుడు తన తొడలయందుంచుకొని చేతులతో మర్దించి వధించాడు (భారతం, సభాపర్వంలోని కథ).

విష్ణువు పీతాంబరుడు. మధుకైటభులనే అసులను తొడలమీద మర్దించి వధించినందువల్ల వారి రక్తంతో స్వామి పచ్చని పట్టు పుట్టం తడిసి ఎఱ్ఱగా అయింది. ఆ పీతాంబరంతో పాటు దానిమీద నడుముకు కట్టిన కాంచి–మొలత్రాడు కూడా రక్తవర్ణంతో శోభించింది.

"*స్త్రీ కట్యాం మేఖలా కాంచీ సప్తకీ రశనాతథా॥*"– (అమరం) 'రశనా' అంటే నడుముకు పీతాంబరం మీద కట్టిన బంగారు మొలత్రాడు, నవరత్నాలు మఱియు బంగారు మువ్వలచే తాపబడింది. కాబట్టి సవ్వడి చేస్తుంది. శబ్దాయమానమైన దేవనాయకుని రశన రతికాంతుడైన కాముడనే గజేంద్రుని కాలును కట్టివేసిన గొలుసువంటి నిగళం– సంకెలగా ప్రకాశిస్తున్నది. మన్మథుని ఆటను కట్టివేసినంత శృంగారంగా ఉన్నది ఆ దేవదేవుని రశన– మొలత్రాడు.

ఆ రశనను సేవించిన భక్తులు లౌకికభోగాలను త్యజించి భగవత్కాము లవుతారు. అట్టి దేవనాయకుని రశనను దర్శించిన దేశికనాయకి యొక్క భగవత్కామం, దుస్సహం మిక్కిలి సహించరానిదిగా ఉన్నదని భావం.

రశన, సౌందర్యాతిశయం చేత భగవత్కామినీ హృదయాలను ఆకర్షిస్తున్నట్లు శోభిస్తున్నదని ఉత్ప్రేక్షింపబడినది.

పూర్వార్ధం చేత వీరరసమై, ఉత్తరార్ధంచేత శృంగారరసమూ ద్యోతకమ వుతున్నది.

"సుఖ సుప్తః పరంతపః"- సుఖంగా నిద్రించినవాడే శత్రువులను తపింపజేయువాడు, అన్నట్లు పీతాంబరంచేత, బంగారు గజ్జెల మొలత్రాడుచే ఒకే సమయాన వీర, శృంగార రసాలకు ఆలంబనమైన దివ్యమంగళ విగ్రహుడు దేవనాథుడు.

రూపకాలంకార ప్రాణితమైన గమ్యోత్ప్రేక్షాలంకారం.

41. దాసాణసచ్చ దీస ఇ
దాణవ వీరాణ దీహణిద్దా సఅణమ్।
తుహ ఉఅరత్థి అ తిహువణ
ప్పాసా అ క్కంభ సచ్ఛఅం ఊరు జు అమ్॥

ఛా. దాసానాం సత్య! దృశ్యతే
దానవ వీరాణాం దీర్ఘ నిద్రా శయనమ్।
తవో దరస్థిత త్రిభువన
ప్రాసాద స్తంభ సచ్ఛాయ మూరుయుగమ్॥

**అర్థం:** హే దాసానాం సత్య!= దాససత్యా!; దానవ వీరాణాం= అసురేంద్రుల యొక్క; దీర్ఘనిద్రా శయనం= పెద్దనిద్రకు-మరణానికి పడకగా ఉన్నట్టి; తవ= నీ

యొక్క; ఊరు యుగం= తొడల జంట; ఉదరస్థితి-సచ్ఛాయం/ ఉదర= కడుపునందు; స్థిత= ఉన్నట్టి; త్రిభువన= మూడులోకాలు అనే; ప్రాసాద= మేడకు; స్తంభ= స్తంభాలతో; సచ్ఛాయం= సమానకాంతి కలదిగా; దృశ్యతే= కనబడుతున్నది.

**తా॥** దేవనాయకుని ఊరుయుగం వర్ణితం.

గత శ్లోకంలో అసురవరులైన మధుకైటభులను భగవానుడు సంహరించాడని తెల్పబడింది. మధుకైటభుల సంహారానికి భగవానుని తొడలజంట వధ్యశిలగా వర్తించింది. కాబట్టి, దీర్ఘనిద్రకు శయనం- వారి మరణశయ్యగానైనది ఊరు యుగం- (రెండు తొడలు) అని ఇందు వర్ణింపబడింది. అట్టి తొడలు భగవానుడు తన బొజ్జలో నిక్షేపించుకొన్న ముజ్జగాలు అనే గొప్ప సౌధానికి ఆధారంగా ఉన్న రెండు స్తంభాలుగా గోచరిస్తున్నాయి. కన్నులకు కనబడుతున్నాయికాని, పీతాంబరంచే ఆచ్ఛాదింపబడిన తొడల సౌందర్యాన్ని పూర్తిగా అనుభవించడానికి వీలులేదు కదా! అని దేశికనాయకి యొక్క ఆశయం.

రూపకాలంకారంచే ఉత్థాపితమైన ఉత్ప్రేక్షాలంకారం.

42. జాణు మణి దప్పణేణ అ
జంఘా మరగఅ కళా ఇఆఏ అ ధణిఆ।
అచ్చుఅ ణ ముఅఇ కంతీ
లచ్ఛీవ సరోఅ లంఛణో తుహచలణే॥

ఛా. జానుమణిదర్పణేన చ
జంఘా మరకత కళాచికయా చ ధన్యా।
అచ్యుత! నముంచతి కాంతిః
లక్ష్మీరివ సరోజలాంఛనౌ తవ చరణౌ॥

**అర్థం:** అచ్యుత!= ఓ అచ్యుతా!; జానుమణిదర్పణేన, చ= మోకాలు (చిప్ప) అనే మణిమయమైన అద్దంచేతనూ; జంఘా మరకత కళాచికయా, చ= పిక్క అనే మరతకమణిచే నిర్మింపబడిన తమ్మ పడిగం చేతనూ; ధన్యా= ధన్యయైన (వృద్ధిబొందినట్టి); కాంతిః= కాంతి- (స్త్రీ వాచకం); లక్ష్మీః, ఇవ= లక్ష్మీదేవివలె; సరోజలాంఛనౌ= పద్మరేఖచేత అంకితాలైన; తవ= నీ యొక్క; చరణౌ= పాదాలను; న, ముంచతి= వదలదు.

**తా॥** ఓ అచ్యుతా! నీ మోకాలే మణిదర్పణం, నీ పిక్కయే మరకత మణిచే చేయబడిన కళాచిక. ఈ రెండింటిచే వృద్ధిజెందిన కాంతి, లక్ష్మీదేవిలాగా అరవిందం మొదలైన రేఖలచేత అంచితాలైన నీ చరణాలను వదలకుండా ఉన్నది.

**వ్యాఖ్య:-** జాను జంఘాలతో పాటు దేవనాయకుని పాదాలను సుశ్లోకిస్తున్నారు దేశికులు.

కాంతిః చరణౌ న ముంచతి- కాంతి భగవానుని పాదాలను విడిచి యుండదు అని ప్రధాన వాక్యం. 'కాంతి' అనే పదం స్త్రీ లింగం. ఒక స్త్రీ అని అర్థం. 'జానువు' అంటే మోకాలు. ఏక వచనం. అట్లే, 'జంఘ' అంటే పిక్క ఇది కూడా ఏకవచనంగానే ప్రయోగింపబడింది.

జానువు ఒక మణిమయమైన అద్దం. 'కళాచిక' అంటే పతద్గ్రహం- తమ్మపడిగం. తాంబూలాన్ని ఉమ్మివేయడానికి ఉపయోగపడే పాత్ర. "వేంగడ క్కోన్‌తాన్ ఉమిషుం పొన్వట్టిల్ పిడిత్తుదనే పుకప్పెరువే నావేనే"- (పెరుమాళ్ తి.మొ. 4-3) వేంకటేశ్వరుడు ఉమ్మివేసే బంగారు పాత్రను- కళాచికను పట్టుకొని అంతరంగ సేవకు చేరే జన్మను నేను పొందవలెను అని కులశేఖరాళ్వారు ప్రార్థించారు.

మోకాటి చిప్పలు రెండు ఉన్నా, పిక్కలు కూడా రెండు ఉన్ననూ క్రమంగా ఒక్క అద్దంతో, ఒక్క కళాచికతో రూపించబడినాయి. కారణమేమి? నారీమణికి దర్పణం, కళాచిక లీలోపకరణాలు. అద్దాలు రెండు ఉన్నా, మగువ తన మొగాన్ని

ఒకే క్షణాన రెండింటిలో చూచుకోజాలదు. ఒక్కొక్కసారి ఒక్కొక్క అద్దాన్ని మాత్రమే ఉపయోగించుకొంటుంది కదా! అట్లే, కళాచిక కూడా ఒక్కటే ఉపయోగపడుతుంది కదా! అందుకే దర్పణం, కళాచిక ఏకవచన పదాలుగా ప్రయోగింపబడినాయి. ఒక్కొక్కపాదం వర్ణింపబడింది. ఆ పాదాల కాంతి ధన్యయైనది. ఎందుకు? భగవత్పాదాలను విడవదు. మోకాటి చిప్ప మణిమయమైన దర్పణం కాబట్టి తళతళలాడుతుంది. "జానూరుపర్వాష్ఠీవద స్త్రియామ్" (అమరం) మోకాలు కంటే క్రింది భాగమైన పిక్క మరకతమణిచే నిర్మితమైన కళాచికయే కదా! "జంఘాతు ప్రసృతా"- (అమరం).

"వృత్తానుపూర్వేచ నచాతిదీర్ఘే జంఘేశుభే సృష్టవతస్తదీయే" - (కుమార సంభవం. 1-35) మొదట గుండ్రంగానూ దాన్ని అనుసరించి ఆవుతోకలాగా చాలా పొడవుకానివై, మంచిలక్షణాలు గలవిగా పార్వతీదేవి జంఘ-పిక్కలను బ్రహ్మ నిర్మించాడు అని కాళిదాసు వర్ణించాడు.

కళాం అంచతి ఇతి= కళాచీ, కళాచియే కళాచిక.

'భగవద్ధ్యాన సోపానం' అనే స్తోత్రకావ్యమందు మూడవ శ్లోకంలో చిక్కని చక్కదనంతో చొక్కుతున్న శ్రీరంగనాథుని పిక్కలను దేశికులు వర్ణించాడు. (జాత్యేకవచనంగా వర్ణన).

చారువృత్తానుపూర్వాం- మీదినుంచి క్రిందివరకు అందంగా గుండ్రగా అమరియున్నాయి.

కాంతి లీలాకలాచీం- కాంతి విలాసాలకు తమ్మపడిగం వంటివి.

జానుచ్ఛాయా ద్విగుణ సుభగాం- మోకాళ్ళ కాంతిచే రెట్టింపు సొబగు కలవి (ఈ శోభ ఇక్కడ స్మరణీయమే). జానువనే మణిమయ దర్పణంచేతనూ, జంఘ అనే మరతక కళాచిక చేతనూ వృద్ధిని పొందిన కాంతి, దేవనాథుని చరణాలను విడవదు. ఎవరివలె? లక్ష్మీరివ- లక్ష్మీదేవివలె. దర్పణ కళాచికలు లక్ష్మికి లీలోపకరణాలే కాబట్టి వాటిచే ధన్యయైనది, లక్ష్మి అని అన్వయం.

సరోజలాంఛనౌ చరణౌ- సరోజ శబ్దం శంఖ వజ్రాదులకు ఉపలక్షణం. శంఖ, రథాంగ, కల్పక, ధ్వజ, అరవింద, అంకుశ, వజ్ర రేఖలు పాదతలాల యందు ప్రకాశిస్తున్నవాడు పురుషోత్తముడు. పద్మప్రియయే కదా లక్ష్మి. పద్మాదిరేఖలుగల పాదాలను లక్ష్మి వదలదు అట్లే కాంతమ్మ కూడా వదలదు.

"మలర్మగళ్ మత్తై నిలమగళ్ పిడిక్కుమ్మెల్లడియై"- (తి.వా.మొ. 9-2-10) అట్లే "లక్ష్మీ భూమ్యోః కరసరసిజై ర్లాలితం రంగభర్తుః పాదాంభోజమ్"- (భ.ధ్యా.సో.-2). చేతులు, కాళ్ళు రెండేసి ఉన్ననూ రెండు చేతులతో ఒకే సమయాన రెండు పాదాలు సంవాహనం చేయబడవు కదా! ఒక్కొక్క పాదాన్ని వేర్వేరు సమయాల్లోనే సంవాహనం చేయవలసి యుంటుంది. దర్పణం, కళాచిక ఏకవచనంలో ఉండి "చరణౌ" అని ద్వివచనమందున్నదేమి?

లక్ష్మీదేవి, భూదేవి ఇర్వురు పరిమళించే తమ పాణిపద్మాలతో సుతిమెత్తగా ఒత్తబడే మృదువైన పాదాలు కలవాడు దేవనాథుడు అని ఆళ్వార్లు, ఆచార్యులు కీర్తించారు కదా!

మలర్మగళ్ కైవరుట్ మలర్ పోనిల్ కిలన్టన"- లక్ష్మీదేవి ఎంతో మృదువుగా స్పృశించిననూ సుకుమారమైన భగవంతుని పాదపద్మాలు కంది పోతాయట.

జాను జంఘాలచేత, ముఖ్యంగా సర్వావయవాలకంటే అధిక కాంతిచే శోభించేవి భగవత్పాదారవిందాలని పిండితార్థం. "అడియు మఃందే" (తిరునెదు-21) శ్రియఃపతి పాదాలకు ఆపాదాలేసాటి- మరొక దృష్టాంతం లేనందువల్ల అనన్యాలంకారశోభితాలు అన్నారు తిరుమంగైయాళ్వార్. జానుజంఘాలచే వృద్ధిజెందిన భగవచ్చరణారవిందకాంతి లక్ష్మీదేవివలె ఆయన చరణారవిందాన్ని విడిచియుండదు.

రూపకాలంకారంచేత ఉత్థాపితమైన ఉపమాలంకారం.

43. సుఇసీమంత పసూణం
సోహా ఇ ణఅసచ్చ తుజ్జ సవ్వసరణ్ణమ్।
కమణఖణజణిఅ సురణ ఇ
ప్రసమిఅ తేల్లోక్కపాఅఅం పఅ ప ఉమమ్॥

ఛా. శ్రుతి సీమంత ప్రసూనం
శోభతే నతసత్య! తవ సర్వశరణ్యమ్।
క్రమణక్షణ జనిత సురనదీ
ప్రశమిత త్రైలోక్యపాతకం పదపద్మమ్॥

**అర్థం:** హే నతసత్య!= ప్రణతులకు సత్యభూతుడా! దేవనాథా!; క్రమణక్షణ-పాతకం/ క్రమణ= ఆక్రమించిన; క్షణ= సమయాననే; జనిత= ఉద్గమించిన; సురనదీ= దేవనదియైన గంగచేత; ప్రశమిత= శమింప-తొలగింప-జేయబడిన; త్రైలోక్య= మూడు లోకాల యొక్క; పాతకం= పాపాలు కలిగినట్టి; శ్రుతి సీమంత ప్రసూనం= నిగమకాంత యొక్క పాపటయందు పుష్పలంగా ఉన్నట్టి; పదపద్మం= చరణకమలం; సర్వశరణ్యం= సర్వరక్షకమై; శోభతే= ప్రకాశిస్తున్నది.

**తా॥** ఓ నతసత్యా! వామనుడవై మూడడుగుల నేలను కొల్చుకొన్న క్షణమందే గంగానది ఉద్భవించి మూడులోకాల పాతకాలను పోగొట్టింది. శ్రుతులు అనే పొలతుకల పాపటలో పుష్పంగా శోభించిన నీ పాదకమలం సర్వలోక రక్షకమై భాసిస్తున్నది అని తాత్పర్యం.

**వ్యాఖ్య:-** దేవనాయకుని పాదకమల యుగళం ప్రత్యేకంగా వర్ణితం.

పూర్వశ్లోకమందు జానుజంఘాలతో కూడియున్న భగవచ్చరణార విందాలను అనుభవించిన దేశికులు, ఇందు భోగ్యతాతిశయంచేత ప్రత్యేకంగా పాదపద్మ శోభను అనుభవిస్తున్నారు.

మహాబలికోసం వామనుడుగా అవతరించి త్రివిక్రముడైనాడు భగవానుడు. "ఇదం విష్ణుర్విచక్రమే, త్రేధాని దధే పదం"- శ్రుతి పలికింది.

వామపాదం ఆకాశాన్ని ఆక్రమించింది. చతుర్ముఖ బ్రహ్మ, తండ్రి పాదాన్ని అభిషేకించాడు. బ్రహ్మాభిషిక్తమైన విష్ణుపాదం నుంచి గంగానది ఉద్భవించింది. మొదట ధూర్జటికి శివత్వాన్ని కల్పించింది. భూలోకంలో ప్రవహించింది. పాతాళంలోకి ప్రవేశించింది. త్రివిక్రముని పాదం నుంచి ఉద్గమించిన గంగానది త్రిలోకాల పాతకాలను పంచబంగాళం చేసింది.

తన పాదమందుపుట్టిన గంగానది మూడు లోకాలను పవిత్రం చేసిందన్నచో ఇక ఆ పాదం ఎంత పవిత్రమైనదో చెప్పడానికి మాటలు చాలవు కదా!

"చరణం పవిత్రం వితతం పురాణం యేన పూతస్తరతి దుష్కృతాని" అని నిగమకాంత ప్రశంసించింది పాదమహిమను. అంతేకాదు; నిగమకాంత తన సిగలో- పాపటయందు పరిమళించే పుష్పంగా అలంకరించుకొన్న పాదమది. "సర్వేవేదా యత్పద మామనంతి"- ఉపనిషద్వాణి. వేదాంత వేద్యమైన పాదం కదా! అందువల్ల ఆ పాదం 'సర్వశరణ్యం'- 'శరణే సాధు శరణ్యం' ప్రకృతిమండల మందున్న సకలజనులను రక్షించే అర్హత విష్ణుపాదానికి తప్ప వేరొక వ్యక్తియొక్క ఏ అవయవానికి లేదనడం నిర్వివాదాంశం.

సర్వజగత్పావనత్వం, వేదాన్తాలంకారత్వం, సర్వలోక శరణ్యత్వం దేవనాయకుని పాదపద్మయుగళం అని స్తుతింపబడింది. ఆనందానికి పర్యాయ పదం విష్ణుపదం.

సకలలోకాల పాపాలను తొలగించే పాదం నా పాపాన్ని తొలగించడం లేదు కదా! శ్రుతికాంతకు శిరోధార్యమైన పాదపుష్పం నా తలను అలంకరించడం లేదు. సర్వలోక శరణ్యమైన పాదం నాకు శరణంగా ఉండదేమి? భర్త దగ్గరగా ఉన్ననూ భార్యను అనుభవించడం లేదు- అన్నట్లున్నది. నేనెంత భాగ్య హీనురాలనో కదా! అని దేశికనాయకి తపన.

44. ఇఅ తిహు వణేక్కమూలం
ఆ సా ఏంతి అణహా అమఅసా ఉ రసమ్।
ఓసహిమహిహరపాసే
ఉఇఅం తుం ఓ సహిం వ దాసరు అణమ్॥

ఛా. ఇతి త్రిభువనైకమూలం
ఆస్వాదయంత్యనఘా అమృత స్వాదు రసమ్।
ఓషధి మహీధర పార్శ్వే
ఉదితం త్వామోషధిమివ దాసరు జామ్॥

**అర్థం:** ఓ దేవనాయకా!; ఇతి= ఈ ప్రకారంగా; అనఘాః= దోషరహితులైన భాగవతులు; ఓషధి మహీధర పార్శ్వే= ఔషధాద్రి సమీపమందు; ఉదితం= ఆవిర్భవించినట్టి/ మొలచినట్టి; త్రిభువన+ఏకమూలం= మూడు లోకాలకు ఒకే ఆధారమైనట్టి/ లోకత్రయమే ఒక్క వేరుగా కలిగినట్టి; అమృత స్వాదురసం= అమృతం వలె భోగ్యమైన రసం కలిగినట్టి; దాసరుజాం= దాసులయొక్క రోగాలకు; ఓషధిం, ఇవ= ఔషధం వలె ఉన్నట్టి; త్వాం= నిన్ను; ఆస్వాదయంతి= భోగ్యంగా అనుభవిస్తున్నారు.

**తా॥** ఓ దేవనాయకా! మొదట ఇంతవరకు నీ దివ్యమంగళ విగ్రహాన్ని, గుణాలను అనుభవించాము. పరమభాగవతులు నిన్ను తప్ప మరొకరిని ఆశ్రయించే దోషంలేనివారు కాబట్టి, వారు నిన్ను సేవించే రీతిని విన్నవిస్తున్నాను. పరమ భక్తులు నిన్ను గొప్ప ఔషధంగా అనుభవిస్తున్నారు.

1) నీవు ముజ్జగాలకు ఒకే ఒక్క ఆధారమైనవాడవు. ఔషధం ముజ్జగాలే ఒక్క వేరు కలిగియున్నది.

2) నీవు మోక్షమనే ఆనందరసం కలవాడవు. ఔషధం మరణించిన వారిని జీవింపజేసే అమృతం వంటి భోగ్యమైన రస ద్రవ్యం కలది.

3) నీవు ఔషధాద్రి ప్రాంత ప్రదేశమందు స్వేచ్ఛగా ఆవిర్భవించావు. ఔషధం ఔషధాచల సమీపస్థలమందు మొలిచింది.

4) నీవు ఆశ్రితుల తాపత్రయాన్ని శమింపజేస్తావు. ఔషధం భక్తులైన సంసారుల వ్యాధులను పోగొట్టుతుంది.

అందువల్ల పరమైకాంత భక్తులు ఔషధాచల ప్రాంతమందున్న అహీంద్రపుర మనే దివ్యదేశమందు నివసించారు.

**వ్యాఖ్య:-** దేవనాథుడు ఓషధివలె సేవింపదగినవాడని సుశ్లోకితం.

'ఓషధి' అంటే జ్వరాన్ని నశింపజేసే లతాది జాతి. ఓషధ్యాః భవం= ఔషధం. ఓషధి వల్ల పుట్టినది ఔషధం. ఓషం- దాహం ధయతి ఇతి= జ్వరం వల్ల కలిగిన దాహాన్ని నశింపజేసేది 'ఔషధం' అని రెండు వ్యుత్పత్తులున్నాయి.

పూర్వ శ్లోకాలలో దేవనాథుని స్వరూపగుణ విభూతులు వర్ణింపబడినాయి. ఇప్పుడు, భవరోగులకు దివ్యౌషధం ఒక్క దేవనాయకుడే అని వర్ణింపబడుతున్న విషయమిది.

అనఘాః- దేవతాంతర ప్రయోజనాంతర రూపమైన దోషాలు లేనివారు అనఘులు- పరమైకాంత భక్తులు అని అర్థం.

దేవదేవుడైన శ్రియఃపతిని కాక వేరే దేవతలను ఆశ్రయించరు. శ్రియః పతినే ఆశ్రయించిననూ మోక్షఫలాన్ని తప్ప వేరే ఫలాలను కోరరు. ఇట్టి పరమభాగవతోత్తములకు దేవనాథుడే ఉపాయమూ, ఉపేయమూ అని నిశ్చయాత్మకమైన భావం ఉంటుంది.

ఉపాయం- అనుభవింపదగిన ఫలాన్ని పొందే మార్గం/ సాధనం భగవానుడు.

ఉపేయం- భోగ్యమైన ఫలం కూడా భగవానుడే. ఉపాయమూ, ఉపేయమూ-రెండు ఒక్కనికే ఎట్లు వర్తిస్తాయి? వ్యాధిని పోగొట్టే ఔషధాన్ని

సేవించినవాడే వ్యాధి నశించినందువల్ల నెయ్యి, పప్పుతో కూడిన అన్నం తృప్తిగా తినడం లోక పరిపాటియే కదా!

ఓషధి మహీధర పార్శ్వే ఉదితం- సంజీవనకరణీత్యాది ఓషధులు ఉద్భవించడం ఓషధి పర్వతమందే కదా! ఆ విధంగానే, దేవనాయకుడు సర్వగుణ పరిపూర్ణుడై ఔషధాద్రి ప్రాంతమందలి దివ్యదేశమందు స్వేచ్ఛగా ఆవిర్భవించాడు. అది ఔషధాద్రి.

త్రిభువనైక మూలం- మూడు లోకాలలో వ్యాపించిన ఓషధికి మూలప్రదేశం- నీటిచేత తడుపబడే వేరు కలిగియున్న స్థలం- ఒక్కటే ఉంటుంది. ఆ రీతిగనే మూడు లోకాలకు ఏకమూలం- ముఖ్యమైన కారణం- నిమిత్తోపాదాన కారణ భూతుడు, అఖిలజగదాధారుడు దేవనాథుడు ఒక్కడే.

అమృత స్వాదురసం- అనుకూలబుద్ధి విషయమైనదే స్వాదు అనబడుతుంది. రసం ఆస్వాదం కదా! 'రస' శబ్దం నానార్థాలు కలది.

"శృంగార ముఖ్యమధురాది సువర్ణరేతో" -(నానార్థరత్నమాల). కొన్ని ఔషధాలు 'చేదు'గా ఉంటాయి. ఈ ఔషధం మాత్రం అమృతంవలె (కంటే) మధురమైనది.

"గంధేన తాసాం ప్రవరౌషధీనాం సుప్తానిశాంతే ష్వపి సంప్రబుద్ధాః"- (రామాయణం) యుద్ధంలో మరణించిన వానరవీరులు సంజీవనౌషధియొక్క వాసన చేతనే గాఢనిద్ర బోయినవారు ఉదయాన మేల్కొన్న రీతిగా జీవించారు కదా! ఇది అమృతంవలె భోగ్యమైన ఓషధి అని భావం. దేవనాయకుడు ఓషధివంటి వాడు కదా!

"అమృతం మోక్ష దేవాన్నే"- అనే నిఘంటువువల్ల అమృత శబ్దానికి దేవతల ఆహారమనే అర్థంకంటే మోక్షమనే అర్థానికే ప్రాథమ్యముంది. అమృతం స్వయంభోగ్యమైనది. అమృతం అంటే జ్ఞాన సంకోచంలేని మోక్షమే స్వాదురసం

"సర్వరసః"- "రసగ్గ్ హ్యేవాయంలబ్ధ్వా ఆనందీభవతి" - (ఉపనిషద్వాణి). ఆనంద మయుడు దేవనాయకుడని అర్థం.

త్వాం దాసరుజామోషధిమివ ఆస్వాదయంతి- "వ్యపగత ప్రాణాత్మ సంజీవనీమ్"- (శ్రీభాష్యం). ప్రాణాలు పోయినవారినే జీవింపజేసే ఔషధం కాబట్టి పాపకర్మలవల్ల కలిగే రోగాలను నశింపజేస్తుంది ఓషధి. అట్లే, ఆధి భౌతిక, ఆధ్యాత్మిక, ఆధి దైవికమనే తాపత్రయాన్ని నశింపజేసేవాడు దేవనాయకుడు. మోక్షప్రాప్తికి ప్రతిబంధకమైన పుణ్యాపాపకర్మలను నశింపజేసి జనన మరణరూపమైన (సంసార) చక్రబంధం నుంచి విముక్తిని కలిగిస్తాడు. క్రయ విక్రయార్హులైన హరిదాసులకు సంసార నివృత్తిని అవశ్యంగా కల్పిస్తాడు.

*"ఆ పీఠాన్మౌళి పర్యంతం పశ్యంతః పురుషోత్తమమ్।*
*పాతకా న్యాశునశ్యంతి కింపున స్తూపపాతకమ్॥"*

దేవనాయకుని పాదాలు మొదల్కొని కిరీటం వరకు చిత్త శుద్ధి కలిగి సేవించిన వ్యక్తుల, భక్తుల పాపతాపాలన్నీ ఆ క్షణంలోనే నశిస్తాయి. ఇక ఉపపాతకాలు మాత్రం నశించడంలో సందేహమెందుకు?

పరమైకాంత భక్తులు- హరిదాసుల రోగాలన్నీ పోగొట్టే ఓషధిని వలె దేవనాయకుని దివ్యవిగ్రహ సౌందర్యాన్ని భోగ్యంగా ఆస్వాదిస్తారు.

"అఱిన్దన రెల్లామ్ అఱియై వణంగి అఱిన్దనర్‌నోయ్‌గళ్ అఱుక్కుమ్మరున్దే"- (తి.వా.మొ. 9-3-3). జ్ఞానాధికులందఱు పాపహరుడైన శ్రీమన్నారాయణుణ్ణి ఆశ్రయించి, సంసారమనే రోగాలను పోగొట్టే ఔషధంగా భావించారు. అంతేకాదు-

"మరున్దేనంగళ్ పోగమగిళ్చ్చిక్కెన్ఱు పురున్దేవర్‌కు షాంగళ్ పిదత్తుం పిరాన్"- (తి.వా.మొ. 9-3-4) మా భోగరసాన్ని వృద్ధిజేసే ఔషధం వంటివాడా! అని నిత్యసూరుల బృందం స్తుతిస్తున్న ఉపకారకుడు అని నమ్మాళ్వార్ల శ్రీసూక్తి.

"కమలనన్మలర్ తేఱల్ అరున్ది ఇన్నిశైమురన్ఱు ఎషు మళికులమ్ పోతుళి అమ్బొ షిలూదే శెరున్ది నాణ్మలర్ శెన్దణైన్దు ఉషితరుతిరువయిన్దిర పురమే"- (పెరియతి.మొ. 3-1-1).

మధుకర వృత్తి గల పరమభాగవతులు దేవనాథుని చరణారవింద మకరంద పానమత్త చిత్తులై సంచరించారు. తర్వాత, నివృత్త సంసారులై నిత్యవిభూతిలో పరవాసు దేవుని వైభవాన్ని తృప్తిగా అనుభవింప ఆశపడినారు అని ఈ పాశురానికి పెద్దలు స్వాపదేశార్థాన్ని కృపజేశారు.

భగవానుడు సర్వాశ్రయణీయుడుగా సులభుడైననూ, మహా విశ్వాసంగల సాధుజనులకు మాత్రం అత్యంత సమాశ్రయణీయుడనీ, భక్తిజనుల మహావ్యాధులను కర్మక్షయమూలంగా నశింపజేసే భగవానుడొక్కడే దివ్యౌషధమని లోకమందలి ప్రసిద్ధమైన ఔషధాలు అధః కరింపబడినాయి. ఉపమాలంకారం.

45. సిద్ధం జణం వసామం
తుజ్ఝ తణుం ణిఅ విలోఅణే సు ఖివంతా।
అచ్చు అ లచ్ఛిణివాసం
ణిచ్చ ణిఊఢం ణిహింవ పేచ్ఛంతి తుమమ్॥

ఛా. సిద్ధాంజనమివ శ్యామం (మాం)
తవ తనుం నిజవిలోచనేసు క్షిపంతః।
అచ్యుత! లక్ష్మీ నివాసం
నిత్య నిగూఢం నిధిమివ పశ్యంతి త్వామ్॥

**అర్థం:** హే అచ్యుత!= ఓ అచ్యుతా!; తవ= నీ యొక్క; శ్యామాం= నల్లని; తనుం= విగ్రహాన్ని; నిజవిలోచనేషు= తమ కన్నులయందు; సిద్ధ+అంజనం, ఇవ= సిద్ధాంజనంవలె; క్షిపంతః= పూసుకొన్నవారై; లక్ష్మీనివాసం= లక్ష్మికి నివాసమైన/

సర్వసంపదలకు స్థానమైనట్టి; త్వాం= నిన్ను; నిత్యనిగూఢం= ఎల్లప్పుడు రహస్యంగా-దాగి ఉన్నట్టి; నిధిం; ఇవ= నిధినివలె; పశ్యంతి= (భక్తులు) చూస్తుంటారు.

**తా॥** ఓ అచ్యుతా! నీ నల్లని దివ్యమంగళ విగ్రహాన్ని సిద్ధాంజనంలాగా తమ నేత్రాలయందు పెట్టుకొన్న భక్తులు, లక్ష్మిని వక్షఃస్థలమందు స్థాపించుకొన్నట్టి సర్వసంపదలకు ఆస్పదమైనట్టి, ఎల్లప్పుడు మరుగుపడియున్న నీ స్వరూపాన్ని నిధిని చూస్తున్నట్లే చూస్తుంటారు.

**వ్యాఖ్య:-** దేవనాయకుని అర్చామూర్తిని భక్తులు నిధినివలె సేవిస్తారు.

పూర్వశ్లోకమందు భగవానుని రూపాన్ని సేవించారు. ఈ శ్లోకంలో స్వామియొక్క స్వరూపాన్ని సేవిస్తున్నారు.

'శ్యామం' అనే పదం 'సిద్ధాంజనం' అనే మాటకు విశేషణం. 'శ్యామాం' అనే పాఠమూ ఉన్నందున 'తనుం' అనే స్త్రీ లింగపదానికి విశేషణంగా అన్వయించుకోవాలి.

'సిద్ధాంజనం' అంటే రసవాదం మొదలైన తంత్రాలలో సిద్ధిని పొందిన సిద్ధయోగులు తయారు చేసిన కాటుక. ఇది నిధిని దర్శించడానికి ఉపయోగపడే అంజనం.

సిద్ధాంజన మివశ్యామాంతవ తనుం నిజవిలోచనేషుక్షిపంతః- దేవనాయకుని దివ్యమంగళ విగ్రహం సజలజలద శ్యామ వర్ణం కలది. అది సిద్ధాంజనం వలె భక్తులకు కనబడుతుంది. కాటుకవన్నెను కలిగిన మూర్తిని సేవించే కన్నులలో ఆ రూపం ప్రతిఫలిస్తుంది కదా!

"మైయార్ మణివణ్ణనై యెణ్ణి నుందమ్ మనత్తే యిరుత్తుం బడి వాళ్ వల్లీర్"- (పె.తి.మొ. 3-2-6). కాటుకచే నిండిన నీలమణి వర్ణుని అనుసంధించి మీ మనస్సునందే ఉంచుకొనే రీతిగా సుఖింప సమర్థులారా! అని తిరుమంగై

యాళ్వార్ శ్రీసూక్తి ప్రకారం, స్వామిరూపాన్ని సేవించిన పరమ భక్తుల కన్నులు సిద్ధాంజనం పూసుకొన్నట్లు సుఖకరమయింది. తత్ఫలితంగా, అర్చామూర్తిలో మరుగున ఉన్న దివ్యస్వరూపం సాక్షాత్కారమయింది.

లక్ష్మీనివాసం నిత్యనిగూఢం నిధిమివ పశ్యంతిత్వామ్- లక్ష్మీదేవిని వక్షఃస్థలమందు నివసింపజేసుకొన్న పరవాసుదేవుని స్వరూపం దర్శనమయింది. ఆయన లక్ష్మీపతి. పరతత్త్వ నిరూపకమైనది లక్ష్మీదేవి. అంతేకాదు సర్వసంపదలకు ఆస్పదమైనది.

"తం దుర్దర్శం గూఢ మనుప్రవిష్టం, గుహాహితం గహ్వరేష్టం పురాణం" అనే ఉపనిషత్ప్రకారంగా, దుర్దర్శం- చూడశక్యం కాని స్వరూపమది. గుర్తించరాని స్థానంగల నిధివంటి ఆకారం కలది.

"త ద్యథా హిరణ్యనిధిం నిహితమక్షేత్రజ్ఞా ఉపర్యుపరి సంచరంతః నవిందేయు రేవమేవే మాః సర్వాః ప్రజాః"- (ఛాం.ఉ.) తెలియకుండా నిక్షేపించి యున్న నిధి మీదనే సంచరిస్తున్న ప్రజలు ఆ నిధిని- అంతర్యామిని పొందలేరు అన్నది స్పష్టం. గత శ్లోకంలో రసనచే అమృతం ఆస్వాదింపబడింది. ఈ శ్లోకమందు కన్నులు దివ్య స్వరూపాన్ని (సర్వేంద్రియాలకు ఉపలక్షకం) సేవించడం వల్ల సర్వేంద్రియాలు సంతృప్తిని పొందడం గమనీయం.

అర్చామూర్తిని సేవించడంవల్ల వైకుంఠమందలి పరవాసుదేవుని దివ్య స్వరూపాన్ని దర్శించి బ్రహ్మానందాన్ని అనుభవించినట్లుంటుందని పిండితార్థం.

*46.* విహడిఅ ణిబిడంధారో
ఘడంతజోఈ తిలోఅ ఏక్కగహవ ఈ।
దిట్ఠి గ ఓ జాణతుమం
ణమంత సచ్చణహు తాణమోహా తిఅమా॥

ఛా. విఘటిత నిబిడాంధకారో
ఘట మానజ్యోతిస్త్రి లోకైక గ్రహ (గృహ) పతిః
దృష్టిగతో యేషాంత్వం
నమత్సత్య! నఖలు తేషాం మోహత్రియామా॥

**అర్థం:** నమత్ సత్య!= నమస్కరించేవారికి సత్యమైనవాడా!; విఘటిత నిబిడ+అంధకారః= పోగొట్టబడిన దట్టని అజ్ఞానమనే అంధకారం కలిగినట్టి; ఘట మానజ్యోతిః= అంతట ప్రసరిస్తున్న తేజస్సు కలిగినట్టి; త్రిలోక+ఏక గ్రహపతిః= మూడులోకాలకు ఒక్క భాస్కరుడు; గృహపతిః= మూడులోకాలు అనే ఒక్క గృహానికి పెద్దవైనట్టి; త్వం నీవు; యేషాం= ఎవరియొక్క దృష్టిగతః= కన్నులకు విషయమైనావో; తేషాం= వారికి; మోహత్రియామా= వ్యామోహమనేరాత్రి; న, ఖలు= ఉండదు కదా!

**తా॥** ప్రపన్నులకు సత్యభూతుడా! ఓ దేవనాయకా! త్రిలోకాలకు ఒక్కడే భాస్కరుడు. అంధకారాన్ని తొలగిస్తూ ప్రకాశించే సూర్యునిలాగా నీవు మూడులోకాలనే గృహానికి పెద్దదిక్కుగా ఉండడం వల్ల నీ దివ్యమంగళ విగ్రహం యొక్క తేజస్సు అంతటా ప్రసరించి అజ్ఞానాన్ని తొలగిస్తున్నది. లోకత్రయం యొక్క లోపలా, బయటా వ్యాపించి అజ్ఞానాంధకారాన్ని పోగొట్టే నీవు ఎవరి లోచనాలకు గోచరిస్తావో, వారికి దేహాత్మ భ్రాంతి అనే రాత్రి ఉండనే ఉండదు కదా! ప్రసిద్ధ సూర్యునికంటే నీవు విలక్షణుడవు. నీ సందర్శనంవల్ల నాస్తికత్వమే నశిస్తుంది.

**వ్యాఖ్య:-** యాదృచ్ఛికంగా దేవనాయకుని సేవించిన వారికి వ్యామోహం తొలగి సమ్యక్ జ్ఞానం కలుగుతుందని వర్ణితం.

స్వర్గమర్త్యపాతాళమనే లోకత్రయానికి సూర్యుడొక్కడే. సూర్యుడు, చంద్రుడు, అగ్ని తేజోరూపాలు. భగవానుని అనుగ్రహంచేత ప్రకాశిస్తుంటాయి. "భీషోదేతిసూర్యః, భీషా స్మాదగ్నిశ్చేంద్రశ్చ" అని శ్రుతి పల్కినట్లు భగవానుని

ఆజ్ఞను మీరకుండా భయపడుతూ సూర్యచంద్రాగ్నులు తమ వ్యాపారాలను కొనసాగిస్తున్నారు.

సూర్యుడు రాత్రి ప్రకాశించనందువల్ల కటికచీకటి వ్యాపిస్తుంది. సూర్యోదయం కాగానే అంధకారం నశించి లోకం చైతన్యవంతమవుతుంది. "విభావసుర్గ్రహపతిః" -(అమరం). మూడు లోకాల గృహపతియైన భగవానుడు జ్యోతిర్మయుడు. తప్తమైన అయఃపిండం-బాగా కాలిన ఇనుప గుండువలె, త్రిలోకాలకు వెలుపల, లోపల అంతటా ప్రకాశించే పరంజ్యోతి దేవనాథుడు.

తెలిసిగానీ, తెల్యకగానీ దేవనాథుని దివ్యమంగళ విగ్రహాన్ని సేవించినట్లయితే, సకల పాపాలు నశించడమే కాక, ఆత్మకాని దేహమందు ఆత్మ అనే భ్రాంతి తొలగిపోతుంది. ఈ శ్లోకమందు "దృష్టిగతః" అనే పదం ప్రాణం వంటిది. ఇష్టం లేకున్నా, ఏదో విధంగా దేవదేవుని మూర్తియొక్క దివ్యతేజస్సు కన్నులకు సోకితే చాలు ఆ భాగ్యవంతులకు అజ్ఞానాంధకారం చెదరిపోయి, శుభాశ్రయ చింతన ఏర్పడుతుంది. అంటే, అకస్మాత్తుగా దివ్యమంగళ విగ్రహాన్ని సేవించినంతనే మనస్సులో సాక్షాత్కారం సిద్ధిస్తుంది.

"భిద్యతే హృదయ గ్రంథిః ఛిద్యంతే సర్వసంశయాః।
క్షీయంతే చాస్యకర్మాణి తస్మిన్ దృష్టే పరావరే॥"- (ముం. 4-10)

పరే అవరే యస్మాత్ సః= పరావరః అని వ్యుత్పత్త్యర్థం. అధికులు అనే బ్రహ్మాది దేవతలు ఎవరికన్న అవరులో- తక్కువవారో అట్టి పరమాత్మ పరావరుడు అనబడును. అట్టి పరావరుడైన పరమాత్మయొక్క దర్శనం పరమపదం వంటి దివ్యదేశమందే పొందగలం. ఆ దేవనాథుని దివ్యమంగళ విగ్రహం ఎవరి కన్నులకు గోచరిస్తుందో, అట్టి పరమ భాగవతుల యెదలో దృఢంగా నాటుకొనియున్న రాగద్వేషాదులు నశిస్తాయి. సకల సంశయాలు భ్రాంతులు తొలగిపోతాయి. అనుభవిస్తేగాని నశించనట్టి పుణ్యపాప రూపకర్మలన్నీ నశిస్తాయి.

అంటే సుఖదుఃఖాది ఫలాలను కలిగించే శక్తిని ఆ కర్మలు కోల్పోతాయి అని ఉనిషన్మంత్రార్థం.

"యశ్చరామం నపశ్యేత్తు యం చ రామోన పశ్యతి।
నిందితః స వసేల్లోకే, స్వాత్మాప్యేనం విగర్హతే॥" -(రా.అర. 17-14).

ఎవడైననూ, రాముణ్ణి చూడవలెను. లేదా రాముడైనా ఇతణ్ణి చూసే సందర్భమేర్పడవలెను. రెండింటిలో ఏదో ఒకటి కలుగని భాగ్యహీనుడు లోకమందు నిందింపబడుతుంటాడు. అతని మనస్సే అతణ్ణి నిందిస్తునే ఉంటుంది అని వాల్మీకి నిర్ణయం.

"సందర్శనా దకస్మాచ్ఛ పుంసాం సమ్మూఢ చేతసామ్।
కువాసనా కుబుద్ధిశ్చ కుతర్క నిచయస్తథా।
కు హేతుశ్చ కుభావశ్చ నాస్తికత్వం లయం వ్రజేత్॥"

మూఢులకు అనుకోకుండా తలవని తలంపుగా, భగవద్దర్శనమే లభిస్తే, వారి హృదయంలో ప్రబలంగా ఏర్పడియున్న చెడ్డ ఈహలు, ఊహలు నశిస్తాయి. వారిమనస్సులో భక్తి ప్రపత్తులు స్థిరంగా నిల్చి ఉంటాయి, అంటే, ఇక దివ్య దేశయాత్రజేసి, భగవదర్చామూర్తులను సర్వేంద్రియ సంతృప్తిగా సేవించి తదర్చా రసానందాన్ని అనుభవించే పరమభక్తులను గూర్చి చెప్పేదేమి?

అకస్మాత్తుగా భగవానుని అర్చామూర్తిని సేవించిననూ, భగవదనుగ్రహం నిరంతరం పొందుతుంటాడు. ప్రసిద్ధ సూర్యునికంటెను విలక్షణుడు పరంధాముడు. వ్యతిరేకాలంకారం.

47. విస అరసమ్మి సువంతా
విఆరజణణేహి అవిణహు విఈరంతా।
జీవంత ముక్కసరిసా
అచ్చు అ దీసంతి పావణా తుహ భత్తా॥

ఛా. విషయరసే స్వపంతో
వికార జననైరపి నఖలు విక్రియ మాణాః।
జీవన్ముక్త సదృశా
అచ్యుత! దృశ్యంతే పావనాస్తవ భక్తాః॥

**అర్థం:** హే అచ్యుత!= ఓ అచ్యుతా!; విషయరసే= ఐహిక భోగమందు; స్వపంతః= నిద్రిస్తున్నట్టి- విరక్తులైనట్టి; వికార జననైః, అపి= మనోవికారాన్ని కలిగించే వస్తువుల చేత కూడా; న, ఖలు, విక్రియ మ్యాణాః= చలించనట్టి ధైర్యం కలవారు; అత ఏవ= కనుకనే; జీవన్ముక్త సదృశాః= బ్రతికి యుండి కూడా ముక్త పురుషులతో సమానులైనట్టి; తవ= నీ యొక్క; భక్తాః= భక్తులు; పావనాః= పరిశుద్ధులను చేస్తున్న వారుగా; దృశ్యంతే= కనబడుతున్నారు.

**తా॥** అచ్యుతా! నీ భక్తులు విషయాలను ఆస్వాదించడమందు రక్తిలేనివారు. చిత్తవికారాన్ని కలిగించే స్రక్చందనాది పదార్థాలున్నప్పటికీ వికారం చెందని ధీరులు. జీవించి యున్ననూ ముక్తాత్మలతో సమాన స్థితిని పొందియున్నవారు. కావుననే అపవిత్రులను కూడా పవిత్రులను చేస్తున్న వారుగా చూడబడుతున్నారు.

**వ్యాఖ్య:-** పరమభక్తులకు జీవన్ముక్త సాదృశ్యం సుశ్లోకితం.

గత మూడు శ్లోకాలలో ఓషధిని, అంజనాన్ని, సూర్యుణ్ణి పోలియున్నట్లు దేవనాయకుణ్ణి సేవించిన భక్తులు జీవన్ముక్త సదృశులై లోకమంతటిని పావనం చేస్తున్నారని భాగవతుల వైభవం ప్రశంసింపబడుతున్నది.

విషయరసే స్వపంతః- భగవంతునియందు భక్తిని కలవారు ధర్మార్థ కామాలనే త్రైవర్గిక పురుషార్థాలను- ప్రాకృతిక భోగాలను అనుభవించడమందు అనురక్తులు కారు.

"పరమాత్మనియోరక్తః విరక్తోఽ పరమాత్మని" అన్నట్లు విషయసుఖం - 1.అల్పత్వం, 2. అస్థిరత్వం, 3. దుఃఖమూలత్వం, 4. దుఃఖ మిశ్రత్వం, 5.దుఃఖో

దర్శకత్వం, 6. స్వాభావిక ఆనంద విరుద్ధత్వం, 7. విపరీత అభిమాన మూలత్వం అనే సప్త దోషాలను కలది. కాబట్టి భగవానుని పట్ల ప్రీతిగల వ్యక్తులు లౌకిక విషయ భోగాలయందు విరక్తులుగా ఉంటారు. అల్పసుఖాలనాశించరు.

వికారజన నైరపి నఖలు విక్రియమాణాః- మనోవికారాన్ని కలిగించే పదార్థాలు తమ చుట్టు ముట్టూ ఉన్నప్పటికీ వాటిని స్మరించడం కానీ, దర్శించడం కానీ చేయని వైరాగ్యపరులు భగవద్భక్తులు.

"కోకిలో హృదయగ్రాహీ మాధవో రుచిరద్రుమే।
అహం కందర్ప సహితః స్థాస్యామి తవపార్శ్వతః॥"

అన్నట్లు కోకిల, వసంతుడు, మన్మథుడు, అప్సరసలెందరో గుమిగూడి వివిధ విచిత్ర చేష్టలతోనూ, ఆటపాటలతోనూ ప్రలోభపెట్టి, వైరాగ్యాన్ని దూరంగా తరిమి, విషయపరవశులను చేయడానికి ప్రతిజ్ఞచేసి వచ్చినప్పటికీ, వారి పప్పులను ఉడుకనీయని ధీరచిత్తులు భాగవతోత్తములు.

"వికారహేతౌ సతి విక్రియంతే యేషాం నచేతాంసి త ఏవ ధీరాః"- (కు.సం. 1-59). మనస్సును దోచుకొనే స్త్రీలు మొదలైన పదార్థ సముదాయం తమకు దగ్గరగా ఉన్ననూ, ఎవరి ప్రకృతి వికృతిని పొందదో వారే ధీరులు అన్నాడు కాళిదాస మహాకవి.

జీవన్ముక్త సదృశాః- జీవంతశ్చతే ముక్త సదృశాశ్చ= జీవన్ముక్త సదృశాః అని విగ్రహ వాక్యం. జీవించియుండగానే ముక్త జీవులతో సమానులుగా నున్నవారు. జీవన్ముక్తి వాదం వేదాంత శాస్త్రమందు పెద్ద చర్చనీయాంశం. పరబ్రహ్మ సర్వాంతర్యామియై వ్యాపించి యున్ననూ, బ్రహ్మజ్ఞాని దేహాన్ని విడిచి, వైకుంఠానికి పోయి అక్కడ ఆ ప్రాకృత దివ్యమూర్తిని దర్శించి, అతనితో సమానంగా అపహతపాప్మత్వాది గుణ విశిష్టుడై బ్రహ్మానందంతో విరాజిల్లువాడు ముక్తుడు. ముక్తికి చరమ దేహత్యాగ కాలం కోరబడునట్లే, దేశ విశేషాన్ని కోరడమూ ఆవశ్యకం. ముక్తి ఈ తమోమయమైన ప్రకృతి మండలమందు అసంభవమని

"తమసః పరస్తాత్" అనే శ్రుతి బోధిస్తున్నది. "*అత్ర బ్రహ్మ సమశ్నుతే*" (కఠోప. 2-6-14) జీవించియున్నవారు ముక్తపురుషులవలె భగవదనుభవైక పరులు అనే అర్థాన్ని తెలుపుతుంది. ఈ ప్రకృతిమండలమందే పరబ్రహ్మను పొందుతాడు, ముక్తుడవుతాడన్న అర్థాన్ని బోధిస్తే జీవన్ముక్తి వాదం ఆభాసరూపమవుతుంది.. అది ప్రత్యక్ష విరుద్ధం. విశిష్టాద్వైత సంప్రదాయమందు 'జీవన్ముక్తి' అనేది అపసిద్ధాన్తమే.

వైకుంఠంలో ముక్తపురుషులు భగవత్కైంకర్య పరులై బ్రహ్మానందాన్ని పొందుతున్నట్లే, ఈ ప్రకృతిమండల మందలి దివ్యదేశాలలో వెలసిన అర్చామూర్తులను సేవిస్తూ బ్రహ్మానందాన్ని పొందుతుంటే పరమభక్తులు జీవన్ముక్తం సదృశులని చెప్పబడింది.

"*పొలిగ పొలిగ పొలిగ*"- *కణోమ్ కణోమ్ కణోమ్*"- (తి.వా.మొ. 5-2-1, 2). భూలోకమందు భగవద్గుణాలను పాడుతూ అంతటా సంచరిస్తున్న శ్రీ వైష్ణవులను జూచి, కలియుగం కృతయుగంగా కనువిందు గొల్పుతున్నదంటూ భాగవత సమృద్ధికి మంగళా శాసనం చేశారు శ్రీ శఠకోప దివ్యసూరులు.

"*వయం త్రిదశ నిర్వృతింభువి ముకుంద విందేమహి*"- (అభీతిస్తవం) ఓ ముకుందా! పరమపదమందలి ఆనందాన్ని మేము భూలోకమందే పొందుతామన్నారు దేశికులు.

"*సంసార ఏష భగవన్నప వర్గ ఏవ*"- (వరదరాజ పంచాశత్) భగవత్సన్నిధిలో నివసిస్తూ హరిదాస్య రసికులతో నిరంతర సాంగత్యం కలిగి ప్రవర్తించే నరుడు ఈ సంసారమండలమందు ఉన్నప్పటికీ మోక్షానందాన్ని పొందుతుంటాడు అని స్తుతించారు దేశికులు.

"*మాతర్దయే! మయికురుష్వ తథా ప్రసాదమ్।*
*బద్ధాదరో వృషగిర ప్రణయీ యథాఽసౌ*
*ముక్తానుభూతి మిహదాస్యతియే ముకుందః॥*" (ద.శ.100)

ఓ దయాదేవీ! బద్ధాత్మలయందు ఆదరం కలిగియున్న శ్రీనివాసుడు వైకుంఠమందు ముక్తాత్మలకు కలిగించే బ్రహ్మానందానుభవాన్ని నేను ఈ లోకమందే అనుభవించునట్లు అనుగ్రహింప జేయుమమ్మా! అని ప్రార్థించారు దేశికులు.

దృశ్యంతే పావనాస్తవ భక్తాః- దేవనాయకుని దివ్యమంగళ విగ్రహాన్ని సేవిస్తూ బ్రహ్మానందాన్ని అనుభవిస్తూ, ముక్తాత్మలతో సమానమైన దశను పొందియున్నట్లు మన కన్నులముందే సంచరిస్తున్న ఈ పరమ భక్తాగ్రేసరులు దోష భూయిష్ఠులైన జనులను పావనం చేస్తున్నారు. తాము బహిరంతస్సులలోను శుచిర్భాతు లైనందువల్ల అపవిత్రులను పవిత్రులుగా పరిశుద్ధాత్ములుగా మలచుతున్నవారై లోకుల దృష్టిలో గౌరవింపబడుతున్నారు. భగవానుని పట్ల భక్తి, మాటల కందనంత మహిమ కలది కదా!

48. *గంధవ్వ ణఅర సిమిణఅ*
*సారిచ్ఛాణం సిరీణ వణ సరిఆణమ్।*
*ణ సుమర ఇ తుమ్హ గహిఓ*
*సరణాగ అ సచ్చ స ఇ మ ఓ జీఅగ ఓ॥*

ఛా. *గంధర్వ నగర స్వప్న*
*సదృక్షాణాం శ్రియాం వన సరితామ్।*
*నస్మరతి త్వ ద్గృహీతః*
*శరణాగత సత్య సదామదో జీవగజః॥*

**అర్థం:** హే శరణాగత సత్య!= శరణుపొందిన వారికి సత్యమైనవాడా!; సదా మదః= నిత్యసంతోషంగల, ఎల్లప్పుడు మదజలంగల; జీవగజః= జీవాత్మ అనే ఏనుగు; త్వత్ గృహీతః సన్= నీచేత గ్రహింపబడిన వాడై; గంధర్వ నగర, స్వప్న, సదృక్షాణాం= మేఘచిత్రాలకు, కలలో కనబడిన పదార్థాలకు, సమానమైన; శ్రియాం= సంపదలు అనే; వనసరితాం= కొండవాగులను; న, స్మరతి= స్మరించదు.

**తా॥** ఓ శరణాగత సత్య! దేవనాయకా! స్వేచ్ఛగా సంచరిస్తూ తాత్కాలిక భోగాలకు ఆశపడి, మదజలం స్రవించే గజం అడవుల్లోని కొండవాగుల్లో నాచుతో నిండిన నీళ్లల్లో జలకాలాడుతూ, మళ్ళీ తొండంతో దుమ్మును తన దేహంమీద పోసుకొంటుంది. అట్టి గజాన్ని మావటీడు పట్టుకొని రాజభవన ద్వారమందు కట్టివేసి, సకల భోగాలను అనుభవింపజేస్తుంటే ఆ గజం అల్పసుఖానికి ఆశపడేటట్లు ఆకర్షించిన కొండవాగులను మరచిపోకుండా ఉంటుందా? మనస్సులోనైనా తలచుకోదు కదా! అట్టి మదగజం వంటివాడే బద్ధజీవుడు. ప్రాకృత భోగాలను అనుభవిస్తూ, అహంకార మమకారాలు కలిగి, అతి గర్వంతో సంచరిస్తూ, సంతోషిస్తుంటాడు. అట్టి జీవునిమీద నిర్హేతుకమైన భగవత్కృప ప్రసరించగా విశేష జ్ఞానం కలిగి ఐహిక సంపదలు, గంధర్వ నగరం అంటే మేఘం యొక్క విచిత్రమైన ఆకారాలు, స్వప్నంలో దర్శించిన వస్తువులు క్షణకాలంలో మెలకువ రాగానే నశించి పోయే వాటితో సమానమైనవని భావిస్తాడు జీవుడు. లౌకిక విషయాలపైన విరక్తి కలిగి భగవద్భక్తుడై విషయాలను సవాసనగా మరచిపోతాడు.

**వ్యాఖ్య:-** విషయ వైరాగ్యాన్ని సహేతుకంగా వివరించే శ్లోకం.

భగవద్భక్తులు నివృత్త సంసారులవుతారని విషయ రసానుభవమందు వారికి అపేక్ష ఉండదా? అనే శంకను పరిహరిస్తున్నదీ శ్లోకం.

సంసార బద్ధజీవుడు (జీవ వర్గానికి జాత్యేకవచనం) తాను స్వతంత్రుడనే భావిస్తాడు. పరతంత్రుడ ననుకోజాలడు. 'త్వంమే'- 'నీవు నావాడవే' అని పరమాత్ముడు అడిగితే, 'అహంమే'- నీ వాడను కాను. నాకు నేనే అని జీవుడు వాదన ఆరంభిస్తాడు. జీవాత్మకు శేషత్వమే స్వరూపం అన్న జ్ఞానం లేక, స్వేచ్ఛగా లౌకిక భోగాలను అనుభవిస్తూ జీవిస్తాడు.

భగవానుని కృపవలన, సదాచార్యుల ఉపదేశంచేత జీవుని స్వరూపమూ, భగవత్స్వరూపమెట్టిదో ఆ జీవునికి తెలుస్తుంది. పారతంత్ర్య జ్ఞానం పొటమరిస్తుంది.

శరణాగతుడవుతాడు. ఇట్టి శరణాగతులైన జీవులకు సత్యమైనవాడు అంటే భగవానుడు తనను అనుభవించే జ్ఞానాన్ని కలుగజేస్తాడు; శరణాగత సత్యభూతుడని అర్థం.

"యమే వైష వృణుతే తేన లభ్యః"- ఇదంతా భగవానుని కృపవలననే కలుగుతుందని ఉపనిషత్తు బోధిస్తుంది. భక్తునికి క్షుద్రమైన విషయాలపై, ప్రాపంచిక భోగాలమీద విరక్తి జనిస్తుంది. భగవానునిచే గ్రహింపబడిన జీవుడు అని త్వత్గృహీతః- అనే పదం తెల్పుతుంది. ఇట్లు విషయ వైరాగ్యం కలిగిన భక్తులు భగవానుని కంటె ఇతరమైన వస్తువులను మనస్సులోనికి చొరనీయరు.

"యత్రనాన్యః పశ్యతి, నాన్యత్ శృణోతి, నాన్యత్ విజానాతి"- భగవత్పరిగృహీత జీవుడు పరమాత్మకు సంబంధించిన విషయాన్ని-పారమార్థికాన్ని తప్ప మరొక్క వేరే విషయాన్ని కన్నులతో చూడదు. చెవులతో వినదు. ముఖ్యంగా లౌకిక వస్తు సముదాయాన్ని తెలుసుకోవాలనే వాంఛ కూడా అతని చిత్తమందు అంకురించదు అని ఉపనిషత్తు స్పష్టపరచింది.

సదామదః- వైరాగ్య పురుషుడు నిత్య సంతుష్టుడు అనబడుతాడు. ప్రసిద్ధ గజంకంటే విలక్షణుడైనందున "జీవగజః" అనబడుతున్నాడు. 'మద' శబ్దానికి హర్షం, గజదాన జలమని నానార్థాలున్నాయి "గర్వహర్షరేతో మృగమదాః మదాః"- (రత్నమాల) మావటీడు పట్టుకొని పోషించే ప్రసిద్ధగజానికి ఎప్పుడో ఒకప్పుడు మదమెక్కుతుంది (ఏనుగు చెక్కిళ్ళనుంచి మదజలం స్రవిస్తుంది).

"క్షిప్రం పురో న జగృహే ముహు రిక్షుకాండం
నా పేక్షతేవ నికటోపగతాం కరేణుమ్।
సస్మార వారణ పతిః పరిమీలితాక్షం
ఇచ్ఛావిహార వనవాస మహోత్సవానామ్॥"

మదించిన ఏనుగు, తన ముందు చెరుకు గడలను వేసిననూ తినదు. ఆడ ఏనుగు దగ్గఱికి వచ్చినా దాన్ని కోరదు. కేవలం కన్నులు మూసుకొని స్వేచ్ఛగా

అడవుల్లో సంచరిస్తూ, దరులు దొరలునట్లు ప్రవహించే నదులలో పొరలే వేడుకను తలచుకొంటుంది. సహజమైన వన్యవృత్తాంతాన్ని స్మరిస్తుంది కదా!

ఈ జీవుడు అనే గజం అట్టి ప్రసిద్ధమైన గజం వంటిది కాదు. ఈ జీవ గజానికి క్షుద్ర వస్తువులందు రక్తి నశించింది. సంపదలు తాత్కాలికమైనవే కాని శాశ్వతంగా ఉండేవి కావు. శ్రీశబ్దానికి అనేకార్థాలున్నాయి.

శోభాసంపత్తి పద్మాసు లక్ష్మ్యాం శ్రీరితికథ్యతే"- (అమరం).

గంధర్వ నగర స్వప్న సదృశమైనవి సంపదలు- 'గంధర్వనగరం' అంటే మేఘచిత్రం. ఒక పులిగా, గజంగా, గుఱ్ఱంగా, యువతిగానో ఆపాతరమణీయమైన విచిత్రాకృతిని పొందియున్నట్లు కనబడే మేఘానికి పేరు. క్షణకాలంలోనే ఆ మేఘచిత్రం మరొక ఆకృతిగా మారుతుంటుంది. వప్ర క్రీడాపరిణత గజం లాగా ప్రేక్షణీయం మేఘం అని మహాకవి కాళిదాసు మాట. రమణీయమైనది కాబట్టి భోగోపకరణంగా ఉంటుందని భావిస్తే, ఆ గంధర్వ నగరం స్వప్నంలో అనుభవించిన వస్తుజాతం వంటిదే అని తెలుస్తుంది. పర్యవసానమేమిటి? అంటే చిత్తరంజకంగా ఉండే మేఘచిత్రంగానీ, స్వప్నమందు అనుభవించిన పదార్థ సమూహంగానీ నశించిపోతుంది. సంపదలు కూడా తాత్కాలికమైనవే, ఎల్లప్పుడు ఉండవని అర్థం.

సంపదలనే వనసరిత్తులు- రూపక సమాసం వల్ల వానలు కురిసినప్పుడే కొండవాగులు ప్రవహిస్తుంటాయి. కాబట్టి ఆ ప్రవాహాలూ శాశ్వతంగా ఉండవని విశదమవుతున్నది. ఈ జీవగజం అల్పసుఖాన్ని కలిగించే లౌకిక విషయాలను 'నస్మరతి' స్మరించదు. శాశ్వతమైన ఆనందాన్ని ప్రసాదించే నివృత్తి మార్గాన్ని అవలంబించి, భగవద్ధ్యానమందు మగ్నమై యుంటుంది.

ఆచార్యాది పదం ఈ శ్లోకమందు లేదు కదా! అని భావించరాదు. 'అనుక్తమన్యతోఽగ్రాహ్యం' అన్నట్లు "నిక్షిప్తోస్మి" అనే (99) శ్లోకమందలి భావం ఇక్కడ స్మారితం.

రూపక, శ్లేషాలంకారాలచే అనుప్రాణితమైన వ్యతిరేకాలంకార సజ్జిత మీ శ్లోకం.

49. ణ మహేంతి ణా ణవంతా
తరంగడిండీర బుబ్బుఅ సరిచ్ఛాఇమ్।
విహి పముహాణ ప ఆ ఇం
ఘణ కందళి కంద క అళిఖంభ సమాఇమ్।

ఛా. న మహయంతి జ్ఞానవంతః
తరంగ డిండీర బుద్బుద సదృక్షాణి।
విధి ప్రముఖానాం పదాని
ఘనకందలీ కంద కదలీస్తంభ సమాని॥

**అర్థం:** జ్ఞానవంతః= జ్ఞానం కలవారు; తరంగ, డిండీర, బుద్బుద సదృక్షాణి= అలలవలె, నురుగులవలె, బుడగలవలె సమానమైయుండునట్టి; ఘన-సమాని/ ఘన= మబ్బులవలె; కందలీ, కంద= మొలకకు- అంకురానికి వేరుదుంపవలె; కదలీస్తంభ= అరటి స్తంభాలవలె; సమాని= పోలియున్నట్టి; విధి ప్రముఖానాం= చతుర్ముఖ బ్రహ్మాదుల యొక్క; పదాని= అధికార స్థానాలను న, మహయంతి= గౌరవించరు.

**తా॥** భగవద్విషయజ్ఞానులు బ్రహ్మారుద్రేంద్రాది పదవులను నీటి కెరటాలు. నురుగులు, బుడగలు అనే వీటితో సమానమైనవని మబ్బులవలెను, కుక్క గొడుగులవలెను, అరటి బోదెలవలె సారంలేనివని ఆదరించరు. బ్రహ్మాది పదవులు నశ్వరమైనవని భావం.

**వ్యాఖ్య:-** భగవద్భక్తి రూపజ్ఞానం కలవారు శతధృతి శివ శతమఖుల పదవులను బహుమానించరని సుశ్లోకితం.

ఆర్తులు, జిజ్ఞాసువులు, అర్థార్థులు, జ్ఞానులు అనే నాలుగు విధాలుగా నున్న భక్తులలో 'జ్ఞానీత్వాత్మైవ మే మతం' జ్ఞానులు తనకు అత్యంత ప్రియులు అని కృష్ణభగవానుడు చెప్పినాడు. పూర్వ శ్లోకమందు పరమభక్తులు విషయరసమందు విరక్తులని చెప్పబడినారు. ప్రసంగాన్నిబట్టి, అట్టి భక్తులకు ఘటకులైన, తత్త్వజ్ఞానాన్ని ఉపదేశించి తరింపజేసే ఆచార్యాది భాగవతోత్తముల మహిమ ఈ శ్లోకమందు అగ్గలంగా ఉగ్గడింపబడుతున్నది.

పరమ భక్తులు స్రక్ చందనాంగనాదులు అనబడే ఐహిక భోగాలయందు ఆశలేని వారైననూ, బ్రహ్మ, రుద్ర, ఇంద్రాది దేవతలయొక్క గొప్ప అధికార పదవుల పట్ల ఆశకలవారై యుందురని భావించవచ్చు కదా! అంటే, జ్ఞానవైరాగ్య భూషణులు బ్రహ్మాది పదవులను కూడా తృణప్రాయంగా భావిస్తారు. మోక్షఫలానుభవం కంటే వేరైన ఆముష్మిక పదార్థాలయందు పరమైకాంతులకు ఆస్థ ఉండదు. ఎందుకంటే, బ్రహ్మాదుల పదవులు అధికారాలు గొప్పవే. అయినా, వాయువు యొక్క ప్రేరణచేత ఉవ్వెత్తుగా లేచి క్షణకాలంలోనే మళ్ళీ నీటిలో పడిపోయే అలలవలె నశ్వరమైనవే కదా ఆ చతుర్ముఖాదుల స్థానాలు.

అధికార పదవులందు ఉన్నప్పుడు కూడా కెరటాలవలె చంచలమైన మనస్సు కలవారే కదా! వేదాలు అపహరింపబడినప్పుడు చతురాననుడు ఎదబాదుకొంటూ ఏడ్వలేదా? భస్మాసురుడు వెంటబడగా పశుపతి దశ దిశల పరుగెత్తలేదా? మహా బలి స్వర్గాన్ని ఆక్రమించినప్పుడు సురపతి గిరిగుహలలో తలదాచుకో లేదా? స్థిర చిత్తులుగా లేరు కదా! అధికార పదవికూడా వారికి స్థిరమైనది కాదు. ఎప్పుడో ఒకప్పుడు పదవినుంచి దిగిపోవలసిందే కదా! అధికారానికీ అవసానదశ ఉంటుంది. శాశ్వతం కాదు. ఇక తరంగాలకంటే క్షణికమైనవి నీటి నురుగులు. డిండీరాలు.

"డిండీరోఽబ్ధి కఫః ఫేనః"- (అమరం). డిండీరాలకన్న క్షణభంగురమైనవి బుద్బుదాలు- నీటి బుడగలు. అధికార పదవులు అతి చంచలమైనవని అర్థం. ఇక ఆ పదవులు రమణీయంగా, సారవంతంగా ఉండేవి కూడా కావు.

ఘన, కందళీకంద, కదళీస్తంభ సమాని- మేఘం రమణీయంగా కనబడిననూ, చంచలమైనదే కదా! ఒకప్పుడు అంతఃసారంలేనిదిగా గోచరిస్తుంది.

"ధూమ జ్యోతిః సలిల మరుతాం సన్నిపాతః- క్వమేఘః"- అన్నాడు కవికుల గురువు కాళిదాసు. తప్పక వర్షాన్నిస్తుందని చెప్పలేము. పొగ, తేజస్సు, జలకణాలు, వాయురేణువులు, వీటన్నిటియొక్క సముదాయ రూపమే మేఘం. దృఢంగా, స్థిరంగా ఉండదు. మేఘం కంటెను పెలుచనైనది, అల్పరసం కలది కందళీకందం. 'కందళీ' శబ్దానికి అంకురపరంగా 'అనర్ఘరాఘవం'లో అర్థం ప్రసిద్ధి.

"రామస్తే షా మచరమ భువ స్తాటకా కాళరాత్రి ప్రత్యూషోఽ యం సుచరిత కథా కందళీ మూలకందః"- (3 అంకం. 21 శ్లో.) దశరథునికి పుట్టిన నలుగురిలో మొదటివాడు, తాటక అనే కాళరాత్రికి సూర్యోదయం వంటివాడు, పుణ్యకథ అనే అంకురానికి వేరు దుంప- బీజ భూతుడు, రాముడు అని శతానందునికి విశ్వామిత్రుడు తెల్పిన సందర్భమిది.

ఇక్కడ మాత్రం, "కందళీయెన్ను నాయ్క్కుడక్కు ప్పేయర్" అని తమిళ వ్యాఖ్యానంలో ఉన్నది. కుక్క గొడుగు అని అర్థం. 'కందళీకందం' అంటే కుక్కగొడుగుకు మూలమైన దుంప. వర్షాకాలమందు పుట్టి శరత్కాలమందు కుక్కగొడుగు నశిస్తుందని భావం. 'కంద' అనడంవల్ల 'దుంప' అత్యల్ప రసం కలదని స్థిరంగా ఉండదనే అర్థం గమనీయం.

'కందళి' అంటే 'భూకదళి'కి పేరు అని 'శబ్దార్ణవం'లో చెప్పబడిందని మేఘసందేశ వ్యాఖ్యలో మల్లినాథసూరి సూక్తి.

"*సరస కదళీస్తంభగౌరశ్చలత్వమ్॥*"- (మే.సం.2-33). అరటి బోదెకు పెళుసు, తెలుపు, నునుపు, చలన మెక్కువ కదా! ఇక కదళీస్తంభం అరటి స్తంభమని పేరే కాని ఇంటికి ఉపయోగపడే దారు, శిలా స్తంభం వంటిది కాదని తెలుస్తునే ఉంది. దృఢమైనది కాదు, పైగా అరటి బోదె అనేకమైన మొలకలను పిలకలను కలిగియుంటుంది.

గొప్ప అధికారం కలవారని బ్రహ్మాదులను ఉపాసనచేసే వారికి దుఃఖో దర్కమైన సంసార వర్ధకమే అవుతుంది కాని సాయుజ్యమనే మోక్షఫలం లభించదని సారార్థం. కాబట్టి సారాసార వివేకం కలిగిన, తత్త్వజ్ఞానులు దేవనాయకుడైన శ్రియః పతినే ఆశ్రయించి పరబ్రహ్మానందాన్ని పొందగోరుతారు.

"ఏతేవై నిరయాస్తాత స్థానస్య పరమాత్మనః॥" (భారతం).

"ఆ బ్రహ్మ భువనాల్లోకాః పునరావర్తినోర్జున॥"- (శాంతిపర్వం). నిత్య విభూతి అనబడే పరమాత్మయొక్క స్థానంకంటే వేరైన బ్రహ్మాది లోకాలన్నీ పునర్జన్మను కలిగించి, అధోగతిపాలు చేస్తాయి. నరకతుల్యమైనందున, బ్రహ్మాదులందరు ఎన్నటికైనా కాలగర్భంలో కలసిపోయే వారు కాబట్టి, బ్రహ్మాది దేవతల పదవులకు ఆశపడరు, పరతత్త్వజ్ఞానులు అచ్యుతుణ్ణి ఆశ్రయించి, "అత్ర పరత్ర చాపి" అన్నట్లు ఇక్కడ గానీ, అక్కడ గానీ ఆనంద సాగరమగ్నులవుతారు.

50. పుళ ఇఅ సపర సహావా
పురిసా ఘేత్తూణ సామిణో తుహసీళమ్।
ణాహ ణఅసచ్చ సఘిణా
ణము అంతి కహం వి సవ్వ జణ సోహద్దమ్॥

ఛా. దృష్ట స్వపర స్వభావాః
పురుషా గృహీత్వా స్వామిన స్తవ శీలమ్।
నాథ! నత సత్య! సఘృణాః
న ముంచంతి కథ మపి సర్వజన సౌహార్దమ్॥

**అర్థం:** హే నాథ!= సర్వరక్షకా!; నతసత్య= శరణాగత సత్య!; దృష్ట స్వపర స్వభావాః= చూడబడిన తనయొక్క (భగవానుని యొక్క) ఇతర జీవులయొక్క స్వభావం కలిగినట్టి; పురుషాః= ఆచార్యాది పురుషులు; స్వామినః= సర్వశేషియైన; తవ= నీ

యొక్క; శీలం= సౌశీల్యాన్ని; గృహీత్వా= గ్రహించి; సఘృణాః= దయగలవారై; సర్వజన సౌహార్దం= సకల జనులయందు స్నేహాన్ని; కథం, అపి= ఏ విధంగానూ; న, ముంచంతి= విడవరు.

**తా॥** ఓ సర్వరక్షకా! దేవనాథా! ఆచార్య పురుషులు తమవంటి జీవుల స్వభావమూ, సర్వాత్ముడవైన నీ స్వభావమూ తెలిసినవారు. నీ శీలాన్ని గ్రహించిన వారు కాబట్టి, కరుణార్ద్ర హృదయులై సకల జనుల పట్ల స్నేహం కలిగియున్నందు వల్ల వారు అపకారులైననూ తమ స్నేహాన్ని మాత్రం వదలుకోరు.

**వ్యాఖ్య:–** భగవానుని శీలాన్ని అనుకరించే పరమభక్తుల సర్వభూత సౌహార్దం సుశ్లోకితం.

ప్రళయకాలమదు తన గర్భంలో భద్రంగా నుంచుకొని, సృష్టికాలాన అనాదిగా నున్న జీవులు తమ తమ కర్మల ననుసరించి దేవ తిర్యఙ్మనుష్య స్థావరాది శరీరాలు కలిగి యుండునట్లు నామరూప విభాగాన్ని పరమాత్మ స్పష్టపరచడమే సృష్టి. ఈ భావాన్ని తెల్పేది శబ్ద ప్రమాణం.

"తద్ధేదం తర్హ్యవ్యాకృత మాసీత్ తన్నామరూపాభ్యాం వ్యాక్రియతే"– (బృ. 3-4-7) అని ఉపనిషత్తు బోధించడం వల్ల, సర్వేశ్వరుడు సర్వదా రక్షకుదని తెలుస్తున్నది.

"వైషమ్య నైర్ఘృణ్యేన సాపేక్షత్వాత్"– (బ్ర.సూ. 2-1-34) జీవుల ధర్మాధర్మాల అపేక్ష ఉండడం వల్ల, అంటే సృజింపబడిన ప్రాణుల పుణ్యాపాప రూపకర్మలే విషమ సృష్టికి కారణం. నిమిత్త మాత్రుడైన సర్వేశ్వరునికి పక్షపాతం గానీ, నిర్దయగానీ లేవు అని బాదరాయణ సూక్తి.

దృష్ట స్వ పర స్వభావాః– 'స్వశబ్దానికి తాము (జీవులు) అని అర్థం. 'పర' శబ్దానికి ముఖ్యంగా భగవానుడనీ, ఇతర జీవులనీ, శత్రువులు అనీ నానార్థాలున్నాయి.

స్వ స్వభావం- జీవులకు తమ దేహయాత్రలో మంచి-చెడు పనులు చేయడం స్వభావమే. సంస్కారపరులైన జీవులు బుద్ధిపూర్వకంగా పాపకర్మలు చేయరు. కాని జీవితంలో వారికి పాతకర్మాచరణం ప్రామాదికంగా సంభవించవచ్చు.

కర్మపరతంత్రులు జీవులు.

*"యద్బ్రహ్మ కల్పనియు తానుభవేఽప్య నాశ్యం*
*తత్కిల్బిషం సృజతి జంతురి హక్షణార్ధే॥"*

వేయి బ్రహ్మకల్పాలు అనుభవించిననూ తీరిపోనట్టి - నశింపజేయడానికి సాధ్యం కానట్టి పాపాన్ని జీవుడు ఈ లోకంలో ఒక అఱక్షణంలో చేస్తుంటాడు. ఇట్టిది జీవుల స్వభావం. భగవానునికి దూరమవుతారు.

*"నాణీయో నజ్యాయోఽస్తికశ్చిత్"*- అని ఉపనిషద్వాణి రీతిగా, భగవానుని కంటే చిన్నవారిలో మరీ చిన్నవాడూ లేడు. అతని కంటే పెద్దవాడు లేడు. కాబట్టి నిస్సమాభ్యధికుడైన భగవానుడు నిరంకుశ స్వతంత్రుడు. సర్వశక్తుడు. నిగ్రహానుగ్రహ సమర్థుడు. అయినా, సర్వజన సౌహార్దమనే గుణం కలవాడనడం విశేషం.

*"ఏవంసదా సకలజన్మసు సాపరాధం,*
*క్షామ్యస్యహో! తదభిసంధి విరామ మాత్రాత్॥"* (వై.స్త. 61).

ఎల్లప్పుడు ఇట్లు అన్ని జన్మలలో పాపకర్మల నాచరించిన ప్రాణిని కూడా భగవానుడు "ఇక నేను పాపం చేయను స్వామీ!" అని అంజలి ఘటించి ప్రార్థించి పాపకర్మను చేయడాన్ని మానుకొన్నంత మాత్రాననే మొదట అతడు చేసిన పాపాలన్నిటినీ క్షమించేశక్తిని కలవాడు. భగవత్స్వభావం ఆశ్చర్యకరమని శ్రీకూరత్తాళ్వాన్ శ్రీసూక్తి.

వేదాంత విజ్ఞాన సునిశ్చితార్థులు, సంప్రదాయ ప్రవర్తకులైనవారు (పురుషాః) ఆచార్య పురుషులు. వీరికి స్వపరస్వభావం స్పష్టంగా తెలిసి, దానికి

అనుగుణంగా తాము నడిచి, తమతోటి జీవులను నడిపించి, వీరిని శ్రియఃపతికి అర్పించే యోగ్యత ఉన్నది కాబట్టి, ఇట్టి మహానుభావులను ఘటకులంటారు. తాముగానీ, తమతోటి జీవులుగానీ అకించనులు, అగతికులు అనీ, పరమాత్మకు శేషభూతులు (దాసులు) అని జీవుల స్వభావం తెలిసినందువల్ల తమతోటి ప్రాణులకు భగవంతుణ్ణి భక్తి ప్రపత్తులతో ఆశ్రయించవలెను, శరణాగతి చేయవలెను అని ఉపదేశించి వారిని తరింపజేస్తారు.

*"భగవానుడు శ్రియఃపతి, జగత్కారణుడు, సర్వశేషి.*
*సమోఽహం సర్వ భూతేషు నమేద్వేష్యోఽస్తి న ప్రియః"*-
(భ.గీ. 9-29).

జాతి, ఆకారం, స్వభావం, జ్ఞానం మొదలైన వాటిచే గొప్పవారైనా, తక్కువ వారైనా, నేను అన్ని ప్రాణులపట్ల సమానుడనే. గొప్ప వారని గౌరవించను, తక్కువవారని తిరస్కరించను అని కృష్ణుడు స్పష్టంగా తెల్పినాడు.

*"శ్రద్ధధానామత్సరమాః భక్తాస్తేఽతీవ మే ప్రియాః"*- (12-10). శ్రద్ధావంతులై నేనే పరమార్థమని తలచి నన్ను భక్తితో సేవించే వారు మిక్కిలి ఇష్టులు అని కూడా విశేషంగా వివరించాడు.

ఇది స్వామియైన *భగవానుని శీలం:*- శరణాగత సత్య-శరణాగతుల పట్ల *"నస్మరత్యపకారాణాం శతమ ప్యాత్మవత్తయా। కథంచిదుపకారేణ కృతే నైకేన తుష్యతి॥"* భగవానుడు, సాపరాధులైన జీవుల పాపాలను స్మరించడు. పైగా అనుకూల్య బుద్ధితో ఆత్మాత్మీయ పదార్థాలతో పాటు భరన్యాసం- ఆత్మ నివేదనం చేసిన వారిని గూర్చి ఎంతో సంతోషిస్తాడు. సత్యభూతుడై అంటే, శరణాగతుల మహావిశ్వాసానికి తగినట్లు ప్రవర్తిస్తాడు. వారిని రక్షిస్తాడు.

స్వామినః శీలం గృహీత్వా- ఆచార్య పురుషులు దేవనాయకుని శీలాన్ని సత్ప్రవర్తనను గ్రహించిన యోగ్యులు. భగవంతుని అభిప్రాయాన్ని చక్కగా తెలుసుకో

జాలని సుగ్రీవుడు. "వధ్యతా మేష దండేన తీవ్రేణ సచివైస్సహ" విభీషణుణ్ని అతని వెంటనున్న వారిని కూడా దారుణంగా వధించవలసిందన్నాడు కదా!

"ఆర్తోవాయదివాదృప్తః పరేషాంశరణాగతః।
అరిః ప్రాణాన్ పరిత్యజ్య రక్షితవ్యః కృతాత్మనా॥"

అన్నట్లు, శత్రువైననూ శరణాగతుడైనందువల్ల అతనిని దక్షుడైనవాడు తన ప్రాణాలు పోయినా సరే! రక్షించి తీరవలెనన్న సౌహార్దం కలవాడు. కాబట్టి శ్రీరాముడు "ఆన యైనం హరిశ్రేష్ఠ!" చపలబుద్ధులైన వానరులకు నాయకుడైన సుగ్రీవుణితో - 'నీవే స్వయంగా విభీషణుని నా వద్దకు తీసుకొని రమ్ము!' అని ఆజ్ఞాపించాడు.

"రిపూణా మపి వత్సలః"- శత్రువులయందు కూడా వాత్సల్యం కలవాడు కదా భగవానుడు.

"యచ్ఛీలః స్వామీ తచ్ఛీలా ప్రకృతిః"- అనే న్యాయాన్ని బట్టి, స్వామి శీలాన్ని అనుకరించేవారు మహాజ్ఞానులు.

"శ్రీనిధినిధిమ పారమర్థినాం అర్థితార్థ పరిదాన దీక్షితమ్।
సర్వభూత సుహృదం దయానిధిం దేవరాజ మధిరాజ మాశ్రయే॥"
(వరదరాజస్తవం-2)

శ్రియః పతి ప్రార్థించేవారికి అపారనిధి, భక్తులు కోరిన విషయాన్ని అనుగ్రహించడమే వ్రతంగా కలవాడు, సమస్త ప్రాణులపట్ల స్నేహం కలవాడు, దయానిధియైన వరదరాజ స్వామిని ఆశ్రయిస్తున్నాను అని స్తుతించారు శ్రీకూరేశులు.

సఘృణాః నముంచంతి కథమపి సర్వజనసౌహార్దమ్- భగవానుడు అందరియందు దయను కలవాడు కదా!

"పరహితమను కంపే భావయంత్యాం భవత్యాం
స్థిరమనుపధి హార్దం శ్రీనివాసోదధాన॥" (ద.శ. 36)

'అనుకంప' అంటే దయ- జీవులు అనుభవించే కష్టాలతో సహానుభూతి కలిగియుండడమే దయ. ప్రతి కూలురైన జీవులకు కూడా స్థిరమైన శ్రేయస్సును కోరునట్టిది శ్రీనివాసుని దయ, అని దేశికులు దయాదేవిని స్తుతించారు.

సర్వేశ్వరుడు అపారమైన దయగలవాడు కాబట్టి ఆయనను ఆశ్రయించిన పరమైకాంత భక్తులు కూడా సఘృణులే- దయగలవారై యుంటారు. భగవద్గుణాలెట్లో, ఆచార్య పురుషుల గుణాలు అట్లే ఉంటాయి. సర్వజన సౌహార్దాన్ని, సకలజనుల శ్రేయస్సును కోరి ఇతర జీవులనుంచి ప్రత్యుపకారాన్ని కోరకుండా వారిపట్ల ఆనుకూల్య బుద్ధితోనే ప్రవర్తిస్తారు.

స్వపర స్వభావమెరిగినవారే-

"చరాచరాణి భూతాని సర్వాణి భగవద్వపుః।
అతస్తదానుకూల్యం మే కర్తవ్య మితిమేమతిః॥"

చిదచిద్రూపమైన జగత్తు- చరాచర పదార్థాలన్నీ "యస్య ఆత్మాశరీరం" అని శ్రుతి పల్కినట్లు, భగవానునికి శరీరం వంటివి కాబట్టి, సర్వపదార్థాలకు ఆత్మగా ఉన్నవాడు సర్వేశ్వరుదని తెలిసిన మహానుభావులైనందున సాటివారి పట్లను దయగలిగి ఉంటారు. వీరినే ప్రసన్నాచార్యులని అంటారు.

"దాసభూతాః స్వతః సర్వే హ్యాత్మానః పరమాత్మనః"- తమవలెనే ఇతర జీవులు కూడా సర్వశేషియైన పరమాత్మకు దాసులే అని భగవత్స్వభావాన్ని అంగీకరించి "గురవో దీనవత్సలాః" అన్నట్లు దీనజనుల యందు ఆచార్య పురుషులు వాత్సల్యాన్ని, అపారమైన ప్రేమ-స్నేహం కలిగియుంటారు.

'స్ఖలిత్యే శాసితారః'- తోటి జీవులు అపచారపరులైతే వారిని సంస్కరిస్తారు. భగవద్గుణ విభూతులను వారికి దయతో ఉపదేశిస్తారు.

భక్త పరాధీనుడైన శ్రియఃపతి తన స్వరూప రూపగుణ విభూతులను భక్తిరూప జ్ఞానంగలవారి వశం చేస్తున్నట్లే, ఆచార్య పురుషులు కూడా భగవానుని కైంకర్యమే ఉత్కృష్టమైనదని తమ జ్ఞానాన్ని తోటి జీవులకు అందజేస్తారు.

"తమ్మైయోడొక్క అరుళ్ శెయ్‌వర్"- "నిరంజనః పరమం సామ్యముపైతి"- భగవదపచార, భాగవతాపచారాదులు లేని జీవులకు భగవానుడు తనతో పరమ సామ్యాన్ని, ముక్తిని కల్పిస్తాడని తత్త్వోపదేశం చేసి ఆచార్య పురుషులు వారిని తీర్చిదిద్ది, భగవంతునికి అభిముఖులుగా జేసి రక్షిస్తారు.

భగవంతునికి సర్వజన సౌహార్దమనే గుణమున్నట్లే, ఆయన దాసులు కూడా సర్వజనసౌహార్దమనే గుణాన్ని కలిగి యుంటారు. ఆ గుణాన్ని ఆచరణలో నుంచుకొని, ఎన్నడు కూడా విడువనివారే భగవద్భక్తులు. భగవానుని కంటే భగవానుని దయకు వైలక్షణ్యాన్ని ధ్వనింపజేసిన దయాశతకాన్ని లోకానికి అందించిన ఆచార్య పురుషులు కదా! శ్రీ వేదాన్త దేశికులు.

*51. మాణ మ ఏసా మచ్ఛర*
*దంభాసూ ఆ భ ఆ మరిస లోహముహా।*
*దీసంతి ణ మోహాసు ఆ*
*దోసాదాసాణసచ్చ తుహభత్తాణమ్॥*

ఛా. *మానమదేర్ష్యామత్సర*
*దంభాసూయా భయామర్షలోభముఖాః।*
*దృశ్యంతే న మోహాసుతాః*
*దోషాదాసానాం సత్య! తవ భక్తానామ్॥*

**అర్థం:** హే దాసానాంసత్య!= దాసులకు సత్యభూతుడా!; తవ= నీ యొక్క భక్తానాం= భక్తులకు; మోహాసుతాః= దేహాత్మభ్రాంతి అనే అజ్ఞానం యొక్క కార్యాలైనట్టి;

మానమదముఖాః/ మాన= అహంకారం; మద= గర్వం; ఈర్ష్యా= ఓర్వని గుణం; దంభ= పరులను వంచించే వ్యాపారం; అసూయా= గుణాలయందు దోషాన్ని ఆరోపించుట; భయ= కష్టాలు కలుగనేమో అని దుఃఖపడుట; అమర్ష= స్థిరంగా ఉండేకోపం; లోభ= ఇతరుల ద్రవ్యం మీద ఆశపడుట; ముఖాః= మొదలైనవి కలిగి యున్నట్టి; దోషాః= దోషాలు; న దృశ్యంతే= (లేనందున) కనబడవు.

**తా॥** ఓ దాస సత్యా! అవివేకం వల్ల జనించే మానం, మదం, ఈర్ష్య, మత్సరం, దంభం, అసూయ, భయం, కోపం, లోభం, మొదలైన దోషాలు నీ భక్తులయందు లేవు. కాబట్టి కనబడవు.

**వ్యాఖ్య:-** భగవద్భక్తులు దోషాలులేని వారని సుశ్లోకితం.

మానమదేర్ష్యాది దోషాలుండగా, భక్తులకు సర్వజన సౌహార్దం అనే మంచి గుణమెట్లుండును? అనే శంకను పరిహరిస్తున్న శ్లోకమిది. దాససత్య! అని సంబోధింపబడిన నేను మీకు అసత్యం చెబుతానా? ప్రజలలో అనుకూలురు, ప్రతికూలురు, ఉదాసీనులు ఉంటారని నేను మీకు చెప్పవలెనా?

"యోవేత్తియుగపత్ సర్వం ప్రత్యక్షేణ సదా స్వతః"- అన్నట్లు ధర్మభూత జ్ఞానంచేత ఒకే సమయాన మంచి-చెడు విషయాలను సాక్షాత్కరించుకొనే నీకు కనబడడం లేదా? అని దేవనాయకుడు పలుకగా; నిజమే!

తవభక్తానాం- దేవనాథా! నీ యందు అపారభక్తిని కలిగియున్న ఆచార్యాది భాగవతోత్తములయందు దుర్గుణ మొక్కటైనను కనబడడం లేదు. నీ యెడబాటును సహింపకుండుట, దయ, వాత్సల్యాది గుణాలే తప్ప మోహజనిత కార్యాలైన మానమదేర్ష్యాదులు మచ్చుకైననూ వారికి లేనే లేవని విన్నపించబడింది.

మోహసుతాః- మోహం యొక్క బిడ్డలు అని అర్థం 'మోహం' అంటే కృత్యాకృత్య వివేక శూన్యత్వం. చేయ తగినది-తగనిది అనే జ్ఞానం లేకపోవడమే మోహం. దేహమేమో నశించేది. ఆత్మకు జనన మరణాలు లేవు. పరమాత్మవలె

జీవాత్మ కూడా జ్ఞానం కలదే. పరిశుద్ధమైనదే. అయితే, దేహమందు బంధింపబడి యున్నందున జీవాత్మకున్న జ్ఞానం సంకుచితమైనది. కావుననే దేహధారులకు విద్యను బోధించే అవసరమేర్పడినది. శబ్దబ్రహ్మాను తెలుసుకొన్న వ్యక్తికి దేహాత్మ భ్రాంతి యుండదు. పరబ్రహ్మాను పొందే సామర్థ్యమేర్పడుతుంది. వివేక శూన్యులకు మానమదాది దుర్గుణాలు సంభవిస్తాయి. కాబట్టి, మోహసుతులనబడే దుర్గుణాల పట్టిక ఇందు కూర్చబడింది.

1) మానం- "మత్సమోనాస్తీతి మననం మానః"- నాతో సమానుడు లేదని తలచే దురహంకారం.

2) మదః- "గర్వోఽభి జనలావణ్య ధనైశ్వర్యాది భిర్మదః। సవిలాసాంగ వీక్షాఽ వినయావజ్ఞాది కృత్తుసః"- (సాహిత్యదర్పణం). సత్కులమందు పుట్టడం చేతనూ, చక్కని రూపం కలిగియుండడం వల్లనూ, సంపదలున్నందు వల్లనూ కలిగే గర్వం. గర్వం వల్ల వినయముండదు. పెద్దలయందు గౌరవముండదు.

3) ఈర్ష్యా- "అక్షాంతి రీర్ష్యా"- (అమరం) ఇతరుల సంపదలను సహింపకుండుట.

4) మత్సరః- "మత్సరోఽన్య శుభద్వేషః"- (అమరం) ఇతరుల సుఖాన్ని మేలును జూచి ఓర్వలేక దుఃఖపడుట.

5) దంభః- పరవంచన హేతువైన వ్యాపారం. ధార్మికుడైనట్లు పేరుతెచ్చుకోవ డానికి ఇతరులను మోసగించే నడవడి, ధర్మాలను ఆచరించే కపటకృత్యం. తన గొప్పతనాన్ని చాటుకొనుట.

6) అసూయ- "అసూయాతు దోషారోపో గుణేష్వపి"- (అమరం) మంచిగుణాల యందు దోషాలను ఆరోపించుట.

"రాజన్! సర్షప మాత్రాణి పరచ్ఛిద్రాణి పశ్యసి।
ఆత్మనో మేరు మాత్రాణి పశ్యన్నపి నపశ్యసి॥"

'ఓ రాజా! ఇతరులయందున్న ఆవగింజలవంటి చిన్న దోషాలనే చూస్తున్నావు. కాని, మేరుపర్వతమంత దోషరాశి నీయందున్ననూ తెలిసికూడా నీవు గమనిస్తు లేవు' అన్న రీతిగా ఉండే ఒకానొక దోషం దుర్గుణం.

"అసూయాన్యగుణర్ధీనా మౌద్ధత్యాదసహిష్ణుతా॥" (సా.ద). ఔద్ధత్యం వల్ల పరుల గుణ సమృద్ధిని సహింపకుండుట అసూయయే కదా!

7) భయం- "రౌద్ర శక్త్యాతుజనితం చిత్తవైక్లబ్యం భయమ్" (సా.ద.) మనస్సును వికలంచేసే చేష్ట. భయం అంటే రాబోయే కష్టాల కారణం గమనించి దుఃఖపడడం.

8) అమర్షః- "కోప ఏవస్థిరతరో హ్యామర్ష ఇతి కథ్యతే" (సా.ద.). అవమానాదుల వల్ల స్థిరంగా నిల్చిన కోపం.

9) లోభః- "పరవిత్తాదికం దృష్ట్వానేతుం యో హృది జాయతే। అభిలాషో ద్విజశ్రేష్ఠ! సలోభః పరికీర్తితః॥"- ఇతరుల ద్రవ్యాన్ని పొందాలనే కోరికయే కాక, తనకున్న ధనంలో చిన్న గవ్వనైనా ఇతరులకు దానం చేయని దుర్గుణమే లోభం.

మోహమనేది కటికచీకటి- భక్తి అనేది గొప్ప తేజస్సు. పరమభక్తులకు మోహం నశించినందువల్ల దాని కార్యాలైన మానమదేర్ష్యాదులు ఉత్పత్తి కావు కదా! ఆచార్యాది భాగవతుల మహిమ దివ్యమైనదని భావం.

52. జాణ మ ఈ ఇఅర ముహీ
కాళో సఅళో వి తాణ కలి విత్థారో।
జే తుహ ప అమ్మి పవణా
ణత్థి కలీ ణా అవ ఇ ణ అరవ ఇ తాణమ్॥

ధా. యేషాం మతి రితర ముఖీ
కాలః సకలో౽ పితేషాం కలివిస్తారః।
యే తవ పదే ప్రవణాః
నాస్తి కలిర్నాగపతి నగరపతే! తేషామ్॥

**అర్థం:** హే నాగపతినగరపతే= అహీంద్రపుర విభో!; యేషాం= ఏ జనులయొక్క; మతిః= బుద్ధి; ఇతర ముఖీ= నీ కంటే వేరే విషయాల యందు ఆసక్తమై యున్నదో; తేషాం= ఆ జనులకు; సకలః, అపి, కాలః= కృతయుగం మొదల్కొని కాలమంతయు; కలివిస్తారః= కలియుగం లాగా వ్యాపించియుండును; యే= ఏ జనులైతే; తవ= నీ యొక్క; పదే= పాద (యుగ్మ)మందు; ప్రవణాః= అత్యాసక్తితో నమస్కరింతురో; తేషాం= వారికి; కలిః= కలియుగమే; న, అస్తి= ఉండదు.

**తా॥** అహీంద్ర పురాధీశా! దేవనాయకా! నీ యందు భక్తి లేకుండా, ప్రాపంచిక భోగాలమీద ఆసక్తి గల బుద్ధి ఎవరికి ఉండునో వారికి కృతయుగాది. కాలాలన్నిటియందు కలికాలమే విస్తరించి యుంటుంది. ఇక నీ పాదారవింద ప్రవణులకు మాత్రం కలియుగ ప్రభావమే ఉండదు.

**వ్యాఖ్య:-** దేవనాథుని చరణయుగళమందు ప్రవణులైన జీవులమీద కలికాల పురుషుని ప్రతాపమించుకైనను చెల్లదని సుశ్లోకితం.

పరమభక్తులకు అన్నీ శుభగుణాలే యున్ననూ, కలికాల ప్రభావం ఉండక పోతుందా? అంటే, నాగపతి నగర విభుని పాదపద్మయుగళమందు శ్రద్ధాసక్తులతో తలవంచి దండవత్ ప్రణామాలర్పించే భాగవతులపైన కలిపురుషుని స్వభావం వల్ల కలిగే దోషరేణువులు కూడా సోకజాలవని ప్రపన్నుల మాహాత్మ్యం ప్రశంసింప బడుతున్నది. నాగపతినగరపతే- ఇది సంబోధనాంత పదం.

ఇది 'అహీంద్రపురం'- దేవనాయక స్వామి ఈ ప్రాంతమందు వేంచేయనున్నాడనే ఇంగిత జ్ఞానమున్న ఆదిశేషుదు స్వామి కంటే ముందే, నాగలోకం

నుంచి తన సైన్యంతో ఇక్కడకు వేంచేసి తన వేయి పడగలను విప్పి, రెండు వేల నాల్కలను చాచి, భయంకరంగా బుసగొట్టే సరికి, కలి పురుషుడు భయపడి ఇక్కడినుంచి ఎక్కడికో పారిపోయాడని, తర్వాత దేవనాయకుడు వేంచేసి శేషపీఠంమీద వెలసి యున్నాడని ఈ సంబోధన సూచిస్తున్నది.

ప్రాకృతిక భోగలాలసులైన జనులెక్కడున్ననూ, కృతయుగం మొదల్గొని నాలుగు యుగాలు కూడా వారిపట్ల కలియుగంగానే పరిణమిస్తాయి. వారు కలికాల స్వభావం చేత ప్రభావితులవుతారు. ఇది పూర్వార్థమందలి భావం. ఇక అహీంద్రపురాధీశుడైన సర్వేశ్వరుని చరణ సరోజద్వయమందు మనస్సుతో ధ్యానిస్తూ, వాక్కుతో స్తుతిస్తూ, కాయికంగా శిరస్సు వంచి ప్రణమిల్లే మహాజనుల పట్ల కలిపురుషుణిచే ప్రయుక్తమైన దోషం లేశమాత్రమైనను సోకజాలదు. అంతేకాదు, పరమైకాంత భక్తుల విషయంలో కలియుగమే కృతయుగంగా పరివర్తనం చెందుతుంది.

'కలి' అంటేనే 'పాపం' అని అర్థం.

"మృత్యుర్యస్యోప సేచనమ్"- (కఠోపనిషత్) మృత్యువునే (యముణ్ణి కూడా) ప్రళయకాలంలో మ్రింగే సర్వేశ్వరునియొక్క పాదపద్మ ప్రవణులైన భక్తుల పాపరాశి తొలగిపోకుండా ఉంటుందా?

"నిన్ నామంకత్త ఆవలిప్పుడైమై- కావలిన్ పులనై వైత్తు కలితన్నై క్కడక్క పాయిందు"- (తిరుమాలై-1)

"శ్రియః పతియొక్క నామస్మరణ ప్రభావం చేత- ఇంద్రియాలను నిగ్రహించి, (కలిప్రభావాన్ని) పాపాలనన్నింటినీ పూర్తిగా తొలగించుకొన్నాను. కృతయుగమందున్న పురుషుడేమో అన్నట్లు మారిపోయాను" అని తొండరడిప్పొడి (భక్తాంఘ్రిరేణువు) ఆళ్వార్లు స్వామి సన్నిధిలో 'నీ నామ ప్రభావమిట్టిది' అని స్తుతించారు.

"తిరియుమ్ కలియుగమ్ నీంగి- పెరియకిత యుగంపత్తి పేరిన్ప వెళ్ళమ్ పెరుగ"- (తి.వా.మొ. 5-2-3) శ్రీ వైష్ణవులంతట వ్యాపించి భగవద్గుణ గానం

చేస్తుంటే, వస్తువుల స్వభావాన్ని మార్చివేసే, పాపియైన కలియుగం తొలగిపోయి, పెద్ద కృతయుగం ప్రవేశించి, గొప్ప ఆనంద సాగరం వృద్ధిబొందినట్లున్నదని నమ్మాళ్వార్ల శ్రీ సూక్తి. భగవద్గుణానుభవం చేసే భాగవతవైభవానికి ఆళ్వార్లూ ఆనందించారు.

"కలౌకృతయుగం తస్య కలిస్తస్య కృతే యుగే।
యస్య చేతసి గోవిందో, హృదయే యస్య నాచ్యుతః॥"

ఎవని చిత్తమందు గోవిందుడు స్మరింపబడునో అతనికి కలియుగం కృతయుగంగా మారుతుంది. హృదయమందు గోవిందుణ్ణి ధ్యానించనట్టి వ్యక్తి కృతయుగమందున్ననూ, ఆ యుగం అతనికి కలియుగంగానే వర్తిస్తుంది. పాపిష్ఠుడై యుంటాడని అర్థం.

ఈ ప్రమాణాలను స్మరింపజేసే శ్లోకమిది- ప్రాకృతభాషలో 'పతి' శబ్దంయొక్క సంబోధన యందు 'ప' కు 'వ' చేరి 'త' లోపమై 'సోర్లుక్' అని పాక్షికంగా 'లుక్' లోపమేర్పడింది. (వ.ఇ.)

53. అచ్చాసణ్ణవిణాశా
అచ్చు అ పేచ్ఛంతి తావ ఏ భత్తజణే।
మోక్ఖ రుఈణసుమగ్గే
మూఢా ది అహఅర మణ్డలమ్మి వఛిద్దమ్॥

ఛా. అత్యాసన్న వినాశాః
అచ్యుత! పశ్యంతి తావకే భక్తిజనే।
మోక్ష రుచీనాం సుమార్గే
మూఢా దివసకర మండల ఇవ ఛిద్రమ్॥

**అర్థం:** హే అచ్యుత! అత్యాసన్న వినాశాః= మిక్కిలి దగ్గరపడిన వినాశం కలిగిన; మూఢాః= మూర్ఖులు; మోక్షరుచీనాం= మోక్షఫలమందు అభిరుచి కలిగిన వారికి; సుమార్గే= మంచిదారిని చూపించే వారైన; తావకే= నీ సంబంధమైన; భక్తజనే= భక్తులైన జనుల విషయంలో; దివసకర మండలే, ఇవ= సూర్యబింబమందు వలెనే; ఛిద్రం= రంధ్రాన్ని/ దూషణాన్ని; పశ్యంతి= చూస్తున్నారు.

**తా॥** ఓ అచ్యుతా! చాలా కొద్దికాలంలో చావనున్న మూఢులు మోక్షమందు కోరిక కలవారికి మంచి మార్గాన్ని చూపే వారైన నీ భక్త జనులయందు సూర్యబింబమందు- ముముక్షువులకు ద్వారంగా ఉండే సూర్యమండలమందు- ఛిద్రాన్ని చూస్తున్నారు.

**వ్యాఖ్య:-** ముముక్షువులకు మార్గదర్శకులైన భగవద్భక్తుల యందు దోషాన్ని చూచి దూషించే మూఢులు శీఘ్రంగా నశించేవారని వివరింపబడు తున్నది.

అచ్యుత! అనేది సంబోధించే పదం. క్షుద్రప్రభువు తన సేవకుల పట్ల ఎవరో అసూయతో వారు దోషభూయిష్ఠులని కొండెములను చెప్పితే, ఆ ప్రభువు వారి మాట విని తన సేవకులనే కఠినంగా శిక్షించి, ఉద్యోగం నుంచి తొలగిస్తాడు. కాని భగవానుణ్ణి ఆశ్రయించిన వారి విషయంలో కొందఱు దోషాలను ఆరోపించి చెప్పినప్పటికీ భగవానుడు -

"మమ మద్భక్త భక్తేషు ప్రీతిరభ్యధికా భవేత్,
తస్మాన్మద్భక్త భక్తాశ్చ పూజనీయా విశేషతః॥"

నాకు నా భక్తుల యెడల ఎక్కువ ప్రీతి కలదు, కాబట్టి నా భక్తులకు భక్తులైనట్టి వారు విశేషంగా పూజింప వలసినవారు అనియు-

"తదాశ్రయ స్స్యాశ్రయణాత్ తస్యతస్య చతస్యచ,
సంసేవనాన్నరాలోకే పూయంతే సర్వపాపకైః॥"

నన్ను (భగవానుని) ఆశ్రయించినవారి దాసానుదాసులను ఆశ్రయించడం వల్లనూ మానవులు సర్వపాతకాల నుంచి విముక్తులవుతారు అని, తన భక్తుల పట్ల అధిక ప్రీతి కలిగియున్నట్లు ప్రకటించాడు. అందువల్ల భగవానుడు-

"ఎన్నడియారదు శెయ్యార్, శెయ్ దారేల్ నన్రు శెయ్‌దార్"- నా భక్తులు అపరాధాలను చేయరు. ఒకవేళ చేసిననూ నాకది ఇష్టమే "ఏదో విధంగా శిక్షా విశేషాలచేతనో, నేనే వారి దోషాలను క్షమించగలను. కాని నా భక్తులను నేను చేయిజారవిడువను" అన్న భగవానుని అభిప్రాయాన్ని బట్టి "అచ్యుత" అనే పదం ప్రయోగింపబడింది.

మోక్షరుచీనాం సుమార్గే- మోక్షఫలాన్ని ఆశించే వారికి దాన్ని పొందే మార్గాన్ని, తత్త్వజ్ఞానోపదేశంచేసి, "యో భిత్వా సూర్యమండలం"- హార్దుడైన భగవానుని కృపచేత ముముక్షువు దేహంనుంచి ప్రాణోత్క్రమణ కాగానే ప్రప్రథమంగా సూర్యమండలాన్ని భేదించుకొని, అతివాహికుల ద్వారా అర్చిరాది మార్గంగా వైకుంఠాన్ని పొందుతాడని, మోక్షమార్గ దర్శనానికి కారణభూతులైనందు వల్ల ఆచార్యాది పరమ 'భక్తజన' శబ్దానికి విశేషణంగా 'సుమార్గే' అనే పదం ప్రయుక్తమైనది. 'సద్గతిని చూపించేవారు' అని అర్థం.

ఆచార్యాది భాగవతులు మోక్షప్రాప్తికి మార్గాన్ని చూపించకుంటే, జీవులకు కంటకాది దుర్గతి సంభవించునట్టి గొప్ప అనర్థం కలుగుతుందని వివరించ నక్కఱలేదు కదా!

తావకే భక్తజనే- భగవద్భక్తులని మాత్రమనకుండా, 'జన' శబ్దం ప్రయుక్తమైనందువల్ల విశేషార్థం గోచరిస్తున్నది.

"యః శూద్రం భగవద్భక్తం నిషాదం శ్వపచం తథా।
వీక్షతే జాతి సామాన్యాత్ సయాతి నరకం నరః"

శూద్రుడుగానీ, నిషాదుడుగానీ, కుక్క మాంసాన్ని వండుకొని తినేవాడు గానీ భగవంతునియందు భక్తిని కలవాడైనప్పుడు అతనిని జన్మ సిద్ధమైన జాతినిబట్టి చూచిన వ్యక్తి తప్పక నరకలోకాన్ని పొందుతాడు.

"నశూద్రా భగవద్భక్తాః విప్రాభాగవతాః స్మృతాః।
సర్వ వర్ణేషు తే శూద్రాః యే హ్యభక్తాః జనార్దనే॥"

భగవద్భక్తులు శూద్రులు అనబడరు. వారు విప్రులుగాను, భాగవతులుగాను భావింపబడుతారు. అన్నివర్ణాలయందు భగవద్భక్తులు కాని వారు శూద్రులుగా ఎన్నబడుతారు. భాగవతులైన వారికందఱికీ భగవంతుని విషయమైన 'ఐకాంత్యం' సమానమే. "ఐకాంత్యం భగవత్యేషాం సమానమధి కారిణామ్" అని చెప్పబడినది. ఏకాంతమే ఐకాంత్యమనబడుతుంది. 'లక్ష్మీనాథుడు' ఒక్కడే భగవానుడు అనే దృఢమైన విశ్వాసమే ఏకాంతభక్తి అనబడుతుంది. దేవతాంతర సంబంధంలేనివారు ఏకాంతులు. వారిలో "జ్ఞానీతుపరమై కాంతీ"- ప్రయోజనాంతర సంబంధమూ లేనట్టి జ్ఞానవంతులు పరమైకాంత భక్తులనబడతారు.

బుద్ధిపూర్వకంగా భక్తులు అపచారం చేయరు. ఒకవేళ చేసిననూ అది ప్రామాదికమో, ఆపద్ధర్మమో అని భావింపబడుతుంది. అయినా, ఆ దోషాన్ని 'ప్రాయశ్చిత్తకర్మ' నాచరించి తొలగించుకొంటారు.

ఇట్టి పరమభక్తులు సన్మార్గదర్శకులు కాబట్టి లోకుల అజ్ఞానాంధకారాన్ని తొలగించి, శ్రేయస్సును కలిగిస్తారు.

"సర్వలోక తమోహంతా ఆదిత్యోద్వారముచ్యతే'
జ్వాలామాలీ మహా తేజాయేనేదం ధార్యతే జగత్॥"

గొప్ప తేజస్సు కలవాడై లోకాల చీకట్లను తొలగించి, చైతన్యాన్ని కలిగించే సూర్యుడు మోక్షమనే రాజభవనానికి ద్వారం వలె ప్రకాశిస్తున్నాడు. అట్టి సూర్యుని

బింబమందు ఛిద్రాన్ని చూచినట్లు, పరమ భక్తులయందు ఆపద్ధర్మాన్ని దోషంగా తలచి దూషించే మూఢులు.

"ఛిద్రం దూషణ రంధ్రయోః"- (మేదిని) పరమభాగవతులను దూషించే వ్యక్తి ఒక్క అయనం- ఆరుమాసాలలోనే మరణిస్తాడని, మరణం ఆసన్నమైన వ్యక్తికి ఒక్క చంద్రుడే రెండు చంద్రులుగానూ, వస్తువులన్నీ బంగారు వన్నెకలవిగానూ, శిథిలమైన చక్రనాభిని- బండిగీరయొక్క బుడ్డికి గల ఛిద్రాన్ని చూచినట్లే, సూర్యబింబంలో రంధ్రం కనబడుట, ఏడురాత్రులలో మరణం సంభవిస్తుందని పంచమవేదమందు ప్రపంచితం.

*"కృష్ణశ్యావచ్ఛవిచ్ఛాయ ష్షణ్మాసాన్మృత్యు లక్షణమ్।*
*శీర్ణనాభిం యథా చక్రం ఛిద్రం సోమం ప్రపశ్యతి॥*
*తత్రైవ చ సహస్రాంశుం సప్తరాత్రేణ మృత్యుభాక్॥"*

(భారతం. మోక్షధర్మం)

"యస్యార్కే సచ్ఛిద్ర స్తస్య వినాశౌ క్షితీశస్య"- (వరాహమిహిర సంహిత). 'దివస' శబ్దమందు "ప్రత్యూషాది వసదశాపాషాణేషు తు హః" అని ప్రాకృతంలో 'వ'కు 'అ'- 'స' కు 'హ' ఆదేశమై "ది అహ" రూప మేర్పడింది.

54. *ణితుడి అ (ణిఖుడిఅ) దుమ్మాణఘణా*
*ణిమ్మల గుణ ఘుడి అ తార ఆ పబ్భారా।*
*భాసంత భత్తి జోణ్హా*
*ణ అసచ్చ ఫురంతి ణహాణిహా తుహాభత్తా॥*

ఛా. *నిస్త్రుటిత (ణిఖండిత) దుర్మాన ఘనాః*
*నిర్మలగుణ ఘటిత తారకా ప్రాగ్భారాః।*
*భాసమాన భక్తి జ్యోత్స్నాః*
*నతసత్య! స్ఫురంతి నభో నిభాస్తవ భక్తాః॥*

**అర్థం:** హే నతసత్య!= ప్రణతులకు సత్యభూతుడా!; నిస్త్రుటిత (నిఖండిత) దుర్మాన ఘనాః= పోగొట్టబడిన దురహంకారం అనే మేఘం కలవారైనందువల్ల; నిర్మల-ప్రాగ్భారాః/ నిర్మల గుణ= స్వచ్ఛమైన గుణాలచే; ఘటిత= ఘటింపజేయబడిన; తారకా= నక్షత్రాలయొక్క/ తరింపజేసే రక్షకాలైన ప్రాయశిత్తాలయొక్క; ప్రాగ్భారాః= సమూహం కలవారైన; భాసమాన భక్తి జ్యోత్స్నాః= ప్రకాశిస్తున్న భక్తి అనే వెన్నెల కలవారైన; తవ= నీ యొక్క; భక్తాః= భాగవతులు; నభోనిభాః= ఆకాశంతో సమానులై; స్ఫురంతి= ప్రకాశిస్తున్నారు.

**తా॥** ఓ నతసత్యా! దేవనాయకా! నీ భక్తులు దురహంకారమనే మేఘాన్ని తొలగించుకొన్న వారు కాబట్టి, నిర్మలజ్ఞానం మొదలైన గుణాలచేత పాపాల నుంచి రక్షించే ప్రాయశ్చిత్తాది కర్మలు అనే తారకల- చుక్కల- సమూహం కలవారై ప్రకాశిస్తున్న భక్తి అనే చంద్రిక కలవారై ఆకాశతుల్యులై భాసిస్తున్నారు.

**వ్యాఖ్య:-** సూర్యబింబంవలె ఛిద్రం- హరిదాస జనమందు దూషింపదగిన పాపంలేదు అని పూర్వశ్లోకమందలి విషయం వివరిస్తున్న శ్లోకమిది.

నిస్త్రుటిత దుర్మాన ఘనాః- ఆవరించిన మేఘం తొలగిపోయినప్పుడు నీలాకాశం స్వచ్ఛంగా శోభిస్తుంది. దుర్మానమే మేఘం. ప్రపన్నుడు నాకు పాపాలెక్కడున్నాయి? నేను ప్రపన్నుడను అని చాటుకొనడం దుర్మానమే దురహంకారమే. దురహంకారం వల్ల జ్ఞానం నిర్మలంగా ఉండదు. ప్రపత్తి చేసిన తర్వాత కాలమందు కలిగిన ఇట్టి దురహంకారం 'ఉత్తరాఘం' అనబడుతుంది. ఈ పాపం చేస్తున్నానని 'సత్త్వగుణం' ఉద్బుద్ధమైనప్పుడు తెలిసి, సిగ్గుపడి, తాపపడుతూ 'నేను అమర్యాదుడను, క్షుద్రుడను, పాపిష్ఠిని' అని భావిస్తాడు. అధికారానికి తగినట్లు 'ప్రాయశ్చిత్తం' చేసుకొంటాడు. పాపం తొలగిపోతుంది. దుర్మానమనే మేఘం తొలిగిపోతే ఆకాశం స్వచ్ఛగా ప్రతిఫలించునట్లు, నిర్మలజ్ఞానాదులైన ఆత్మగుణాలు శోభిస్తాయి. ఇట్టివారే భగవద్భక్తులు అనబడుతారు. నిర్మలగుణాలవల్ల కలిగే ప్రయోజనమేమిటి? అంటే తర్వాతనున్న పదం వివరిస్తున్నది.

నిర్మల గుణఘటిత తారకా ప్రాగ్భారాః- దుర్మానం తొలగినందువల్ల నిర్మల జ్ఞానాది గుణాలచేత సంపాదింపబడినవే తారకాప్రాగ్భారాలు. మేఘం తొలగిపోవడంవల్ల ఆకాశమందు నైర్మల్యమేర్పడుటచేత (రాత్రిపూట) చుక్కలన్నీ చక్కగా మెరుస్తుంటాయి. 'తారక' శబ్దం నానార్థాలు కలది.

"తారకో దైత్య భిత్ కర్ణధార యోర్నద్వయోర్ధ్రుశి।
కనీనికాయా మృక్షేచన పుమాంస్త్రాతరిత్రిషు॥" - (మేదిని)

నిర్మల జ్ఞానం చేత బాహ్యవస్తువుల మీద దృష్టిపెట్టక, దహరాకాశమందు- హృదయగుహయందు- "ఆత్మాగుహాయాం నిహితోఽస్య జంతోః"- (శ్రుతి). వెలసియున్న (హార్దపురుషుడు) అంతర్యామిపైన దృష్టిపెట్టడం ఘటిస్తుంది. అంతర్ముఖుడవుతాడని భావం. ప్రామాదికంగా పొటమరించిన పాపాల నుంచి రక్షించే ప్రాయశ్చిత్త కర్మను ఆచరించకుంటే రాజకుమారుని అపరాధానికివలె లఘు శిక్షను-దండనను పొంది నివృత్త పాపులవుతారు కొందరు.

'తారక' పదం తరింపజేసేది, రక్షించేది అనే అర్థం కలది. కాబట్టి 'ప్రాయశ్చిత్తం' అనే అర్థం చెప్పబడింది. పాపం కలిగిందని తెలియగానే ఆలస్యాన్ని సహించక త్వరగా ప్రాయశ్చిత్తాన్ని ఆచరించడం ఘటిస్తుంది.

"ప్రాయశ్చిత్తాన్య శేషాణి తపః కర్మాత్మ కానివై।
యాని తేషామశేషాణాంకృష్ణాను స్మరణం పరమ్॥"

తపః కర్మలవంటి ప్రాయశ్చిత్తాలన్నిటికంటెను గొప్ప పాపాలను నశింపజేసి, తత్త్వార్థాలను ప్రకాశింపజేసే భగవంతుణ్ణి అనుస్మరించడం శ్రేయస్కరం అనే ప్రమాణాన్ని స్మృతి చెబుతున్నది.

'ప్రాక్‌భారం' అంటే ఎప్పటివలె 'ధురంధరత్వం' అని అర్థం. మేఘం తొలగగానే నిర్మలమైన ఆకాశం నక్షత్ర సముదాయాన్ని భరిస్తుంది, వహిస్తుంది. చుక్కలతో నిండి ఆకాశం ప్రకాశిస్తుంది. కాబట్టి 'సమూహం' అనే అర్థం వ్యవహృతం.

నక్షత్రాలతో అందంగా ప్రకాశించే ఆకాశమందు చంద్రుడు ఉదయించడంతోనే అంధకారం తొలగిపోయి, ఆహ్లాదపరచే వెన్నెలతో అధికంగా ప్రకాశిస్తుంది ఆకాశం.

నిర్మలజ్ఞానం భక్తి రూపమైన చంద్రికతో అధికంగా ప్రకాశించే ఆకాశంతో సమానంగా స్ఫురించేది భక్తజనం అని పిండితార్థం. చంద్రికతో నిండిన ఆకాశం వంటి వారు దేశికులే.

1) మేఘం-దురభిమానం. 2) తారక-ఉత్తమ ఆత్మగుణం. 3) జ్యోత్స్న-భక్తి. 4) ఆకాశం-భక్తజనం. భాగవతులు నభోనిధులు.

55. ణ హు జమవి స అమ్మి గ ఈ
ణఅసచ్చ పఅంబుఅం తుహ పవణ్ణాణమ్।
ఖలిఆణ వి జహజోగ్గం
సిక్ఖా సుద్ధంత కింకరాణ వ లహు ఈ॥

ఛా. నఖలు యమవిషయే గతిః
నతసత్య! పదామ్బుజంతవ ప్రపన్నానామ్।
స్ఖలితానామపియథా యోగ్యం
శిక్షా శుద్ధాన్త కిఙ్క రాణామివలఘ్వీ॥

**అర్థం:** హే నతసత్య!= శరణుచొచ్చినవారికి మోక్షమిస్తావన్నమాటను సత్యం చేయువాడా!; తవ= నీ యొక్క; పదాంబుజం= పాదకమలాలను; ప్రపన్నానాం= శరణంగా పొందిన వారికి; యమవిషయే= యముని దేశమందు- నరకలోకానికి; గతిః= గమనం-పోవడం; నఖలు= ఉండదు కదా!; స్ఖలితానాం, అపి= అపరాధం చేసినవారికి కూడా; శుద్ధాంత కింకరాణాం, ఇవ= అంతఃపుర సేవకులకు వలె; యథాయోగ్యం= నేరానికి తగినట్లు; శిక్షా= దండన; లఘ్వీ= లఘువుగా-స్వల్పంగా; (భవతి= ఉండును).

**తా॥** హే నతసత్యా! నీ చరణ కమలాలయందు శిరస్సును వంచి శరణం వేడినవారికి నరకలోక ప్రాప్తి యుండదు కదా! ప్రపన్నులు అపరాధులైతే వారికి అంతఃపుర ద్వారపాలకులకు వలె తగినట్లు స్వల్పమైన దండన విధించి, నీ సన్నిధిలో చేర్చుకొంటావు.

**వ్యాఖ్య:–** ప్రపన్నులకు నరకలోక ప్రాప్తి యుండదని సుశ్లోకితం.

"త్రిభువనైక మూలమాస్వాదయంతి" అనే (44) శ్లోకం మొదల్కొని (54)వ శ్లోకం వరకు భాగవతుల మహిమ సామాన్యంగా ఉగ్గడింపబడింది. ఈ శ్లోకం నుండి (5) శ్లోకాల వరకు శరణాగతులైన ప్రపన్నులను గూర్చి వివరింపబడుతున్నది.

ప్రపత్తి చేసినవారికి ఉత్తరకాలమందు అపరాధం సంభవిస్తే, ఔషధం సేవించినవారికి వ్యాధి తొలగిపోవునట్లు, ప్రాయశ్చిత్త మాచరిస్తే, చేసిన అపరాధం నివృత్తియై, రక్షింపబడే యోగ్యత కలుగుతుందని పూర్వశ్లోకం వివరించింది.

ప్రపత్తిచేత సకలకర్మలు నశించిననూ, ప్రారబ్ధకర్మ మాత్రం "నా భుక్తం క్షీయతే కర్మ కల్పకోటి శతైరపి"– అన్నట్లు నరకాది అనుభవం లేకుండా ఎట్లు నశిస్తుందని అంటే, ఈ శ్లోకం ఆ సంశయాన్ని నివారిస్తుంది.

"నఖలు భాగవతాః యమ విషయం గచ్ఛంతి"– భగవద్భాగవతుల విషయమై అపచారం చేయని ప్రపన్నులు యమలోకానికి పోనే పోరని శరణాగతి ప్రభావం చెప్పబడింది. సర్వేశ్వరుడు నతసత్యుడు. 'శరణం వ్రజ'– నన్ను శరణు పొందుము, 'సర్వపాపేభ్యో మోక్షయిష్యామి'– సకల పాపాలను పోగొట్టి ముక్తిని కలుగజేస్తాను' అని తాను చెప్పిన మాటను సత్యమని నిరూపించుకొంటాడు.

"దేవం శార్ఙ్గధరం విష్ణుం యే ప్రపన్నాః పరాయణమ్।
నతేషాం యమసాలోక్యం నచతే నరకౌకసః॥"

శార్జ్గధరుడైన విష్ణువును శరణు చొచ్చినట్టి ప్రపన్నులకు యమధర్మనం కాదు. వారు నరకలోకానికి పోరు- "సాధ్యభక్తిస్తు సాహంత్రీ ప్రారబ్ధస్యాపి భూయసీ"- సాధ్యభక్తిని అంటే ప్రపత్తిని అనుష్ఠించిన వారి ప్రారబ్ధకర్మ కూడా నశిస్తుందన్నమాట శాస్త్ర ప్రసిద్ధం.

శాస్త్రవిహితమైన ఆచరణకు విరుద్ధంగా ప్రవర్తించిన పాపం ఒక్కటే అయిననూ, అది జాతిగుణాద్యధికార భేదాన్ని బట్టి తీక్షణమైన ఫలమిచ్చేదిగానూ, తేలికయైన ఫలమిచ్చేదిగానూ ఉంటుంది.

సామాన్యమైన న్యాయవచనం విశేషమైన న్యాయవచనాన్ని బాధించదు. ఆయుధంతో తీసివేయదగిన ముల్లును, ముల్లుతోనే తీయుట లోకంలో కనబడుతుంది కదా!

"కొటిల్యేసతి శిక్షయాప్యనఘయన్ క్రోడీకరోతి ప్రభుః"- ప్రపన్నుడు ప్రమాదవశాన చేసిన పాపానికి తగిన ప్రాయశ్చిత్తం చేసుకోకపోతే, దండన విధించి అతనిని పాపరహితునిగా, పవిత్రునిగా జేసి సర్వేశ్వరుడు స్వీకరిస్తాడు.

శిక్షా శుద్ధాంత కింకరాణామివ లక్ష్మ్యా- ప్రపత్తి చేయకముందు చేసిన పాపానికి విధించే దండన తీక్షణంగా ఉంటుంది.

*"నప్రాగ్వత్ విద్ధి పూర్వాఘే, న చాత్యంత మని గ్రహః।*
*లఘుర్దండః ప్రపన్నస్య రాజపుత్రాపరాధవత్॥"*

ప్రపన్నుడు అపరాధం చేసినప్పుడు దండన, పూర్వాఘానికి ఉన్నట్లు కఠినంగా ఉండదు. అట్లని బొత్తుగా క్షమించి యుండుటయూ లేదు.

రాజకుమారుడు అపరాధం చేసినప్పుడు, అతనిని పేరుకు మాత్రం దండించినట్లే, ప్రపన్నుని పట్ల విధింపబడే శిక్ష కూడా చాలా తేలికగా ఉంటుంది. ఇది అధికారానుగుణమైన శిక్షగా శాస్త్రం చెబుతుంది.

ఈ శ్లోకమందు శుద్ధాంత కింకరుల దండనతో సామ్యం చెప్పబడింది. అంతఃపుర సేవకులు చాలా నమ్మకం కలవారు. శుద్ధాంత కింకరులు అపచారం చేస్తే వారి దోషానికి తగినట్లు స్వల్పంగా దండన విధింపబడుతుంది. నరకానికి మాత్రం పోరు అని భావం.

స్వల్ప దండనకు ఉదాహరణం చెప్పింది శాస్త్రం-

"ఖంజా భవంతి కాణాభవంతి అవిధేయ పుత్రా
భవంతి అవిధేయ భార్యా భవంతి"- 'ఖోడే ఖంజః' (అమరం)

కుంటివారుగానూ, గ్రుడ్డివారుగాను, వికలాంగులుగా నయ్యే శిక్షణో లేదా తమకు అనుకూలంగా లేని భార్యను, కొడుకులను కలిగియుండే నరకబాధను ఈ లోకాననే అనుభవింతురు. కాని నరకలోకానికి మాత్రం పోయి యమభాదను అనుభవించునంతటిది కాదని చెప్పబడింది.

"స్వపురుష మభివీక్ష్య పాశహస్తం
వదతి యమః కిల తస్య కర్ణమూలే
పరిహర మధుసూదన ప్రపన్నాన్
ప్రభురహ మన్యనృణాం నవైష్ణవానామ్" (వి.పు.)

యముడు, పాశహస్తుడైన తన భటుని, కింకరుని పిలిచి నీవు శ్రీమన్నారాయణుణ్ణి శరణు చొచ్చినవారి దగ్గరికిపోవద్దు. నేను విష్ణుభక్తులకు ప్రభువును కాను. ప్రపన్నులకంటే వేరైన నరుల మీదనే నా దొరతనం చెల్లుతుంది అని అతని చెవిలో రహస్యంగా చెప్పినాడు అన్నది గమనీయం.

56. కమ్మగ ఇ దోస దుహి ఆ
క అంత భిడడీ భుఅంగి దంసణ తత్థా।
అచ్చంతి తుజ్ఝ చళణే
అచ్చు అ పబ్భుత్థ వమ్మహా ర సాసాఅ॥

ఛా. కర్మగతి దోష దుఃఖితాః
కృతాంత భ్రుకుటీ భుజంగీ దర్శన త్రస్తాః।
అర్చంతి తవ చరణౌ
అచ్యుత! ప్రభ్రష్ట మన్మథ రసాస్వాదాః॥

**అర్థం:** హే అచ్యుత!= ఓ అచ్యుతా!; కర్మగతిదోష దుఃఖితాః= కర్మయోగ మార్గమందు కలిగే దోషాలచేత దుఃఖపడువారు; కృతాంత-త్రస్తాః/ కృతాంత= యముని యొక్క; భ్రుకుటీ= బొమల ముడి అనే; భుజంగీ= ఆడ నాగుపాము యొక్క; దర్శన= దర్శనం చేత; త్రస్తాః= భయపడినవారు కనుక; ప్రభ్రష్ట మన్మథ రసాస్వాదాః= విడిచిపెట్టిన కామభోగ రుచిగల పురుషులు, తవ= నీ యొక్క; చరణౌ= పాదాలను; అర్చంతి= పూజిస్తుంటారు.

**తా॥** ఓ అచ్యుతా! కర్మయోగమార్గమందు అనేక దోషాలు కలుగుటచేత పీడింపబడుతారు. నరకప్రాప్తి తప్పదని దుఃఖపడుతారు. యముని యొక్క కనుబొమల ముడియనే ఆడ నాగుపామును జూచి భయపడే వ్యక్తులు, ప్రాపంచిక వనితాది భోగాలమీద లాలసను- ఆసక్తిని వదలుకొన్నవారై నీ పాదాలనే పూజిస్తుంటారు.

**వ్యాఖ్య:-** కర్మయోగానుష్ఠానంచే కలిగే దోషాల ఫలితమైన యముని క్రూర దృష్టికి భయపడే జనులు భగవదారాధన పరులవుతారని స్తుతింపబడుతున్నది.

కర్మయోగానుష్ఠానం క్లేశభూయిష్ఠమైనది. యావజ్జీవం- జీవించినంత కాలం కర్మలను ఆచరిస్తూనే ఉండాలి. కృచ్ఛ్ర చాంద్రాయణ వ్రతం, తీర్థయాత్ర, సేతుస్నానం ఇత్యాది మహాక్లేశ దోషాలచే దుఃఖపడుతుంటారు. కర్మాచరణమందు పుణ్యపాపాలు, తెలియకుండానే సంభవిస్తాయి. చిత్తం రాగాది దోషంచేత మలినమవుతుంది.

"యథాక్రతు రస్మిన్‌లోకే పురుషోభవతి, తథేతః ప్రేత్య భవతి"- ఈ లోకమందు వ్యక్తి యేమేమి చేస్తాడో, పరలోకమందు ఆయా కృత్యాల ఫలం అనుభవిస్తాడు అని (శ్రుతి). తత్క్రతున్యాయమే ప్రమాణం.

"రాగాది దూషితే చిత్తే నాస్పదీ మధుసూదనః
నబధ్నాతి రతిం హంసః కదాచిత్ కర్దమాంభసి॥"

బురదనీటి మడుగులో హంస సంతోషంగా ఉండదు. అట్లే, రాగద్వేషాదులు గల చిత్తమందు భగవానుడు ఇష్టంతో నివసింపడు- అని శ్రుతిస్మృతులు చెబుతున్నాయి. విషయలాలసుడైన వ్యక్తికి భగవానునిపట్ల భజనాసక్తి ఎలా కుదురుతుంది? భజింపకుంటే (యముని) నరకలోక గమనం నుంచి నివారింపబడుటెట్లు సిద్ధిస్తుంది? అనే సందేహాన్ని ఈ శ్లోకం నివృత్తి చేస్తున్నది.

సుఖదుఃఖ రూపఫలం అనుభవించక నశించనట్టి కర్మయోగం చేత పీడితులు, దుఃఖితులు కావడానికి కారణం కృతాంత భ్రుకుటీ భుజంగీ దర్శన త్రస్తులవడమే. యముడంటే మృత్యువే. అతని ముఖం చూస్తేనే భయం కలుగుతుంది. భ్రుకుటి అంటే కోపం వల్ల కలిగిన కనుబొమల ముడి. "భ్రువోర్మూల సముత్క్షేపాత్ భ్రుకుటీ పరికీర్తితా"- యముని భ్రుకుటి యే భుజంగి. క్రూరమైన యముని భ్రుకుటి ఆడ నాగుపాము వంటిదని చెప్పబడింది. 'భ్రుకుటి' శబ్దం స్త్రీలింగం. ఆడనాగుపాము అనబడుతుంది. పైగా, మగనాగుకంటే ఆడనాగుకు కోపమెక్కువ, విషమూ తీవ్రమైనది- అని ప్రసిద్ధం.

ఆడ నల్లనాగుపామును చూస్తే భయం కలిగినట్లే, యముని భ్రుకుటిని చూచినంతనే జీవులు భయపడుతారు. ఇట్లు కర్మగతిచే నిర్విణ్ణులై యముని- నరకలోక గమనానికే భయపడి, స్రక్ చందనాంగనాది విలాస వస్తువులయందు విరక్తి చెందుతారు. త్రివర్గమందు ఏవగింపు కలుగుతుంది కాబట్టి-

ప్రభ్రష్ట మన్మథ రసాస్వాదాః తవచరణా వర్చంతి- ముఖ్యంగా కామ పురుషార్థమందు- ఇంద్రియాల సుఖానుభవమందు ఆసక్తిని వదల్కొని, భగవత్పాద సేవయందే నిమగ్నులవుతారు. మోక్షపురుషార్థాన్నే అభిలషించి, సకల సుఖ దుఃఖాలకు మూలమైన కర్మగతి యొక్క నివృత్తికోసం, అతిసులభోపాయమైన

శ్రియఃపతి పాదకమలాలనే 'అర్చయంతి' పూజిస్తారు. ప్రాపకుడూ ప్రాప్యుడూ భగవంతుడే అని మహావిశ్వాసంతో భగవత్పాదార్చన చేసే ప్రపన్నులకు 'యమ విషయగతి' యుండదని గత శ్లోకమందలి భావాన్ని సమర్థించిన శ్లోకమిది.

"దురాచారోఽపి కృతఘ్నో నాస్తికః పురా
సమాశ్రయే దాది దేవం శ్రద్ధయా శరణం యది।
నిర్దోషం విద్ధితంజంతుం ప్రభావాత్పరమాత్మనః॥"

పూర్వం నాస్తికుడే అయినా, భగవంతునియందు భారముంచి శరణాగతుడే యైనచో, భగవత్ప్రభావంచేత దోషరహితుడై పవిత్రుడై ఇహపరసుఖాలను పొందుతాడని, శాస్త్రం సర్వసంశయాలను తొలగించి, పరోక్షార్థదర్శనం అవశ్యంగా కల్పిస్తుంది కదా!

57. ఆలగ్గఇ తుహచళనే
అచ్చుఅ విహిణా వి అచ్చణా ఆఅరిఆ।
జా ఎక్కంతి ప ఉత్తా
సేసం వ సఅం సిరేణ పడిగేణ్ణసి తమ్॥

ఛా. ఆలగతి తవచరణే
అచ్యుత! విధినాఽ ప్యర్చనాఽఽ చరితా।
యైకాంతి ప్రయుక్తా
శేషా మివ స్వయం శిరసా ప్రతిగృహ్ణాసితామ్॥

**అర్థం:** హే అచ్యుత!= అచ్యుతా!; విధినా, అపి= చతుర్ముఖుడైన బ్రహ్మచేత కూడా,/ శాస్త్రం నియమం చేతను; ఆచరితా= చేయబడిన; అర్చనా= పూజ; తవ= నీ యొక్క; చరణే= పాద (యుగళ) మందు; ఆలగతి= పొందుతున్నది; యా= ఏ పూజ; ఏ కాంతి ప్రయుక్తా= ఏకాంత భక్తులచే చేయబడినదో; తాం= ఆ పూజను; (త్వం=

నీవు); శేషాం, ఇవ= శేష వస్త్రమును (ధరించి విడిచిన పట్టమును) వలె; శిరసా= శిరస్సుతో; స్వయంగా; ప్రతిగృహ్ణాసి= స్వీకరిస్తున్నావు.

**తా॥** ఓ అచ్యుతా! పితామహుడైన చతుర్ముఖ బ్రహ్మ యథావిధిగా సమర్పించిన పూజ నీ పాదాలయందే సంక్రమిస్తున్నది. ఏకాంత భక్తులు చేసిన పూజను మాత్రం శేషవస్త్రాన్ని పొందినట్లు, నీవు స్వయంగా శిరస్సుతోనే ప్రతిగ్రహిస్తున్నావు.

**వ్యాఖ్య:-** భగవత్కృపా పాత్రులైన ఏకాంత భక్తులు సమర్పించిన అర్చనను భగవానుడు నతశిరస్కుడై స్వీకరిస్తాడని సుశ్లోకితం.

మహాయోగ్యులైన చతుర్ముఖ బ్రహ్మాది దేవతలర్పించిన భగవదారాధన వల్ల వారికే భగవత్ప్రసాదం-అనుగ్రహం లభిస్తుంది, కాని ఇతరులు చేసిన పూజలకు లభించదు అనే శంకను పరిహరిస్తున్న శ్లోకమిది.

"విధినాఽ ప్యర్చనా ఆచరితా తవచరణే ఆలగతి"- 'విధి' శబ్దం బ్రహ్మ, శాస్త్ర విహిత నియమం అనే అర్థద్వయం కలది. 'అపి' అనే అవ్యయం చతుర్ముఖాది సర్వాధికారులు అనే సముచ్చయార్థాన్నీ తెల్పుతుంది.

*"సాక్షా ల్లక్ష్మీపతావేవ కృతం కైంకర్యమంజసా।*
*సారకల్క విభాగేన ద్విధా సద్భిరుచ్యతే॥"*

సాక్షాత్తుగా శ్రియఃపతి విషయంలో చేయబడే పూజాది కైంకర్యం సారం అనీ, కల్కమనీ రెండు విధాలుగా ఉంటుందని వ్యాస పరాశరాది సత్పురుషులు చెప్పినారు.

*"కృతకృత్యస్య కైంకర్యం యదనన్య ప్రయోజనమ్।*
*గుర్వాది రక్షణార్థం వా తత్సారం సంప్రచక్షతే॥"*

కృతకృత్యుడు అనన్య ప్రయోజనంగా చేసిన కైంకర్యం, లేదా ఆచార్యులను, మాతాపిత్రాది గురువులను రక్షించడం కోసం చేసిన కైంకర్యం 'సారం' అని చెప్పబడింది.

"దం భార్థం పరపీడార్థం తన్నిరోధార్థమేవవా।
ప్రయోజనాంతరార్థంవా కైంకర్యం కల్క ఇష్యతే॥"

తమ వైభవాన్ని ప్రకటించుకోవడానికిగానీ, శత్రువులను పీడించడానికి గానీ, ఇతర బాధలు కలుగకుండా అడ్డుపడుటకుగానీ, వేరే ప్రయోజనాన్ని ఆశించి చేసే కైంకర్యం 'కల్కం' అనబడుతుంది.

విధినా అపి- భగవానుని నాభి కమలం నుంచి ఉద్భవించినవాడు, స్రష్టగా ప్రసిద్ధి పొందినవాడు చతుర్ముఖ బ్రహ్మ. ఆ బ్రహ్మదేవుడూ, తక్కుంగల అధికారులైన దేవతలు-పూర్వదేవతలు కూడా ప్రయోజనాంతర పరులు. తమ అధికారాన్ని భద్రంగా నిల్పుకోవడానికో, శత్రువులైన రాక్షసులను వధించడానికో, ఏదో ఒక ప్రయోజనాన్ని ఆశించి శాస్త్ర నియమానుసారంగానే బ్రహ్మాదులు భగవత్పూజను చేస్తారు. ఆ పూజ-అర్చన భగవానుని పాదాల యందే చేరుతుంది. భగవానుని అనుగ్రహమూ లభిస్తుంది.

"యద్బ్రహ్మా ఋష యశ్చైవ స్వయం పశుపతిశ్చయత్।
శేషాశ్చ ఋషయః శ్రేష్ఠాః దైత్య దానవ రాక్షసాః।
నాగాః సుపర్ణా గంధర్వాః సిద్ధా రాజర్ష యశ్చతే।
హవ్యం కవ్యంచ సతతం విధియుక్తం ప్రయుంజతే।
తత్సర్వం దేవదేవస్య చరణా వుపతిష్ఠతే॥" (మహాభారతం)

బ్రహ్మరుద్రేంద్రాది దేవతలు, మహర్షులు, రాక్షసులు అనబడే పూర్వదేవతలు యథావిధిగా హవ్యకవ్యాలను ఆచరిస్తూ శ్రియఃపతిని ఆరాధిస్తారు. హవ్య కవ్యాలకు భోక్త దేవదేవుడే.

'స్వాహా' అని ఉచ్చరిస్తూ ఉద్దేశ్యులైన దేవతలకు హవిస్సును అగ్నికుండమందు అర్పించే పూజ 'హవ్యం' అనబడుతుంది. ఇక 'స్వధా' అని పఠిస్తూ పితృదేవలకు హోమమందు సమర్పించే త్యాగద్రవ్యం 'కవ్యం' అనబడుతుంది. మంత్రతంత్రాలు కూడా వేర్వేఱుగా అనుసంధింపబడుతూ

ఆచరింపబడుతాయి. హవ్య, కవ్యరూపమైన ఈ పూజ శ్రియఃపతి యొక్క పాదాలయందే సంక్రమిస్తుంది. 'లగి-గతౌ' అని ధాత్వర్థం (పొదును-అని భావం). ఇది పూర్వార్ధమందు వివరింపబడింది. ఉత్తరార్ధం ఏకాంతులు, పరమై కాంతులు అనే మహాభాగులు చేసే కైంకర్యాన్ని విశదంగా బోధిస్తున్నది.

శేషా మివ స్వయం శిరసాగృహ్ణాతి- ఏకాంతులు, పరమైకాంతుల విషయం (53 శ్లో.) ఇంతకుముందే కొంత వివరింపబడింది కదా! "సమహాత్మా సుదుర్లభః" (భ.గీత) అన్నాడు కదా!

"జ్ఞానీతు పరమైకాంతీ పరాయత్తాత్మ జీవనః।
తత్సంశ్లేష వియోగైక సుఖదుఃఖ స్తదేకధీః॥
భగవద్ధ్యాన యోగోక్తి వందనస్తుతి కీర్త నైః।
లబ్ధాత్మా తద్గత ప్రాణ మనోబుద్ధీంద్రియ క్రియః॥" (గీతార్థ సంగ్ర.)

భగవానుని అధీనమైన జీవనం కలవాడు. భగవత్సంబంధమే సుఖంగానూ, ఆయన వియోగాన్ని దుఃఖంగానూ తలచేవాడు; భగవద్ధ్యానం, ఆరాధన, నైచ్యాను సంధానం, వందనం, స్తోత్రం, సంకీర్తనాదులచేత ప్రాణాలను ధరించి యుండేవాడు; మనస్సు, బుద్ధి, ఇంద్రియాలు అన్నీ భగవానుని యందే లయమై యుండే జ్ఞాని 'పరమైకాంతి' యనబడునని శ్రీ యామునమునులు నిర్వచించారు.

"ఇనిప్పోయ్ ఒరువన్ తనక్కుప్పణిందు కడై తలైనిత్తు
నిన్ శాయై అషివు కండాయ్" (పెరియా. 5-3-3)

నీ కృపకు పాత్రుడనైన నేను దేవతాంతరాల సన్నిధికి పోయి కాచుకుంటూ వారి కృపను అపేక్షించడం, నిన్ను అవమానపరచినట్లు కాదా! స్వామీ! అని విష్ణుచిత్తుల శ్రీసూక్తి.

సర్వశేషికి, శరణాగతిని ప్రపత్తిని అనుష్ఠించి చేసే కైంకర్యానికి వేరే ఫలాన్ని ఆశించడం, వడ్డీకి ఆశపడి డబ్బునిచ్చుట వంటిదే. భగవత్కైంకర్యానికి మోక్షాన్నీ

ఫలంగా కోరక, కైంకర్యమే ఫలమని భావించేవారి పరమైకాంతిత్వం పదహారు వన్నెలుగల బంగారంతో సమానమైనది. పంచమ వేదమందు పరమైకాంతుల ప్రభావం విపులంగా చెప్పబడింది.

కేవలం భగవత్కింకరుడైన జీవుని ధర్మం అనే అధ్యవసాయంతో ఏకాంత భక్తుడు సమర్పించే పూజను భగవానుడు శేషవస్త్రంలాగా, శిరస్సుతో సాదరంగా స్వీకరిస్తాడు. 'శేష' శబ్దానికి నానార్థాలున్నాయి.

*"శేషః సంకర్షణే వధే! అనంతే నా ప్రసాదేన స్వనిర్మాల్యార్పణే స్త్రియామ్"* (మేదినీ నిఘంటువు). తాను ధరించిన పదార్థాన్ని ఆదరంగా ఇచ్చి తన కృపకు పాత్రునిగా చేయుట. దేవాలయంలో తీర్థప్రసాద వినియోగం కంటే ముందు భాగవతోత్తములకు, భగవానునికి సమర్పించిన వస్త్రాలను, మాలికలను అర్చకుడు తెచ్చి, మాలికలను వారి గళమందు సమర్పించి, వస్త్రాన్ని తలకు చుట్టి; తీర్థాన్ని, శఠారిని భగవత్ప్రసాదంగా సమర్పించి గౌరవించే ఆచారాన్ని 'తిరుపరివట్టం' అని సంప్రదాయజ్ఞులంటారు. 'నిర్మాల్యాన్ని అర్పించుట' అనే అర్థమందు స్త్రీలింగ శబ్దంగా 'శేషాం' అని ప్రయోగింపబడింది. 'శేషాపటం' అని వ్యవహృతం.

*"సచమమప్రియః"*- (భ.గీత) అన్నట్లు, ఏకాంతులచే ఒనర్పబడిన పూజను భగవానుడు 'ధన్యోఽస్మి' అంటూ, శేషవస్త్రాన్నివలె తలవంచుకొని స్వీకరిస్తాడు.

*"జ్ఞానీత్వాత్మైవమేమతం"*- (భ.గీ.) జ్ఞానవంతుడైన 'భక్తుడు నా ఆత్మయే' అనుకొనే భగవానుడు, అతడు శాస్త్ర విహితమైన విధిని అనుసరించి పూజను చేశాడా? లేదా? అని కూడా గమనించక, ఆ పూజను తన పాదాలయందు చేర్చుకొనక, తానే తలవంచి ప్రతిగ్రహించి, సంతుష్టాంతరంగుడవుతాడు.

*"ధత్తేన తేన శిరసాతవ మౌళిమాలామ్"*- (గోదాస్తుతి-17). ఓ గోదాదేవీ! నీ కొప్పునందు ముడుచుకొని విడిచిన పూమాలికను భగవానుడు తన వంచిన శిరస్సుచే ధరించాడు అని దేశికులు స్తుతించారు.

"యాః క్రియాస్సం ప్రయుక్తాః స్యుః ఏకాంత గత బుద్ధి భిః।
తాః సర్వాః శిరసాదేవః ప్రతిగృహ్ణాతివై స్వయమ్॥
అహో హ్యేకాంతినః సర్వాన్ ప్రీణాతి భగవాన్ హరిః।
విధి ప్రయుక్తాం పూజాంచ గృహ్ణాతి శిరసా స్వయమ్॥"

ఏకాంతభక్తులు సమర్పించిన సకల కైంకర్యాలను దేవనాథుడు స్వయంగా శిరస్సుతోనే గ్రహిస్తాడు. ఏకాంతులు కాని భక్తులొనర్చిన కైంకర్యాన్ని శ్రీహరి తన పాదాలతో పరిగ్రహిస్తాడు. ఏకాంతులు సమర్పించిన సర్వవిధ కైంకర్యాలను అర్చనలను మాత్రం శిరస్సుతోనే గ్రహించి, ఏకాంత భక్తులకు పూర్ణకృపతో అనుగ్రహిస్తాడు, ఆనందింపజేస్తాడు–అని మోక్షధర్మ పర్వమందు విశేషంగా తెల్పినాడు పారాశర్యుడు.

"తోళినై మేలుమ్ నన్మార్బిన్మేలుమ్ శుదర్ముడి మేలుమ్।
తాళిణై మేలుమ్ పునైందతణ్ణన్తుషాయుడై యమ్మాన్"– (తి. 1-9-7)

ఏ విధమైన ఫలాన్ని అపేక్షింపని భక్తిరూపాపన్నజ్ఞానులు సమర్పించిన తులసిని స్వయంగా భగవానుడు తన అంజలితో పరిగ్రహించి, భక్తులకు విరోధులైన వారిని సంహరించే శంక చక్రాయుధాలను ధరించి పరాక్రమించే రెండు భుజాలపైన మొదట అలంకరించుకొన్నాడు. ఆ తర్వాత జయలక్ష్మి నివసించే వక్షఃస్థలాన్ని తులసితో అలంకరించాడు. పిమ్మట విజయలక్ష్మి ఫలితమైన ప్రభుత్వ చిహ్నంగా ఉజ్జ్వలంగా ప్రకాశించే కిరీటంమీద అలంకరించుకోగా మిగిలిన తులసిని తన పాదయుగళమందు అలంకరించుకొన్నాడు. అట్టి తులసీదళాలంకృత దివ్యసుందరమూర్తి "నాళణైన్దొన్టు మగళాన్" ప్రతిదినం నాతో కలిసియుండి, ఒకప్పుడైనా నన్ను విడువనివాడు అని నమ్మాళ్వార్లు తమ అనుభవాన్ని, భక్తులకు భగవంతునికి గల పరస్పర ఘనిష్ఠ సంబంధాన్ని 'అచ్యుత' పదస్వారస్యాన్ని అద్భుతంగా వ్యక్తపరచారు.

58. తుహముహ జోణ్హా దావిఅ
మాణస ససిఅంత పవహ సంణిహ బాహే,
అచ్చుఅ ణ ముఅసి భత్తే
కళంబ గోళ ణిహ కంట అంత ణి అంగే॥

ఛా. తవ ముఖ జ్యోత్స్నా ద్రావిత
మానస శశికాంత ప్రవాహసన్నిభ బాష్పాన్,
అచ్యుత! నముంచసి భక్తాన్
కదంబ గోళ నిభ కంటకాయమాన నిజాంగాన్॥

**అర్థం:** హే అచ్యుత!; తవ= నీ యొక్క; ముఖ-బాష్పాన్/ ముఖ= ముఖ (మండల)ం యొక్క; జ్యోత్స్నా= కాంతి అనే వెన్నెలచేత; ద్రావిత= ద్రవీకరింపబడిన- కరగినట్టి; మానస= మనస్సు అనే; శశికాంత= చంద్రకాంత శిలయొక్క; ప్రవాహ సన్నిభ= ప్రవాహంతో సమానమైన; బాష్పాన్= కన్నీళ్ళు కల్గినట్టి వారైన; కదంబ- నిజాంగాన్/ కదంబ= కడప చెట్టుయొక్క; గోళనిభ= పూమొగ్గలవలె; కంటకాయమాన= గగుర్పొడిచిన రోమాలతోనున్న; నిజ+అంగాన్= స్వీయ అవయవాలు కలవారైన; భక్తాన్= భక్తులను; నముంచసి= విడువవు.

**తా॥** అచ్యుతా! నీ ముఖకాంతి అనే వెన్నెలచేత కరగిన మనస్సు అనే చంద్రకాంత శిలనుంచి కలిగిన ప్రవాహం వలె కన్నుల్లో ఆనంద బాష్పాలు కలిగినట్టి వారైన; నీప తరువుయొక్క ముకుళాలవలె పులకించిన అవయవాలు కలవారైన భక్తులను విడనాడవు.

**వ్యాఖ్య:-** భగవంతుణ్ణి సందర్శించగానే ఆనందబాష్పాలనూ, పులకిత గాత్రాలనూ కలిగియుండే భక్తులను భగవంతుడు విడిచియుండడని సుశ్లోకితం.

నిరంకుశ స్వతంత్రుడైన శ్రియఃపతి భక్తులను విడనాడితే, అడ్డుకొనే వాడెవడు? అనే సందేహాన్ని నివృత్తి చేసే శ్లోకం.

ప్రత్యక్షంగా కనబడే ప్రాకృతిక పదార్థాల స్వరూప స్వభావాలను ప్రదర్శిస్తూ పరోక్ష విషయాలను మనస్సుకు పట్టించడమే విద్యాబోధన పద్ధతి.

భగవానుని ముఖమండలమే చంద్రబింబం. ఆయన ముఖకాన్తియే జ్యోత్స్న- "చంద్రికా కౌముదీ జ్యోత్స్నా"- (అమరం) వెన్నెల, 'ముఖజ్యోత్స్నా' అనే పదం శ్లిష్ట రూపకం. మనస్సే చంద్రకాంతశిల, చల్లని చంద్రునివెన్నెల- చంద్రిక సోకగానే చంద్రకాంతమణి కరగి, నీరై ప్రవహిస్తుంది. ఇది జడపదార్థ లక్షణం.

భగవానుడు కనబడనందువల్ల- ఎడబాటువల్ల భక్తుల మనస్సు తాపంతో వేడెక్కియున్నది. భగవన్ముఖ మండలవర్చస్సు భక్తుల మనస్సుపై పడగానే మనస్సు ప్రిదిలి, కరగి నీరై కన్నుల్లోకి చేరింది. ఇది చైతన్య లక్షణం.

చంద్రికవల్ల ద్రవించిన చంద్రకాంత శిలవలె, భగవానుని ముఖ సందర్శనం చేత ద్రవించిన భక్తుల మానసం కన్నుల ద్వారా ఆనందబాష్పాలను స్రవిస్తుంది. ఇది పూర్వార్ధ భావం.

*కదంబగోళ నిభకంటకాయమాన నిజాంగాన్*- వర్షాకాలమందు మొగ్గలు పూచిన కదంబ వృక్షశాఖలవలె గగుర్పొడిచిన రోమాలతో కూడిన శరీరావయవాలు కలవారై యుంటారు భక్తులు.

విష్ణుభక్తి-నాయకి- *"నియత పులకితాంగీ, నిర్భరానంద బాష్పా"*- అనే రెండు అనుభవాలను కలదని 'సంకల్ప సూర్యోదయం' చెప్పింది. 'శశికాంత ప్రవాహం' అనడం వల్ల ఆనందబాష్పాలకు శైత్యం సూచితం.

*"ఆహ్లాద శీత నేత్రాంబు పులకీ కృత గాత్రవాన్"*- భగవానుణ్ణి అనుభవించే విషయంలో శీతలానందాశ్రువులతో గద్గద స్వరంతో పులకిత గాత్రులై ఎల్లప్పుడు పరగుణావిష్టులై భగవద్గుణాలను అనుసంధిస్తూ ఉండేవారు భక్తులు.

*"భక్తిరష్ట విధా"*- ఎనిమిది విధాలుగా భక్తి చెప్పబడింది.

1) మద్భక్త జనవాత్సల్యం- నా భక్తుల పట్ల దయ కలిగియుండుట.

2) పూజాయాంచానుమోదం- భక్తులు చేసే పూజపట్ల సానుభూతి.

3) మత్కథాశ్రవణేభక్తిః- నా చరిత్రలను వినుటయందు ప్రీతి.

4) స్వర నేత్రాంగ విక్రియా- భక్తివల్ల స్వర, నేత్ర, అంగ వికారాలను కలిగి యుండుట.

5) స్వయమారాధనే యత్నః- స్వయంగా ఆరాధించే యత్నం చేయుట.

6) మమార్థే దంభవర్జనం- నా విషయంలో డంభం లేకుండుట.

7) మమాను స్మరణం నిత్యం- సర్వదా నన్ను స్మరించుకొనుట.

8) యచ్చ మాంచోపజీవతి- స్మరించుకున్నట్లైతే క్షణమైననూ ప్రాణాన్ని ధరించి యుండజాలక పోవడం.

ఇట్లు భగవానుడే శరణం అని దేహయాత్ర జేసే భక్తులను "మిత్ర భావేన సంప్రాప్తం నత్యజేయం కథంచన"- స్నేహభావంతో నా చెంతకు వచ్చిన వ్యక్తిని ఏ విధంగానూ విడిచిపెట్టను అని ప్రతిజ్ఞ చేసిన భగవానుడు 'న, ముంచతి' త్యజించడు కదా! "దదామి బుద్ధి యోగం తం యేన మా ముపయాంతితే"- (భ.గీ.) అన్నట్లు, ప్రీతిపూర్వకంగా భజించేవారికి బుద్ధియోగాన్ని ప్రసాదించి రక్షిస్తాడు. నాయకి "నేను విరహ తాపంతో వేడి కన్నీళ్ళను కారుస్తూ కరిగిపోవలసిందేనా? స్వామీ! ఎంత పాపమో కదా!" అని తన భావాన్ని ప్రకటించింది.

*59. సవ్వేసువి ణివ్వేరా*
*సరణాగఅ సచ్చ గహి అ సాసఅ ధమ్మా౹*
*గఅసంగా తుహభత్తా*
*జంతి తుమం ఏవ్వదుళ్ళహం ఇఅరే హిమ్॥*

ఛా. సర్వేష్వపి నిర్వైరాః
శరణాగత సత్య! గృహీత శాశ్వత ధర్మాః।
గతసంగా స్తవభక్తాః
యాంతిత్వా మేవ దుర్లభమితరైః॥

**అర్థం:** హే శరణాగత సత్య! = రక్షింపుమని వేడుకొనే భక్తులకు సత్యమైనవాడా!; సర్వేషు, అపి= అన్ని ప్రాణుల విషయంలోనూ; నిర్వైరాః= ద్వేషంలేనివారు; గృహీత శాశ్వత ధర్మాః= గ్రహింపబడిన శాశ్వతమైన ధర్మాన్ని కలవారు; గత సంగాః= తొలగబడిన విషయ సంబంధం కలవారు అయిన; తవ= నీ యొక్క భక్తాః= సేవను చేయువారు; ఇతరైః= వేరే వారిచేత; దుర్లభం= పొందరాని; త్వాం, ఏవ= నిన్నే; యాంతి= పొందుతున్నారు.

**తా॥** ఓ శరణాగత సత్యా! సకల జంతువుల యందుకూడా విరోధగంధం లేనట్టి, శాశ్వతమైన ధర్మాన్ని అవలంబించినట్టి; హేయమైన విషయాలతో సంబంధం తొలగినట్టి; నీ భక్తులు, ఇతరులచేత పొందరానట్టి నిన్ను మాత్రమే పొందుతుంటారు.

**వ్యాఖ్య:-** సర్వభూత సౌహార్దం కల భక్తులు భగవానుని సన్నిధిని చేరుతారని సుశ్లోకితం.

అచ్యుతుడు తన భక్తులను మోక్షమిచ్చునంతవరకు విడువడు అని గత శ్లోకమందు చెప్పబడింది. అదెట్లు సంభవం? అంటే భక్తులు '50'వ శ్లోకంలో, సర్వభూత సౌహార్దం కలవారు అన్న విషయాన్ని ఈ శ్లోకంలో ఇంక వివరిస్తుంది.

సర్వేష్వపి నిర్వైరాః- భక్తులు ఏ ఒక్క ప్రాణియందును ద్వేషం-వైరం-తమ హృదయంలోనైనా లేనివారు. ఇతరులు తనను ద్వేషించి అవమానపరచి నప్పుడు ఆ దోషాలు తన స్వరూపానికి సంబంధించినవి కావనుకొంటాడు.

"శప్యమానస్య యత్పాపం శపంతమను గచ్ఛతి"- తిట్లు పడేవాని పాపం తిట్టేవానితో కూడ పోతుంది అన్నట్లు, తనకు ద్రోహంచేసి తన పాపాన్ని తీసుకొని పోతున్న వ్యక్తిని 'అజ్ఞాని' అని చింతిస్తాడు.

"బద్ధ వైరాణి భూతాని ద్వేషం కుర్వంతి చేత్ తతః।
శోచ్యాన్యహోऽతిమోహేన వ్యాప్తానీతి మనీషిణా।
ఆత్మద్రుహ మమర్యాదం మూఢ ముజ్ఞిత సత్పథం।
సుతరా మనుకంపేత నరకార్చిష్మదింధనమ్॥

అన్నట్లు, పరస్పర వైరంగల ప్రాణులు పరస్పరం ద్వేషించుకొన్నట్లైతే 'అయ్యో పాపం! ఇవి చాలా అజ్ఞానంలో పడిపోయినాయి' అని పరితపిస్తాడు. తనకు ద్రోహం చేసినవాడు మర్యాదలేనివాడై, మూఢుడై, తప్పుదారిలో పోతున్నాడని ఆ వ్యక్తిని జూచి, నరకరూపమైన అగ్నిలో ఇంధనంగా పడిపోతున్నట్లు తలచి, అతని విషయంలో సానుభూతిని జూపిస్తాడు.

తన దోషాలను తనపైన నిరూపించి తాను వాటిని మరవకుండా చేసినాడని, ఉపకార స్మృతితో నుంటాడు. జీవులందఱు కర్మవశ్యులని, తనకూ తనను ద్వేషిస్తున్న వారికున్న కర్మలకు తగినట్లు, సర్వేశ్వరునిచే ప్రేరేపింపబడినవారై, తనను దూషించి, అవమానపరచినారని భావిస్తూ ద్వేషించిన వారి విషయంలో ఏ మాత్రం కోపగించుకోడు. పైగా తన ప్రారబ్ధ పాపశేషం నశిస్తుందని సంతోషిస్తాడు. కాబట్టి భగవద్భక్తులు వైరం లేనివారు.

*గృహీత శాశ్వతధర్మాః* – సిద్ధోపాయభూతుడైన సర్వేశ్వరుడే రక్షకుడనే శాశ్వత ధర్మాన్ని అవలంభించే వారు భక్తులు. "అమృతః శాశ్వతః స్థాణుః" అన్నట్లు శాశ్వతుడైన పరమాత్మయే సనాతన ధర్మమని అధ్యవసించి యుండేవాడు.

"సమస్త పురుషార్థానాం సాధకస్య దయానిధేః।
ఏమతః పూర్వ సిద్ధాత్వాత్ సిద్ధోపాయ మిమం విదుః॥"

సమస్త పురుషార్థాలను సాధించే దయానిధి, లక్ష్మీపతియైన నారాయణుడే సాధించి సంపాదింపనక్కఱ లేకుండా ముందే యుండడం వల్ల 'సిద్ధోపాయం' అనబడుతున్నాడు.

"భక్తి ప్రపత్తి ప్రముఖం తద్వశీకారకారణమ్।
తత్తత్ ఫలార్థి సాధ్యత్వాత్ సాధ్యోపాయం విదుర్బుధాః॥"

భగవానుని అనుగ్రహాన్ని పొందడానికి ఉపాయాలైన భక్తి ప్రపత్తులు, ఆయా ఫలాలను కోరేవారిచేత సాధించి సంపాదింపవలసినవి, కాబట్టి వాటిని 'సాధ్యోపాయం' అంటారు.

"ప్రసాద నస్యోపాయత్వే శాస్త్రీయేఽపి ఫలం ప్రతి।
కర్తృత్వా వ్యవధా నాద్యైః సిద్ధోపాయ ప్రధానతా॥"

సాధ్యోపాయమే (భక్తి ప్రపత్తులు) శాస్త్రం చెప్పిన ఫలాలను పొందడానికి హేతువు. అయినా కాలవ్యవధిలేనిది, కర్తృత్వాధిక్యం కూడా లేనట్టిది, సులభంగా భగవదనుగ్రహాన్ని కల్గజేయునట్టిది కాబట్టి సిద్ధోపాయమే ప్రధానమైనదని చెప్పబడింది.

"కళైవాయ్ తున్బంగళై యా తోషివాయ్ కళైకణ్ మత్తిలేన్"– (తి.వా.మొ.) నీవు రక్షించు, రక్షించకపో! నీకంటే నాకు వేరొక రక్షకుడు లేదు. "ఆవిక్కోర్ పత్తు కొమ్బు నిన్నలాలరికిన్టిలేన్"– ఆత్మకు ఆధారభూతుడుగా ఆశ్రయింపదగినవాడు నీకంటే వేరొకడు లేదు– అని స్వరూపానురూపాలైన అనుభవాలనే అనుసంధిస్తారు భక్తులు.

"పూర్వసిద్ధస్య దేశాదేః ధర్మత్వం యద్వదిష్యతే।
ఏవం తత్త్వ విదః ప్రాహుః కృష్ణం ధర్మం సనాతనమ్॥"

పూర్వం నుంచి యున్న దేశాదులు ధర్మభూతమైనవే. అట్లే, తత్త్వవేత్తలు శ్రీకృష్ణణ్ణి సనాతన ధర్మంగా జెప్పుతున్నారు. శ్రీకృష్ణుడే శరణాగత పరిత్రాణ రూపమైన ధర్మమని భరన్యాసం చేసి నిర్భరులైయుండువారు భక్తులు.

*గతసంగాః*– ఇంద్రియాలకు రుచించే, హేయమైన పదార్థాలయందు– ప్రాపంచిక భోగాల యందు తమ మనస్సును చేరనీయని వారు, నిస్సంగత్వం కలవారు భగవద్భక్తులు.

భక్తా యాంతిత్వామేవ దుర్లభమితరైః- స్వనిష్ఠాభిజ్ఞానులైన భక్తులకే తనను పొందే శక్తిని ప్రసాదిస్తాడు భగవానుడు. ఇతరులకు భగవత్ప్రాప్తి దుర్లభమే.

"మత్కర్మకృ న్మత్పరమో మద్భక్తః సంగవర్జితః।
నిర్వైరః సర్వభూతేషు యస్సమామేతిపాండవ॥"- (భ.గీ. 11-55)

తన ధర్మాలను నా ఆరాధన బుద్ధితో ఆచరించేవాడు నా సాయుజ్యాన్ని పొందడమే ప్రధానమైన ఉద్దేశంగా కలవాడు, నాకంటే వేరైన సకల ఐహిక, ఆముష్మిక పదార్థాలయందు తనకు సంబంధం లేకుండా చేసుకొన్నవాడు, సకల జీవరాశిపట్ల విరోధం లేకుండా, ప్రేమతో ప్రవర్తించే ప్రియుడైన భక్తుడు నన్నే పొందుతాడు-అని శ్రీకృష్ణుడు భక్తియొక్క అవస్థా విశేషాన్ని ప్రబోధించాడు.

"దేవాన్ దేవయజోయాంతి మద్భక్తాయాంతి మామపి"- (భ.గీ. 7-23). ఫలమిచ్చేవాడను నేనే. అయినా, దేవతలను పూజించినవారు పరిమితమైన ఫలాన్ని ఇచ్చే దేవతలను పొందుతారు. నా భక్తులు మాత్రం నన్నే పొంది, శాశ్వతమైన నా భోగాలతో సమానమైన భోగాలను అనుభవిస్తారు అని దేవతోపాసకులకూ, భగవదుపాసకులకు గల తారతమ్యాన్ని స్పష్టంగా తెల్పినాడు.

60. అహివ ఇ ణ అరింద తుమం
ఆసణ్ణం వి గ అణం వ స ఇ దుగ్గేజ్ఝమ్।
విస ఏసు విలగ్గంతా
తూరంతా వి ణలహంతి డోలంత మణా॥

ఛా. అహి పతి నగరేంద్ర! త్వాం
ఆసన్నమపి గగనమివ సదా దుర్గ్రాహ్యామ్।
విషయేషు విలగంతః
త్వరమాణా అపి న లభంతే డోలాయమాన మనసః॥

**అర్థం:** హే అహిపతి నగరీంద్ర!= ఓ అహీంద్రగనరికి నాథుడవైన దేవనాయకా!; విషయేషు= శబ్దరసగంధాదులయందు; విలగంతః= మిక్కిలి ఆశను కలవారైన; డోలాయమానమనసః= చంచలమైన మనస్సును కలిగియున్న పురుషులు; త్వరమాణాః, అపి= (నీ దర్శనానికి) త్వరపడుతున్న వారైనప్పటికి; ఆసన్నం, అపి= దగ్గరగా ఉన్నవాడవైననూ; గగనం, ఇవ= ఆకాశాన్నివలె; సదా= ఎల్లప్పుడు; దుర్గ్రాహ్యం= గ్రహింపజాలనివాడవైన; త్వాం= నిన్ను; న, లభంతే= పొందుతులేరు.

**తా॥** ఓ అహీంద్రపురనాథా! సాంసారిక సుఖాలయందు ఆశ కలిగియుండి చంచలమనస్సు కల పురుషులు నీ దర్శనం కోసం తొందరపడుతున్నవారైననూ, హృదయంలో అంతర్యామివై యున్నప్పటికీ, ఆకాశంలాగా సర్వదా తెలియశక్యం కాని నిన్ను పొందుతులేరు.

**వ్యాఖ్య:**– ఉభయ భావనలతో, చంచలాత్ములు భగవత్సన్నిధిని పొందలేరని సుశ్లోకితం.

డోలాయమాన మనసః– ఒకవైపు ప్రాపంచిక భోగాలను, సుఖాలను పొందవలెననే ఆశ, మరొకవైపు భగవానుని దర్శించాలనే అభిలాష కలవారి మనస్సు ఊయల ఊగుతున్నట్లు ఉంటుంది. ఏ ఒక్కవైపు స్థిరంగా నిల్చియుండదు. బాహ్యవిషయాలకు తహతహలాడే మనస్సుకు హృదయాకాశమందున్న అంతర్యామిని భగవానుణ్ణి చూచే కోరిక యున్నప్పటికీ అది ఊగులాడుతున్నందున దానికి స్థైర్యం లేనందున వారు దర్శింపజాలరు. చాలా సన్నిహితుడైన వానినే తెలుసుకోలేనివాడు నిరవయవమైన మహాకాశాన్ని పొందడం దుర్లభమే కదా! గగనం దుర్గ్రాహ్యం కదా! సన్నిహితుడైనను విషయ లంపటునికి భగవానుడు గగనంవలె గ్రహింపబడడు–

*"ధ్యాయతో విషయాన్ పుంసః సంగస్తే షూపజాయతే!*
*సంగాత్ సంజాయతే కామః, కామాత్ క్రోధోఽభి జాయతే॥*
*క్రోధాత్ భవతి సంమోహః సమ్మోహాత్ స్మృతివిభ్రమః।*
*స్మృతి భ్రంశాత్ బుద్ధినాశో బుద్ధినాశాత్ ప్రణశ్యతి॥"* (భ.గీ.2-62, 63).

మనస్సులో విషయాలను ధ్యానించే వ్యక్తికి వాటియందే అనురాగం అధికంగా కలుగుతుంది. ఆ రాగమే కామంగా పరిణమిస్తుంది. కామానికి అడ్డు తగిలితే కోపం పెరుగుతుంది. కోపం వల్ల అవివేకమూ, అవివేకంవల్ల స్మృతి భ్రంశం- తన ప్రయత్నమందు మరపు కలుగుతుంది. స్మృతి భ్రంశంవల్ల బుద్ధి- ఆత్మజ్ఞానానికి చేసిన ప్రయత్నం-నశిస్తుంది. బుద్ధినాశంవల్ల సంసారమందు మునిగి పూర్తిగా నశిస్తాడు. కారణమాలగా ఉన్న ఈ స్మృతి వినాశోదర్కం కదా!

"వీడుమిన్ ముత్తవుమ్"- భగవానుణ్ణి పొందవలసిన నీవు (ఆత్మ) భగవానునికి వ్యతిరేకంగా ఉన్న ప్రాకృత భోగాలమీద ఆసక్తిని సవాసనగా విడిచిపెట్టవలెనని పరోపదేశాన్ని చేశారు నమ్మాళ్వార్లు.

"భక్త్యా పరమయావాఽపి ప్రసపత్త్యా వా మహామతే।
ప్రాప్యోఽహం నాన్యథా ప్రాపః అహమేవం విధోర్జున॥"

అర్జునా! నన్ను పొందలసిన విధమెట్టిదో వినుమని నొక్కి చెప్పినాడు భగవానుడు. పరమభక్తిచేతగానీ, ప్రపత్తిని అనుష్ఠించడం వల్లగానీ నన్ను పొందవచ్చును. మరోవిధంగా నేను ఒకరిచేత పొందయోగ్యుడను కాను- అని తేట తెల్లంగా తెల్పాడు కదా!

61. భత్తా తావఅ సేవా
రసభరిఆ సఅల రక్ఖణోసు అ రుఇణా।
కరణాఇ ధరంతి చిరం
కంఖిఅ మోక్ఖా వి అచ్చుఅ తుప రవిఆ॥

ఛా. భక్తాస్తావక సేవా
రసభరితా స్సకల రక్షణోత్సుక రుచినా।
కరణాని ధరంతి చిరం
కాంక్షిత మోక్షా అప్యచ్యుత! త్వయాస్థాపితాః॥

**అర్థం:** హే అచ్యుత! = ఓ అచ్యుతా!; చిరం= చాలాకాలంగా; భక్తాః= భక్తులు; కాంక్షిత మోక్షాః, అపి= కోరబడిన మోక్షం కలవారైననూ; తావక సేవా రసభరితాః = నీకు సంబంధించిన సేవయందుండే రసంచేత పూర్ణులై; త్వయా= నీ చేత; సకల రక్షణ+ఉత్సుక రుచినా= సమస్త జనుల రక్షణయందు వేడుకగల (నీ) సంకల్పంచేతనే; స్థాపితాః= (లోకమందు) ఉంచబడిన వారై; కరణాని= కరణ కళేబరాలను-శరీరాలను; ధరంతి= ధరిస్తున్నారు.

**తా॥** ఓ అచ్యుతా! నీ భక్తులు చాలాకాలం నుంచి మోక్షఫలాన్ని ఆశిస్తున్నవారే. అయినా, నీకు సేవ చేసే రుచియందు నిండు ఆసక్తి కలవారైనందువల్ల, సామాన్య జనులందఱినీ సజాతీయులైన ఆచార్య భాగవతులే రక్షింపగల సమర్థులు అనే ఔత్సుక్యంగల నీ సంకల్పం చేతనే భూలోకమందు ఉంచబడిన కారణంవల్ల, చిరకాలం వారు దేహాలను ధరించి యున్నారు.

**వ్యాఖ్య:-** భక్తులు తమ జ్ఞానానుష్ఠానోపదేశాలచే సామాన్యజనులను రక్షిస్తారనే భగవత్సంకల్పం చేత చిరకాలం జీవిస్తున్నారని సుశ్లోకితం.

'భక్తులు' అంటే జ్ఞానానుష్ఠానపరులైన ప్రపన్నులు, ఆచార్యులు, భగవద్భాగవత కైంకర్యపరులని అర్థం. ఇట్టి మహాపురుషులు దేహ పతనానంతరం, పరమపద నాథుని యొక్క కైంకర్య సామ్రాజ్య రసానుభవాన్ని- మోక్షప్రాప్తిని కోరువారే.

"సాధ్య భక్తిస్తు సాహంత్రీ ప్రారబ్ధ స్యాపిభూయసీ"- అన్నట్లు, ప్రపత్తిని అనుష్ఠించినవారు అనాగత ప్రారబ్ధకర్మ నశించి కాలవిలంబాన్ని సహించని వారై త్వరపడుతున్ననూ, ఉభయ భావనలతో డోలాయమానులై భగవంతుణ్ణి పొందలేని జనులవలె, చిరకాలం జీవించి యుంటున్నారెందుకు? అనే ప్రశ్నకు సమాధాన మిస్తున్న శ్లోకమిది.

"సకల రక్షణోత్సుక రుచినా త్వయాచిరం స్థాపితాః"- జనులందఱు తమవలె జ్ఞానానుష్ఠానం కలవారై యుండవలెను- అని కాంక్షించే వారు ప్రసన్నాచార్యులు.

అహంకార మదమాత్సర్యాది దుర్గుణాలుగల సజాతీయులను తమ జ్ఞాన, అనుష్ఠాన, ఉపదేశాలచేత ఉద్ధరిస్తారు. ఆధ్యాత్మ గ్రంథనిర్మాణం, ఈ శేశితవ్య సంబంధాన్ని- దేవునికీ, జీవులకూ పరస్పర సంబంధంగల జ్ఞానాన్ని ఉపదేశించుట, దివినుంచి భువికి పరమకృపతో వేంచేసి అర్చామూర్తిగా వెలసిన భగవానునికి సర్వదా కైంకర్యం చేస్తూ భగవదనుగ్రహాన్ని పొందుట అనే మూడు లక్షణాలు కలవారు తత్త్వవేత్తలు. "జ్ఞానాన్ముక్తిః" అనే మాట నిజమే. అయినా, జ్ఞానపూర్ణులు మోక్షాన్ని పొందితే, ఇక సామాన్యజనులను, జ్ఞానాన్ని ఉపదేశించి, ఉజ్జీవింపజేసే వారెవరు?

"ఉపదేక్ష్యంతితే జ్ఞానం జ్ఞాని నస్తత్త్వ దర్శినః"- (భ.గీ.4-34). చిత్తు, అచిత్తు, ఈశ్వరుడు అనే తత్త్వ త్రయాన్ని దర్శించిన జ్ఞానులే (నీకు) జ్ఞానాన్ని ఉపదేశించగలరు అని శ్రీకృష్ణభగవానుడు పార్థునికి ప్రబోధించాడు కదా!

"మదీయైవ దయయా-అత్రైవ శ్రీరంగేసుఖమాస్వ"- నా కృప చేతనే నీవు ఈ భూమిమీద శ్రీరంగమందే సుఖంగా ఉండుము- అని భగవద్రామానుజులు భగవదనుగ్రహాన్ని పొందినట్లే 'శరణాగతి గద్య'లో అనుసంధించారు కదా! సకల జనుల సంరక్షణమందు కుతూహలం కలిగి సంకల్పించేవాడు భగవానుడు. రుచి అంటే సంకల్పం, అభిలాష.

"రుచిస్తు దీప్తౌ శోభాయా మభిష్వంగా భిలాషయోః"- (మేదిని) భగవద్భాగవత కైంకర్యపరులైన ప్రపన్నులు ప్రారబ్ధ కర్మశేషాన్ని అనుభవించడానికే భూమిమీద జీవిస్తున్నారనుకోవడం అపచారమవుతుంది. జ్ఞానాగ్నిచే దగ్ధమైన నిఖిల కర్మాశయం కలవారైనందున భగవానుడు వారికి మోక్షఫలప్రదానం చేయడమందు వైముఖ్య మేమాత్రం లేనివాడైననూ, కేవలం పామరజనులను ప్రసన్నహృదయులై ఉజ్జీవింపజేస్తారనే ఔత్సుక్యంగల భగవత్సంకల్పమే ప్రపన్నులు భూమిమీద దేవధారులై చిరకాలం జీవించి యుండుటకు హేతువు. భగవత్సంకల్పం పూర్తిగా నెరవేరగానే ప్రపన్నులు దేహాన్ని విడిచి, పరమపద నాథుని కైంకర్య సామ్రాజ్య భోగాన్ని అనుభవిస్తారని శ్లోకసారార్థం. "ఎన్నాల్

త్తన్నైవన్ కవిపాదుమెన్ వైగుందనాథనే"- (తి.వా.మొ. 7-9-6) శ్రీవైకుంఠనాథుడు దివ్య ప్రబంధాన్ని తనచే పూర్తి చేయించడానికే సంసారమందు ఉంచుతున్నా డన్నారాళ్వార్లు.

*62. థిరగుణ గిరి జణి ఏహిం*
*సంతారేసి ణ అసచ్చ ణి అ భత్తేహిమ్।*
*జమ్మ పరివాడి జలహిం*
*జంగమథిర సే ఉ దంసణిజ్జేహి జణే॥*

ఛా. *స్థిరగుణ గిరిజనితైః*
*సంతారయసి నతసత్య నిజభక్తైః*
*జన్మపరిపాటి జలధిం*
*జంగమ స్థిరసేతు దర్శనీయైర్జనాన్॥*

**అర్థం:** హే నతసత్య!; స్థిరగుణ గిరిజనితైః= స్థిరమైన గుణాలు అనే పర్వతాల చేత కలిగినట్టి; జంగమ స్థిరసేతు దర్శనీయైః= నడయాడే చలించని సేతువు వలె చూడదగినట్టి; నిజభక్తైః= నీ భక్తులచేత; జనాన్= జనులను; జన్మపరిపాటి జలధిం= జనన (మరణ) క్రమం అనే సముద్రాన్ని; సంతారయసి= దాటింపజేస్తున్నావు.

**తా॥** ఓ నతసత్యా! మార్పులేని సౌహార్దాది గుణాలు అనే దృఢమైన పర్వతాలచే నిర్మింపబడినట్టిది కాబట్టి నడయాడే స్థిరమైన సేతువువలె దర్శనీయులైన నీ భక్తులచేత జనన మరణ క్రమమనే సముద్రాన్ని తరింపజేస్తున్నావు.

**వ్యాఖ్య:-** భగవద్భక్తుల జనులను సంసార సాగరం నుంచి తరింప జేస్తారని వర్ణితం.

గత శ్లోకమందు సకల జనులను రక్షిస్తారనే సంకల్పంచేత భక్తులను భూమిమీద భగవానుడు చిరకాలముండునట్లు చేశాడు అని చెప్పబడింది కదా! ఆ భక్తులు జనులను రక్షించే విషయం ఇంక వివరింపబడుతున్నది. "సేతుం దృష్ట్వా సముద్రస్యబ్రహ్మహత్యాం వ్యపోహతి"- భక్తులు సేతువువంటివారు. సేతువు స్థిరమైన పర్వతాలచే నిర్మింపబడింది. సేతువును దర్శించి, అక్కడ సముద్రమందు స్నానం చేసి, జనులు పునర్జన్మ లేకుండా ముక్తిని పొందుతారు. ఆ సేతువువలె భక్తులు దర్శనీయులు. వీరు నడయాడే సేతువువంటి వారు. పర్వతాలవలె భక్తుల గుణాలు స్థిరమైనవి మార్పులేనివి. సౌశీల్యం, వాత్సల్యం, సర్వజన సౌహార్దం మొదలైన గుణాలచేత ఏర్పడిన వారి సంకల్పం చాలా సత్తా కలది.

"దీనబంధుర్దయాళుః"- అని ప్రసిద్ధిని పొందినవారు ఆచార్యాది భాగవతులు. సేతువును దర్శించిన జనులు పావనులౌతారు. పరమశక్తుల దర్శనం చేత జనులు పవిత్రీకరింపబడుతారు. పరిశుద్ధాత్ములవుతారు. సముద్రాన్ని దాటడానికి సేతువు-వంతెన-ఉపయోగపడినట్లే,నడయాడే మహనీయులే-జంగమ వస్తువే-స్థిర సేతువుగా భావించడానికి వారు సన్మార్గాన్ని చూపి, ఆ మార్గంలో నడిపించి, మళ్ళీ పుట్టడం గిట్టడం అనే క్రమమున్న సంసారమనే సముద్రం యొక్క ఆవలి తీరానికి చేర్చడమే మూలకారణం. "పరిపాటిరను క్రమః"- (అమరం). భగవానునికి సేవ చేసినవారు చేబట్టిన కార్యం సిద్ధిస్తుందో లేదో సంశయగ్రస్తమే. భగవద్భక్తులకు సేవ చేయడమనే ఆసక్తి కలవారు మాత్రం సంకల్పించిన కార్యం సిద్ధింపదనేది లేనే లేదు అనడంలో సందేహమే లేదు. ఈ శ్లోకమే ప్రమాణం.

"సిద్ధిర్భవతివా నేతి సంశయోఽచ్యుత సేవినామ్।
అసంశయోఽత్ర తద్భక్త పరిచర్యర తాత్మనామ్॥"

ఎప్పుడు కూడా మారనట్టి, స్థిరమైన సద్గుణాలు కల భగవత్ప్రావణ్యులే ముక్తి మార్గాన్ని చూపించి, సంసార ప్రతిబంధకాలనుంచి జనులకు విముక్తిని కల్పిస్తారు. "గుణాః పూజాస్థానం"- (ఉ.రా.చ.).

శ్రియఃపతి సతసత్యుడే. జంగమ స్థిరసేతువుగా నున్న ప్రపన్నులను సకలజనుల రక్షణకై భూమిమీద చిరకాలం జీవించి యుండునట్లు చేయడం కేవలం భగవత్కృపయే. భక్త శబ్దం ఆచార్య పరమైన అర్థం కలది. కాబట్టి -

"పశుర్మనుష్యః పక్షీవా యే చవైష్ణవ సంశ్రితాః।
తేనైవ తే ప్రయాస్యంతి తద్విష్ణోః పరమం పదమ్॥"

పశువు, పక్షి, మనిషి యెవరైనను సరె! ప్రాణులు విష్ణుభక్తియందు ప్రవణులైన సదాచార్యులను ఆశ్రయించడం వల్లనే వైకుంఠుని సన్నిధికి చేరుతారు.

"పాపిష్ఠః క్షత్రబంధుశ్చ పుండరీకశ్చ పుణ్యకృత్।
ఆచార్యవత్తయా ముక్తౌ తస్మాదాచార్య వాన్ భవేత్॥"

క్షత్రబంధువు పాపాత్ముడు. పుండరీకుడు పుణ్యాత్ముడు. వీరిద్దఱు ఆచార్యులను ఆశ్రయించి చరమోపాయం ఉపదేశింపబడినారు. పాపహతుడైనా, పుణ్యయుతుడైనా, పుండరీకునివలె క్షత్రబంధువు కూడా ఆచార్యాభిమాన రూపమైన, నిష్ఠచేత, ఇద్దఱూ ముక్తిని పొందినారు. సకలజన సంరక్షణమనే భగవత్సంకల్ప ఫలితమిది.

63. పసమిఅ భవంతరభ ఆ
పత్తం పత్తం పిాఅం తి పరిపేచ్ఛన్తా।
భావేంతి తుజ్ఝభత్తా
పిఆఇహిం వ ణఅసచ్చ పచ్చిమ ది అహమ్॥

ఛా. ప్రశమిత భవాంతరభయాః
ప్రాప్తం ప్రాప్తం హితమితి పరిపశ్యంతః।
భావయంతి తవ భక్తాః
ప్రియా తిథిమివ నతసత్య! పశ్చిమ దివసమ్॥

**అర్థం:** హే నతసత్య!= ఆశ్రితులపట్ల సత్యభూతుడా! దేవనాయకా!; తవ= నీ యొక్క భక్తాః= భక్తులు; ప్రశమిత భవ+అంతర భయాః= పోగొట్టబడిన మరొక జన్మవల్ల భయం కలవారు; (అత ఏవ= కావుననే); ప్రాప్తం ప్రాప్తం= అప్పటికప్పుడే పొందిన కర్మఫలాన్ని; హితం, ఇతి= అనుకూలమైనదని; పరిపశ్యంతః= చూస్తున్నవారై; పశ్చిమ దివసం= అంతిమ దినాన్ని; ప్రియ+అతిథిం, ఇవ= ప్రీతి కలిగిన అతిథినివలె; భావయంతి= తలచుచున్నారు.

**తా॥** ఓ నతసత్యా! నీ భక్తులు వేరొక జన్మ కలుగుతుందనే భయం ప్రపత్త్యనుష్ఠానంచేత పోగొట్టబడినవారే. గడచిన కాలంలో సాధారణంగానే ఉండి మిగతా కాలమందు అప్పటికప్పుడు సంభవించిన కష్టాలను తమకు అనుకూలమైన వాటిగానే అనుభవిస్తున్నవారై, అంతిమ దినానికై ఎదురుచూస్తూ (మృత్యువును) ఇష్టమైన అతిథినివలె సంభావిస్తూ, కాలాన్ని గడుపుతుంటారని తాత్పర్యం.

**వ్యాఖ్య:-** ప్రపన్నులు సంతోషంగా మరణదివసం కోసం ప్రతీక్షిస్తూ శేష జీవితాన్ని గడపుతుంటారని సుశ్లోకితం.

అర్చామూర్తికి సర్వవిధ కైంకర్యాన్ని సమర్పిస్తూ ఇప్పుడున్న శరీరాన్ని ప్రపత్త్యనుష్ఠానంతో సహిస్తున్నట్లే, ప్రపన్నులు మరొక జన్మలోనూ శరీరాన్ని సహించేవారైనచో వారికి మోక్షప్రాప్తి ఎప్పటికీ ఉండదు కదా! అనే శంకను పరిహరిస్తున్న శ్లోకమిది.

ప్రశమిత భవాంతర భయాః భక్తాః- పరమపదమందు నిత్యసూరులు, ముక్తాత్మలు చేసే భగవత్కైంకర్య రసానుభవం ఈ జన్మలో భక్తులకు ఇక్కడనే

భగవద్భాగవత కైంకర్యం చేసి పొందే అవకాశమున్నది. 'శరణాగతులైన వారి సర్వపాపాలను తొలగించి మోక్షమీయగలను' అని శ్రీకృష్ణ భగవానుడు చరమోపాయాన్ని అనుగ్రహించాడు కదా!

"అనారబ్ధ కార్యే ఏవతు పూర్వే తదవధేః"- అనియు "భోగేనత్వితరేక్షప యిత్వాథ సంపద్యతే"- అని వేదవ్యాస మహర్షి బ్రహ్మసూత్రాలతో భగవానుని వ్యవస్థను సూచించాడు.

పూర్వకృతకర్మలు ఆరబ్ధకార్యాలు, అనారబ్ధకార్యాలు అని రెండు వర్గాలుగా విభజింపబడి యుండును. పుణ్యపాపకర్మలు తమ ఫలానుభవాలనిస్తూ ఆచరణలోకి వచ్చిన ఆరబ్ధకార్యాల ఫలితంగానే ఈ జన్మలో దేహం వచ్చింది. ఇక రాబోయే జన్మలలో అనుభవించడానికి నిల్వలో ఉన్నట్టి సంచితాలైన అనారబ్ధ కార్యాలను భగవానుడు ప్రపన్నుల పట్ల ఫలానుభవానికి రాకుండా నశింపజేస్తాడు.

ఆరబ్ధకార్యాల ఫలితంగా వచ్చిన ఈ దేహంతో ఆచరణలోకి వస్తున్నవాటిని ఎవరైనను అనుభవించి తీర్చుకొనవలసినవే. ఫలితమీయడానికి ఆరంభమైన కర్మశేషాన్ని అనుభవింపజేస్తూ, ప్రపన్నులకు ఆ జన్మలోనే దేహాంతమందు భగవానుడు ముక్తిని ప్రసాదిస్తాడని శాస్త్రసిద్ధాంతం. ఇట్లు శాస్త్రమే భగవదాజ్ఞ యని మహావిశ్వాసంతో ప్రవర్తించే ప్రపన్నులకు అనారబ్ధ కార్యాల ఫలితాన్ని భగవానుడు నశింపజేయడం వల్ల, మరొక జన్మ కలుగుతుందనే భయం ఉండదు అని అర్థం.

ప్రాప్తం ప్రాప్తం హితమితి పరిపశ్యంతః- గడిచిపోయిన కాలం ధన్యమైనదని, ఆరబ్ధ కార్యశేష ఫలితంగా, ఎప్పటికప్పుడు పొందిన కాయక్లేశాలను అనుభవిస్తూ కాలవిలంబనాన్ని సహిస్తుంటారు. క్షుద్రమైన ఖ్యాతి లాభపూజాదులను చేయరు.

"పావియేనై పలనీ కాట్టిప్పడుప్పాయో"- (తి.వా.మొ.) ఆర్త ప్రపన్నులు "జన్మమృత్యుపరం పరారూపమైన ఈ దుఃఖసముద్రంలో పాపిపైన నన్ను ఇంక

ఎంతకాలం పడవేసి యుంచుతావు స్వామీ!" అని ప్రార్థిస్తుంటారు. దృప్త ప్రపన్నులు కర్మశేషమనుభవించవలసినదే కదా! అని తలచి "పాపం వ్యాధిరూపంగా సంభవించినదని దాన్ని అనుభవించడం వల్ల పాపం కడుగబడుతున్నది కాబట్టి అనుభవిస్తున్న ఆపదలను హితకరమైనవి, మంగళోదర్కమని భావిస్తారు. సంతోషంగా కృష్ణానుస్మరణం చేస్తుంటారు.

"ప్రత్యూషతాంభజతి సంసృతికాళరాత్రేః"- (అధికార సంగ్రహం-60) సంసారమనే కాళరాత్రి తొలగి సుప్రభాత మేర్పడుతుందనే మహావిశ్వాసం కలవారు ప్రపన్నులు.

పశ్చిమదివసం ప్రియాతిథిమివ భావయంతి- కృతకృత్యులై ప్రపన్నులు శేషజీవితాన్ని ప్రతిబంధకంగా భావించక, మరణించే దివసాన్ని ప్రియమైన అతిథిని సంభావించే రీతిగా ప్రతీక్షిస్తూ గడుపుతుంటారు.

"కృతకృత్యాః ప్రతీక్షంతే మృత్యుం ప్రియమివాతిథిమ్"- ఆచార్యోపదేశం వల్ల భగవద్భాగవత కైంకర్యం నిష్ఠులై జీవిస్తున్న ప్రపన్నులు మృత్యువును అతిథిని ప్రేమతో ఆదరించే విధంగా స్వాగతిస్తారు. విషయ వైలక్షణ్యాన్ని బట్టి, విరహోత్కంఠిత యందున్న ప్రాప్యత్వరను తెల్పిన కాళిదాసకవి మాట స్మరణీయం.

"శేషాన్మాసాన్ విరహదివస స్థాపిత స్యావధేర్వా
విన్యస్యంతీ భువిగణ నయా దేహళీదత్తపుష్పైః॥"- (మే.సం. 2-24)

యక్షుని భార్య వియోగారంభం నుంచి వియోగాంతం దాకా మిగిలిన నెలలలో గుమ్మం- కడపమీద ప్రతిదినం పూలను పెట్టి, ఒక్కొక్క నెల పూర్తికాగానే ఒక్కొక్క పువ్వును తీసి భూమిపై నుంచి మిగిలిన పూలను లెక్కపెడుతూ కాలం గడుపుతుంటుంది.

"శేషాయుష్యపి శేషిదంపతి దయాదీక్షా ముదీక్షామహే"- (అధి.సం.72) శ్రీమన్నాథయామున యతివరాదుల సిద్ధాంతాన్ని అనుసరించి, మిగలిన

జీవితకాలంలో ఉభయ విభూతి శేషి దంపతులై శ్రీ శ్రీనివాసులు దయతో చేసిన "మోక్షయిష్యామి" అని సంకల్పరూపమైన దీక్షను గూర్చి ప్రతీక్షిస్తుంటారు. పరమపద ప్రాప్తికోసం ఎదిరిచూస్తుంటారు.

*64. పఅడ తిమిరమ్మి భువణే*
*పత్తపడిట్ఠా విఅ పరమ ణాణ ప ఈవా,*
*ణిజ్జంతి అచ్చు అ తుఏ*
*ణిఅం పఅం స ఇ సఅం పహం కఅ కజ్జా!!*

ఛా. *ప్రకట తిమిరే భువనే*
*పాత్ర ప్రతిష్ఠాపిత పరమజ్ఞాన ప్రదీపాః,*
*నీయంతేఽచ్యుత! త్వయా*
*నిజం పదం సదా స్వయం ప్రభం కృతకార్యాః॥*

**అర్థం:** హే అచ్యుత!; ప్రకటతిమిరే= వ్యాపించియున్న అజ్ఞానాంధకారం గల; భువనే= లోకమందు; పాత్ర ప్రతిష్ఠాపిత పరమ జ్ఞాన ప్రదీపాః/ పాత్ర= యోగ్యుడైన జనుడు అనే పాత్రయందు; ప్రతిష్ఠాపిత= చక్కగా స్థాపింపబడినట్టి; పరమ ఉత్కృష్టమైన= జ్ఞాన; ప్రదీపాః= జ్ఞానం అనే పెద్ద దీపం కలిగిన; కృతకార్యాః= చేయబడిన కార్యాలు కలిగిన మహాత్ములు; సదా= ఎల్లప్పుడు; స్వయం ప్రభం= స్వయంగా ప్రకాశించే; నిజం, పదం= నీదైన పరమపదాన్ని; త్వయా= నీ చేత; నీయంతే= పొందింపబడుతున్నారు.

**తా॥** అజ్ఞానమనే అంధకారం బాగా వ్యాపించియున్న ఈ లోకమందు సచ్ఛిష్యుడు అనే పాత్రయందు బ్రహ్మజ్ఞానం అనే ఉజ్జ్వల దీపాన్ని వెలిగించిన వారు కృతకృత్యులు. కాబట్టి లోకోపకారులైన ఆ మహాత్ములను ఎల్లప్పుడు ఎడతెగకుండా ప్రకాశించే పరమపదమనబడే నీవు ఉండే చోటికి నీవే తీసుకొని పోతావు కదా స్వామీ!

వ్యాఖ్య:- కృతకృత్యులైన ఆచార్యాది భాగవతులకు భగవానుడు చేసే ఉపకారం వర్ణితం.

భక్తులకు దేహావసానమంద మోక్షం కలుగుతుందనే అపేక్ష- ఆ దినం ముక్తివాసరమనే విశ్వాసమున్నప్పటికీ, ఒకవేళ స్వతంత్రుడైన భగవానుడు తన సంకల్పిత కార్యాలను-అభిమత విషయాలను నిర్వహించడానికి మరొక జన్మను కల్పిస్తే చేసేదేమి? అని అడిగితే ఈ శ్లోకమే సమాధానం.

ప్రకటతిమిరే భువనే- ఇది ప్రకృతిమండలం. భగవత్ జ్ఞాన తిరోధానకరి. జంతువుల ఇంద్రియాలన్నీ ప్రాకృత పదార్థాలవైపు అభిముఖంగా నున్నవి. అంటే వాటిని అనుభవించడానికి నోరు తెరచుకొని యున్నట్లు కనబడుతున్నాయి కదా! హృదయంలో వెలిగే పరమాత్మను-అంతర్యామిని అంతర్ముఖులై చూడాలనే జ్ఞానం లేనివి. ఆత్మజ్ఞానం కలదే కాని దేహంచేత అది ఆచ్ఛాదింపబడి, సంకుచితమై యున్నది. కాబట్టి కటిక చీకటివంటి అజ్ఞానం లోకమందు అంతటా వ్యాపించి యున్నది. బోనులో బలమైన ఆకర్షణీయమైన మృగాన్ని పెట్టి తక్కిన మృగాలను వశపరచుకొనే ఉపాయం పన్నబడినట్లే, భగవానుడు జీవులను తన వశం చేసుకోవడానికి సజాతీయులను-జ్ఞానబలంతో ఆకర్షించే జీవులను ఈ లోకమందు తన సంకల్పంచేత నియమించి యుంచినాడు. వారే భక్తులు-ప్రపన్నులు. ఆచార్యులు భగవానుని అభిమతాన్ని చక్కగా ఈ జన్మమందే నిర్వహించే సమర్థులు.

"విష్ణోః కర్మాణి పశ్యత"- విష్ణుమూర్తి యొక్క కార్యాలను చూడండి- అనే శ్రుతి వాక్యార్థం ఈ విషయాన్నే వివరిస్తుంది.

పాత్ర ప్రతిష్ఠాపిత పరమజ్ఞాన ప్రదీపాః- బాగా శుద్ధిచేసిన పాత్ర-ప్రమిదయందు ఉజ్జ్వలమైన దీపాన్ని వెలిగించినట్లు, యోగ్యుడైన శిష్యునికి ఆచార్యుడు సంప్రదాయ జ్ఞానాన్ని-ఋషులు, ఆళ్వార్లు మొదలైన మహాత్ముల నుంచి పరంపరగా పొందిన బ్రహ్మజ్ఞానాన్ని- నిరపాయమై యుండునట్లు ఉపదేశిస్తాడు.

ప్రదీపం అంటే అల్పమైన దీపమైతే, చిన్న గాలికి కూడా ఆరిపోతుంది. కాబట్టి గాలికి ఆరిపోనట్టి బాగా వెలిగే నందా దీపంలాగా, అల్పజ్ఞానం కాక హేతువాదాలను ఎదుర్కొనే యుక్తి యుక్తమైన జ్ఞానవర్ధకమైన పరమజ్ఞానం తత్త్వ విదులచే ఉపదేశింపబడుతుంది.

"*మానం ప్రదీపమివ కారుణికో దదాతి*" అన్నారు భట్టరు. కరుణాపయోనిధి యైన శ్రియఃపతి ప్రామాణిక శాస్త్రాన్ని ప్రదీపం వలె అనుగ్రహించాడు.

"*శ్రుతి వివిధ పరీక్షాశోధితే క్వాపి పాత్రే*"– అన్నట్లు, సత్పాత్రుడైన శిష్యునియందే బాగా వెలుగుతుందని ఆచార్యుడు "*ప్రదిశతి నిరపాయం సంప్రదాయ ప్రదీపమ్*"– (ర.త్ర.సా.) సంప్రదాయ జ్ఞానమనే ప్రదీపాన్ని ప్రతిష్ఠాపిస్తాడు.

"*పాత్ర విశేషేన్యస్తం గుణాంతరం వ్రజతి శిల్పమ్*"– (మాళ 1–6). వాన చినుకు ముత్తెపుచిప్పలో పడి ముత్యం అయినట్లు గురువు, యోగ్యునికి చెప్పిన విద్య విశేష గుణాన్ని పొంది భాసిస్తుందన్నాడు కాళిదాస మహాకవి. అప్పుళ్ళార్ వెలిగించిన ప్రదీపం స్వామి దేశికన్. ఈ విధంగా ప్రపన్నులు 'కృతకార్యాః' అంటే చేయవలసిన పనులన్నీ పూర్తిగా చేసినవారు అని అర్థం. కృతకృత్యులని భావం.

"*పాత్రస్థ మాత్మజ్ఞానం చ కృత్వాపిండం సముత్సృజేత్।*
*నాంతర్ధాయ స్వయంయాతి జగద్బీజమ బీజకృత్॥*" (ర.త్ర.సా.)

యోగ్యుడైన శిష్యునికి ఆత్మజ్ఞానాన్ని ఉపదేశించి శరీరాన్ని విడనాడాలి. "జగత్కారణుడైన శ్రీమన్నారాయణుని పొందే జ్ఞానాన్ని ఇతరులకు బోధించక దేహాన్ని త్యజించకూడదు" అన్నది భగవదాజ్ఞ. అందువల్ల ఈ జన్మలోనే కృతకృత్యు లవుతారు. "*యతో వ్రతాని పస్పశే*"– (శ్రుతి) భగవానుడు తనచే నియమితమైనట్టి, జ్ఞానులచే నెరవేర్చబడినట్టి కార్యాలను చూస్తాడు.

భగవదనుగ్రహంచేత కృతకృత్యులైన భక్తులను ఈ జన్మ అంతం కాగానే ఆదరంతో అర్చిరాది మార్గంగా, సదా స్వయం ప్రభుం నిజం పదం నీయంతే- సూర్యచంద్రాగ్నుల తేజస్సు లేకుండా, తనంత తాను దేదీప్యమానంగా ఉన్నత వైకుంఠానికి సర్వేశ్వరుడు తీసుకొనిపోతాడు. కాబట్టి, భగవద్భక్తులకు పునర్జన్మ ఉండదు- అనడం నిర్వివాదాంశం.

65. దిఢ తివ్వ భత్తిణఅణా
పరిపేచ్ఛంతా అహింద ఉరణాహతుమమ్।
పత్తా తుహ సా ఉజ్జం
పంతిం పూరేంతి పణ్ణఇంద ముహాణమ్॥

ఛా. దృఢ తీవ్ర భక్తి నయనాః
పరిపశ్యన్తోఽ హీంద్ర పురనాథ! త్వామ్।
ప్రాప్తాస్తవసాయుజ్యం,
పంక్తిం పూరయన్తి పన్నగేంద్ర ముఖానామ్॥

**అర్థం:** హే అహీంద్ర పురనాథ!= ఓ అహీంద్రపురప్రభూ!; దృఢ, తీవ్ర, భక్తి నయనాః= చంచలం కానట్టి, తీవ్రమైన భక్తి అనే కన్నులు గలవారై; త్వాం= నిన్ను; పరిపశ్యంతః= చూస్తున్న భక్తులు; తవ= నీ యొక్క సాయుజ్యం= సాయుజ్యమనే మోక్షాన్ని; ప్రాప్తాః= పొందినవారై; పన్నగేంద్ర ముఖానాం= ఆదిశేషుడు మొదలైనవారి యొక్క పంక్తిం= శ్రేణిని-గోష్ఠిని; పూరయంతి= సంపూర్ణం చేస్తుంటారు.

**తా॥** ఓ అహీంద్రపురనాథా! దృఢమైన, తీవ్రమైన భక్తి అనే నయనాలను కలిగి నిన్ను సేవిస్తున్న భక్తులు నీ సాయుజ్యాన్ని పొందినవారై ఆదిశేష విష్వక్సేనాదుల గోష్ఠిని పూరిస్తారు.

**వ్యాఖ్య:-** భక్తి నయనులై భగవంతుణ్ణి సేవించే సాయుజ్యాన్ని పొందిన భక్తులచేత నిత్యసూరుల గోష్ఠి సంపూర్ణంగా శోభిస్తుందని వర్ణితం.

దృఢ తీవ్ర భక్తి నయనాః- అనంతగరుడ విష్వక్సేనాది నిత్యసూరులు ఉండగా, భగవానుడు భక్తులను కూడా పరమ పదానికి చేర్చడం ఎందుకు? అంటే, "భక్తి క్రీతో జనార్దనః"- "జ్ఞానీత్వాత్మైవ మేమతం" అన్నట్లు ఈ భక్తులు నిత్యసూరులలో చేరకుంటే ఆ గోష్ఠి పరిపూర్ణంగా శోభించదు అని భక్తవత్సలుడైన భగవానుని అభిమతం. పరమభక్తులు కాబట్టి, భగవానుని విశ్లేషం కలుగుతుందేమో అని భయపడేవారు. వారి భక్తి దృఢమైనది అంటే చంచలమైనది కాదు. భగవానుని దివ్యస్వరూప గుణ విభూతులు-రేచీకట్లుగా ఒకే వస్తువు, రెండుగా కనబడేటట్లు ఉండే కన్నులు కావు వారి కన్నులు. చర్మచక్షువులచే కానరాని వస్తువులను కూడా ప్రత్యక్షంగా చూచే తీవ్రదృష్టి కలవి. భక్తియే జ్ఞానంగా పరిణమించడం చేత పరమపదనాథుని దివ్యమహిమను, సాక్షాత్తుగా అతీంద్రియ విషయాలనూ చూడగలిగే భక్తిరూప నేత్రాలు కలవారు. అంతే కాదు;

తవ సాయుజ్యం ప్రాప్తాః-మోక్షం నాలుగు విధాలుగా ఉంటుంది.

"సాలోక్యం చాపి సారూప్యం సామీప్యం చతతః పరం।
సాయుజ్యమితి ముక్తిస్తు ప్రోక్తావిద్భిశ్చతుర్విధా॥"

సాలోక్యం, సారూప్యం, సామీప్యం, సాయుజ్యం- అని ముక్తి రూపాలు నాలుగు రకాలని విజ్ఞులు చెప్పినమాట. ఈ ముక్తి రూపభేదాలు సాధన వైషమ్యాన్ని బట్టి ఫలవైషమ్యం కలవి. 'సాయుజ్యం' అంటే 'సయుక్' యొక్క భావం. ఒకే భోగ్యవస్తువును ఒకరితో కూడా యుండి అనుభవించేవాడు 'సయుక్' అనబడతాడు.

"సాయుజ్యముభయోరత్ర బోక్త వ్యస్యావిశిష్టతా!"- 'బ్రహ్మం' అనే భోగ్యవస్తువునందు బ్రహ్మం మరియు ముక్తపురుషుడు- ఆత్మపరమాత్మలు- ఉభయులు భేదం లేకుండా భోక్తలై అన్వయిస్తారు. కాబట్టి 'సాయుజ్యం' అనబడుతున్నది. "సామరస్యంహి సాయుజ్యం"- శాకటాయనుని మాట ఇది. "భోగ మాత్ర సామ్యలింగాచ్చ" అని బ్రహ్మ సూత్రం.

"జగద్వ్యాపారవర్జం"- ముక్తునికి జగత్సృష్టిలో జోక్యం లేదు- అని చెప్పిన తర్వాత భోగానుభవ విషయంలో సామ్యం కలదని శ్రీ వ్యాసమహర్షి తెల్పినాడు.

"నిరంజనః పరమం సామ్యము పైతి" అని ఛాం.ఉపనిషత్తు తెల్పింది. "మమసాధర్మ్య మాగతాః"- ముక్తులు నాతో సమానధర్మాన్ని పొందుతారని గీతాచార్యుడూ చెప్పినాడు.

వివరంగా చెప్పితే సామ్యభావమిలా ఉంటుంది- ముక్తపురుషుడు జగత్తును సృజింపజాలకున్ననూ, పొలంలో కృషిచేసే తండ్రి, ఇంట్లో ఉన్న బిడ్డలు కలిసి, తండ్రి చేసిన వ్యవసాయ ఫలాన్ని అనుభవించే రీతిగా, జగత్సృష్టిని సర్వేశ్వరుడు చేస్తుండగా కలిగే రసం, అతనికెట్లో ఆయన చేస్తుండగా చూస్తున్న ముక్తాత్మలకు కూడా అది సమానమే అని సాయుజ్య లక్షణం చెప్పబడింది. ముక్తాత్మ సర్వేశ్వరునితో సామ్యాన్ని పొందుతాడన్నందువల్ల 'ఐక్యం' అనే అర్థం కలుగదు. ఒకవేళ ముక్తదశ యందు సర్వేశ్వరునితో 'ఐక్యం' అని చెప్పితే ఆ చోట "రామసుగ్రీవయో రైక్యం దేవ్యేవం సమజాయత"- (సుం.కాం) హనుమంతుడు సీతతో రామునికీ సుగ్రీవునికి ఇరువురికి 'ఐక్యం' ఇట్లు కలిగినది అని చెప్పిన విధంగా భేదశ్రుతులకు విరోధం కలుగకుండా అర్థం చేసుకోవాలి.

సర్వవ్యాపియై అంతర్యామిగా ఉండేవాడు భగవానుడు. ఇరవైయైదవ తత్త్వమైన జీవుడు వేఱు. భగవంతనిపైన మనస్సును లగ్నం చేసినందువల్ల జీవుడు దేవుడు ఒక్కడే యని కొందఱు భావిస్తారు. కాని, "ఉత్తమః పురుషస్త్వన్యః"- దేవుడు జీవునికంటెను వేరైనవాడు- అని శ్రీకృష్ణ భగవానుడే నొక్కి చెప్పినాడు కదా!

పన్నగేంద్ర ముఖానాం పంక్తిం పూరయంతి-అనంత గరుడ విష్వక్సేనాది నిత్యసూరులు సంసారమనే వాసనకూడా లేనివారు. పరమపదనాథుణ్ణి సర్వదా కనువిందుగా సేవిస్తూ, స్తుతిస్తూ జాగ్రదవస్థలో ఉండి ప్రకాశించేవారు. ముక్తాత్మలు కొంతకాలం సంసారమందు ఉండి భగవద్భక్తులై పరమపదం చేరి, నిత్యసూరివర్గం వలె పరవాసుదేవుణ్ని సేవిస్తుంటారు. ముక్తాత్మలు నిత్యసూరుల మధ్యలో

చేరనంతవరకు ఆ గోష్ఠి-పంక్తి నిండుగా నుండదు. ముక్తాత్మలు నిత్యసూరులతో కూడి పరవాసుదేవుని సేవిస్తూ బ్రహ్మానంద సాగరాంతర్మగ్ను లవుతారని సారార్థం.

66. సణ్ణఅ సుల హం అచ్చు అ
సమాహి సోవాణ కమ విలంబ విముహి ఆ।
సరణం గంతూణ తుమం
ముత్తా ముఉఉండ ఖత్తబంధుప్పముహా॥

ఛా. సన్నతసులభమచ్యుత!
సమాధిసోపాన క్రమ విలంబ విముఖితాః।
శరణం గత్వాత్వాం
ముక్తా ముచుకుంద క్షత్రబంధు ప్రముఖాః।

**అర్థం:** హే అచ్యుత!= ఓ అచ్యుతా!; ముచుకుంద, క్షత్రబంధు ప్రముఖాః= ముచుకుందుడు, క్షత్రబంధువు మొదలైనవారు; సమాధి-విముఖితాః/ సమాధి= యోగం యొక్క సోపాన= పడికట్లయొక్క క్రమ= వరుసచేత (కలిగే); విలంబ= కాలం యొక్క ఆలస్యంచేత; విముఖితాః= ఇష్టపడని వారై; సంనత సులభం= వంగి నమస్కరించే వారిచే సుఖంగా పొందదగినవాడవైన; త్వాం= నిన్ను; శరణం, గత్వా= శరణమును పొంది; ముక్తాః= ముక్తులైనారు.

**తా॥** ఓ అచ్యుతా! ముచుకుందుడు, క్షత్రబంధువు మొదలైన భక్తులు కర్మయోగ, జ్ఞానయోగ, భక్తియోగాల యొక్క పడికట్ల క్రమాన్ని పాటించడం వల్ల దీర్ఘకాలాన్ని సహించలేక భక్తిమార్గాన్ని ఇష్టపడక ఉండినారు. సదాచార్యుల ఉపదేశాన్ని పొంది ప్రపత్తిని అనుష్ఠించారు. శరణాగతులై సుఖలభ్యుడైన శ్రియః పతియొక్క అనుగ్రహంచేత పరమపదం చేరి ముక్తాత్మలుగా భాసించారు.

**వ్యాఖ్య:-** భక్తులు ముక్తులవడానికి కాలవిలంబాన్ని సహించలేక, ప్రపన్నులై ముక్తిని పొందినారని సుశ్లోకితం.

"త్రిభువనైక మూలమాస్వాదయన్తి"- నే (44) శ్లోకం నుంచి ఇంతవరకు ఆచార్యాది భాగవత మహిమ చెప్పబడింది. భక్తియోగాన్ని అనుష్ఠించే సమర్థులకు ప్రపత్తిని అనుష్ఠించే అధికారం ఎలా సంభవిస్తుంది? అనే ప్రశ్నకు సమాధాన మీ శ్లోకం.

సమాధి సోపాన క్రమ విలంబ విముఖితాః- భక్తి ప్రపత్తులను అనుష్ఠించడం వల్ల మోక్షఫలాన్ని పొందవచ్చు. ఫలంలో భేదముండదు.

"వికల్పోఽ విశిష్ట ఫలత్వాత్"- (బ్ర.సూ. 411/3-3-57) అని వికల్పాధి కరణమందు చెప్పబడింది. భక్తి, ప్రపత్తి అనే మార్గాలు రెండైనా గమ్యం ఒక్కటే.

భక్తిని అనుష్ఠించే వ్యక్తులు అంగబలం, అర్థబలం కలిగి, మోక్షాన్ని పొందడానికి చాలాకాలం పట్టినా, ఓర్చుకొనే సమర్థులై యుండాలి. బ్రహ్మోపాసనకు త్రైవర్ణికులై యుండాలి.

"భక్త్యాదౌశక్త్యభావః"- భక్తి, ఉపాసన అనే వాటిని అనుష్ఠించడానికి శక్తిలేనివారు, త్వరగా ముక్తిని పొందవలెనని కోరేవారు, కుల, మత భేదం లేకుండా మగువలు, మగవారు, సజ్జనులందఱు ప్రపత్తిని అనుష్ఠిస్తూ శ్రియః పతిని ఆశ్రయించే అధికారులు.

భక్తియోగం గురువైన ఉపాయం. ప్రపత్తి లఘువైన ఉపాయం. ఇంద్రియ నిగ్రహం, మనస్సును అదుపులో నుంచుకోవడం, తర్వాత జీవాత్మదర్శనం, ఆ పిమ్మట పరమాత్మ నిది ధ్యాసనం, ఇవన్నీ చెదరిపోకుండా దృఢంగా ఉండడానికి దినదినం అభ్యాసం చేయడమూ తద్వారా కర్మయోగ, జ్ఞానయోగ, పరభక్తి పరజ్ఞాన పరమభక్తి అనే పద్ధతులను క్రమంగా మెట్లు ఎక్కినట్లు పాటించడానికి ఎంతో కాలం పట్టుతుంది. త్వరగా ముక్తిని పొందాలనే కోరికగలవారికి, క్షణకాలమైనా భగవద్విరహాన్ని సహించలేని వారికి దీర్ఘకాల సహనం ఉండనేరదు. కాబట్టి "న్యాసమేషాంతపసామ తిరిక్తమాహుః"- అని ఉపనిషద్వాణి. సత్యం, ధర్మం, తపస్సు- అనే ఉపాయాల సాధనాలన్నిటికంటెను శ్రేష్ఠమైనది న్యాసవిద్య- ప్రపత్తి

నిష్ఠ- అని ఆ వాక్యానికి అర్థం. ఆకించన్యం, అగతికత్వం, మహావిశ్వాసం నా దగ్గఱ ఏమీ లేదు. సర్వం నీదే భారం. వేఱే రక్షకుడున్నాడని ఆశించేవాణ్ని కాను స్వామీ! "మోక్షయిష్యామి" అని నీవు చెప్పిన మాటయందే గొప్ప నమ్మకం కలవాడను.

"శరణమాగుం తనతాళ్‌డైన్దార్ కెక్కల్లామ్,
మరణమానాల్ వైగుందం కొడుక్కుమ్ పిరాన్॥"

(తి.వా.మొ. 9-10-5)

భగవత్పాద పద్మాలను ఉపాయంగానూ, ఉపేయంగానూ విశ్వసించి ఆశ్రయించిన ప్రపన్నులకు ఈ దేహావసానమందే మోక్షమిచ్చే పరమోపకారకుడవు. "ముముక్షుర్వై శరణమహం ప్రపద్యే"- (శ్వే.ఉ.). మోక్షాన్ని కోరుతున్న నేను నిన్ను శరణు పొందుతున్నాను- అని భరన్యాసం చేయడం ప్రపన్నుని లక్షణం.

సంనత సులభం- "స్వప్రాప్తయే ప్రధానోఽయం పంథాః నమన నామవాన్"- (అహి.సం.) నీ సొత్తును నీవే రక్షించుకొంటావు స్వామీ! ఆత్మ సమర్పణం చేసిన ఫలం కూడా నీదే! అంటూ శరణు పొందడమే 'నమనం' (వంగి పాదాలకు నమస్కరించడమే) అనే పేరుగల దారి. నతసత్యుడు కదా!

"ఏతద్వై మహోపనిషదం దేవానాం గుహ్యమ్"- (త్తై.ఉ. 79) ఈ ప్రపత్తి మార్గం దేవతలకు దుర్జ్ఞేయమైన రహస్యం కదా! ముచుకుందుడు ఒక చక్రవర్తి. శ్రీకృష్ణుని కాలాన ఒక పర్వత గుహలో చిరకాలం నిద్రిస్తున్నాడు. కాలయవనుడనే రాక్షసుణ్ని ఎలయించుకొంటూ ఈ గుహలోకి కృష్ణుడు ప్రవేశించి కనబడక ఉన్నాడు. కాలయవనుడు వచ్చి "మాయావీ! ఇక్కడ పడుకొన్నావా!" అంటూ కాలుతో ముచుకుందుణ్ని తన్నినాడు. నిద్ర నుంచి లేచినప్పుడు ఎవని మొగమైనా చూస్తే వాడు నశిస్తాడనేది ముచుకుందునికున్న నియమం. ముచుకుందుడు నిద్రనుంచి లేవగనే ఎదురుగా నిలబడియున్న కాలయవనుణ్ణి చూచాడు. క్షణంలో ఆ రాక్షసుడు బూడిద అయ్యాడు. తర్వాత కృష్ణుణ్ణి సేవించిన ముచుకుందుడు ఆనందంతో ముకుందుని శరణు పొంది ముక్తుడయ్యాడు.

క్షత్రియుడైనా క్షాత్ర ధర్మాన్ని అనుష్ఠించని పాపిష్ఠుడు క్షత్రబంధువు. అడవుల్లో తిరుగుతూ బాటసారులను కొట్టి, వారి సొమ్మును దోచుకొని కాలాన్ని గడుపుతున్న వాడు.

ఒకప్పుడు ముద్గల మహర్షి ఒక జలాశయానికి పోతుండగా ఆయనను బాధించి సొమ్ములాగుతానని నఖశిఖా పర్యంతం చూశాడు. మహర్షి దగ్గర సొమ్మేదీ కనబడలేదు. ఆయన మడుగులోకి అడుగుపెట్టగానే జారి నీళ్ళల్లో పడిపోయాడు. ఆ మహర్షిని ఆపాదమస్తకంగా చూచినప్పుడే సాధుదర్శనం వల్ల క్షత్రబంధువుకు చిత్తమాలిన్యం తొలిగిపోయింది. కాబట్టి వెంటనే నీటినుంచి మహర్షిని రక్షించాడు. తత్ఫలితంగా ముద్గలుడు (నారదుడని ఒకచోట ఉంది) క్షత్రబంధువుకు 'గోవింద' నామాన్ని ఉపదేశించాడు.

ఆచార్యోప దిష్టమైన క్షత్రబంధువు గోవింద నామాన్ని నిత్యం స్మరిస్తూ శరణాగతిని- ప్రపత్తిని అనుష్ఠించాడు. ముచుకుందుడు గానీ, క్షత్రబంధువుగానీ ఇంక పలువుర్రు ప్రపన్నులు సర్వేశ్వరుణ్ని శరణుపొంది, ఆ జన్మతోనే పునర్జన్మ లేకుండా, పరమపదానికి చేరి ముక్తాత్ములై భగవత్కైంకర్య సామ్రాజ్యాన్ని అనుభవించారు. ప్రపత్తిని అనుష్ఠించడంవల్ల అతిసులభుడైన అచ్యుతుడు తనను ఆశ్రయించిన వారిని చేజారవిడిచి పెట్టడు కదా!

"తద్దూరే తద్వదంతికే" - (ఈ.ఉ). "అగలిల్ అగలుమ్, అణిగిల్ అణుగుమ్" - (తి.వా.మొ. 1-7-10) చేతనుడు స్వామి నుంచి దూరమైతే, స్వామి కూడా దూరమవుతాడు. అనన్య ప్రయోజనుడైన స్వామిని ఆశ్రయిస్తే, స్వామి అతణ్ణి దగ్గ్రా చేర్చుకొంటాడు కదా!

*67. దేవాణ పసుసమాణో*
*జంతూ గంతూణ దేవణాహ తుహపఅమ్।*
*తేహించి అ సవ్వేహిం*
*సంసరమాణేహి హోఇ స ఇ దిణ్ణ బలీ॥*

భా. దేవానాం పశుసమ్మానో
జంతుర్గత్వా దేవనాథ! తవ పదమ్।
తైరేవ సర్వైః
సంసర మాణైః భవతిసదా దత్త బలిః॥

**అర్థం:** దేవనాథ!; దేవానాం= దేవతలకు; పశుసమానః= మేకవంటి బలిపశువుతో సమానుడైన; జంతుః= చేతనుడు; తవ= నీ యొక్క పదం= స్థానాన్ని- వైకుంఠాన్ని; గత్వా= పొంది; సంసరమాణైః= కుటుంబంతో నున్నట్టి; తైః, సర్వైః, ఏవ= వారందఱిచేతనే; సదా= ఎల్లప్పుడు; దత్తబలిః= సమర్పింపబడిన పూజ కలవాడై; భవతి= ఉంటాడు.

**తా॥** దేవనాథా! ప్రాణిని-మానవుణ్ణి- దేవతలు బలిపశువుగా భావిస్తారు. ఆ ప్రాణియే నీ స్థానమైన వైకుంఠాన్ని చేరినప్పుడు స్వర్గమందు సపరివారంగా నున్న ఆ దేవతలంతు స్వాగతం పలికి, ఆ ప్రాణిని ఎల్లప్పుడు కానుకలను సమర్పించి పూజిస్తారు.

**వ్యాఖ్య:**- బలిపశువుగా దేవతలచే భావింపబడే చేతనుడు, ఆ దేవతల చేతనే పరమపదమందు సర్వదా పూజింపబడుతాడని సుశ్లోకితం.

మానవుడు కర్మయోగాదులచేత దేవతలను ఆరాధించకపోతే, శ్రాద్ధకర్మ యందు నియంత్రింపబడిన బ్రాహ్మణులు తృప్తిని జెందితే పితృదేవతలు తృప్తి బడినట్లు తృప్తిబడే ఇంద్రాది దేవతలచేత, ఆటంకమేదైన కలుగకుండునా? అనే శంకను పరిహరించే శ్లోకమిది.

"జాయమానో హిబ్రాహ్మణ స్త్రిభీ ఋణవాన్ జాయతే, బ్రహ్మచర్యేణర్షిభ్యో యజ్ఞేన దేవేభ్యః ప్రజయా పితృభ్యః ఏషవా అనృణః"- (శ్రుతి). జన్మసిద్ధమైన మూడు ఋణాలను మానవుడు తీర్చుకోవలసి యుంటుంది.

1) ఋషి ఋణం:- జ్ఞానశక్తిని ప్రసాదించిన ఋషులకు మానవుడు ఋణపడి యున్నాడు. బ్రహ్మచర్యమందు వేదశాస్త్రాదులను అభ్యసించి, ఆర్షవిజ్ఞానాన్ని ఆర్జించి అనుష్ఠించి ప్రచారం చేయడం వల్ల ఋషిఋణం నుంచి విముక్తుడగును.

2) దేవర్ణం:- మనిషి ఆహారం విషయంలో దేవతలకు ఋణపడి యున్నాడు. "అగ్ని ముఖావైదే వాః" (శ్రుతి). అగ్నిముఖులైన దేవతలు యజ్ఞాలయందు సమర్పింపబడిన హవిస్సును అగ్నిద్వారా గ్రహించి తృప్తిని పొందుతారు. ఆ దేవతలు మనుష్యులకు పాడి-పంటలు బాగా వృద్ధిని పొందునట్లు అనుగ్రహిస్తారు. యజ్ఞాలు చేయడం వల్ల మనిషి దేవతల ఋణం నుంచి విముక్తుడవుతాడు.

3) పితౄణం:- పితృదేవతల అనుగ్రహంచేతనే మానవుల దేహాలు పొందబడినాయి. సృష్టికార్యం వృద్ధిజేయబడింది. కాబట్టి మనిషి పితృదేవతలకు ఋణపడియున్నాడు.

పురుషుడు ఒక స్త్రీని వివాహం చేసుకొని గృహస్థాశ్రమ ధర్మాన్ని ఆచరిస్తూ, సత్సంతానాన్ని పొంది, వంశవృద్ధికి పాటుపడినందువల్ల, పితృదేవతలు ఆ సంతానం ద్వారా తమకు పిండోదకాలు లభిస్తుంటాయని తృప్తిబడుతారు. మంచి సంతానాన్ని పొంది, వంశవృక్షాన్ని పెంచిన మనిషి పితరుల అప్పును తీర్చుకొన్న వాడవుతాడు.

*"ఋణాని త్రీణ్యా పాకృత్య మనోమోక్షేనివేశయేత్"*- జన్మసిద్ధమైన మూడు ఋణాలను తీర్చుకొన్న తర్వాతనే మనస్సును మోక్షమార్గమందు ప్రవేశపెట్టాలి అని మనస్మృతి బోధిస్తుంది. ఇదొక వేదాంతశాస్త్ర చర్చకదా!

*"భాక్తం వానాత్మవిత్త్వాత్ తథాహి దర్శయతి"*- (బ్ర.సూ. 3-1-7) యజ్ఞాది కర్మలు చేసేవాడు బ్రహ్మజ్ఞానం లేనివాడైనందువల్ల, తాను చేసిన కర్మలవల్ల దేవలోకానికి పోయి దేవతలకు భోగసాధనమవుతాడు, ఆహారమవుతాడు- అనే మాట గౌణమని శ్రుతి తెలుపుతున్నది.

దేవానాం పశుసమానః:- యాగాది కర్మిష్ఠుడైన పురుషుడు "యథా పశురేవం సదేవానాం"- "ఇత్యనాత్మ విదో దేవానా ముపకరణత్వం దర్శయతి శ్రుతిః"- (శ్రీభాష్యం) ఇంద్రాది దేవపూజకోసం యజ్ఞమందు "ఉపాకృత చ్ఛాగ ప్రాయః"- అంటే ప్రోక్షించి అభిమంత్రించి హింసింపబడే మేక వంటివాడై చాలా విధేయుడుగా ఉంటాడని శ్రుతి బోధిస్తున్నది. భోగసాధనమంటే అన్నం తినడమనే అర్థం కాదు. "నహవైదేవా అశ్నంతి నపిబంతి, ఏతదేవామృతం దృష్ట్వా తృప్యంతి"- (శ్రుతి). దేవతలు తినరు, త్రాగరు. ఈ అమృతాన్నే జూచి తృప్తిపడుతారు అని శ్రుత్యర్థం.

"దేవాన్ దేవయ జోయాంతి మద్భక్తా యాంతి మామపి"- (భ.గీ.7-23). దేవతలను పూజించేవారు దేవతలను పొంది వారనుభవించే అల్పమైన భోగాలనే పొందుతారు. నన్నారాధించే భక్తులు నన్నే పొంది శాశ్వతమైన నా భోగాలను అనుభవిస్తారని శ్రీకృష్ణ భగవానుడే చెప్పినాడు. కాబట్టి, తమ కర్మ కలాపాన్ని బట్టి స్వర్గంలో పరిమితమైన దేవతల భోగాలను అనుభవించి కర్మఫల శేషాన్ని అనుభవించడానికి ఈ లోకానికి తిరిగి వస్తారని శ్రుతిస్మృతులు తెలుపుతున్నాయి.

"యత్ర నాన్యత్పశ్యతి యత్ర నాన్యచ్ఛృణోతి నాన్యద్విజానాతి స భూమా"- బ్రహ్మానుభవాన్ని పొందేవాడు మరొక వస్తువును జూడడు, వేరొక విషయాన్ని వినడు. ఇంకొకటి తెలుసుకోడు. సర్వం పరబ్రహ్మయొక్క విభూతిలోనే అంతర్గతమై యుండడం వల్ల అదే పరమ పురుషార్థమైన గొప్ప సుఖం అని ఉపనిషద్వాణి. దేహంతో ఉన్నప్పుడే అతికృష్ట జంతువుగా నున్న చేతనుడు భగవత్కృపచేత సదాచార్యోపదిష్టుడై ఋణపరిహార సాధనాలైన ధర్మాలను భగవానుని ఆజ్ఞా కైంకర్య రూపంగా ఆచరిస్తాడు.

"దేవర్షి భూతాత్మ నృణాం పితౄణాం
నకింకరో నా యమృణీ చ రాజన్।

*సర్వాత్మనా యః శరణం శరణ్యం*
*నారాయణం లోక గురుం ప్రపన్నః॥"*

ప్రాపకుడు - ప్రాప్యుడు లేదా ఉపాయం - ఉపేయం రెండూ శ్రీమన్నారాయణుడే అని అధ్యవసాయం కలిగిన ప్రపన్నుడు దేవర్షి భూత పితృగణాలకు కింకరుడై, ఋణగ్రస్తుడై యుండడని తెలుపుతున్నదీ ప్రామాణిక శ్లోకం.

*జంతుర్గత్వా దేవనాథా! తవపదమ్:* - దేవతలచే పశువుగా భావింపబడే వ్యక్తి దేవనాథుని - దయవల్ల ప్రపత్తిని అనుష్ఠించాడు. దేహావసానమందు "తదోకోऽ ధికరణం"లో చెప్పబడినట్లే, హృదయంలో అంతర్యామిగా ఉన్న భగవానుడు ప్రకాశింపజేసిన 'దేవయానం' అనే దారిలో పయనిస్తున్నప్పుడు ఈ ముక్తాత్మకు కాలాభిమాన దేవతలు, ఊర్ధ్వలోకాధిపతులు గౌరవంగా స్వాగత వచనాలను పల్కుతూ, కానుకలను సమర్పిస్తుంటారు. నిజంగా ఎంత గొప్ప వ్యత్యాసమిది!

*తైరేవ సర్వైః సంసర మాణైః భవతి సదాదత్త బలిః* - 'బలి' అంటే పూజ, కానుక అని అర్థం.

*"కరోప హారయోః పుంసి బలిః ప్రాణ్యంగజేస్త్రియామ్"* (అమరం). దేవతలు కూడా అధికార పదవికాలం ముగియగానే సామాన్యులవుతారు. తిర్యక్ జంతువుగా భావింపబడిన మానవుడు దేవతలచేత ఆరాధింపబడుతుంటాడు. స్వర్గంలో పరివారంతో నున్న దేవతలే వైకుంఠాన్ని చేరే ముక్తాత్మను పూజించి. కానుకలిచ్చి గౌరవిస్తుంటారని *"సర్వేऽస్మై దేవా బలిమావహంతి"*- అనే ఉపనిషద్వాక్యం నొక్కి చెబుతున్నది కదా! "దత్తబలిః" దత్తః బలిః యస్మై సః= దత్తబలిః. ఇవ్వబడిన కానుక ఎవని కొరకో అతడు 'దత్తబలిః' అనబడునని విగ్రహ వాక్యం.

"తొషుదన రులకర్‌కళ్ తూప నన్మలర్ మషై పొషివనర్- వషియితు వైగుందుర్కు ఎన్ఱువన్ది వరే"- (తి.వా.మొ. 10-9-3) ఊర్ధ్వ లోకాధిపతులు ఈ ముక్తాత్మను పూర్ణకుంభంతో ఎదుర్కొని "వైకుంఠానికి దారి ఇదే, వేం చేయండి" అంటూ స్వాగత వచనాలను పల్కి పూలవర్షాన్ని కురిపించి, షోడశోపచారాలతో సత్కరించి బద్ధాంజులులై సాగనంపుతారని నమ్మాళ్వార్లు అర్చిష్పథ మందు అమరులు ఆదరించే విధానాన్ని విశదం చేశారు.

వాత్సల్యపూర్ణుడైన వైకుంఠుని స్థానానికి చేరిన ఈ ముక్తాత్మను "పదియినిల్ పొంగినిల్ పాదంగళ్ కషు వినర్"- (తి.వా.మొ. 10-9-10). పరమపదమందు నిత్యసూరులు 'మీరు ఇక్కడికి రావడం మా భాగ్యం' అంటూ తమ సింహాసనమందు వేంచేపించి, పాదప్రక్షాళనం చేసి మంగళార్థంగా పూర్ణకుంభాదులను ఎదురుగా తెచ్చి, మహోపచారాన్ని చేస్తారు. ఈ వైభవానికి హేతువు ప్రపత్తియే కదా!

"దేవనాథ!" అనే సంబోధనాంత పదం సాభిప్రాయం. స్వామీ! నీవు దేవతలకు ప్రభువైనందువల్ల నీ పాదారవిందాలను ఆశ్రయించిన జీవాత్మను గౌరవించకుంటే మాకు నీచే ఎటువంటి శిక్ష-దండన విధింపబడునో అని దేవత లందఱు భయపడి పూజిస్తుంటారని సూచితం. భగవత్కృపను పొందడానికే దేవతలు ప్రపన్నుని గౌరవిస్తారు. ఇట్లు దేవతలే, తమకు భోగసాధనంగా మొదట భావింపబడిన ప్రాణిని గౌరవంగా సమ్మానిస్తుంటే ఇక ఆటంకం ఎలా కలుగుతుంది? అని సారార్థం.

*68.* మోహాంధార మహణ్ణవ
ముచ్ఛిఅ మాఆ మహోరఅణి పచ్చూహో,
అచ్చు అ తుజ్ఞ కడక్ఖో
విముత్తి పత్థాణ పుఢమ పరిఅర బంధో

ఛా. మోహాంధకార మహార్ణవ
మూర్ఛిత మాయా మహా రజనీ ప్రత్యూషః।
అచ్యుత! తవ కటాక్షో
విముక్తి ప్రస్థాన ప్రథమ పరికర బంధః॥

**అర్థం:** హే అచ్యుత!; మోహాంధకార-ప్రత్యూషః/ మోహ+అంధకార= అజ్ఞానమనే అంధకారం అనే; మహార్ణవ= గొప్ప సముద్రంచేత; మూర్ఛిత= మూర్ఛపోయిన వ్యక్తికి; మాయా= ప్రకృతి అనే; మహారజనీ= కాళరాత్రికి; ప్రత్యూషః = విడిపోయే కాలమైన-ప్రాతఃకాలమైనట్టి; తవ= నీ యొక్క; కటాక్షః= కడగంటి చూపు; విముక్తి-బంధః/ విముక్తి, ప్రస్థాన= మోక్షం కోసం పయనించడానికి; ప్రథమ= మొదటిదైన; పరికరబంధః= దారి బత్తెం- పాథేయం; భవతి= అవుతుంది.

**తా॥** అజ్ఞానాంధకారమనే సముద్రంచేత ఆవరింపబడిన వ్యక్తికి సంబంధించిన మాయ- ప్రకృతి అనే కాళరాత్రిని పోగొట్టే ప్రభాతకాలం వంటిది భగవత్కటాక్షం. ఓ అచ్యుతా! నీ కటాక్షమే మోక్ష ప్రయాణానికి మొదటిదైన బద్ధాన్నమవుతుంది.

**వ్యాఖ్య:-** ముముక్షువుకు మోక్షం కోరే విషయంలో భగవానుని కటాక్షమే ప్రాథమ్యమని వర్ణితం.

చేతనుడు అనుష్ఠించిన ఉపాయానికి అధీనమైనది పరమ పురుషార్థ ప్రాప్తి అన్నచో భగవత్సంకల్పం వల్లనే సమస్త పదార్థాల ఉనికి "ఇచ్ఛాత ఏవ తవ విశ్వపదార్థ సత్తా"- అనే మాట విరోధించదా? అంటే, చేతనుడు చేసే ఉపాయానుష్ఠానం కూడా భగవత్కటాక్షానికి అధీనమైనందువల్ల విరోధం కాదని సమర్థింపబడుతున్నది.

"జాయమానం హి పురుషం యం పశ్యేన్మధుసూదనః।
సాత్త్వికః సతువిజ్ఞేయః సవై మోక్షార్థ చింతకః॥"

పుట్టుతున్న ఏ జీవుని మీద భగవానుని కృపా కటాక్షం ప్రసరిస్తుందో ఆ జీవుడు సాత్త్వికుడై, సదాచార్య సంబంధం కలిగియుండి తురీయ- నాల్గవ పురుషార్థమైన మోక్షం కోసం చింతిస్తుంటాడని ప్రామాణిక సూక్తి.

మోహాంధకార- ప్రత్యూషః- 'మోహం' అంటే అవిద్య- అజ్ఞానం. చైతన్యానికి విరోధి కాబట్టి చీకటిగా చెప్పబడింది. మోహాంధకారమే మహా సముద్రం. సముద్రంచే ఆవరింపబడినది ప్రకృతి.

"మాయాంతు ప్రకృతిం విద్యాత్"- (శ్వే.ఉ.)

"దైవీహ్యే షా గుణమయీ మమ మాయాదురత్యయా"- (భ.గీ.) 'మాయ' అంటే మూల ప్రకృతి. ఆ ప్రకృతి కూడా భగవదధీనమైనదే.

సంసారి అజ్ఞానాంధకార సముద్రంలో మునిగియుండడమూ భగవానుని మాయయే కదా! అది దుస్తరమైనది. ఆ మాయయే మహారజని- కాళరాత్రి. అది ఎప్పుడు విడిపోతుందో? సంసారికి ఆ కాళరాత్రి ముగిసి, ఎప్పుడు తెల్లవారుతుందో?

*"ఏవం సంసృతి చక్రస్థే భ్రామ్య మాణేస్వకర్మభిః।*
*జీవే దుఃఖాకులే, విష్ణోః కృపాంకాప్యుప జాయతే॥"*

అన్నట్లు అవిద్యా కర్మవాసన యందలి రుచిచేత ప్రకృతి సంబంధ రూపమైన సంసార చక్రమందు, బయటపడే మార్గం తెల్యక, పరిభ్రమిస్తున్న జీవుని పట్ల భగవానుని కృప ఎప్పుడో ఒకప్పుడు ప్రసరిస్తుంది. సత్త్వగుణం మేల్కొంటుంది. తద్వారా మోక్షేచ్ఛ కలుగుతుంది.

మహారజని-కాళరాత్రి పోయి, ఉషఃకాలమేర్పడడమే భగవత్కటాక్షం. భగవానుని దయాన్వితమైన అపాంగదృష్టి జీవునికి సంసార నివర్తకమని భావం.

తవ కటాక్షః విముక్తి ప్రస్థాన ప్రథమ పరికరబంధః- భగవత్కటాక్షం ముక్తి మార్గానికి మొదట చేయదగిన పరివార కలాపంగా ఉంటుంది.

"భవేత్ పరికరో వ్రాతే పర్యంక పరివారయోః।
ప్రగాఢే గాత్రికా బంధే వివేకారంభయోరపి॥"- (విశ్వ.ని.)

ప్రయాణం చేసే వ్యక్తికి దారిలో బద్ధాన్నం- మూటకట్టిన ఆహారమే ముఖ్య సాధనం కదా! "బద్ధః పరికరస్తేన మోక్షాయ గమనం ప్రతి"- మోక్షానికి పయనించే జీవునికి దారిబత్తెంగా ఉంటుంది భగవత్కటాక్షం.

"ప్రపన్న జన పాథేయమ్"- (అష్ట భుజాష్టక స్తోత్రం-9) అన్నారు దేశికులు. (He can take his food-packet). స్వామీ! "అంగణ్ ఇరండుం కొండు ఎంగళ్ మేల్ నోక్కుదియేల్, ఎంగళ్ మేల్ శాపమిళిందు"- (తిరుప్పావై-22). నీ రెండు కన్నులను మెల్లగా తెరిచి మా మీద నీ దృష్టిని ప్రసరింపజేస్తే, మా దీర్ఘకాలికమైన శాపం పోతుందని శ్రీ గోదాదేవి సూక్తి.

ఈ శ్లోకం నుంచి "భరస్వమామప్రమత్తః"- అనే 78వ శ్లోకం వరకు (11 శ్లో.) భగవత్కటాక్ష నామసంకీర్తన సపర్యాదులు మోక్ష కారణాలు అని కీర్తింప బడుతున్నాయి.

69. మోక్ఖ సుహరుక్ఖమూలం
మోహజరాఉర మహారసా అణ పవరమ్।
సఅల కుసలేక ఖేత్తం
కింకరసచ్చ తుహకిత్తణం అమిఅ ణిహమ్॥

ఛా. మోక్షసుఖ వృక్షమూలం
మోహజరాతుర మహారసాయన ప్రవరమ్।
సకల కుశలైక క్షేత్రం
కింకరసత్య! తవకీర్తన మమృత నిభమ్॥

**అర్థం:** హే కింకరసత్య!; అమృత నిభం= అమృతంతో సమానమైన; తవ= నీ యొక్క; కీర్తనం= నామ సంకీర్తనం; మోక్ష సుఖవృక్షమూలం= మోక్షసుఖమనే

వృక్షానికి మూలం వంటిది; మోహజరా+ఆతుర మహారసాయన ప్రవరం= మోహం అనే ముసలితనంచేత పీడింపబడు వారికి గొప్ప ఔషధాలలో శ్రేష్ఠమైనది. సకల కుశల+ఏక క్షేత్రం= అన్ని శుభాలకు అద్వితీయమైన ఉత్పత్తి స్థానమైనది.

**తా॥** ఓ కింకర సత్యా! నీ నామసంకీర్తనం మోక్షసుఖం అనే వృక్షానికి వేరు వంటిది. మోహమనే ముదిమిచే బాధపడువారికి గొప్ప రసాయనాలలో శ్రేష్ఠమైనది. సకల మంగళాలకు ముఖ్యాస్పదమైనది. అమృత తుల్యమైనది.

**వ్యాఖ్య:-** సంసారియొక్క అనాదికాల ప్రవృత్త అనంతాపరాధాలను తొలగించే భగవన్నామ సంకీర్తనం నిశ్రేయసానికి నిదానమని సుశ్లోకితం.

'కింకర సత్య' అనే సంబోధనాంత పదం భగవన్ముఖోల్లాసం కోసం కైంకర్యం చేసే జీవులకు ఆనుకూల్యాన్ని కల్పించేవాడు భగవానుడు అనే అర్థాన్ని సూచిస్తుంది. "తద్విప్రాసోవిపన్యవః"- భగవానుని దివ్యమంగళ విగ్రహసౌందర్యాన్ని సేవిస్తూ ఆయన కల్యాణ గుణగణాలను అనుసంధానం చేయడమే నామ సంకీర్తనం.

"యాని నామాని గౌణాని"- అని భీష్మాచార్యుల సూక్తి.

"దేవో నామ సహస్రవాన్"- "పేరుమ్ పల పలవే"- ఉభయవేదాన్త సూక్తుల ప్రకారంగా లెక్కకు మిక్కిలిగా ఉన్న భగవన్నామాలలో కొన్ని భగవత్స్వరూపాన్ని మరికొన్ని దివ్యసుందర విగ్రహ వైభవాన్ని, కల్యాణగుణాలను, భగవచ్చేష్టితాలను కీర్తిస్తున్నాయి.

తవ కీర్తనం మోక్షసుఖ వృక్షమూలం- చెట్టు, కాండం, కొమ్మలు, రెమ్మలు, ఆకులు, పూలు, పండ్లు మొదలైన వాటిచే బహువిధాలుగా ఉన్నట్లే మోక్ష సుఖం నానా ప్రకారాలుగా ఉంటుంది. చెట్టుకు దాని వేరు ఎట్లు ఆధారమో, అట్లే మోక్షానందానికి నామ సంకీర్తనం మూలకారణం.

"మోహజరాతుర మహారసాయన ప్రవరమ్"- 'మోహం' అంటే అజ్ఞానం చేత దేహాన్నే ఆత్మగా భావించడం. ఇది భ్రాంతియే కాని యథార్థం- నిజం

కాదు. 'జరా' అంటే వార్ధక్యం- ముసలితనం. 'మోహమే జరా అని రూపకం. జరా జర్జరిత దేహం ఎంత బాధపడుతుందో అనుభవించేవానికే తెలుస్తుంది. అదొక మహావ్యాధి. మోహం అంటే దేహాత్మ భ్రాంతిగల జీవునికి అదొక గొప్ప రోగమే. వ్యాధిని పోగొట్టే రసాయనాలు- ఔషధాలు లోకంలో ప్రశస్తమైనవని కీర్తింపబడుతాయి. అట్టి ఔషధాలను సేవించి నిరామయులవుతారు. లోకమందున్న ప్రశస్తమైన రసాయనాల కంటే విలక్షణమైనది, మిక్కిలి శ్రేష్ఠమైనది నామ సంకీర్తన మనే రసాయనం. లోకమందలి ప్రసిద్ధ రసాయనాలు దేహానికి గల వ్యాధులను నివారిస్తుంది. నామ సంకీర్తనమనే రసాయనం ఆత్మవ్యాధి నివారకం.

"రసాయనం విహంగేఽపి జరా వ్యాధి హరౌషధమ్॥" (విశ్వ.ని.)

"దీర్ఘమాయుః స్మృతిర్మేధా మా రోగ్యం తరుణం వయః।
ప్రభావర్ణ స్వరౌదార్యం దేహేంద్రియ బలోదయమ్॥
వాక్సిద్ధి వృషతాం కాన్తి మవాప్నోతి రసాయనాత్॥" అని ప్రసిద్ధం.

"లాభోపాయోహి శస్తానాం రసాదీనాం రసాయనమ్॥" రసాయన లక్షణం ఇది.

"అచ్యుతానంత గోవింద నామోచ్చారణ భేషజాత్।
నశ్యంతి సకలారోగాః సత్యంసత్యం వదామ్యహమ్॥" (విష్ణుధర్మం)

అచ్యుత! అనంత! గోవింద! అనే నామాలను ఉచ్చరించడం అనే ఔషధంతో సర్వరోగాలు నశిస్తాయని రెండుసార్లు సత్యం, సత్యం అని శపథం చేసి చెప్పబడింది. ఇందున్న 'సకల' శబ్దాన్ని వివరించే సూక్తిని ఆళ్వార్లు అనుసంధించారు.

"అచ్చమ్ నోయోడల్లల్ పల్ పిఱన్దవాయ మూప్పినై వైత్త
శిందైదైత్త వాక్కైమాత్తి వానిలేత్తువాన్ అచ్చుదన్॥"

(తిరుచ్చన్ద విరుత్తం-117)

భయం, దేహవ్యాధితోపాటు మనోవ్యాధి, అపాయాలకు నిలయమైన వార్ధక్యం, అనేక జన్మలు అనే వాటిని అనుభవించే మనస్సును, వీటికన్నిటికి ఆశ్రయమైన శరీరాన్ని నశింపజేసి పరమ పదానికి చేర్చేవాడు అచ్యుతుడు అని తిరుమఌశై యాళ్వార్లు అనుసంధించారు.

సకల కుశలైక క్షేత్రం- కళలతోకూడి యుండే శుభాలకు ముఖ్యోత్పాదక స్థానమైనది భగవన్నామం. చతుర్విధ పురుషార్థ సాధకం కదా! ఒక క్షేత్రంలో సకల ధాన్యాలు ఒకేసారి పండజాలవు. ఈ క్షేత్రం సకల మంగళ వస్తువులను ఒకే సమయాన పండించగలదు.

*"వాచ్యప్రభావమ్ పోలన్ఱు వాచక ప్రభావమ్।*
*అవన్ దూర స్థనానాలుమ్ ఇదుకిట్టి నిన్ఱు ఉదవుమ్॥"*

భగవానుని మహిమవంటిది కాదు భగవన్నామ మహిమ. భగవానుడు దూరంగా ఉన్ననూ భవగన్నామం మన దగ్గరనే ఉండి ఉపకరిస్తుంది- అన్నారు శ్రీపిళ్ళై లోకాచార్యులు. భగవానుడు ముద్ద బంగారమైతే మంగళాభరణం వంటిది భగవన్నామం.

"ద్రౌపదిక్కు ఆపత్తిల్ పుడవై శురన్దదుతిరునామ మిఱే"- స్త్రీకి శీలమే ప్రాణం కంటే గొప్పది. కౌరవసభలో భీష్మద్రోణాది ధర్మవృద్ధులు చూస్తుండగా, అమరతుల్యులైన ఐదుగురు భర్తలు నేలగీతలు గీస్తుండగా, దుర్యోధనుని ఆజ్ఞచే దుశ్శాసనుడు ద్రౌపది యొక్క వలువలను ఈడ్చివేస్తున్నప్పుడు శీలం నశించే గొప్ప ఆపత్తులో ఆమె శీలాన్ని రక్షించింది భగవన్నామ సంకీర్తనమే కదా!

*"శంఖచక్రగదాపాణే ద్వారకా నిలయాచ్యుత।*
*గోవింద పుండరీకాక్ష, రక్షమాం శరణాగతమ్॥"*

శరణాగతనైన నన్ను రక్షించు గోవిందా! అని పిలిస్తే గోవిందుడు రాలేదు. కాని భగవన్నామం మాత్రం ఎనలేని, ఎన్నలేని సకల మంగళాన్విత లక్షణాలు

గల వస్త్రాలను ఉత్పత్తి చేసే క్షేత్రమై, ద్రౌపదీ మాన సంరక్షణం చేసిన ప్రభావం అద్భుతం కదా!

అమృత నిభం- అమృత తుల్యమైనది నామసంకీర్తనం.

శ్రమపడి అర్థవ్యయాదులతో సంపాదించుకొన్న అమృతాన్ని పానం చేసిన దేవతలు తాము అపేక్షించిన యౌవనాన్ని పొంది భోగాలకు మరగినారు. ఉపయోగించిన కొలది అమృతం తరగిపోతుంది. నామామృతం కీర్తిస్తున్న సమయమందే అమృతంలాగా భోగ్యమైనది. తరుగు లేక, కీర్తిస్తున్న కొలది మధురమైన రుచి అధికమవుతుంది. "తేనై నన్పాలై క్కన్నలై యముదై" తేనె లాగా మంచి పాలవలె, చెరుకు రసాన్ని, అమృతాన్ని పోలిన మధురిమను కలిగి యుంటుంది. ఖిలంలేనిది.

"మధురం మదురం మధురాధిపతే రఖిలం మధురం"- "కులం తరుం"- కోరికల నీడేర్చడమే కాక నామ సంకీర్తనం స్వతంత్రంగా "విణ్ణులగుం తరుమ్"- వైకుంఠ లోకాన్ని ప్రసాదిస్తుంది.

"శారా వేదంగళ్ నీరార్ ముగిల్ వణ్ణన్।
పేరారోదువార్ ఆరార్ అమరరే॥" - (తి.వా.మొ. 10-5-8).

నీలమేఘశ్యాముడైన సర్వేశ్వరుని నామాలను కీర్తించిన వారికి "ఏదజ్గళ్‌శారా"- పాపాలు చేరవు. వారేజాతియందు పుట్టినా, ఏ కృత్యాల నాచరించినా, భగవన్నామ సంకీర్తన ప్రభావంచే నిత్యసూరులతో సమాన కైంకర్య పరులవుతారని నమ్మాళ్వార్లు నామ సంకీర్తన వైభవాన్ని ఉగ్గడించారు.

"ధ్రువాసో అస్యకీరయో జనాసః"- భగవానుని గుణగణాలను కీర్తించే జనులు స్థిరమైన మోక్షస్థానాన్ని పొందుతారని నొక్కి చెప్పింది వేదవాణి.

"నారాయణేతి శబ్దోఽస్తి వాగస్తి వశవర్తినీ।
తథాఽపి నరకేఘోరే పతంతీతి కి మద్భుతమ్॥"

ఈ పురాణ శ్లోకాన్నే-

"నావాయిలుండే నమోనారణావెన్టొ, ఓవాదు రైక్కుమ్ ఉరై యుండే, మూవాద మాక్కదిక్కణ్ శెల్లుమ్ వగై యుండే, ఎన్నొరువర్ తీక్కదిక్కణ్ శెల్లుమ్ తిఱమ్॥"- (ముదల్ తిరువన్తాది-95). నాలుక నోటిలోనే యున్నది కదా! ఎడతెగకుండా "నమో నారాయణాయ" అని ఉచ్చరింపబడే తిరుమంత్రమున్నది కదా! మళ్ళీ తిరిగిరాని మోక్ష మార్గాన పోయే ఉపాయమూ ఉన్నప్పటికీ కొందఱు ఘోరమైన నరకలోకానికి పోతున్నారనడం ఎంత ఆశ్చర్యకరం! అని పొయ్గైయాళ్వార్ సరోవరయోగి అనుసంధానం చేశారు. ఓ కింకర సత్యా! నీ నామసంకీర్తనామృతాన్ని ఆస్వాదించే యోగ్యతను కూడా కల్పించడానికి నీ కృపా కటాక్షమే మూలకారణం, అనుగ్రహించవయ్యా! దేవనాయకా! అని ప్రార్థించడం కవితార్కిక కేసరికే సరి. నామ మాహాత్మ్యం పాఠకులు బాగా గమనించదగినది కదా!

70. ణత్థి అహిక్కమణాసో
విచ్ఛే అమ్మి వి ణ పచ్చవా అ పసంగో।
సప్పావితుహ సపజ్జా
రక్ఖఇ అచ్చుఅ మహత్తరాదు భ ఆదో॥

ఛా. నాస్త్య భిక్ర మనాశో
విచ్ఛేదేఽపి నప్రత్యవాయ ప్రసంగః।
స్వల్పాఽపి తవ సపర్యా
రక్షత్యచ్యుత! మహత్తరాత్ భయాత్॥

**అర్థం:** హే అచ్యుత!= ఓ అచ్యుతా!; అభిక్రమ నాశః= ఆరంభించిన భాగానికి ఫలమీయకుండుట; నాస్తి= లేదు; విచ్ఛేదే, అపి= నడుమ విడిచిపెట్టినప్పటికీ; ప్రత్యవాయ ప్రసంగః, న= దోషలేశం లేదు; స్వల్పా, అపి= మిక్కిలి కొంచెమైన

దైననూ; తవ= నీ యొక్క; సపర్యా= పూజ; మహత్తరాత్= గొప్పదైన; భయాత్= భయం నుంచి; రక్షతి= కాపాడుతుంది.

**తా॥** ఓ అచ్యుత! నీ పూజను కొంతచేసినా చేసిన భాగానికి ఫలమీయక పోవడమనేది లేదు. ఒకవేళ మధ్యన ఆపివేసిననూ, దోషమేమాత్రం ఉండదు. నీ ఆరాధన స్వల్పంగా చేసినప్పటికీ చాలా గొప్పసంసారమనే భయం నుంచి రక్షిస్తుంది.

**వ్యాఖ్య:-** భగవదారాధనయే నిరపాయమైన సాధనమనే శ్లోకం.

*నాస్తి అభిక్రమనాశః:-* నిరుపాధిక వత్సలుడూ, నిత్యబంధువూ, పూర్ణకాముడూ అయిన భగవానుని యొక్క పూజను పూర్తిగా చేయక, ఆరంభించి అభిక్రమనాశః నాస్తి- మొదలుపెట్టి కొంతవరకు చేసిన పూజకు ఫలం లభించదనేది లేదని అర్థం. సకల సుఖానికి కారణమే అవుతుందని భావం.

*విచ్ఛేదేఽపి న ప్రత్యవాయ ప్రసంగః:-* శక్తిలేకనో, మరేదైన కారణం వల్లనో పూజను మొదలుపెట్టి నడుమ విడిచివేసినా, పాపం తగులుకొంటుందనే మాట లేదు. ఆరంభించి కొంతచేస్తే, అదే సకల సుఖనిదానమైనప్పుడు, శక్తిలేక నడుమ ఆపివేస్తే, ప్రత్యవాయం-దోషం అనే మాటకు తావే లేదు కదా! ఇతర దేవతలను పూజించినప్పుడుగానీ, యజ్ఞాది కర్మల నాచరించినప్పుడుగానీ, ఆరంభించి నడుమ విడువకుండా పూర్తిగా చేయవలసిందే. లేనిచో ప్రత్యవాయం-దోషం తప్పక తగులుకొంటుంది.

*సపర్యా స్వల్పాఽపి మహత్తరాత్ భయాద్రక్షతి:-* భగవదారాధన స్వల్పంగా చేసిననూ మిక్కిలి గొప్పభయం నుంచి కాపాడుతుంది. సంసారం కంటే గొప్ప భయమేముంది? సంసార భయమే ఉండదని అర్థం.

*"నేహాభిక్రమ నాశోఽస్తి ప్రత్యవాయోన విద్యతే।*
*స్వల్ప మల్పస్య ధర్మస్య త్రాయతే మహతో భయాత్॥"*- (భ.గీ. 2-40)

కామ్యకర్మల వలె కాక, సర్వేశ్వరుని ఆరాధించే బుద్ధితో ఆచరించే కర్మయోగాన్ని ఆరంభించి ముగించకున్ననూ ఫలం లభింపకపోదు. ఆరంభించిన సపర్య, క్షుద్ర ఫలాశలచే చెడిననూ పాపం సంభవించదు. కొద్దిగా ఆచరింప బడిననూ మహత్తరమైన సంసారపు బారినుంచి రక్షించునని శ్రీకృష్ణుడే చెప్పినాడు.

*"నహి కల్యాణకృత్ కశ్చిత్ దుర్గతిం తాత! గచ్ఛతి॥"* - (భ.గీ. 6-40). శుభకర్మయోగాన్ని ఆరంభించిన వాడెన్నడూ చెడిపోదు.

*71. అపసాఏ అపసణ్ణా*
*తుజ్ఝ పసాఅమ్మి దాససచ్చ పసణ్ణా।*
*ఆరజ్ఝాహోంతి పరే*
*కింతేహి పసంగ లంభిఅ పహావేహిమ్॥*

ఛా. *అప్రసాదేఽ ప్రసన్నాః*
*తవ ప్రసాదే దాససత్య! ప్రసన్నాః।*
*ఆరాధ్యా భవంతి పరే*
*కింతైః ప్రసంగలంభిత ప్రభావైః॥*

**అర్థం:** హే దాససత్య!; పరే= వేరే దేవతలు; తవ= నీ యొక్క; అప్రసాదే (సతి)= అనుగ్రహం లేనప్పుడు; అప్రసన్నాః= అనుగ్రహింపలేని వారవుతున్నారు; ప్రసాదే= నీ అనుగ్రహం ఉన్నప్పుడు; ప్రసన్నాః (సంతః)= అనుగ్రమింప గలవారవుతూ; ఆరాధ్యాః= పూజనీయులు; భవంతి= అవుతున్నారు- (అతః= ఇందువల్ల); ప్రసంగ లంభిత ప్రభావైః= నీ సంబంధం చేతనే పొందిన మహిమగలవారైన; తైః= ఇతర దేవతలచేత; కిం= ఏమి ప్రయోజనం? లాభం లేదని భావం.

**తా॥** ఓ దాససత్యా! నీ అనుగ్రహం లేకపోతే ఇతర దేవతలు ఎవరినీ అనుగ్రహించలేరు. వారే నీ అనుగ్రహమున్నప్పుడు తమను ఆశ్రయించినవారిని

అనుగ్రహింపగలవారై పూజింపబడుతుంటారు. నీ దయచేతనే పూజింపబడి అనుగ్రహించే మహిమగల అన్యదేవతలను పూజిస్తే ఏమి లాభం?

**వ్యాఖ్య:-** అచ్యుతుని సపర్యయే ఫలజనకత్వమని సుశ్లోకితం.

జనులు బ్రహ్మరుద్రేంద్రాదులను తమ ఇష్టదైవంగా ఆరాధిస్తుంటారు. మనలో జీవాత్మ యెట్టిదో ఆ దేవతలయందున్న జీవాత్మలు అట్టివే. శ్రియఃపతి యొక్కడే పరమాత్మ. అధికార పదవిని బట్టి ఆయా దేవతలు మనకంటే గొప్పవారు. లక్ష్మీనాథునికి అందరం దాసులమే.

*పరే, త్వయి అప్రసాదే సతి తే అప్రసన్నాః:-* ఇతర దేవతలు నీ యనుగ్రహాన్ని పొందునప్పుడు వారిని నమ్మియున్న జనులను అనుగ్రహింపజాలరు, ఆశ్రితులకు కోరిన ఫలాన్ని ప్రసాదించలేరు కదా!

*తవ ప్రసాదే ప్రసన్నాస్సంతః ఆరాధ్యాః భవంతి:-* నీ కృప ఆయా దేవతల మీద ప్రసరించినందు వల్లనే వారు వారి ఆశ్రితులకు ఫలప్రదానం చేసే సమర్థులై ఆరాధింపబడుతుంటారు.

*ప్రసంగలంభిత ప్రభావైః తైః కిమ్?-* అన్యదేవతలు తమ నాశ్రయించిన వారిని అనుగ్రహించడంగానీ, అనుగ్రహించకపోవడం గానీ భగవానుని కృపకు అధీనమైనదే. కాబట్టి అన్యదేవతారాధనం కంటే భగవదారాధనమే శ్రేయస్కరమని సారార్థం.

*"సపిత్రాచ పరిత్యక్తః సురైశ్చ సమహర్షిభిః"*- (రా). పచ్చి అపరాధియైన కాకాసురుడు, శ్రీరామునిచే నిగ్రహింపబడినప్పుడు తండ్రియైన ఇంద్రునిచే 'నేను రక్షింపజాలను' అని ఇంటినుంచి తరిమి వేశాడు కదా! ఇతరదేవతలుగానీ, మహర్షులుగానీ రక్షింపలేకపోయారు. చివరకు మూడు లోకాలలో తిరిగి తిరిగి గత్యంతరం లేక శ్రీరాముని సన్నిధిలోనే శరణాగతుడైన కాకాసురుణ్ణి "కృపయా పర్యపాలయత్"- శ్రీరాముడే దయతో రక్షించాడన్న వృత్తాంతం సర్వజన విదితమే కదా!

*"యస్య ప్రసాదే సకలాః ప్రసీదేయురిమాః ప్రజాః।
ప్రసన్న మభవత్తస్మై ప్రసన్నాయ చరాచరమ్॥"*

సకల విధబంధువైన సర్వేశ్వరుని యనుగ్రహం కలిగినట్లైతే, ప్రజలందఱు అనుగ్రహింపబడుతారు. దేవతలకూ ప్రభువైన భగవానుడు ప్రసన్నుడు కాగానే, భగవదనుగ్రహాన్ని పొందినవాని విషయంలో, స్థావరజంగమ పదార్థాలన్నీ ప్రసన్నమయ్యాయి. కాబట్టి, దాససత్యుడైన దేవనాయకుని పూజించక ప్రాసంగిక ప్రభావం గల వేరే దేవతలను పూజిస్తే ఏ లాభమూ కలుగదు. What is the Great thing in shining with Borrowed Feathers?

*"పుక్కడిమైయినాల్ తన్నైకణ్ణ మార్కండేయ నవనై।
రక్కపిరాను మన్ఱు ఉయ్యక్కొండదు నారాయణ నరుళే॥"*-

(తి.వా.మొ. 4-10-8)

'నక్క, పిరాన్' అంటే దిగంబరుడు, జ్ఞాన ప్రదుడైన పరమ శివుడు ఉపకారకుడని అర్థం.

మార్కండేయ మహర్షి పరమశివుణ్ణి పరదేవతగా భావించి ఆశ్రయించి దాస్యం చేశాడు. శివదర్శనమయింది. తన ఆశ్రయణం వృధా కాకూడదని తలచిన పరమశివుడు 'నీకైనా, నాకైనా రక్షకుడు నారాయణుడే' అని ఉపదేశించి, నారాయణునిచేత మార్కండేయ మహర్షిని రక్షింపజేశాడు అని నమ్మాళ్వార్ల శ్రీసూక్తి.

*"త్వయి రక్షతి రక్షకైః కి మన్యైః।
త్వయి చారక్షతి రక్షకైః కిమన్యైః॥"* (కామాసికాష్టకమ్-8)

ఓ దేవదేవా! నీవు రక్షకుడవై యుండగా, ఇతరులను రక్షకులనే భావంతో ఆశ్రయిస్తే ఏమి లాభం? ఒకవేళ నీవు రక్షించకుండా నన్ను శిక్షించినట్లైతే కాపాదలేని వారిని ఆశ్రిత రక్షకులనుకోవడం కూడా నిష్ప్రయోజనమని నరసింహ స్వామిని దేశికులు స్తుతించారు.

సర్వేశ్వరుడే సకల కర్మ సమారాధ్యుడని స్పష్టీకృతం.

72. ఇఅరతిఅసా పసణ్ణా
కింకర సచ్చమహకింణు కాహింతిహిఅమ్।
ణీ హారఘణ స ఏహిం
ణహుపూరిజ్జఇ కహం వి చాఅఅతిణ్హా॥

ఛా. ఇతర త్రిదశాః ప్రసన్నాః
కింకర సత్య! మమకింను కరిష్యంతి హితమ్।
నీహారఘన శతైః
నఖలు పూర్యతే కథ మపి చాతక తృష్ణా॥

**అర్థం:** హే కింకరసత్య!= ఆశ్రితులకు సత్యదేవా!; త్రిదశాః= ఇంద్రాది దేవతలు; ప్రసన్నాః సంతః= అనుగ్రహం కలవారై; మమ= నాకు; కిం, ను, హితం= ఏమి మేలును; కరిష్యంతి= చేయగలరు;? నీహారఘన శతైః= మంచును-తుంపురును కురిసే నూరు మేఘాలచేత; చాతక తృష్ణా= చాతక పక్షియొక్క దప్పిక; కథం, అపి= ఏ విధంగానూ; నఖలు పూర్యతే= పూర్తి చేయబడదు కదా!

**తా॥** ఎందరు దేవతలైనా ప్రసన్నులై నాకు ఏ హితాన్ని చేయ్యగలరు? చల్లని మంచు తుంపరను కురిసే వంద మేఘాలైనా చాతక పక్షియొక్క దాహాన్ని తీర్చి తృప్తిపరచలేవు కదా!

**వ్యాఖ్య:-** ఇతర దేవతలు ముముక్షువు యొక్క కోరికను పూర్తి చేయజాలరని వర్ణితం.

గత శ్లోకంవలె ఈ శ్లోకమందు కూడా అన్యదేవతల పూజకంటే దేవనాథుని పూజయే శాశ్వతమైన ఫలమొసగునని దృష్టాంతం చేత సమర్థింపబడుతున్నది.

రుద్రహిరణ్యగర్భేంద్రాదులెందఱో దేవతలున్నారు.

"కాంక్షంతః కర్మాణాం సిద్ధిం యజంత ఇహదేవతాః।
క్షిప్రంహిమానుషే లోకే సిద్ధిర్భవతి కర్మజా॥" (భ.గీ.-4)

ఈ మర్త్యలోకంలో కామ్యకర్మలన్నీ శీఘ్రంగా ఫలమీయగలవని మానవులు అన్యదేవతలను ఆరాధిస్తారు. "అన్తవత్తు ఫలంతేషాం"- ఇతర దేవతలిచ్చే ఫలం పరిమితమైనది. ఆరాధించిన జనుల కోరికలను దీర్చే ఫలాలను నేనే దేవతలకిచ్చి వారి ద్వారా ఆరాధకులను తృప్తిపరచునట్లు చేస్తానని "లభతే చతతః కామాన్ మయైవ విహితాన్ హితాన్"- గీతాచార్యుడే బోధించాడు కదా! కాబట్టి అన్యదేవతలు త్రివర్గఫలాలను ప్రసాదిస్తారు. స్వర్గ వాస సౌఖ్యాన్నీ కల్పిస్తారు.

"బ్రహ్మాణం శితికంఠంచ యాశ్చాన్యాదేవతాః స్మృతాః।
ప్రతిబుద్ధా నసేవంతే యస్మాత్పరిమితం ఫలమ్॥"

బ్రహ్మరుద్రేంద్రాద్యన్య దేవతలను పరిమిత ఫలమొసగే వారని జ్ఞానమున్న వారెవ్వరు పూజించరు, ధ్యానించరు. "హరిరేకః సదా ధ్యేయః"- శ్రీహరి మాత్రమే మోక్షఫలమొసగునని సర్వదా ధ్యానం చేయతగినవాడు కదా!

త్రిదశాః ప్రసన్నాః మమకింను కరిష్యంతి హితమ్?- అన్యదేవతలు కర్మవశ్యులే కాబట్టి, మానవులచే పూజితులై ప్రసన్నులైన వారు మోక్షఫలాన్ని గోరే ప్రపన్నునికి ఏ విధంగానూ మేలు చేయలేరు. ప్రపన్నులు ప్రాపంచిక భోగాలను మనస్సులోనైనా కోరుకొనరు. స్వర్గ సౌఖ్యాదులను తృణప్రాయంగా భావిస్తారు. ప్రపన్నులు త్రికరణ శుద్ధిగా కోరే మోక్షసామ్రాజ్యాన్ని ప్రదానం చేసే శక్తి గోవిందునికి తప్ప వేరే దేవతలకు లేదు కాబట్టి ముముక్షువు యొక్క అభిలాషను అన్యదేవతలెందఱో కలిసి కూడా పూర్తి చేయలేరు. ఇందుకు దృష్టాంతం చెప్పబడుతున్నది.

నీహార ఘన శతైః నఖలు పూర్యతే చాతక తృష్ణా:- "ప్రసన్న శ్చాతక కోయద్వత్"- ప్రపన్నుడు చాతక పక్షి వంటివాడు. నీహారమంటే మంచు. "నీహారస్తు షారస్తుహినం హిమం"- (అమరం). చాతక పక్షి [illegible] తప్ప నేలమీద

పడిన నీటిని త్రాగదు. మంచును వర్షించే మేఘాలు అనేకం కూడియున్నా చాతక పక్షియొక్క పిపాసను పూర్తి చేయజాలవు కదా! పైగా (కథమపి) మంచును కురిసే మేఘాలు ఉపద్రవాన్ని కలిగించే రీతిగా, దేవతలు ధర్మార్థ కామాలు అనబడే త్రివర్గ ఫలాలను నొసగి సంసార వ్యాధిని కలిగింతురే తప్ప పరమ హితాన్ని చేకూర్చలేరు (తృష్ణే స్పృహాపిపాసేద్వే) అమరం.

*(చాతక పక్షికి గొంతులో రంధ్రమున్నందువల్ల తలవంచి నేలమీద మడుగులోనో, ఏటిలోనో ఉన్న నీటిని త్రాగజాలదు. మేఘం వర్షిస్తున్నప్పుడు-వాన పడుతున్నప్పుడు చాతకపక్షి అఱ్ఱుచాచి, తెరచి పైకి పెట్టిన నోటితో క్రొత్త నీటిని త్రాగగా ఆ నీరు దాని కడుపులోకి నేరుగా చేరుతుంది. దప్పిక తీరి తృప్తి పడుతుంది).*

73. *అణుగఅ సుహ మిఅతిణ్హా*
*అచ్చుఅ వీసమ ఇ తుజ్ఝ మామ అ తిణ్హా!*
*పవహేసు పసరిఆఏ*
*ఆసిఅ పవహంత ఘణకివా సరిఆఏ॥*

ఛా. *అనుగత సుఖమృగతృష్ణా*
*అచ్యుత! విశ్రామ్యతి తవ మామక తృష్ణా!*
*ప్రవాహేషు ప్రసృతాయాః*
*ఆశ్రిత ప్రవహద్ఘన కృపా సరితః॥*

**అర్థం:** హే అచ్యుత!; అనుగత·సుఖమృగతృష్ణా= అనుసరింపబడిన సుఖమే ఎండమావిగా కలిగినట్టి; మామక తృష్ణా= నా యొక్క దాహం, దప్పి; ప్రసృతాయాః = అంతట ప్రసరించునట్టి; తవ= నీ యొక్క; ఆశ్రిత-సరితః/ ఆశ్రిత= ఆశ్రితులపట్ల; ప్రవహత్= ప్రవహించే; ఘన= అధికమైన; కృపా= దయ అనే; సరితః= నదియొక్క; ప్రవాహేషు= ప్రవాహాలయందు; విశ్రామ్యతి= విశ్రమించును.

**తా॥** ఓ అచ్యుతా! నా పిపాస–శబ్ద స్పర్శాది విషయ సుఖం అనే మృగతృష్ణ– ఎండమావి నీటిని కలిగియున్నది. సర్వత్ర ప్రసరించునట్టిదై, నీ యందు భక్తిగలవారున్న చోట పారునట్టి అధికమైన నీ దయ అనే నదియొక్క ప్రవాహాల యందే విశ్రమిస్తుంది. నా దాహం శమిస్తుంది.

**వ్యాఖ్య:–** ప్రపన్నుని తృష్ణ భగవత్కృపను పొందినప్పుడు శమిస్తుంది అని సుశ్లోకితం.

నమ్మాళ్వార్లది "కృష్ణ తృష్ణాతత్త్వమ్" అని పూర్వాచార్యుల శ్రీసూక్తి. అట్టి 'కృష్ణ తృష్ణ'ను జీవులందఱు వృద్ధిజేసుకోవాలి కదా!

*"తన్మయత్వేన గోవిందే యేనరా న్యస్త చేతసః।*
*విషయత్యాగినస్తేషాం విజ్ఞేయం చ తదం తికే॥"*

భగవద్ధ్యానపరులై సర్వదా గోవిందుని యందే మనస్సు నుంచినవారై, శబ్దాది విషయాలను పూర్తిగా విడిచిపెట్టిన మానవులకే భగవత్కృప ప్రసరించి ఆయన సన్నిధిలో ఉండే భాగ్యం కలుగుతుంది.

మామక తృష్ణా:– దేశికులవారు 'తమ తృష్ణ' అన్నారు. కాని ఇది దేహధారు లందఱికి సామాన్యంగా వర్తిస్తుందని గమనించాలి. మనం ప్రాపంచిక భోగాలను అనుభవించడమే సుఖమని భావిస్తున్నాం. నిజంగా ఇది సుఖం కాదు. ఈ విషయ తృష్ణ అనాదికాలం నుంచి అనువర్తిస్తున్నది. 'తృష్ణ' అంటే ఆశ, దాహం అని అర్థద్వయం. మన తృష్ణ 'మృగతృష్ణ' వంటిది. "మృగతృష్ణా మరీచికా" (అమరం) ఎండమావులని అర్థం.

మంచి ఎండకాలంలో గ్రీష్మర్తువునందు సూర్యకిరణాలు గాలికెరటాలచే వ్యాపించి నీటి ప్రవాహంలాగా కనబడుతాయి. అడవిలో జింకలు, లేళ్ళు మొదలైన మృగాలు ఎండమావులను జూచి జలప్రవాహం అనే భ్రాంతిచేత తమ తృష్ణ– దప్పికను దీర్చకోవడానికి ఇటు అటు పరుగెత్తి, పరుగెత్తి చాలా అలసిపోతాయి,

చచ్చిపోతాయి కూడా (మృగాల తృష్ణ= మృగతృష్ణ). మన విషయ సుఖం మృగతృష్ణను పోలియున్నది. ఆశ తీరదు. ఆయువాగదు.

"శిశ్నోదరే యేఽభిరతా స్సదైవ
స్తే యా నృతా వాక్పరుషాశ్చ నిత్యమ్।
వ్యపేత ధర్మా ఇతి తాన్ విదిత్వా
దూరాద్దేవాః సంపరివర్జయంతి॥"

సర్వదా శిశ్నోదరపరాయణులై- చౌర్యం, అసత్య భాషణం, పరుష సంభాషణం చేసేవారు ధర్మమార్గాన్ని తప్పి ప్రవర్తిస్తున్నారనుకొని దేవతలు వారిని దూరంగా విడిచిపెడ్తారు.

ఐహికాముష్మిక సుఖాల భ్రాంతిచేత ఇతర దేవతలను సంతోషింప జేయడానికి ఉపాసనలు, పూజలు చేస్తే, ఆ ఫలం కూడా పరిమితమై, మరీచికా జలంలాగా దుఃఖానికే కారణమవుతుంది కదా!

"పరాఙ్ముఖానాం గోవిందే విషయాసక్త చేతసామ్।
తేషాం తత్ పరమంబ్రహ్మ దూరాత్ దూరతరే స్థితమ్॥"

భగవానునికి అభిముఖులు కాకుండా, శబ్దాది విషయాలయందు ప్రవణులైన వారికి దేవదేవుడైన ఆ పరబ్రహ్మ కూడా చాలా దూరమే ఉంటాడు. లోకంలో ప్రవహించే నదీజలాన్ని త్రాగితేనే మృగతృష్ణగానీ, మన తృష్ణగాని నశిస్తుంది.

భగవానుని కృప అనే ప్రవాహం అంతట ప్రవహిస్తుంటుంది. అందులోనూ భగవత్ప్రవణులైనవారి యందు భగవత్కృపానది అధికంగా ప్రవహిస్తుంది. కాబట్టి, భగవత్కృప అనే సరిత్ప్రవాహాన్ని చేరి ఆ సలిలాన్ని త్రాగినంతనే మన తృష్ణ దాహం ఆరిపోతుంది.

"పశవః పాశితాః పూర్వం పరమేణస్వలీలయా।
తేనైవ మోచనీయాస్తే నాన్యైర్మోచయితుం క్షమాః॥"

భగవానుడు తన లీలచేత ఈ జీవులను సంసార బంధమందుంచాడు. కాబట్టి, ఆయన కాళ్లను పట్టుకొంటేనే, ఆయనయే ఈ సంసార బంధం నుంచి విముక్తులనుగా చేయగలడు. కాని వేరెవ్వరు కూడా జీవులను బంధం నుంచి విడిపించే సమర్థులు కారు.

బంధమోక్షాలకు కారణమైన ఆ దేవనాథుని కృపను పొందడానికి ఆయనపై భారముంచి, మహావిశ్వాసంతో నిరంతరం ప్రార్థించవలసినదే అని పిండితార్థం.

74. విఅల సఅలంగ విసమే
ధమ్మేణఅసచ్చ ధఅణిహే ధారేంతో।
కంతారపంథ ఓ విఅ
ఖలంత చలణోమ్హి కాఅర విసీరంతో॥

ఛా. వికల సకలాంగ విషమాన్
ధర్మాన్ నతసత్య! ధ్వజనిభాన్ ధారయన్।
కాంతార పాంథక ఇవ
స్ఖల చ్చరణోఽస్మి కాతర విశీర్యమాణః॥

**అర్థం:** నతసత్య!; వికల సకల+అంగ, విషమాన్= పూర్తిగానట్టి, సకల కర్మాంగాలచేత, దోషహేతువులైన; ధ్వజనిభాన్= ధ్వజంవలె (తన ప్రసిద్ధికి కారణమై) ఉన్నట్టి; ధర్మాన్= జ్యోతిష్టోమాది కర్మలను; ధారయన్= అనుష్ఠిస్తూ; కాంతార పాంథకః, ఇవ= అడవిలోని బాటసారివలె; కాతర విశీర్యమాణః= భయంవల్ల చెదరిన అవయవాలు గలిగినవాడనై; స్ఖలత్+చరణః= జారుతున్న కాళ్ళు కలవాడనై; అస్మి= ఉన్నాను.

**తా॥** ఓ నతసత్యా! వర్ణాశ్రమాది ధర్మాలను సంపూర్ణంగా అనుష్ఠించనందు వల్ల విపరీత ఫలమిచ్చునట్టివి. అయిననూ, ధర్మానుష్ఠానపరుడనని, సోమయాజినని

నా మహిమను ధ్వజపతాకమెత్తి ప్రచారం చేసి, ప్రసిద్ధిని పొందడానికి మాత్రం ప్రయోజకాలైన ధర్మాలను అనుష్ఠిస్తున్నాను. అందువల్ల, గమ్యం తెలియక అడవిలో తిరిగే వ్యక్తివలె భయంవల్ల శరీరావయవాలు చీటికలేర్పడునట్లు కాలుజారి పడియున్నాను. ఈ విధమైన ధర్మాన్ని ఆచరించే నాకు విషయ సుఖతృష్ణ ఎట్లు తొలగిపోతుంది?

**వ్యాఖ్య:-** భగవదనుభవాన్ని అభిలషించేవారి యొక్క ఔన్నత్యాన్ని ఉపన్యసించిన దేశికులు, ఇప్పుడు నైచ్యానుసంధానం చేస్తున్న శ్లోకం.

"వర్ణాశ్రమాచారవతా పురుషేణ పరః పుమాన్।
విష్ణు రారాధ్యతే పంథా నాన్యస్తత్తోష కారకః॥"

"నచలతి నిజవర్ణ ధర్మతో యః॥"

"స్వకర్మణా తమభ్యర్చ్య సిద్ధిం విందతి మానవః॥"

వర్ణాశ్రమ ధర్మనిష్ఠుడైన పురుషునిచే పరమ పురుషుడైన విష్ణువు ఆరాధింపబడుతున్నాడు. ఇంతకంటే విష్ణుమూర్తిని సంతోషపరచే వేరే మార్గమే లేదు.

ఎవ్వడు తన యొక్క వర్ణాశ్రమ ధర్మాచరణం నుంచి చలించడో అట్టి మానవుడు స్వధర్మానుష్ఠానం చేత సర్వేశ్వరుణ్ణి పూజించి సిద్ధిని పొందుతున్నాడు- అని చెప్పబడిన రీతిగా, భగవదారాధన రూపమైన కర్మల నాచరించే నీకు అయ్యో! ఈ వైషయిక సుఖతృష్ణయొక్క ప్రసక్తి యేమిటి? అని నతసత్యుడు అడిగినట్లు భావించుకొని "నధర్మనిష్ఠోఽస్మి"- "అమర్యాదః" నేను ధర్మనిష్ఠుడను కాను; ఏ మర్యాదను పాటించడం లేదు- అని దేశికులు తమ నైచ్యాన్ని భగవానునికి విన్నవించు కొంటున్నారు.

ఆళ్వార్లు, ఆళ్వందార్, పూర్వాచార్యులు తమ జీవనశైలిని, ప్రవర్తనను ఈ విధంగానే నిరసించుకొన్నారు.

నైచ్యాను సంధానం దేశికులకు అసంగతమే అయినా మానవులు భగవద్భాగవతాచార్యులముందు, తమకంటే పెద్దవారి యెదుట తమ గొప్పతనాన్ని చెప్పుకొనగూడదనే గుణపాఠమని గ్రహించి ప్రశంసింపదగినదే.

వికల సకలాంగ విషమాన్ ధర్మాన్:- ఓ నతసత్యా! దేవనాయకా! శాస్త్రమందు చెప్పబడినందువల్ల ధర్మాలు అనబడుతున్నవి. ఆ ధర్మాలే ఆచరింప బడుతున్నప్పుడు 'కర్మలు' అనబడుతున్నాయి. ఆ ధర్మాలకు సంబంధించి, క్రమంగా ఆచరించే ప్రక్రియలు కర్మాంగాలు అనబడుతాయి. దేవదేవా! నేను ఆచరిస్తున్న నిత్య, నైమిత్తిక, కామ్యకర్మలన్నీ యథావిధిగా సంపూర్ణంగా ఆచరింపబడుతు లేవు. ఎందుకంటే అంగలోప, అంగహీనతాదులనుబట్టి, స్వర, వర్ణ, పదాలను చక్కగా ఉచ్చరించనందువల్లనూ, ద్రవ్యలోపంవల్లనూ, కర్మలోపం వల్లనూ విషమంగా దోషాలను కలిగియున్నాయి. విపరీత ఫలప్రాప్తికి హేతువులై యున్నాయి.

ధ్వజనిభాన్ ధారయన్:- "పుంసాం జటాభరణ మౌండవ్యతాం వృథైవ"- ధర్మానుష్ఠాన పరులకు జడలు తాల్చుకొని యుండడం, తలను బోడి చేసుకొని, యుండడం ఇట్టి బాహ్యాలంకారాలు వ్యర్థమైనవని శాస్త్రం చెబుతుంది. కాని పవిత్ర దర్భలను, కృష్ణాజినాన్ని- నల్లజింక చర్మాన్ని, తీర్థకుండికను, వేణుదండాన్ని ధరించి, దీక్షకలవాడనని తోచడానికి మకరకుండలాలను చెవులకు అలంకరించు కొని, నేను అగ్నిహోత్రిని, వాజపేయిని, చాతుర్మాస్య యాజిని అని చెబుతూ, బిరుదుగా ధ్వజపతాకాన్ని ఎత్తి, ప్రచారం చేస్తూ ప్రసిద్ధిని పొందడానికి చేస్తున్న దాంభిక ధర్మాలే సుమా!

కాంతార పాంథక ఇవ కాతర విశీర్యమాణః స్ఖలచ్చరణోஉస్మి:- పోవలసిన స్థలం తెల్యక కారడవిలో నడచుకొంటూ పోతున్న వ్యక్తి, సింహ, వ్యాఘ్ర, సర్పాది దుష్టజంతువులవల్ల కలిగిన భయంవల్ల చూపు తగ్గిపోయి, కాలుజారి రాళ్ళు రప్పల్లో, ముండ్లల్లో పడిపోయి శరీరావయవాలన్ని గాయాలై బాధపడుతున్నట్లే

నేను చేసిన కర్మలన్నీ వైకల్యంచేత అసమగ్రంగా ఉండి విపరీత ఫలజనకాలై, గొప్ప ధర్మాత్ముడని నా మహిమను అందఱు పొగడడానికి దంభంగా ఆచరిస్తున్న ఇటువంటి ధర్మాలవల్ల అధఃపాతాళంలో పడి మహాభయాన్ని పొందియున్నాను.

హే నతసత్య:- యథావిధి ధర్మాలను ఆచరించనందువల్ల, వైషయిక సుఖతృష్ణ-మృగతృష్ణ దాని కారణంగా సంసార భయం తొలగిపోదని, అగతికుడనై నీవే శరణమని వేడుకొంటున్నాను స్వామీ! నీవే నన్ను రక్షింపవలెను.

75. థిరధమ్మవమ్మ థ ఇ అం
అధమ్మ పవణాణ అగ్గఖంధ పవట్టమ్।
అఘడన్త విపడిసారం
అచ్చుఅ మం హససి ణూణ లచ్ఛిసమక్ఖమ్॥

ఛా. స్థిర ధర్మ వర్మస్థగితం
అధర్మ ప్రవణానా మగ్రస్కంధ ప్రవృత్తమ్।
అఘటమాన విప్రతీసారం
అచ్యుత! మాంహససి నూనం లక్ష్మీ సమక్షమ్॥

**అర్థం:** హే అచ్యుత!; స్థిర ధర్మవర్మ స్థగితం= దృఢమైన ధర్మం అనే కవచం చేత కప్పిపుచ్చబడిన; అధర్మ ప్రవణానాం= అధర్మం (పాపం) చేయడమందే ఆసక్తి గలవారియొక్క; అగ్రస్కంధ ప్రవృత్తం= మొదటి స్థానమందు ఉన్నట్టి; అఘటమాన విప్రతీ సారం= చేయబడని పశ్చాత్తాపం కలవాడనైన; మాం= నన్ను; లక్ష్మీ సమక్షం= లక్ష్మీదేవి ముందు; నూనం= నిశ్చయంగా; హససి= పరిహసిస్తున్నావు.

**తా॥** ఓ అచ్యుతా! భేదింపరాని ధర్మం అనే కవచాన్ని ధరించి, అధర్మ మాచరించే వ్యక్తులలో అగ్రేసరుడనై యున్నాను. పశ్చాత్తాపమేమాత్రమూ లేని నన్ను లోక మాతయైన లక్ష్మీదేవి ముందర పరిహసిస్తున్నావు.

**వ్యాఖ్య:-** ఆత్మనింద అనే నైచ్యానుసంధానం భంగ్యంతరంగానూ వివరింప బడుతున్న శ్లోకం.

విపరీత ఫలమిచ్చే ధర్మాన్ని అనుష్ఠించినందుకు పశ్చాత్తాపపడి ప్రాయశ్చిత్తం చేసినట్లైతే అనిష్ట నివృత్తి సులభమే కదా! మఱి భయపడడమెందుకు? అంటే దేశికుల సమాధానమిట్లున్నది.

*"పాపం ప్రజ్ఞాం నాశయతి క్రియమాణం పునః పునః।*
*నష్ట ప్రజ్ఞః పాప మేవ పునరారభతే నరః॥"*

మానవుడు మళ్ళీ మళ్ళీ చేస్తున్న పాపం అతని బుద్ధిని నాశనం చేస్తుంది. బుద్ధి నశించిన మనిషి ఇంక ఎక్కువగా పాపం చేస్తునే ఉంటాడు. కాబట్టి అధర్మ ప్రవర్తనకు కారణమైన పూర్వవిపరీతానుష్ఠానం పశ్చాత్తాపాన్ని కలిగిస్తుందా? దాని మూలకంగా ప్రాయశ్చిత్తాన్ని అనుష్ఠించే బుద్ధిని జనింపజేస్తుందా? ముఖ్యంగా ప్రజ్ఞ నశిస్తుంది. ఇప్పుడు నేను వంచనపరుడ నయ్యాను స్వామీ! ఒక్క పాపం ఇంక ఎన్నో పాపాలను చేయిస్తుంది కదా!

*స్థిరధర్మ వర్మస్థగితం:-* ప్రవృత్తి ధర్మంకంటే శ్రేష్ఠమైన నివృత్తి ధర్మం అనే దృఢమైన కవచాన్ని ధరించాను. మేకవన్నె పులిని నేను. "అంతర్దుష్టో బహిః శాంతః"- అన్నట్లు పైకి ధర్మభావన కలవానిగా కనబడుతున్నాను. లోపల అధర్మాన్ని మాత్రం మరుగు పరచియున్నాను. అంతః శుద్ధిలేనివాడనై, గొప్ప కర్మానుష్ఠాతవలె నటిస్తున్న మహాడాంభికుడను.

*అధర్మ ప్రవణానా మగ్రస్కంధ ప్రవృత్తం:-* చెట్టు కొమ్మలనెక్కినవారిలో మీది కొమ్మనెక్కినవాడు మొనగాడన్నట్లు, అధర్మ ప్రవర్తన యందు ఆసక్తిగల వారిలో నేను అగ్రేసరుడను కదా!

*"స్కంధఃస్యాన్నృపతా వంశే సాంపరాయ సమూహయోః।*
*కాయే తరు ప్రకాండేచ భద్రాదౌ ఛందసోభిది॥"* (మేదిని)

అఘటమాన విప్రతీసారం- అసంభవమైన, ఉండదగని పశ్చాత్తాపం కలవాడు. పాపాలను చేస్తూ, ధర్మభావనను అభినయిస్తున్ననూ, పశ్చాత్తాపం లేనివాడను.

"పశ్చాత్తాపోఽను తాపశ్చ విప్రతీ సార ఇత్యపి"- (అమరం).

మాంహాససి లక్ష్మీ సమక్షమ్:- ఇట్లు ఇతడు కపటవేషధారి. బాహ్యధర్మాడంబరం చేత అందఱిని వంచించి, నా యాజ్ఞను- శాస్త్రవిధిని ఉల్లంఘించినవాడు. అయిననూ, పశ్చాత్తాప రహితుడు అని నన్ను నీ ప్రక్కన నున్న లక్ష్మీదేవి ముందఱ పరిహాసిస్తున్నావు స్వామీ!

"ధర్మానుష్ఠాన నిష్ఠుడైన దాసుణ్ణి సర్వస్వామివైన నీవు అనుగ్రహించకుండా నిగ్రహించడం 'దయాళుడు' అని ప్రసిద్ధిపొందిన నీకు తగునా?" అని మధ్యస్థయై, పురుషకారం చేసే జగన్మాత- లక్ష్మీదేవి యెదుట "ఆజ్ఞను మీఱి అందరిని ప్రలోభపరచే ఈ నయవంచకుడు నీ కృపకు ఎట్లు పాత్రుడైనాడు?" అని పల్కుతూ నన్ను తిరస్కరిస్తున్నావు. శ్రీదేవి సమక్షంలో నన్ను పరిహాసిస్తున్నావు అంటే, చెప్పిన దోషాలన్ని వాస్తవమే, అవి ఆరోపితాలు కావు- అనే అభిప్రాయమే కదా! లోకంలోనూ స్త్రీలముందు అబద్ధంగా దూషించారు.

"పూశిత్తునల్ గి య్యురైప్పర్ తమ్ తేవియర్క్కే"- (తి.వా.మొ. 7-10-11). తమ పత్నులకు మంచిమాటలనే ప్రేమతో చెబుతూ కొనియాడుతుంటారు- అని ఆళ్వార్ల శ్రీసూక్తి. అయ్యో! ఇప్పుడేమి చేయాలి? ఇక నాకు రక్షకులెవరున్నారు? 'నూనం' ఉత్ప్రేక్షను సూచిస్తుంది.

హే అచ్యుత! ఓ దేవనాయకా! నీ 'అచ్యుత' త్వగుణానికి 'చ్యుతి' కల్గకుండే విధంగా నన్ను రక్షించుమని దేశికులు ప్రార్థించారు.

76. తరిఉం అచ్చు అ దురిఅం
ఇమమ్మి దేహమ్మి ఏక్క ది అహేవి కఅమ్।
కాళో అళం ణ స అళో
కలు ణా ఏ తుజ్ఝ పుణ్ణ పత్తం మ్హి ఇమో॥

ఛా. తరితు మచ్యుత దురితం
అస్మిన్ దేహ ఏకదివసేఽపి కృతమ్
కాలోఽలం నసకలః
కరుణాయాస్తవ పూర్ణ పాత్రమస్మ్యయమ్॥

**అర్థం:** హే అచ్యుత!; అస్మిన్= ఈ; దేహమందు; ఏకదివసే, అపి= ఒక్కనాడు మాత్రం; కృతం= చేయబడిన; దురితం= పాపాన్ని; తరితుం= పోగొట్టుకోవడానికి; సకలః= సమస్తమైన; కాలః= కాలం; న, అలం= సరిపోదు; అతః= ఇందువల్ల-కావుననే; తవ= నీ యొక్క; కరుణాయాః= దయకు; పూర్ణ పాత్రం= సంపూర్ణ లక్ష్యంగా; అయం= ఈ నేను; అస్మి= ఉన్నాను.

**తా॥** ఓ అచ్యుతా! ఈ శరీరంచేత ఒక్కరోజుననే చేయబడిన పాపాన్ని పోగొట్టుకోవడానికి సమస్త కాలం కూడా సరిపోదు. కావున నీ కృపకు నిండు లక్ష్యభూతుడనై ఉన్నాను.

**వ్యాఖ్య:-** అపరాధాలను క్షమించే భగవత్కృపయే నిదానమని స్తుతి.

అధర్మ భూయిష్ఠుడవైన నీ యొక్క పాపాలన్నీ నశించిన తర్వాతనే నిన్ను రక్షించగలను అని భగవానుడు ఉదాసీనుడై యుండగా స్వామి దేశికన్ ప్రార్థిస్తున్న విధమిది.

"అస్మిన్ దేహే ఏకదివసేఽపి కృతం దురితం తరితుం నాలం సకలః కాలః"- ప్రారబ్ధ కర్మఫలమైన ఈ జన్మలోనే ఈ దేహంచేత ఒక్కదినాన మాత్రమే

చేసిన పాపాన్ని కాలతత్త్వమున్నంత వరకు అనుభవించినా, పాపం నశించదు కదా! ఇక అనాదికాలం నుంచి అనేక జన్మలలోనూ క్షణేక్షణే చేస్తూ వచ్చిన పాపాలను గూర్చి చెప్పేదేమి? కల్పాంతకాలం కూడా నా దురితాలను నశింప జేయదానికి సరిపోదనడం నిశ్చ ప్రచం.

"అలం భూషణ పర్యాప్తి శక్తివారణ వాచకమ్"- (అమరం).

"అనుభవితు మహౌఘం నాలమాగామి కాలః"- (ద.శ. 34). పాపరాశిని అనుభవించడానికి రాబోయే కాలం చాలదు.

యద్బ్రహ్మ కల్ప నియుతానుభవేఽ ప్య నాశ్యం
తత్ కిల్బిషం సృజతి జంతురిహ క్షణార్ధే।
ఏవం సదా సకల జన్మసు సాపరాధం
క్షామ్యస్యహో! తదభిసంధివిరామ మాత్రాత్॥ (శ్రీవై.స్తవం. 61)

వేయి బ్రహ్మకల్పాలు అనుభవించినా నశింపజేయడానికి సాధ్యం కాని పాపాన్ని ఈ లోకంలో చేతనుడు ఒక అరక్షణంలోనే చేస్తున్నాడు. ఇట్లు అన్ని జన్మలలోనూ ఎల్లప్పుడు అపరాధాలను చేసిన ప్రాణిని కూడా ఆ వైకుంఠనాథుడు, 'ఇకమీద నేను పాపం చేయను' అని నిశ్చయించుకొని, పాపం చేయడం మానినంతలోనే అతడు ఇంతకాలం దాకా చేసిన పాపాల నన్నింటినీ క్షమిస్తాడు. భగవానుని క్షమాశక్తి చాలా ఆశ్చర్యకరమని శ్రీ కూరేశులు తెల్పినారు.

కరుణాయాస్తవ పూర్ణపాత్ర మస్మి అయమహమ్:- అపరాధ సహస్ర భాజనుడవైన నీపైన నా కృప ఎట్లు ప్రవర్తిస్తుంది? అంటావా స్వామీ! ఆలోచించవయ్యా, అచ్యుతా! పరుల దుఃఖాన్ని తొలగించే సామర్థ్యం దయాదేవికి మాత్రమే ఉన్నది. అధర్మబాహుళ్యంచేత దుఃఖ భూయిష్ఠుడనైన నా విషయమై కాలానికి ఏ విధంగానైనా నా పాపాలను నశింపజేసే సామర్థ్యం లేదు, కాబట్టి మహా విశ్వాసంతో భగవత్కరుణ నా యందు ప్రసరించాలి అని ఆశ్రయించాను.

కరుణాపాత్రులయందు కరుణ ప్రవర్తించకపోతే కరుణాస్వరూపమే సిద్ధించదు కదా!

"అహమస్మ్య పరాధ చక్రవర్తీ, కరుణేత్వంచ గుణేషు సార్వభౌమీ"- (ద.శ.). అపరాధులలో చక్రవర్తిని నేను. భగవద్గుణాలలో సార్వభౌమి దయాదేవి. కాబట్టి, భగవత్కరుణకు పూర్ణపాత్రుడనై యున్నాను. నిష్పాపుల విషయంలో భగవత్కృపకు ప్రయోజనం లేదు. మహాపాపాత్ములమైన మావంటి వారి విషయంలోనే కదా భగవత్కృప ఉపయోగపడవలెను. దేవనాయకా! అచ్యుతా! దయనీయుడనైన నన్ను విడువకుండా కృపతో రక్షింపుమని ప్రార్థన చేశారు దేశికులవారు.

77. అచ్చుఅ తుజ్ఝ గుణాణం
మహ దోసాణం వి ణత్థికుత్థవి గణణా।
తహావి జ ఓ పుధమాణం
అహి అం లీణాణ హోఇ ణహు దుబ్బల్లమ్॥

ఛా. అచ్యుత! తవగుణా నాం
మమదోషాణా మపి నాస్తికు త్రాపి గణనా।
తథాఽ పి జయః ప్రథమానాం
అధికం లీనానాం భవతి నఖలు దౌర్బల్యమ్॥

**అర్థం:** హే అచ్యుతా!; తవ= నీ యొక్క; గుణానాం= గుణాలకు; మమ= నా యొక్క; దోషాణాం, అపి= దోషాలకును; గణనా= లెక్క; కుత్ర, అపి= ఏచోట కూడా; నాస్తి= లేదు; తథా, అపి= అట్లైననూ; ప్రథమానాం= మొదట చెప్పబడిన గుణాలకు; జయః= జయం కలుగును; అధికం= ఒప్పువానియందు/ జలమందు; లీనానాం= లయమైన గుణాలకు, మునిగిన (ప్రబ్జలివంటి) వాటికి; దౌర్బల్యం= బలహీనత; భవతినఖలు= ఉండదు కదా!

**తా॥** ఓ అచ్యుతా! నీ గుణాలెన్ని ఉన్నాయో నా దోషాలు కూడా అన్నే ఉన్నాయి. ఏ కాలానగానీ, ఏ దేశమందుగానీ ఎవ్వరు లెక్కించలేనన్ని ఉన్నాయి. నీ గుణాలకు, నా దోషాలకు పోరు ఏర్పడితే నీ గుణాలకే జయం కలుగుతుంది. అధికుని చేరిన గుణాలకు/ జలమందు మునిగిన ప్రబ్బలివంటి వాటికి, దౌర్బల్యమేర్పడదు కదా! (మునుగడమే దౌర్బల్యమని 'కాకువు'గా తాత్పర్యం).

**వ్యాఖ్య:-** దోషాలు కూడా లెక్కలేనన్ని ఉన్న మనకు గుణాలే శరణం.

కల్పకోటి కాలం అనుభవించిననూ నశించని నీ దోషాలను నా కరుణ అనే ఒక్క గుణం నివారిస్తుందా? నా గుణాలన్నీ కలసి కూడా నీ దోషాలను తొలగింపజాలవు. నా గుణాలవలె నీ దోషాలు కూడా ఎన్నలేనన్ని ఉన్నాయి. సమాన బలం కలిగియున్న నా గుణాలకూ నీ దోషాలకూ ఏ విధంగానూ నాశక నాశ్యభావం సంభవం కాదు- అని దేవనాయకుడు పలుకగా స్వామిదేశికన్ నమ్రతతో తన ఆశయాన్ని విన్నపిస్తున్న విధమిట్లున్నది.

*అచ్యుత! తవగుణానాం మమదోషాణా మపినాస్తి కుత్రాపిగణనా:-* స్వామీ! నీవు అచ్యుతుడవు. నన్ను వదలివేయాలని ప్రయత్నించకు. నా పాపాలు నీ కృపను నా మీద ప్రసరింపజేయనంత ప్రబలంగా ఉన్నాయి. అసంఖ్యేయమైనవి నీ గుణాలు. నా దోషాలూ అసంఖ్యేయాలే. నీ, నా గుణదోషాలు సమానబలం కలవి అనడమూ నిజమే. నాస్తి కుత్రాపి గణనా-గుణాలను దోషాలతో సమానంగా పోల్చి లెక్కించడం ఎక్కడా లేదు అనే అర్థమూ ఉన్నది. తథాపి-గుణదోషాలను రెండింటినీ లెక్కించడం శక్యం కాకపోయినా, ఆ రెండింటికి గల భేదమైతే విచారించదగినదే కదా!

*ప్రథమానాం జయః-* మొదట చెప్పబడినవి దోషాలు కావు. గుణాలే చెప్పబడినాయి. హేయగుణమొక్కటి కూడా లేని నీకు ఉన్నవన్నీ కల్యాణ గుణాలే. ఆ గుణాలు హేయ ప్రత్యనీకాలు. దోషాలను ఎదుర్కొని తొలగించే స్వభావం

కలవి నీ కల్యాణ గుణాలు. గుణాలకు విరుద్ధమైనవి దోషాలు. ఆ రెండింటికీ సమరం సంభవిస్తే అరమరలేకుండా నీ కల్యాణ గుణాలకే జయం కలుగుతుంది. జయశీలం కలవి భగవత్కల్యాణ గుణాలు కదా!

"నహి కల్యాణకృత్ కశ్చిత్ దుర్గతింతాత గచ్ఛతి"- (భ.గీత). మంచి పనులను చేసే వాడెవ్వడు చెడిపోడు అని కదా అర్థం. ఇక కల్యాణ గుణాలకు అపజయమే ఉండదు, సర్వదా జయమే కలుగుతుంది. భగవద్గుణాలకు ఆశ్రితులను రక్షించడం చేతనే స్వరూపలాభం ఉన్నందువల్ల అవి మాత్రమే విజయాన్ని పొందుతాయి. కార్యమందు నెగ్గడమే జయం కదా!

ఈ విషయాన్నే సామాన్య రూపమైన అర్థాంతరన్యాసం చేత సమర్థిస్తున్నారు ఆచార్యులు.

*అధికం లీనానాం భవతి నఖలు దౌర్బల్యమ్:* -పురుషోత్తముణ్ని ఆశ్రయించిన గుణాలకు బలహీనమేర్పడదు. కే= అధికం, అని విగ్రహవాక్యం, అధికరణ సప్తమీ విభక్తియొక్క అర్థమందు అవ్యయీభావం. 'జలమందు' అని అర్థం.

"కో బ్రహ్మణి సమీరాత్మ యమదక్షషు భాస్కరే।
కామే గ్రంథౌ చక్రిణి చ పతత్రిణి చ పార్థివే॥" (మేదిని)

"కం వారిణి చ మూర్ధని"- (అమరం) "కం బ్రహ్మ, ఖం బ్రహ్మ"- (శ్రుతి. 'కం' అంటే జలం, శిరస్సు, సుఖం, బ్రహ్మ అని నానార్థాలు. అత్యంత వినీతులకు అపజయం కలుగదు అని వాక్యార్థం. అధికుణ్ణి ఆశ్రయించిన గుణాలకు జయశీలత్వం యుక్తమే అని భావం.

"న శయానః పతత్యధః, నమంతి సంతః త్రైలోక్యాద పిలబ్ధుం సమున్నతిమ్"- నిలబడిన వ్యక్తి క్రింద పడుతాడు కాని, పడుకొన్న వాడు క్రింద పడడు. సత్పురుషులు మూడు లోకాలకంటే ఉన్నత స్థానాన్ని పొందడానికే వంగి వంగి దండాలు పెడతారు.

"బలీయ సాభియుక్తో దుర్బలః సర్వత్ర అనుప్రణతః వైతసం ధర్మమను తిష్ఠేత్"- తనకంటే ఎక్కువ బలమున్న వానితో ఎదిరించే దుర్బలుడు సర్వదేశకాలాల్లో వంగి నమస్కరిస్తూ వైతసధర్మాన్ని అనుష్ఠించవలెను- అని కౌటిల్య వచనం.

వైతస ధర్మం- ప్రబ్బలిచెట్టు స్వభావమిది-నదిలో ప్రవాహం వచ్చినప్పుడు ప్రబ్బలిచెట్టు (వేరేచెట్టు ఎదురుగా నిటారుగా నిలబడినందున వాటిని కూకటి వ్రేళ్ళను పెకలించి పడగొడుతుంది) వంగి నీళ్ళలో మునిగి యుంటుంది. ప్రవాహం లేనప్పుడు ఎప్పటివలె నిల్చియుంటుంది (వేతసః= ప్రబ్బలిచెట్టు). ప్రబ్బలికి, నీటియందు మునిగి యుంటుంది కాబట్టి, దౌర్బల్యం సంభవించదు అని భావం. నమ్రతను పాటించడమే కమ్రత కదా! భగవద్గుణాలను ఆశ్రయించడం వల్ల దౌర్బల్యం కలుగదు. మనస్సుకు సంకోచం కలుగదు- అని భావం. దోషాలు- పాపాలు వ్యక్తిని పడద్రోసి అణగద్రొక్కే స్వభావం కలవి. గుణాలను విన్నంతనే పాపాలకు ఊపిరాడదు. కాబట్టి, ఓ దేవనాయకా! అచ్యుతా! నీ కల్యాణ గుణాలే అనంత దోషాలను కలియున్న నాకు శరణం అని దేశికులు ప్రార్థించారు.

"పావమెల్లాం శుమ్మెనాదే కైవిట్టోడి త్తూఱుగళ్ పాయ్న్దననవే" (పెరియాళ్వార్ తిరుమొషి- 5-4-3). తిరుపతి వేంకటేశ్వరస్వామి యొక్క దివ్యకృపను అపేక్షించి ఆశ్రయించిన వెంటనే తన పాపాలన్నీ ఊపిరి ఆడక తనను విడిచిపెట్టి, పరుగెత్తి పొదరిండ్లల్లో ప్రవేశించాయి- అని శ్రీవిష్ణుచిత్తులు స్తోత్రం చేశారు.

(దౌర్బల్యం అనే శబ్దం ప్రాకృత భాషలో 'దుబ్బల్లమ్' అనబడింది. 'య' కారంలోపించి మిగిలిన 'ల' కు - రేఫం లోపించిన 'బ' కు కూడా 'ద్విత్వం' ఏర్పడింది. 'దౌ' అనేచోట 'ఏచ ఇగ్ఘస్వాదేశే' అనే సూత్రం వల్ల 'ఔ'కు 'ఉ' కారం ఆదేశమయింది).

78. రత్తిం దిఅహం అచ్చుఅ
తుడిఅ పడంతాఇ ఆఉ ఉదమ ఖండాఇమ్।
దర్థూణ వి దరిఅమణం
బాలం ఏణ్హిం వి భరసుమం అపమత్తో॥

ఛా. రాత్రిం దివసమచ్యుత!
త్రుటిత పతమానాన్యా యుర్ద్రుమ ఖండాని।
దృష్ట్వాఽపి దృప్తమనసం
బాల మిదానీ మపి భరస్వమా మప్రమత్తః॥

**అర్థం:** హే అచ్యుత!; రాత్రిం దివసం= రేయింబవలు; త్రుటిత పతమానాని= ఛేదింపబడి పడిపోతున్నట్టి; ఆయుః+ద్రుమఖండాని= ఆయువు అనే వృక్షం యొక్క ముక్కలను; దృష్ట్వా, అపి= చూచి కూడా; దృప్తమనసం= దర్పంతోనున్న మనస్సు గలిగినట్టి; ఇదానీం అపి= ఇప్పుడు కూడా; బాలం= బాలుడనైన (అజ్ఞానినైన); మాం= నన్ను; అప్రమత్తః= సావధానుడవై; భరస్వ= భరించుము.

**తా॥** ఓ అచ్యుతా! ఆయుష్యమనేది ఒక వృక్షం వంటిది. ఆ వృక్షం రాత్రి పగలు ఛేదింపబడి ముక్కలు ముక్కలుగా పడగొట్టబడుతున్నది. ఈ విషయం నాకు తెలుసు. అయినా, ఇంక నా మనస్సు గర్వంతోనే యున్నది. ఇప్పుడు ఈ ప్రాయంలో కూడా, బాలునిగా– అజ్ఞానిగా నున్న నన్ను సావధానుడవై నా రక్షణ భారాన్ని నీవే భరింపవలెను.

**వ్యాఖ్య:–** రక్షకుడైన భగవానునిచేతనే ఈ చేతనుడు రక్షణీయుడు అని ప్రార్థింపబడుతున్నది.

సర్వప్రాణుల ఆయువు యొక్క అవసాన దశను లోకంలో ప్రత్యక్షంగా చూస్తున్న నీకు కూడా అట్టి దశ తప్పదనియే భావించావు. "గృహీత ఇవ కేశేషు

మృత్యు నా ధర్మమాచరేత్"- "మృత్యుదేవత జుట్టు పట్టుకొని ఈడ్చి వేస్తున్నట్లు భావించే చేతనుడు ప్రతిక్షణం ధర్మాన్ని ఆచరించవలెను"- అని శాస్త్రం చెప్పిన రీతిగా, నీవు సంసార తరణోపాయమైన ధర్మాన్ని అనుష్ఠిస్తున్నావు కదా! తత్ఫలితంగా, నా కృపయే నిన్ను లక్ష్యంగా చూచుకొంటుందిలే. ఇంక ఈ ప్రార్థన చేస్తున్నావెందుకు? అని అచ్యుతుడు ప్రశ్నించాడు. ఆచార్యులు వినయంగా తన అభిప్రాయాన్ని ఆదరింపవలెనని ఇట్లు ప్రార్థిస్తున్నారు.

*"అహన్యహని భూతాని ప్రవిశంతి యమాలయమ్।*
*శేషాః స్థావర మిచ్ఛంతి కిమాశ్చర్య మతః పరమ్॥"*

ప్రతిదినం ఎన్నో ప్రాణులు యముని సదనానికి- నరకానికి- చేరుకొంటున్నాయి. మిగిలిన ప్రాణులు ఇక్కడనే స్థిరంగా ఉండాలని కోరుకొంటున్నాయి. ఇంతకంటే ఆశ్చర్యమేముంది? అన్నట్లు, చిరకాలమీ సంసారమందే ఉండాలని కాంక్షించే మౌఢ్యమున్న నాకు ధర్మానుష్ఠాన ప్రసక్తి ఉండదు కదా!

*రాత్రిం దివసం త్రుటిత పతమానాని ఆయుర్ ద్రుమఖండాని*- రాత్రిశ్చ దివసశ్చ తయోః సమాహారః= రాత్రిం దివసం; అని విగ్రహ వాక్యం.

రేయింబవలు కాలమనే గొడ్డలిచేత ఆయుష్యమనే వృక్షం తునాతునకలుగా నరకబడుతునే యున్నది. దినదినం ఆయుస్సు క్షీణిస్తున్నదని భావం.

దృష్ట్వాఽపి- అహోరాత్రాలు బాల్య కౌమార్యాది వ్యాజంతో ఆయుష్కాలం గడచిపోతున్నదని కనబడుతునే యున్నది.

దృష్టమనసం- క్షణం క్షణం ఆయుస్సు అంతరిస్తున్నదని లోకాన్ని చూచి తెలుసుకొంటున్నప్పటికీ, విషయలాలసచే స్వాత్మోజ్జీవనకై ఉపయోగపడే ధర్మాన్ని ఆర్జించలేని నా మనస్సు తమోగుణ భూయిష్ఠమై యున్నది. అఖర్వగర్వంతో మేలు కీళ్లను ఎంచక, అలక్ష్యంగా ప్రవర్తిస్తున్నది.

ఇదానీ మపి, బాలం మాం అప్రమత్తః భరస్వ:– తత్త్వహిత పురుషార్థాలను సంపాదించుకొనే సామర్థ్యం కలిగియున్న ఈ దశయందు కూడా సంసార బంధం నుంచి విడివడే ఉపాయం తెలియని బాలుని– మూఢునివలె ఉన్నవాడనని, హృదయ కుహరంలో శాస్త్రగా ఉన్న నీకు తెలియకున్నదా? స్వామీ!

"అద్యవాఽబ్ద శతాంతేవా మృత్యుర్వై ప్రాణినాంధ్రువమ్"– నేడుగానీ, నూరేండ్లు నిండిన తర్వాతగానీ ప్రాణులకు 'చావు'– మరణం నిశ్చయమని ప్రతిదినం "అంతర్యాతి నిజాయుః కాలః"– నా ఆయుష్కాలం తరిగిపోతున్నదని నాకు తెలిసిననూ, బంధవిముక్తికై ప్రయత్నించని నన్ను అనుగుణమైన ఉపాయమందు ప్రవర్తింపజేసి, నా రక్షణ భారాన్ని నీవే స్వీకరించాలి అని దేశికులు అచ్యుతుణ్ణి ప్రార్థించారు.

79. ణీసాస సంకణి జ్జే
దేమే పడలంత సలిల బిందు సరిచ్ఛే।
జాణసి ణ అసచ్చ తుమం
జరంత కరణే వి దీహ జోవ్వణ తిణ్హమ్॥

ఛా. నిశ్శ్వాస శంకనీయే
దేహే పటలాంత సలిల బిందు సదృక్షే।
జానాసి నతసత్య! త్వం
జరత్ కరణేఽపి దీర్ఘయౌవన తృష్ణామ్॥

**అర్థం:** హే నతసత్య!; నిశ్వాస శంకనీయే= ఊపిరాడుట సంశయింప దగినట్టిది; పటల+అంత సలిలబిందు సదృక్షే= (ఇంటికప్పు) చూరు చివరనున్న, నీటిబొట్టుతో సమానమైనట్టిది; జరత్ కరణే= శిథిలమైన ఇంద్రియాలు కలిగినట్టి; దేహే, అపి= దేహమందు కూడా; దీర్ఘయౌవన తృష్ణాం= చిరకాల యౌవనమందలి ఆశను; త్వం= నీవు; జానాసి= ఎరుగుదువు.

**తా॥** ఓ దాససత్యా! అచ్యుతా! శ్వాసక్రియ అనుమానింపదగినదే. ఇంటికప్పు చూరు కొనకున్న నీటి చుక్కతో సమానమైన, దేహేంద్రియాలన్నీ పట్టుతప్పి సడలిపోయిన ఈ శరీరమందు కూడా చిరకాలం యౌవనం ఉండాలనే ఆశపడడం నీకు తెలుసు.

**వ్యాఖ్య:**– జీవితం క్షణభంగురమని తెలిసినా, ప్రాణి చిరకాల యౌవనాన్ని అభిలషించడం సర్వజ్ఞుడైన భగవానునికి తెలియునని వివరించే శ్లోకం.

'నశ్వరమైన దేహమందు విషయసుఖలాలసతో స్థిరయౌవనాన్ని అపేక్షించడం అసత్యం, అప్రామాణికం' అని అచ్యుతమూర్తి పల్కగా, ఆచార్యులు "అత్యంత జీర్ణమైన శరీరమందు నిత్యయౌవనం ఉండాలనే అపేక్ష ప్రాణికి ఉంటుందని స్వామీ! నీకు తెల్యనిది కాదు. నేను నిత్యయౌవనాన్ని ఆశించడం కూడా నీకు తెలుసు. కాబట్టి నాకు ఇట్టి ఆశ కలగడం సత్యమే. అప్రమాణం కాదు" అంటున్నారు.

*నిశ్శ్వాస శంకనీయే దేహే:*– దేహమందు ఊపిరాడునంతవరకు జీవించడం సత్యం. శ్వాస ఆగిపోతే మరణించడం తథ్యం. ముక్కులో గాలి ఆడడమే శ్వాసక్రియ. ఈ నిశ్శ్వాసం ఎంతకాలముంటుందో ప్రాణులకు తెల్యదు. ఈ క్షణంలో ఉండి, మరొక క్షణంలో ఉండకపోవచ్చు. కాబట్టి శ్వాసక్రియ అనుమానింప తగినదే. జీవితం శాశ్వతం కాదు, క్షణభంగురం అని భావం.

*దేహే పటలాంత సలిల బిందు సదృక్షే:*– 'పటలం' అంటే ఇంటికప్పు. "పటలంఛదిః"– (అమరం) ఇంటికి పొడవైన వాసాలతో, అడ్డంగా పొరకతోనూ కప్పువేయబడుతుంది. వానపడుతుంటే నీరు కప్పు చివరనున్న చూరునుంచి జాఱిపడుతుంది. వాన వెలసిన తరువాత చూరు చివరను ఆనుకొని యున్న నీటి చుక్క ఉత్తర క్షణాన రాలిపడుతుంది. కాసేపట్లో రాలిపోవడానికి సిద్ధమైన చూరుకొన యందలి నీటి బొట్టువంటిది ఈ దేహం. దేహం అస్థిరమైనదని భావం.

జరత్కరణేపి దేహే దీర్ఘయౌవనతృష్ణాంత్వం జానాసి:– 'ఉండడం, పుట్టడం, పెరగడం, దృఢంగా ఉండడం, తరగడం, నశించడం' అనబడే షడూర్మలు కలది దేహం. యౌవనం జాతిపోగానే వృద్ధాప్యంలో శక్తిక్షీణిస్తుంది. వార్ధక్యంలో అవయవాలు, ఇంద్రియాలు శిథిలమైపోయినప్పటికీ ఈ దేహమందు భోగానుభవ సామర్థ్యంగల యౌవనం స్థిరంగా, చిరకాలం ఉండాలని దేశికులు ఆశించే విషయం భగవంతునికి తెలుసునంటున్నారు ('జ్ఞా'ధాతువుకు 'జాణముణౌజ్ఞ'– జాణముణ ఆదేశం).

అన్యాపదేశార్థం:– పూర్వం యయాతి మహారాజు వృద్ధుడైన తర్వాత కూడా విషయానుభవాపేక్ష చేత యౌవనమందలి తృష్ణ– ఆశను విడువక, కోరి పొందినాడు కదా! (చారిత్రక సత్యమిది).

స్వాపదేశార్థం:– దేశికులు, పరమ పురుషునికి మోక్షదశలో పాదసేవ చేసే భాగ్యం గల పదహారేండ్ల పడుచు యువతిగా ఉండునట్లు, దీర్ఘయౌవన తృష్ణను కలవారు.

ఇది నాయకీ భావం. లజ్జతో స్పష్టంగా చెప్పలేక 'త్వంజానాసి' నీకు తప్ప మరొకరికి తెల్యదని సూచితం.

త్వంజానాసి:– స్వామీ! "అవావత్తు, వీడుపెత్త"– (తి.వా.మొ.) ఆశతీరింది, ఆనంద ధామం లభించింది' అన్నట్లు, నా ఆశ– నిత్య యౌవన తృష్ణ నీకు తెలుసు (నాయకిగా సిగ్గుపడుతూ), నేను నోటితో నేరుగా వేరే చెప్పవలెనా? "సర్వరసః సర్వగంధః" అనే ప్రసిద్ధిని పొందిన నీకు తెలియకున్నదా? తెలుసునులే అన్న భావాన్ని సూచిస్తున్న 'మాట' ఇది.

80. అముణిఅ ణిఅ కాఅవ్వం
తుళగ్గ ముణిఏసు మం వి పడి ఊళగ ఇమ్।
ఇఅ ణిఅ సహావ విళిఅం
హో ఉం దాసాణసచ్చ ణహూ తుహజుత్తమ్॥

ఛా. అజ్ఞాత నిజకర్తవ్యం
తిలాగ్ర జ్ఞాతేషు మామపిప్రతికూలగతిమ్।
ఇతి నిజస్వభావ వ్రీడితం
హాతుం దాసానాం సత్య! నఖలు తవయుక్తమ్॥

**అర్థం:** హే దాసానాం సత్య!= ఓ దాససత్యా! అచ్యుతా!; అజ్ఞాత నిజకర్తవ్యం= తెలియబడని స్వీయకర్తవ్య వ్యాపారాలు గల్గినట్టి; తిల+అగ్ర, జ్ఞాతేషు, అపి= నువ్వుగింజ కొనవంటి పరిమాణం గల తెలిసిన విషయాలయందు కూడా; ప్రతికూల గతిం= విరుద్ధమైన ఆచరణ కలిగినట్టి; ఇతి= ఈ విధంగా; నిజస్వభావ వ్రీడితం= స్వీయ స్వభావం చేత సిగ్గుపడియున్న; మాం= నన్ను; హాతుం= విడుచుటకు; తవ= నీకు; యుక్తం= తగినది; న, ఖలు= కాదు గదా!

**తా॥** ఓ దాససత్యా! దేవనాయకా! నాకు చేయదగిన కార్యాలేవో తెల్యవు. యాదృచ్ఛికంగా తెలిసిన కార్యాలు నువ్వుగింజ యొక్క చివరి భాగమంతటివే. ఆ తెలిసిన విషయాలను ధర్మవిరుద్ధంగా ఆచరించినవాడను. ఇట్లు ప్రవర్తిస్తున్న స్వభావం చేతనే సిగ్గుపడి తలవంచుకొని యున్న నన్ను దయాళుడవైన నీవు సహించక దూరంగా విడిచిపెట్టుట సముచితం కాదు.

**వ్యాఖ్య:**– నిరంకుశ స్వతంత్రుడైన భగవానుడు తెలిసీ తెల్యక దోషాలను చేసిన ఆశ్రితుణ్ణి పరిత్యజించడం తగదు అని ప్రార్థించే శ్లోకం.

'శాస్త్ర నిషిద్ధమైన ధర్మాలను ఆచరించే నీవు రక్షణీయుడవు కావు' అని అంటున్నావా స్వామీ! 'పక్షపాతం, నిర్దయ' లేని నీవు జ్ఞాతాజ్ఞాత దోషాలను చూచినంతనే నన్ను కాపాడక విడిచిపెట్టడం సముచితం కాదని ఆచార్యుల విజ్ఞాపన.

అజ్ఞాత నిజకర్తవ్యం:– మొదట ధర్మం అంటే ఏమిటో లక్షణంగా తెలుసుకోవాలి. తర్వాత దాన్ని ఆచరించాలి. ఇది ధర్మానుష్ఠాతయొక్క కర్తవ్య వ్యాపారం.

అయితే నాకు ఈ కర్తవ్యం చేయదగిన విధానమే తెల్యదు. సకల కర్తవ్య విషయజ్ఞానం కలవాడనే అనుకొన్నాను. "సత్యంవద, ధర్మంచర; అహరహః సంధ్యాముపాసీత"- అన్నట్లు శ్రుతి స్మృతి ప్రసిద్ధకర్మలను చేయవలసిన రీతి తెల్యక, చేయనందువల్ల ప్రత్యవాయం-దోషం కలుగుతుందని కూడా తెల్యని వాడను.

*తిలాగ్ర జ్ఞాతేషు అపి ప్రతికూల గతిం:* - ('తిలాగ్ర' అనే చోట 'యదృచ్ఛా' శబ్దం 'ఛాయ'లో కల్పితం). యాదృచ్ఛికంగా లోకుల మాటలనుబట్టిగానీ, సుకృత విశేషంవల్లగాని కర్తవ్య కర్మలు నాకు తెలుసుననుకొన్నాను. జ్ఞాతాంశం- తెలిసిన భాగం కూడా 'తిలాగ్రం' వంటిదే. చిన్నదైన నువ్వుగింజలోని కొస భాగమంతటిది మాత్రమే. అతి స్వల్పమే అయినా, నిన్ను ఆరాధించే కర్మచేయక, విరుద్ధ కర్మలను ఆచరించిన వాడను కదా!

*ఇతి నిజస్వభావ వ్రీడితం:* - ఇట్లు అకృత్యకరణం, కృత్యాకరణం- చేయరాని కార్యాలను చేసి, చేయదగిన కార్యాలను చేయని నా బుద్ధి ఋజువుగా ప్రవర్తించ నందువల్ల నీవే రక్షించవలసినదని ప్రార్థించడానికి సిగ్గుపడుతూ నీ ముందు తలవంచుకొని యున్నాను.

*దాసానాం సత్య! మాంహాతుం తవ నయుక్తం ఖలు:* - ఇప్పుడు నిన్ను శరణుపొంది నన్ను, ప్రతికూలాచరణానికి పాటుపడిన వాడనైనందున 'ఇతడు దండింపదగినవాడు' అని నీవు పరిత్యజించడం తగదు.

*"మిత్ర భావేన సంప్రాప్తం నత్యజేయం కథం చన।*
*దోషో యద్యపి తస్యస్యాత్ సతామేత దగర్హితమ్॥"*

*"అభయం సర్వ భూతేభ్యో దదామ్యేత ద్వ్రతం మమ॥"* (రామా)- దోషియైననూ, మిత్రధర్మంతో నన్ను ఆశ్రయించిన వ్యక్తిని ఎట్లైనాసరె! నేను విడిచిపెట్టను. సత్పురుషులు ప్రశంసింపదగిన కార్యమే ఇది. ఒక్కసారి శరణాగతుడై 'నీవాడనే' అని అర్థించే ప్రాణులన్నిటికీ అభయమిస్తున్నాను. ఇది 'నా ప్రతిజ్ఞ' అని చెప్పిన నీ మాటకు నీవే విరుద్ధంగా ప్రవర్తించడం వల్ల, ఔచిత్యానికి హాని

యేర్పడుతుందని నీకూ తెలుసు. రక్షావసరాన్ని ప్రతీక్షించే స్వామివి కాబట్టి, కృపతో నా రక్షణ భారాన్ని స్వీకరింపుమని కవితార్కిక కేసరి ప్రార్థన.

*(జానాతేః ముణాదేశః. యదృచ్ఛార్థమందు 'తులగ్గ' అని నిపాతం. 'వ్రీడిత' శబ్దానికి 'గభీరగ ఇత్' అని ఈ కారాన్ని ఇత్వం 'లల్‌డోనుడుగ్' అని 'డ' కు 'ల' చేరి 'విళిఅమ్' రూపమేర్పడింది).*

*81. కోఽహం కింకరణిజ్జం*
*పరిహరణిజ్జం వికింతి జాణసి సవ్వమ్।*
*తీరసి అతం హిఅం మహ*
*తిఅసేసర! కుణసు ణిఅ హిఅఅ నిక్ఖిత్తమ్॥*

ఛా. *కోఽహం కింకరణీయం*
*పరిహరణీయ మపి కిమితి జానాసి సర్వమ్।*
*శక్నోషి చ తద్ధితం మమ*
*త్రిదశేశ్వర! కురుష్వ నిజహృదయ నిక్షిప్తమ్॥*

**అర్థం:** హే త్రిదశేశ్వర!= ఓ దేవనాథా!; అహం= నేను; కః= ఎవడను? (మయా= నా చేత); కరణీయం= చేయదగినది; కిం= ఏది?; పరిహరణీయం, అపి= విడువదగినదీ; కిం= ఏది?/ ఇతి= అని; సర్వం= అంత; జానాసి= తెలిసినవాడవై యున్నావు; శక్నోషి, చ= దాన్ని చేయు శక్తిగలవాడవై యున్నావు కూడా; నిజహృదయ నిక్షిప్తం= నీ మనస్సున ఉంచబడినట్టి; తత్= ఆ శ్రేష్ఠమైన; హితం= పథ్యమును; మమ= నా విషయంలో; కురుష్వ= చేయుము (చేయవలెనని భావం).

**తా॥** ఓ దేవనాయకా! నేను ఎటువంటివాడను, నేను పరిగ్రహింప దగినది, పరిత్యజింపదగినది కూడా ఏదో? అదంతా నీకు తెలుసు. తెలిసిన దాన్ని ఆచరింప జేయడానికి కూడా నీవు శక్తిగలవాడవు. నీ మనస్సున సంకల్పింపబడిన పరమహితాన్ని నా పట్ల కృపజేయవలెను.

**వ్యాఖ్య:**– నీ స్వరూప స్వభావాలను తెలియక, నిన్ను పరిగ్రహించి, నేనేమి చేయాలి? అనే భగవానుని శంకకు సమాధానం సుశ్లోకితం.

నిన్ను త్యజించడం తగదు అన్నావు. అది సత్యమే. నీ స్వరూపమూ, స్వభావమూ తెల్యని నాకు నిన్ను స్వీకరించడం ఎట్లు తగును? అని దేవనాథుని ప్రశ్నకు ఆచార్యులు 'త్యాజ్యోపాదేయాలు, సమస్తమూ భగవానునికి తెలియునని' విన్నపిస్తున్నారు.

*కోఽహం:*– నేనెటువంటివాడనో– 'ఆర్తుడు, జిజ్ఞాసువు, అర్థార్థి, జ్ఞాని' అనే నలుగురిలో భక్తి ప్రపత్తిగల అధికారులలో నేనెటువంటి అధికారినో నీకు తెలియదా? దేవదేవా!

*కింకరణీయం:*– నా కర్తవ్యమేమిటో దేహేంద్రియాది విలక్షణ స్వరూపమూ, స్వభావమూ కలిగియుండి, నిత్యశేష భూతుడనైన నా చేత, అధికారానికి తగిన ఫలసిద్ధికోసం అనుష్ఠింపదగినదేదో నీకు భగవానునికి తెలియదా?

*కింకరిహరణీయం:*– నిత్యనైమిత్తికాది కర్మలలో– అసత్యంవలె అధికారాన్ని భ్రష్టపరచేదవడంచేత– ఏ కర్మ నా చేత పరిత్యజింపదగినదో నీకు తెల్యకున్నదా? స్వామీ!

*త్వం తత్ సర్వం జానాసి, శక్నోషిచ:*– ఆచార్య పరిగృహీత వస్తువునైన నా యోగ్యతను బట్టి నాకు త్యాజ్యమేదో, ఉపాదేయమేదో సమస్తమూ నీకు తెలుసు. తెలియడమే కాదు; నాకున్న జ్ఞానానుష్ఠానాలు స్వల్పమే కాబట్టి దీన్ని మానుము, దాన్ని చేయుము– అని కర్తవ్యాన్ని నా చేత ఆచరింపజేయడానికి కూడా నీవే శక్తిమంతుడవు, ప్రభూ!

*నిజహృదయ నిక్షిప్తం తద్ధితం మమకురుష్వ:*– నీ మనసులో సంకల్పించిన హితమేదో దానినే నాకు కృప జేయుము. సీతాదేవి ఇష్టంకాని పనిచేసి "కింత్వాం మన్యత వైదేహః"– నా తండ్రి జనక మహారాజు నిన్ను పురుషోత్తముడనుకొని

నన్ను నీ కొరకే ఇచ్చి పెండ్లి చేశాడు- అని ఆమె చేత నిందింపబడినవాడవు. ఒకప్పుడు సీతమ్మ ముఖోల్లాసం కోసం, ఆమెకు అభిమతమైన వీర కృత్యాన్ని ఆచరించి పదునాల్గువేల రాక్షసులను సంహరించి ఆమెచేత కౌగిలింపబడిన వాడవూ నీవే.

"ఉన్ మాయంగళ్ మేలై వానరుం అఱియార్, ఇనియెమ్బురమే"- (తి.వా.మొ. 6-2-4). అఘటితఘటనా సమర్థుడవైన నీ యొక్క ఆశ్చర్యకర చేష్టలను నిత్యసూరులే తెలుసుకొన జాలరు. అజ్ఞుడనైన నాకు ఇక తెలుసుకోవడానికి సాధ్యమగునా? అని "మిన్నిడై మడవార్గళ్" అనే దశకంలో శఠకోప దివ్యసూరులే పల్కినారు కదా!

ఇక నేను నీతో 'అలాగా చేయకు, ఇలాగా చేయు'మని చెప్పి చేయించుకో అనడానికి నాకు ఏ విధమైన 'సత్తా' లేదని నీకూ తెలుసు. కాబట్టి, నాకు హితమైనది, పథ్యమైనది ఏదో దాన్ని ఇదివరకే నీ హృదయంలో పదిలపరచుకొని యున్నావు. ఆ శ్రేయస్సునే కలిగించు.

*"యత్ హితం మమదేవేశ! తత్ ఆజ్ఞాపయ మాధవ!"*- (జితంతే స్తోత్రం).

*త్రిదశేశ్వర:*- దేవతలను, నిత్యసూరులను అందఱిని పాలించే నీకు నన్ను పాలించడమనేది ఎంత పాటిది? నా విషయమై హితాన్ని నిర్వహించడమందు నీవే పారీణుడవు ప్రభూ! అని నిగమాంత సూరి నివేదన.

*82.* *ఏణ్హిం ఉవరిం విఇమో*
*గుణగహిఓ దారుపుత్తఓవ పరవసో।*
*తస్స విమహా తి అసేసర।*
*తీసు వి కరణేసు హోసు సుహా సం కప్పో॥*

భా. ఇదా నీ ముపర్యప్యయం
గుణగృహీతో దారుపుత్రక ఇవ పరవశః।
తస్యాపి మమత్రిదశేశ్వర!
త్రిష్వ పి కరణేషు భవ సుఖ సంకల్పః॥

**అర్థం:** హే త్రిదశేశ్వర!= ఓ దేవనాథా!; ఇదానీం= ఇప్పుడు; ఉపరి, అపి= ఇక మీద కూడా; అయం (అహం)= ఈ నేను; గుణగృహీతః= త్రిగుణాలచేత/ త్రాళ్ళ చేత; కట్టబడిన; దారు పుత్రకః, ఇవ= చెక్కబొమ్మవలె; పరవశః= పరతంత్రుడను; తస్య, అపి= కట్టబడిన వాడనైనను; మమ= నా యొక్క; త్రిషు= మూడు విధాలైన; కరణేషు, అపి= ఇంద్రియాల విషయమై (త్రిషు, కరణేష్వపి= బొమ్మలాటకు సంబంధించిన ఉపకరణాల విషయంలోనూ); సుఖ సంకల్పః, భవ= శుభసంకల్పం కలవాడవగుము.

**తా॥** ఓ దేవనాథా! వర్తమాన కాలాన, భావికాలమందును, నా నటనకు నీవు స్పందించి ఆనందింపదగినట్లు సంకల్పింపుము. నేను సత్త్వ రజస్తమోగుణాల చేత, త్రాళ్ళచే కట్టబడిన చెక్కబొమ్మలాగా, పరతంత్రుడనై యున్నాను, అటువంటి వాడనైనను నా యొక్క మనోవాక్కాయాలనే కరణత్రయ విషయంలో ఇహపరసుఖాన్ని కూర్చేవిధంగా నీవే సంకల్పింప అనుగ్రహించవలెను.

**వ్యాఖ్య:-** చేతనుని సత్తాస్థితి ప్రవృత్తులు భగవానుని అధీనమందు ఉండునని తెలిసిన భక్తుణ్ని భగవానుడు ఉపేక్షింపదగదని విజ్ఞప్తి.

ఒక నియమ ప్రకారంగానే నీకు ఇదివరకే కరణకళేబరాదుల నిచ్చాను. ఇప్పుడు నేను చేయదగినదేముంది? అంటున్నావా? అట్లు సర్వశక్తిమంతుడవైన నీవు అనదగదు స్వామీ! అని ఆచార్యులు కారణాలను చెప్పి ప్రార్థిస్తున్న విషయమిది.

ఇదా నీ ముపర్యప్యయం గుణగృహీతోదారు పుత్రక ఇవ పరవశః- నా కరణ త్రయానికి ప్రేరకుడవు నీవే స్వామీ! నా ఉనికి, ప్రవర్తనాదులన్ని నీ వశమై యుండగా నేను స్వతంత్రుడను ఎట్లవుతాను?

సత్త్వరజస్తమో గుణాలచే ఆక్రాంతుడనైన నేను ఇప్పుడు గడుస్తున్న కాలానగానీ, రాబోయే కాలానగానీ సర్వావయవాలను త్రాళ్ళతో గట్టిన చెక్కబొమ్మ వలె పరాధీనమైన స్వరూపస్థి ప్రవృత్తి కలవాడను. గుణాలు అంటే, సత్త్వాది గుణాలు అనీ (దారాలు) త్రాళ్ళు అనీ రెండు అర్థాలున్నాయి. సూత్రధారి-నటుడు చెక్కబొమ్మ కట్టిన త్రాళ్ళను పట్టుకొని అతని ఇష్టానుసారంగా ఆ బొమ్మను ఆడిస్తాడు. అతని సంకల్పం లేకుండా ఆ బొమ్మ స్వయంగా స్పందించ జాలదు. అట్లే, ప్రకృతి గుణాలను నీవు పట్టుకొని నీ ఇచ్ఛానుసారంగా ఆడిస్తుంటే ఆడుతున్న వాడనే, పరతంత్రుడనే. నీ సంకల్పం లేకుండా నా హితాహితాలకోసం స్వయంగా ప్రవర్తించే శక్తిలేని అస్వతంత్రుడనే కదా! స్వామీ!

*తస్యాపిమమ త్రిష్వపి కరణేషు భవ సుఖ సంకల్పః* - సూత్రధారి బొమ్మ త్రాళ్ళను పట్టుకొని యాడించే వాడైననూ (త్రిషుకరణేషు) ఆటకు తగినట్లుగా నృత్యం, వాద్యం, గీతం అనే మూడు విధాలైన ఉపకరణాల విషయంలో మాత్రం ప్రేక్షక సమాజానికి ఆనందం కలుగునట్లు సంకల్పించుకొని తన కళాకౌశలాన్ని ప్రదర్శించి కృతార్థుడవుతాడు.

'కరణత్రయం' అంటే మనస్సు, వాక్కు కాయం (శరీరం) అనీ; నృత్యం, వాద్యం, గీతం- వీటికి సంబంధించిన ప్రయోగభేదాలు అని కూడా అర్థం.

*"నృత్య వాదిత్ర గీతానాం ప్రయోగ వశభేదినామ్।*
*సంస్థానం, తాడనం, రోధః కరణాని ప్రచక్షతే॥"* (రాజకందర్పః)

దేవనాథా! అనడంవల్ల 'దివ్' ధాతువునకు క్రీడార్థమున్నది. క్రీడాపరులలో అగ్రేసరుడా! నటశేఖరా! అనే అర్థం. కాబట్టి, నన్ను చక్కగా ఆడించవయ్యా! ప్రభూ! అని విజ్ఞాపన.

గుణత్రయబద్ధుణ్ణి చేసి నీ అధీనమందుంచుకొన్నవాడవైనందు వల్ల, నా మనోవాక్కాయాలు అనే కరణత్రయం చేత నేను చేసే కర్మానుష్ఠానాలలో అనర్థం దొర్లకుండా అవి ఉపాయానుష్ఠానాలై ఇహపరసుఖాలను కలిగించే విధంగా,

నీవే త్రికరణశుద్ధిగా శుభసంకల్పం చేయుము. ఫలసిద్ధికోసం శాస్త్ర విహితమైన అనుష్ఠానమేదీ చేయని వాడనని కర్తృత్వాన్ని నా మీద ఆరోపించదగదు.

త్రాళ్లను తన చేతులతో బట్టుకొని చెక్కబొమ్మ నాడించేవాడైనా, శ్రవణానందంగా తానే పాటపాడుతూ, పాటకు తగినట్లు చెక్కబొమ్మచేత, సమాజానికి నయనానందకరంగా అభినయింప జేస్తాడు కదా! ఆశ్చర్యకరమైన నీ లీల చేత నా మీద లేనిపోని ఆరోపణలు చేసి నన్ను ఉపేక్షింపదగదు, పరిత్యజించ కూడదు. రక్షణీయుడననే సంకల్పలంతో నీవే రక్షించాలి. మా ఆచార్యులు 'పాలన సామర్థ్యం శ్రీవారికి తప్ప తదితరులెవ్వరికీ లేదు' అని మాకు ఉపదేశించారు. "ప్రసీద మద్వృత్తమ చింత యిత్వా"- నా హితంకోసం నేనే సంకల్పించుకొన్నచో సిద్ధించదు. నా నడవడిని నీవు పరిశీలించకుండా, ఆచార్య రుచి పరిగృహీత వస్తువునని శుభసంకల్పంతో ప్రసన్నుడవై నన్ను రక్షింపుమని ప్రార్థన.

*83. ణిఅకమ్మ ణిఅళ జుఅళం*
*అచ్చుఅ కాఊణ మహ పిఅప్పివగ్గే।*
*కాహే గోరకళేవర*
*కారాఘర కుహర ణిగ్గఅం కాహిసి మమ్॥*

ఛా. *నిజకర్మ నిగళ యుగళం*
*అచ్యుత! కృత్వామమ ప్రియాప్రియవర్గే।*
*కదా గోర కళేబర*
*కారాగృహ కుహర నిర్గతం కరిష్యసిమామ్॥*

**అర్థం:** హే అచ్యుత!; నిజకర్మ నిగళయుగళం= నా పుణ్యపాపాలు అనే రెండు సంకెళ్ళను; మమ= నా యొక్క; ప్రియ+అప్రియవర్గే= మిత్రుల, శత్రువుల సమూహమందు; కృత్వా= పంచి; మాం= నన్ను; ఘోరకళేబర కారాగృహ కుహర

నిర్గతం= భయంకరమైన శరీరమనే చెఱసాలయొక్క గోతినుంచి వెలువడిన వానిగా; కదా= ఎప్పుడు; కరిష్యసి= చేయగలవు?

**తా॥** ఓ అచ్యుతా! నేను పుణ్యపాపాలు అనే రెండు సంకెళ్ళను కలిగియున్నాను. ఆ రెండు సంకెళ్ళు విడిపోకుంటే నేనేమాత్రం కదలలేను, పరమపదానికి పోజాలను. వేదాంత శాస్త్రం బోధించినట్లు నా పుణ్యఫలాన్ని నా మిత్రులకు, అలాగే నా పాపాల ఫలాన్ని నన్ను ద్వేషించే వారికి చేరునట్లు చేయుము. వైకుంఠానికి పోయే అర్హతగల నన్ను- నా ఆత్మను సర్వదుఃఖాస్పదమై భయహేతువువైన ఈ నా శరీరమనే బంధనాలయంలోని గోతినుంచి ఎప్పుడు ఉద్ధరించగలవో నాకు తెల్యదు. త్వరగా నీ సన్నిధికి నన్ను చేర్చుకోవయ్యా స్వామీ!

**వ్యాఖ్య:–** ప్రపన్నుని ప్రారబ్ధకర్మ శేషాన్ని మార్చివేసి, తన ఆత్మను ఉత్క్రాంతి మార్గమందు చేర్చవలెనని సుశ్లోకితం.

ఈ 83వ శ్లోకం నుంచి 91 శ్లోకం వరకు (9 శ్లోకాలలో) అనిష్ట నివృత్తి పూర్వకమైన ఇష్టప్రాప్తి రూపఫలం ప్రార్థింపబడుతున్నది.

*నిజకర్మ నిగళయుగళం:–* మానవ జన్మ, ఎన్నో జన్మలలో చేసి కూడ పెట్టుకొన్న (సంచితమైన) పాప పుణ్యరూపకర్మలలో, ఒక పుణ్యఫలాన్ని అనుభవించడానికే కలిగినది. ఇప్పుడున్న శరీరం, ప్రారబ్ధకర్మఫలాన్ని అనుభవిస్తున్న రూపమన్నమాట. ఈ జన్మలో చేసే పుణ్యపాపాలు మళ్ళీ సంచిత కర్మరాశిలో కలిసిపోయి రాబోయే జన్మలకు కారణమవుతుంటాయి. ప్రారబ్ధకర్మ అనుభవించక నశించదు. భగవంతుణ్ని భజిస్తూ, ఏ ఫలాన్ని ఆశించకుండా విధిగా కర్మనాచరించే భక్తులకు, ప్రపన్నులకు వారి సంచిత, ఆగామి కర్మలన్నీ నశిస్తాయి. అంటే ఆ కర్మలు ఫలించవు– వేగిన విత్తనాలవలె అంకురించవని భావం. ప్రారబ్ధకర్మ మాత్రం ఈ జన్మలో అనుభవించినా ముగియునో లేక మరెన్ని జన్మలనో ఎత్తి అనుభవించవలసి యుంటుందో మనకు తెలియదు కదా!

కాబట్టి మనిషి శరీరం పాపపుణ్య రూపమైన కర్మలు అనే రెండు సంకెళ్ళచే బంధింపబడియున్నది. భక్తి ప్రపత్తులను అనుష్ఠించి వైకుంఠానికి పోయే యోగ్యుడై యున్ననూ, ఆ వ్యక్తి మరణకాలమందు, పుణ్యపాప రూపమైన ప్రారబ్ధకర్మను అనుభవించినప్పటికీ ఇంక మిగిలియున్నందువల్ల ఆ పుణ్యపాపాలు ఆ వ్యక్తికి రెండు సంకెళ్ళుగా మోక్ష ప్రతిబంధకంగా ఉంటాయి. వైకుంఠానికి పోలేదు, మోక్షోపాయాన్ని అనుష్ఠించినందుకు ఇక లాభమేమి?

*"అథ శృంఖలే, కందుకో నిగళోఽ స్త్రియామ్"*– (అమరం). నపుంసక శబ్దమైన కర్మసాహచర్యాన్ని బట్టి 'నిగళయుగళం' అని అమహద్వాచకంగా రూపక సమాసపదం ప్రయుక్తం.

*మమ ప్రియాప్రియవర్గే కృత్వా:*– *"శ్రుతిః స్మృతిర్మమైవాజ్ఞా"*– 'శ్రుతి, స్మృతి' అనే భగవంతుని శాసనం ఇలా ప్రకటిస్తున్నది.

*"సుహృదః సాధు కృత్యాం ద్విషంతః పాపకృత్యామ్"*– (శ్రుతి). ఉపాయాన్ని అనుష్ఠించిన ప్రపన్నుని పుణ్యకర్మను భగవానుడు ఆ ప్రపన్నుని మిత్రులకు చేర్చుతాడు, ద్వేషించిన వారియందు పాపకర్మ చేరునట్లు మార్చుతాడు. తత్ఫలితంగా *"తదా విద్వాన్ పుణ్య పాపే విధూయ నిరంజనః పరమం సామ్యముపైతి"*– (శ్రుతి). ఆ భగవద్విషయవేత్త– ప్రపన్నుడు పుణ్యపాపాలను దుల్పుకొని, పరిశుద్ధుడై (ఆ జీవాత్మ) పరమాత్మతో సమాన రూపాన్ని మోక్షాన్ని పొందుతాడు. దేశికులు శ్రుతి చెప్పిన ప్రకారంగా చేయవలెనని భగవానునితో మొరపెట్టుకొన్నారు.

*మాం ఘోర కళేబర కారాగృహ కుమర నిర్గతం కదా కరిష్యసి:*– మెఱుపు వలె అస్థిరమైనది, ప్రకృతి సంబంధం కలదైనందున బహుళ దుఃఖాస్పదమై, భయహేతువైనది శరీరం.

*"మిన్నిన్నిలైయిల మన్నుయి రాక్కైగళ్"*– (తి.వా.మొ. 2 దశకం).

"శంపాచలం బహుళదుఃఖ మనర్థ హేతుః"- (శ్రీ.వై.స.78). జీవాత్మ, కారాగృహంలోని ఒక చీకటి గోతివంటి శరీరంలో పడియున్నది. పాపంవలె పుణ్యం కూడా నిగళమే. పుణ్యఫలం స్వర్గలోక సుఖాన్ని అనుభవింపజేస్తుంది. అయినా అది, మోక్షఫల విరోధియే కాబట్టి 'సంకెల' అనబడింది.

*నిర్గతం:*- బంధనాలయం నుంచి బయటపడునట్లు చేయవలెను. సమస్త అజ్ఞానావరణాన్ని తొలగించి, అపహత పాప్మత్వాది గుణాష్టకాన్ని ఆవిర్భవించునట్లు చేయవలెను.

"తదోకోగ్ర జ్వలనం"- (బ్ర.సూ. 4-2-16). ప్రకారంగా హృదయమందు వెలసియున్న అంతర్యామి- హార్దపురుషుడు సుషుమ్నా నాడి చివర వెలిగే కాంతిని ముందుచూపుతూ జీవాత్మను ఉత్క్రమింపజేసి, అర్చిరాది మార్గంగా పరమ పదానికి చేర్చుకొంటాడని సూత్రార్థం.

*కదాకరిష్యసి:*- "ఇన్నం కాలం కుఱుగాదో" ఇంక కాలం దగ్గఱ పడలేదా? ఇంక ఎంతకాలానికి (వేదోక్త ప్రకారంగా) చేయగలవు? అదంతా అచ్యుతుని అధీనమైయున్నదని భావం. ప్రపన్నులు నిర్వైరులు, సర్వజన సుహృదులు; కాబట్టి వారిని దూషింపతగదు. ద్వేషించ కూడదు. పాపాలు చుట్టుకొంటాయి. అనేక మిత్రులను సంపాదించుకొనవలెను. సకల ప్రాణులయందు, తన పట్ల తనకెంత ప్రీతి యుండునో అంతటి ప్రీతిని ప్రేమను కలిగియుండవలెను. పుణ్యం సంక్రమిస్తుంది. మహాత్ములు ఆదర్శపురుషులు.

*84. హద్దే తుమమ్మి క ఇఆ*
*విస్సమిఅం బంహధమణి మగ్గ ణి హింతమ్।*
*దిణఅర దిణ్ణగ్గ అరం*
*అచ్చుఅ దచ్ఛిహిసి ద ఇఅడింభం విఅ మమ్॥*

ఛా. హార్దే త్వయి కదా
విశ్రాంతం బ్రహ్మాధమని మార్గ గమిష్యంతమ్।
దినకరదత్తాగ్ర కరం
అచ్యుత! ద్రక్షసి దయిత డింభమివ మామ్॥

**అర్థం:** హే అచ్యుత!; హార్దే= హృదయమందున్నట్టి; త్వయి= నీ యందు; విశ్రాంతం= విశ్రమించినట్టి; బ్రహ్మాధమని మార్గ గమిష్యంతం= సుషుమ్నా నాడిద్వారా బయటికి పోగలుగునట్టి; దినకర దత్త+అగ్రకరం= సూర్యునిచే ఇవ్వబడిన కిరణాగ్రములు అనే హస్తాలు కలిగినట్టి; మాం= నన్ను; దయితడింభం, ఇవ= ప్రియ పుత్రునివలె; కదా= ఎప్పుడు; ద్రక్ష్యసి= చూడగలవు?

**తా॥** ఓ అచ్యుతా! హృదయమందు అధివసించి యున్న నీ యందు సంసార క్షోభ పోగొట్టబడి యుండునట్టి; సుషుమ్నా నాడిద్వారా ఊర్ధ్వలోకానికి పయనించ గలుగునట్టి, సూర్యుని రశ్మలు అనే చేతులను ఆలంబనంగా పొందినట్టి; నన్ను- నా జీవాత్మను ప్రియుడైన బాలునివలె, ఎన్నడు చూడగలవు?

**వ్యాఖ్య:-** సాంసారిక బంధం నుంచి విడిపించి భగవానుడు ఈ జీవుణ్ని తన సన్నిధిలో చేర్చుకొనే కృపతో కటాక్షించే దెప్పుడో కదా! అని ఆర్తిని ప్రకటించే శ్లోకమిది.

జీవాత్మ శరీరాన్ని విడిచి లేచిపోవడం 'ఉత్క్రాంతి'. వ్యక్తి మరణించునప్పుడు చెప్పరానంత క్షోభను పొందుతాడు. ప్రపన్నుడు, భగవదధీనమైన తన మరణ సమయాన్ని సాదరంగా ప్రతీక్షిస్తుంటాడు. ప్రపన్నుని ద్వారా లోకోపకారాన్ని నిర్వహింజేసిన భగవానుడు కూడా అతణ్ణి ఆదరాభిమానాలతో అర్చిరాది మార్గం ద్వారా తన సన్నిధికి చేర్చుకొని ఆనందిస్తాడని శ్రుతి స్మృతులు ప్రకటించే విధానం ఇందు సంగ్రహింపబడినది.

*హార్దే త్వయి విశ్రాంతం:-* ఓ అచ్యుతా! పర, వ్యూహ, విభవ, అంతర్యామి, అర్చా రూపాలు అనే ఐదింటిలో భగవానుని 'అంతర్యామి' రూపం ఒకటి. దహరమనే నామాంతరం గల హృదయ పుండరీకం నడుమ ప్రవేశించి, శాసిస్తూ సత్తను కలిగిస్తూ ఉండే భగవానుడు 'హార్దుడు' అనబడినాడు. ఆ హార్దమూర్తిని ఆశ్రయించడం వల్ల త్రిస్థాణ క్షోభవల్ల కలిగిన శ్రమ- ఆయాసం పోగొట్ట బడుతుంది.

'త్రిస్థాణ క్షోభ' అంటే మూడు శూలాలుగా ఉన్న సత్త్వ రజస్తమోగుణాలు గల ప్రకృతివలన కలిగిన సంసార క్లేశమని అర్థం. హార్ద భగవానుని పొంది యున్నప్పుడే జీవుడు విశ్రాంతుడు కదా!

*బ్రహ్మాధమని మార్గ గమిష్యంతం:-* 'బ్రహ్మాధమని' అంటే 'సుషుమ్నా' నాడి. *"శతంచైకాచ హదయస్య నాడ్యః, తాసాం మూర్ధాన మభినిస్సృతై కా"*- (శ్రుతి). హృదయంలోనున్న హార్దపురుషుని అనుగ్రహంచేత నూఱునాడులవల్ల కాక, నూటయొకటవదైన బ్రహ్మనాడి ద్వారా విశేషంగా ప్రపన్నుని ఆత్మ, శరీరం నుంచి బయటకు లేచిపోతుంది.

*దినకర దత్తాగ్రకరం:-* 'దినకరేణ దత్తాః అగ్రకరాః యస్మై, తం' అని విగ్రహవాక్యం. వెలుపలికి లేచి వచ్చిన ఆత్మకు, మొట్టమొదట సూర్యుడు తేలికగా లేపడానికి తన కిరణాగ్రాలు అనే హస్తాలను ఆలంబనంగా ఇచ్చి సహాయపడుతాడు. దేవయానమందలి ప్రథమ ప్రక్రియ ఇది.

*మాం దయితడింభ మివకదా ద్రక్ష్యసి:-* తండ్రియెదమీద పడుకొన్న బాలుడు, బయట పయనించినప్పుడు దారిలో కనబడిన వెంటనే తండ్రియొక్క భృత్యులు బాలుణ్ణి తండ్రి దగ్గరికి తీసుకొని రాగానే, తండ్రి తన డింభకుణ్ణి దయార్ద్ర హృదయుడై చూచి గారవిస్తాడు కదా!

*"అవతార్య సుమంత్రస్తం రాఘవం స్యందనోత్తమాత్,*
*పితుస్సమీ పేగచ్ఛంతం ప్రాంజలిః పృష్ఠతోஉన్వ గాత్॥"*

సుమంత్రుడు శ్రీరాముణ్ని రథంనుంచి హస్తావలంబనం చేత దింపగా, తండ్రి దగ్గరికి పోతున్న రాముని వెంట అంజల బద్ధుడై వెళ్ళినాడు.

"సత తర్ప సమాయాంతం పశ్యమానో మహీపతిః"- దశరథ చక్రవర్తి తన దగ్గరికి వస్తున్న పుత్రుణ్ణి చూచి అంతులేని ఆనందాన్ని పొందినాడు. అట్లే వాత్సల్యకారుణ్యాది గుణపూర్ణుడవైన నీవు నీ కిష్టమైన పుత్రునిలాగా నన్ను ఎన్నడు కటాక్షించగలవో దేవనాథా! అని దేశికులు 'తదోకోధికరణ' మందు వ్యాస భగవానుడు, భగవద్రామానుజులు శ్రీభాష్యమందు ప్రతిపాదించిన ప్రకారంగా 'అర్చిరాది గతిని' కల్పించవలెనని ప్రార్థించారు.

85. కాహే అమాణవంతా
అగ్గిముహా ఆఇవాహి ఆ తుహి పురిసా।
అఇలంఘేహింతి మిమం
అచ్చుఅ తమ గహణ తిఉణ మరు కంతారమ్॥

ఛా. కదా అమానవాంతా
అగ్ని ముఖా ఆతివాహికాస్తవ పురుషాః।
అతిలంఘ యిష్యంతి మాం
అచ్యుత! తమో గహన త్రిగుణ మరుకాంతారమ్॥

**అర్థం:** హే అచ్యుత!; అమానవ+అంతాః= అమానవుడనే పురుషుణి కడవరకున్నట్టి; అగ్నిముఖాః= అగ్ని మొదలైన వారైన; ఆతివాహికాః= నీ సన్నిధికి చేర్చునట్టి (పేరును కల) వారైన; తవ= నీ యొక్క; పురుషాః= (భృత్యులైన) పురుషులు; మాం= నన్ను; తమో గహన త్రిగుణ మరుకాంతారం= తమోగుణం అనే చీకటి అడవి లాగా ఉన్న ప్రకృతి అనే ఎడారిని; కదా= ఎప్పుడు; అతిలంఘ యిష్యంతి= దాటింపజేయగలరు; (ద్వికర్మ కత్వం).

**తా॥** ఓ అచ్యుతా! అమానవుడనే పురుషుని పర్యంతమున్నట్టి అగ్ని మొదలైన ఆతివాహికులు అనే నీ పురుషులు, నన్ను తమస్సు అనే అంధకార పూర్ణమై ప్రవేశించరాని అరణ్యం వంటి (త్రిగుణం) ప్రకృతి అనే నిర్జల ప్రదేశం నుంచి ఎన్నడు దాటించి నీ సన్నిధికి **చేర్ప**గలరు?

**వ్యాఖ్య:-** ఆతివాహికులు భగవత్సన్నిధికి ముక్తాత్మను చేర్చే ఆశను ప్రకటిస్తున్న శ్లోకమిది.

ప్రపన్నుడైన ముక్తాత్మకు కలిగే 'అర్చిరాది గతి' విధానం ఇందు వివరింప బడుతున్నది.

అమానవాంతాః అగ్ని ముఖాః ఆతివాహికాః తవ పురుషాః - ముక్తాత్మకు స్వాగతం పలికి, ఊర్ధ్వలోకాలలో తమ ఆధిపత్యమున్న ప్రదేశాలలో గౌరవంగా బహుమతులిచ్చి సీమాంతం వరకు సహకరిస్తూ సాగనంపేవారిలో మొదటివాడు అగ్ని.

"అర్చిషోఽహః"- తేజోదేవత సూర్యుడు. పగటికాలదేవత కాబట్టి, అర్చిరాదిగతి అంటే సూర్యుడు మొదల్గొని కాలాభిమాన దేవతలు, పైలోకాధిపతులు సహకరించగా ముక్తాత్మ పయనించే మార్గం, దేవయానమని కూడా అంటారు.

"అర్చిరహః సితపక్షాన్ ఉదగయనాబ్ద మరుదర్కేందూన్।
అపి వైద్యుత వరుణేంద్ర ప్రజాపతీన్ ఆతివాహికానాహుః॥"-

(తత్త్వ సారం. 102)

అగ్ని, దినకాలాభిమాన దేవత, శుక్లపక్షకాల దేవత, ఉత్తరాయణ, సంవత్సర కాలాభిమాన దేవతలు, వాయువు, సూర్యుడు, చంద్రుడు, మెఱుపు, వానదేవుడు (వరుణుడు), ఇంద్రుడు, బ్రహ్మ (సత్యలోకాధిపతి) వీరందఱు క్రమంగా తమ ప్రాంతాల పొలిమేరవరకు- తర్వాత ఉన్న ప్రదేశం వరకు వెంట ఉండి గౌరవంగా సాగనంపుతారు. ఈ ముక్తాత్మను పూజించి సాగనంపే అగ్ని మొదల్గొని క్రమంగా సహకారులైన దేవతలందఱు 'ఆతివాహికులు' అని పేరుపొందినవారు.

"అమానవః వైద్యుతః పురుషః"- God of lightning 'అర్చిరాదిగతి'లో ముక్తాత్మను, ఈ కాలాభిమాన దేవతలు, **ఊర్ధ్వలోకాధినాయకులందఱు** కలిసి 'అమానవు'డనే 'విద్యుత్ పురుషుని దగ్గరికి చేర్చుతారు. అగ్ని మొదల్కొని ఆతివాహికులనే భగవత్సంబంధమున్న పురుషులలో అంతమందు-పైన ఉన్నవాడు 'అమానవుడు' అని భావం. అమానవాంతాః- అన్న శబ్దానికి అర్థమిది.

అయితే "తటితో ధివరుణః సంబంధాత్"- (4-3-3) అనే బ్రహ్మసూత్ర మందు అమానవునిపైన వరుణాది దేవతలు చెప్పబడి యుండగా, అందరికంటే అమానవునికి "ఉత్తరావధిత్వం"- పై వాడు అనే భావం ఎలా పొసగుతుంది? అని శంకింపదగదు. వరుణాది దేవతలు అనుగ్రహాన్ని ప్రదర్శించే వారని సూత్రాన్ని అన్వయించారు.

"తత్పురుషః అమానవః స ఏనాన్ బ్రహ్మ గమయతి"- (ఛాం. ఉప. 4-15-5). ఆతివాహికులు అంటే అతివాహనం- గమ్యస్థలానికి దారిజూపించే భారాన్ని, బాధ్యతను-వహించే వారని అర్థం. అమానవుడనే ఉత్తరావధి గల పురుషుడే ముక్తాత్మలను పరబ్రహ్మ సన్నిధికి చేర్చువాడని ఉపనిషద్వాణి స్పష్టపరచింది (అమానవస్యైవ బ్రహ్మణి గమయితృత్వాత్).

మాం తమోగహన త్రిగుణ మరుకాంతారం కదా అతిలంఘ యిష్యంతి:- ఇందు 'తమస్సు' అనేది శ్లిష్టపదం. 'మరుకాంతారం' అంటే ప్రకృతియే నిర్జల ప్రదేశం, ఎడారి.

"కాంతారం వర్త్మదుర్గమమ్"- చొచ్చినవారిని దాటనీయని మార్గం (అమరం). "గహనం" అంటే రాళ్ళు రప్పలు, ముండ్లచేతనూ, దుష్టజంతువులు, క్రూరమృగాల చేతనూ కలచబడియున్న అడవి, ప్రవేశించరాని ప్రదేశమని అర్థం. అభేదాధ్యవసాయ రూపకాలంకార లక్షణం ఇది.

తమోగుణమనే తమస్సు- అంధకారం కలది ప్రకృతి సత్త్వరజస్తమస్సులు అనే మూడు గుణాలు కలది. సంసారం అనేది కటిక చీకటితో నిండిన అడవి.

కాబట్టి ప్రవేశించరానిది. అయినా, ప్రవేశించిన వారిని తృష్ణను పెంచి ప్రకృతి మండలం నుంచి బయల్పడనీయదు కదా!

ఆతివాహికులు ముముక్షువును ప్రకృతి మండలం నుంచి దాటించి భగవత్సన్నిధికి చేర్చే సమయం భగవదధీనమే కాబట్టి దేశికుల మనస్సు ఆ సమయం కోసం త్వరపడుతున్నది. భగవంతుని దాస్యైక భోగం కోసం ఆశపడుతూ తన ఆర్తిని ప్రకటించడం ప్రశంసనీయం.

86. లంఘిఅ విర ఆ సరిఅం
లంభిఅ సఇసుద్ధ సత్తమఅ సోమ్మ తణుమ్।
కఅ బమ్హాలంకారం
కాహిసి ణఅసచ్చ కింకరం కాహే మమ్॥

ఛా. లంఘిత విరజాసరితం
లంభిత సదా శుద్ధ సత్వమయ సౌమ్యతనుమ్।
కృత బ్రహ్మాలంకారం
కరిష్యసి నతసత్య! కింకరం కదా మామ్॥

**అర్థం:** హే అచ్యుత! నతసత్య!; కింకరం= దాసుడనైన; మాం= నన్ను; లంఘిత విరజాసరితం= దాటబడిన విరజా నదిగలవానిగాను; లంభిత సదాశుద్ధ సత్వమయ సౌమ్య తనుం= పొందబడిన, ఎల్లప్పుడు శుద్ధ సత్వగుణమయమైన, ఉద్వేగాన్ని కల్గించనట్టి అప్రాకృత శరీరం కలవానిగాను; కృతబ్రహ్మాలంకారం= చేయబడిన పరబ్రహ్మానుభవానికి యోగ్యమైన అలంకారం కలవానిగాను; కదా= ఎప్పుడు; కరిష్యసి= చేయగలవు?

**తా॥** ఓ నతసత్యా! అమానవుని చేరిన ముక్తాత్మ విరజానదిని దాటుతాడు. వెంటనే శుద్ధ సత్వమయమైన అప్రాకృత దివ్యశరీరాన్ని ధరిస్తాడు. భగవంతుని

ప్రేరణచేత అప్సరసలు వచ్చి ముక్తాత్మకు పరమ పదనాథునికి సేవ చేయదగిన అలంకారం చేస్తారు. భగవద్దాస్య రసికులైన దేశికులు తమకు అట్టి బ్రహ్మాలంకారాన్ని పొందే స్థితిని భగవానుడెన్నడు కృప జేస్తాడో అని చింతపడుతున్నారు.

**వ్యాఖ్య:**– ముక్తపురుషుడు అప్రాకృత దివ్యమంగళ విగ్రహుడు అవుతాడని సుశ్లోకితం.

*"అర్చిషమభి సంభవంతి అర్చిషోऽహః"* (శ్రుతి)

*"అగ్ని ర్జ్యోతిరహః శుక్లః షణ్మాసా ఉత్తరాయణమ్"*– (భ.గీత) అని శ్రుతి స్మృతులు చెప్పిన అర్చిరాది గతి ప్రక్రియను గత శ్లోకం వివరించింది.

*లంఘిత విరజా సరితం:*– అర్చిరాది గణం అమానవుని పర్యంతం ముక్తపురుషుణ్ణి చేర్చుతుంది. *"అమానవం సమాసాద్య"*– అమానవుడనే విద్యుత్పురుషుణ్ణి చేరిన ముక్తాత్మ విరజానదిని దాటుతాడు. విరజానదికి ఇవతలి గట్టు రజోగుణ భూయిష్టం, ఆవలి గట్టు శుద్ధ సత్త్వమయం. అందువల్ల 'విరజ' అని ఆ నది పేరు గాంచింది. విరజానదిని దాటడానికి ముక్తాత్మ తన సంకల్పమే నియామకం కాబట్టి *"తాం మనసా అత్యేతి"*– ముక్తాత్మ తన మనస్సు, సంకల్పం చేతనే విరజానదిని దాటడంతోనే తన సూక్ష్మ శరీరం విడిపోయి, శుద్ధ సత్త్వమయమైన అప్రాకృత దివ్యశరీరం కలవాడవుతాడు. పెంజీకటిగా ఉండే ఈ ప్రకృతి మండలానికీ, రజస్తమోగుణాల స్పర్శలేని వైకుంఠ లోకానికీ మధ్యనున్న విరజా నదిని దాటగానే పొందిన శుద్ధ సత్త్వమయమైన శరీరం *"సదా సౌమ్యతనుం"*– ఎల్లప్పుడూ ఉంటుంది.

*"కామచారో భవతి"*– అన్నట్లు ఎప్పుడైన ఏ లోకంలోగానీ ముక్తిదశలో సంచరించ దలచుకొన్నప్పుడు కూడా శుద్ధ సత్త్వమయ శరీరుడయ్యే ఉంటాడు. లేదా *"ఏకధాభవతి, త్రిధా భవతి"* అన్నట్లు ముక్తిదశయందు ఏ రూపాలను ధరించినా, ఆయా రూపాలు 'ప్రాకృత విగ్రహాలు కావు' అనకుండా 'సదా' శబ్ద ప్రయోగంవల్ల శుద్ధ సత్త్వ విగ్రహాలే అని సూచింపబడింది. *"తదుభయమపి"*–

అనే బ్రహ్మసూత్రాల యందు 'అప్రాకృత శరీరం' అని చెప్పబడింది. పునర్జన్మ లేనిదని భావం.

"స ఆగచ్ఛతి విరజాంతం మనసైవాత్యేతి, తంపంచ శతా.ని అప్సరసాం ప్రధావంతి; శతం మాలాహస్తాః, శతమంజన హస్తాః, శతం చూర్ణహస్తాః, శతం భూషణ హస్తాః, శతం వాసోహస్తాస్తం బ్రహ్మాలంకారేణ అలంకుర్వంతి"-(14-2) అని కౌషీతక్యుపనిషద్యుక్త ఫలమే 'కృత బ్రహ్మాలంకారం' అనే పదం చేత చెప్పబడింది.

భగవానునిచే నియమింపబడిన అయిదువందల (500) అప్సరలేమలు-("వాళొణ్కణ్ మడన్దైయర్"- (తి.వా.మొ. 10-9-6) తేజస్సు, అందం ఉన్న కన్నులు గల దేవతాస్త్రీలు అని నమ్మాళ్వార్ల శ్రీసూక్తి). పరుగెత్తుకొని వస్తారు. ఒక వందస్త్రీలు పూలహారాలను, ఒక వంద కంటి కాటుకను, ఒక వంద సువాసనగల పౌడర్లు-పొడులను, ఒక వంద ఆభరణాలను, ఆపైన ఒక వంద స్త్రీలు వస్త్రాలను తమ తమ చేతులలో పట్టుకొని వచ్చి, ముక్తపురుషుణ్ణి బ్రహ్మాలంకారం చేత అలంకరిస్తారు.

బ్రహ్మానుభవంకోసం అలంకరించడం కాబట్టి 'బ్రహ్మాలంకారం' అని పేరు. శ్రియఃపతికి ముక్తాత్మ నిత్య కైంకర్యంచేసే యోగ్యుడవుతాడు. ఇటువంటి ముక్తి దశ, కింకరుడైన నాకు ఎన్నడు సంప్రాప్తింపజేయగలవు స్వామీ! అని దేశికుల విజ్ఞాపన.

"తస్మాత్సర్వేషు కాలేషు యోగయుక్తోభవార్జున"- (భ.గీ. 8-27). అర్చిరాది మార్గాన్ని నిరంతరం చింతించవలెనని నరునికి విధింపబడినది కదా!

87. సంసారసా అరాఓ
ఉక్ఖిత్తం తిఅసణాహ ఫురి ఆలోఅమ్।
కాహే కాహిసి హిఅఅ
కోత్థుహమణి దప్పణం వలచ్ఛిపుల ఇఅమ్॥

ఛా. సంసార సాగరాత్

ఉక్షిప్తం త్రిదశనాథ! స్ఫురితా లోకమ్।

కదా కరిష్యసి హృదయే

కౌస్తుభమణి దర్పణమివ లక్ష్మీదృష్టమ్॥

**అర్థం:** హే త్రిదశనాథ!= ఓ దేవనాథా!; సంసార సాగరాత్= సంసారం అనే సముద్రం నుంచి; ఉక్షిప్తం= ఉద్ధరింపబడినట్టి; స్ఫురిత+ఆలోకం= ప్రకాశింపబడే కాంతిని కలిగి యున్నట్టి; మాం= నన్ను; హృదయే= (నీ) వక్షఃస్థలమందు; కౌస్తుభమణి దర్పణం, ఇవ= కౌస్తుభమణి అనే అద్దంనువలె; లక్ష్మీదృష్టం= లక్ష్మీదేవిచేత చూడబడు వానినిగా; కదా= ఎప్పుడు; కరిష్యసి= చేయగలవు?

**తా॥** ఓ దేవనాథా! సంసారమనే సాగరం నుంచి ఉద్ధరింపబడినట్టి, ప్రకాశించే ధర్మభూత జ్ఞానాన్ని కలిగియున్నట్టి నన్ను నీ యొక్క వక్షఃస్థలమందు కౌస్తుభమనే పేరుగల మణిమయ దర్పణంలాగా లక్ష్మీదేవిచే కటాక్షింపబడే వానిగా ఎన్నడు చేయగలవు?

**వ్యాఖ్య:-** శ్రియఃపతి కౌస్తుభమణిని తన వక్షఃస్థలమందు భూషణంగా ధరించిన విధంగా ముక్తపురుషుణ్ని ఎదలో హత్తుకొంటాడని సుశ్లోకితం.

భగవానుడు చేతనాచేతన తత్త్వాల నన్నిటినీ తనకు ఆభరణాలుగానూ, ఆయుధాలుగానూ ధరించి యున్నాడు.

"బిభర్తి కౌస్తుభమణి స్వరూపం భగవాన్ హరిః"- ఇత్యాదిగా శ్రీవిష్ణు పురాణంలో అస్త్రభూషణాధ్యాయ తాత్పర్యమును సంధేయం.

"పురుడన్ మణివరమాక"- (అధికార సంగ్రహం-41) పురుడన్= పురుషుడు, జీవుడు కౌస్తుభమణిగా ధరింపబడినాడని అర్థం. జీవుడు కౌస్తుభమణియై యున్నాడు- అంటే జీవవర్గ తత్త్వం యొక్క అభిమాన దేవతయైన కౌస్తుభమణిని శ్రియఃపతి ఆభరణంగా తన వక్షఃస్థలాన ధరించి యున్నాడని అర్థం.

సంసార సాగరా దుత్క్షిప్తం:- కౌస్తుభమణి సముద్రం నుంచి ఉద్భవించింది. జీవుడు భగవదనుగ్రహంచేత శరీరం నుంచి ఉత్క్రమింపబడినాడు అంటే సంసారమనే సముద్రం నుంచి ఉద్ధరింపబడినాడు.

స్ఫురితాలోకం:- కౌస్తుభమణి స్వయంగా ప్రకాశించేది. ప్రతిబింబించే కాంతిని కలది కూడా. జీవుడు ధర్మభూత జ్ఞానం కలవాడు, ప్రకాశము కలవాడు. జీవునికి ఇంతవరకు ప్రకృతి బద్ధుడైనందువల్ల జ్ఞానం సంకుచితమై యుండింది. ఇప్పుడు ముక్తాత్మకదా! నిజరూపంతో ప్రకాశిస్తున్నాడు (స్ఫురితః, ఆలోకశ్చ యస్యసః = స్ఫురితాలోకః, తం).

"పరంజ్యోతిరుప సంపద్య స్వేన రూపేణాభినిష్పద్యతే"- (శ్రుతి). కర్మబద్ధుడైన జీవుడు శరీరం నుంచి బయల్వెడలి పరంజ్యోతియైన పరమాత్మను పొందడం చేత కర్మబంధ నివృత్తి రూపమైన ముక్తైశ్వర్యాన్ని పొందడంచేత స్వస్వరూపంతో ఉంటాడని శ్రుతి వాక్యార్థం. 'స్వస్వరూపం' అంటే "య ఆత్మా అపహత పాప్మా విజరో విమృత్యు ర్విశోకో విజిఘత్సోఽ పిపాసః, సత్యకామః సత్య సంకల్పః"- (చా. ఉప. 8-7-1) జీవుడు-ఆత్మ, పాపం లేనివాడు, ముసలితనం లేనివాడు, మరణంలేనివాడు, దుఃఖంలేనివాడు, ఆకలి, దప్పిక లేనివాడు, సత్యకాముడు, సత్యసంకల్పుడు అనే ఎనిమిది గుణాలు కలవాడు అని అర్థం. ఈ గుణాష్టకం జీవునికి సహజమైనా, ఎప్పుడు ఉండేవే అయినా సంసారదశయందు అవిద్యచే ప్రకాశించలేదు, కొత్తగా ఇప్పుడు ఆవిర్భవించనూ లేదు.

బావి తవ్వినప్పుడు-భూమి పొరలను తొలగించినప్పుడు అందు ఉన్న వస్తువే, నీరు స్పష్టంగా బయల్పడును కదా! అట్లే-

*"తథా హేయగుణ ధ్వంసా దవబోధా దయోగుణాః।*
*ప్రకాశ్యంతే నజన్యంతే నిత్యా ఏ వాత్మనోహి తే॥"*

హేయగుణాలు నశించడంచేత జీవునికి సహజమైన జ్ఞానానందా మలాది గుణాలు ప్రకాశిస్తున్నవే గాని, అవి సృజింపబడలేదు.

కదా కరిష్యసి హృదయే కౌస్తుభమణి దర్పణ మివ లక్ష్మీదృష్టమ్- కౌస్తుభమణి, లక్ష్మీదేవియు సముద్రం నుంచి ఉద్భవించారు. లక్ష్మీదేవి, కౌస్తుభమణి, భగవానుని వక్షఃస్థలమందే నివసించియున్నారు. లక్ష్మీదేవి వస్త్రభూషణాదులను అలంకరించుకొన్నప్పుడు కౌస్తుభమనే మణిమయ దర్పణం ఆమె రూపాన్ని చూచుకోవడానికి ఉపయోగపడుతుంది.

"దర్పణే ముకురాదర్శౌ"- (అమరం). గుణాష్టకావిర్భావం చేత, తేజిష్ఠుడైన ముక్తపురుషుడూ, కౌస్తుభంవలె కరుణారూపిణియైన లక్ష్మీదేవి యొక్క అంగీకార, అనుమతి, వాత్సల్యాదులుగల కటాక్షాలచే సంభావింపడుతాడు.

"*తిరువుడన్ వంద శెషుమణిపోల్ తిరుమాలి దయమరువిడమ్*"- (అధికార సంగ్రహం-8). క్షీరసముద్రమందు లక్ష్మీదేవితో పాటు ప్రభవించిన కౌస్తుభమణిని కూడా సర్వేశ్వరుడు తన హృదయమందే అలంకరించుకొన్నాడు. జీవాభిమాన దేవతయైన కౌస్తుభమణివలె ముక్తాత్మలకు కూడా శ్రియఃపతి యొక్క హృదయమే ప్రేమతో నివసించే స్థానమని భావం. ఇట్టి ముక్తైశ్వర్య ప్రాప్తిని చింతన చేస్తూ, శ్రియఃపతి కౌస్తుభమణివలె నన్ను తన ప్రియపుత్రునిగా ఎత్తుకొని, ఆలింగన భాగ్యాన్ని కలిగించేదెన్నడో కదా! అని దేశికులు ఆర్తిని ప్రకటించారు.

*88.* కాహేతుహప అ ప ఉమే
హోహిమి ణఅసచ్చ కేళికంత తిహువణే!
మఅణ రిఉ మ ఉడ మండణ
సుర సరిఆ సోత్త సూఇఅ మహుప్పవహే॥

ఛా. కదా తవ పద పద్మే
భవిష్యామి నతసత్య! కేళిక్రాంత త్రిభువనే!
మదనరిపు మకుటమండన
సురసరి త్రోస్తేతస్సూచిత మధు ప్రవాహే॥

**అర్థం:** హే నతసత్య!; కేళిక్రాంత త్రిభువనే= క్రీడ చేత ఆక్రమింపబడిన మూడు లోకాలు గల; మదనరిపు-ప్రవాహే/ మదనరిపు= మన్మథుని వైరియైన శివుని యొక్క; మకుట= కిరీటానికి; మండన= అలంకారమైన; సురసరిత్= దేవనది యొక్క; స్రోతః= ప్రవాహంచేత; సూచిత= సూచింపబడిన; మధు ప్రవాహే= పూదేనె వంటి ప్రవాహంగల; తవ= నీ యొక్క; పదపద్మే= పాదకమలమందు; కదా= ఎప్పుడు; భవిష్యామి= చేరియుండగలను?

**తా॥** ఓ దాససత్యా! దేవనాథా! లీలగా మూడు లోకాలను ఆక్రమించినట్టి, పరమశివుని మకుటానికి అలంకారంగా ఉండే అలకనంద-గంగానదియొక్క ప్రవాహంచేత సూచింపబడిన మకరంద ప్రవాహం కలిగినట్టి, నీ యొక్క పాద పద్మమందు నేను ఎన్నడు చేరి యుండగలను?

**వ్యాఖ్య:-** త్రివిక్రముని మకరంద ప్రవాహంగల పాదపద్మమందు ముక్తపురుషుడు మధువ్రతుడై యుండే దశ సుశ్లోకితం.

"అడిక్కీష మర్న్దు పుగున్దడియార్ వాష్మిన్"- (తి.వా.మొ. 6-10-11) భగవద్భక్తులారా! శ్రియఃపతి యొక్క చరణారవిందాల యందు నత శిరస్సులుగా ప్రవేశించి సుఖించండి- అని నమ్మాళ్వార్లు ఉపదేశించారు. దేశికులు ముక్తపురుష భోగ్యమైన భగవానుని పాదపద్మ సాన్నిధ్యాన్ని ప్రార్థిస్తున్నారు.

నతసత్య:- దాస జనమైన దేవగణం బలిచక్రవర్తికి గుణపాఠం చెప్పుమని ప్రార్థించిన వెంటనే, వామనుడవై అవతరించి హితమొనర్చిన సత్యపురుషా! అని శ్లోక భావాన్ని గర్భీకరించుకొన్న సంబోధన ఇది. పొట్టివాడే అయినా, అతని పొడవెంతో-వైశ్వరూప్యాన్ని- ప్రదర్శించి స్థావర జంగమాలను పావనం చేసిన పటువైన వటువు.

మహాబలియొక్క యాగశాలకు చేరుకొన్న బుడత వడుగు మూడడుగుల పుడమిని దానం చేయుమని అడిగాడు. అక్కజపడిన ఆ రక్కసుల దొర గురువు మాటను కూడా లెక్కపెట్టక, దాన జలధారను విడిచాడు. అబ్బురమేమి? అంటే

వామనుదు బ్రహ్మాండమంత పెరిగినాడు. ఒక్క అడుగుతో పృథివిని గొలిచి చరాచర వస్తువులనన్నిటిని తన అడుగు క్రింద అమర్చి పవిత్రీకరించాడు. ఎడమ పాదాన్ని పైకి చాచి ఆకాశానికి (అస్కభాయత్) అట్టను అతికించినట్లు చేశాడు. మూడవ అడుగుకు చోటు లేనందువల్ల, చూపి వంచిన బలి తనమీద తన పాదతలాన్ని పెట్టి పాతాళం వరకు అణచివేశాడు. ఇట్లు త్రిభువనాన్ని కొలిచి స్వీకరించినందు వల్ల త్రివిక్రముదు అని పేరు గాంచినాడు విష్ణుమూర్తి. "ఇదం విష్ణు ర్విచక్రమే, త్రేధా నిదదే పదమ్"- (విష్ణుసూక్తం, ఋగ్వేదం) అని స్పష్టపరచింది.

*త్రిభువనం:*- భవతి ఇతి భువనం. భగవత్సంకల్పంచేత నామరూపాలతో ఏర్పడిన జగత్తు. త్రయాణాంభువనానాం సమాహారః= త్రిభువనం.

పృథివి, అంతరిక్షం, ద్యులోకం అని మూడు లోకాలు. భూలోకం, భువర్లోకం, సువర్లోకం- అని మూడు లోకాలు. అధోలోకాలు, మధ్యలోకాలు, ఊర్ధ్వలోకాలు అని మూడు విధాలు. కృతకం, అకృతకం, కృతకాకృతకం అనే లోకాలు మూడు రకాలు. వీటినే త్రిభువనాలు అంటారు.

'కృతకం'- భూః, భువః, స్వః అనే మూడు లోకాలకు ఈ పేరున్నది.

'అకృతకం'- జనః, తపః, సత్యం అనే మూడు లోకాలపేరు.

'కృతకాకృతకం'- మహర్లోకం పేరు. కల్పాంతమందు జనశూన్యమై ఉంటుంది. కాని అత్యంతం నశించదు. కృతకానికి, అకృతానికి నడుమ ఉన్నందున 'కృతకాకృతకమ'ని పేరు (వి.పు.2-7-18, 19, 20).

*కేళిక్రాంత త్రిభువనే:*- త్రిభువనాన్ని త్రివిక్రముదు అనాయాసంగానే ఆక్రమించాడు. ఆయన పాదానికి నొప్పి, బాధ ఏమాత్రం కలగలేదు. అది ఒక వినోద క్రీడగానే ఉండింది. "క్రీడాభూమ్యోః కేళికేళ్యౌ" (విశ్వ).

మదనరిపు మకుట మండన సురసరిత్ స్రోతః సూచిత మధు ప్రవాహే:- త్రివిక్రముని వామపాదం సత్యలోకాధిపతియైన చతుర్ముఖ బ్రహ్మచేత కదుగబడింది.

బ్రహ్మయొక్క కమండలూదకం సరిపోలేదు. అది ధర్మజలం. ఒక ధర్మాన్ని సత్సంకల్పంచేత ఆచరిస్తున్నప్పుడు ద్రవ్యాదిలోపం కలిగినా, దోషమేర్పడకుండా ఆ ధర్మకార్యాన్ని లోక కల్యాణకరంగా భగవానుడు సంపూర్ణంగా నిర్వహిస్తాడు. కాబట్టి, విష్ణుమూర్తి యొక్క ఎడమకాలి బొటనవ్రేలు నుంచి నీరు నిరంతరంగా ఉద్గమించింది. దేవనదిగా పేరు పొందింది. మన్మథ వైరియైన రుద్రుడు ఆ దేవనదీ జలంచేత అభిషిక్తుడయ్యాడు. శుచిర్భూతుడై శివుడు అనే పేరుతో లబ్ధ వర్ణుడు అయ్యాడు. నీరు పల్లమెరుగును కాబట్టి స్వాభావికంగా నిమ్నగామినియై 'గంగ' అనే పేరుతో ప్రసిద్ధిని పొందింది. శివుడు శిరస్సుపై గంగను అలంకరించు కొన్నందువల్ల గంగాధరుడు అనే అతని నామాంతరానికి కారణమైనది. అధోలోకాలలోకి ప్రవహించి వాటిని పావనం చేసిన విష్ణుపాదోద్భవియైన గంగా ప్రవాహం మధుర జలప్రవాహం కలది. దేవ, భూ, పాతాళ లోకాలలో ప్రవహించిన మూడు ప్రవాహాలలో ఒక దాన్ని జ్యోతిశ్చక్రాన్ని నడిపించే ధ్రువుడు తలమీద ధరించాడు. మరొక ప్రవాహాన్ని శివుడు ధరించాడు. శివుడు ధరించిన ప్రవాహానికి 'అలకనంద' అని అన్వర్థమైన పేరు (పురాణోక్తం) 'త్రిపథగ' అనబడింది.

"విష్ణోః పదే పరమే మధ్వ ఉత్సః"- (శ్రుతి) విష్ణుపాదం పద్మం వంటిది కాబట్టి ఆ పాదపద్మం నుంచి మకరందం- పూదేనె- ప్రవహిస్తుంది. మధుర జలం కలిగిన దేవనదీ ప్రవాహం గంగాధరుడు విష్ణుపాద పద్మమందు తలవంచి నమస్కరించగా ఆ మధుర గంగా ప్రవాహం పద్మరూపానికి అనుగుణమైన మకరంద ప్రవాహంవలె ప్రకాశించింది. మకరంద ప్రవాహాన్ని తుమ్మెదలు త్రాగి, జుమ్మని మ్రోగుతూ, ఆ పూవుల దగ్గరనే స్వేచ్ఛగా విహరిస్తున్నట్లే, ప్రపన్నుడు ఉపాయ దశలోగానీ, ఉపేయ దశలోగానీ, "త్రివిక్రమ! త్వ చ్చరణాం బుజద్వయం, మదీయ మూర్ధాన మలంకరిష్యతి"- (స్తో.ర.) అని ఆశపడుతాడు. సాక్షాత్తుగా ముక్తపురుషుడు "నిర్వేశ్య స్వపద పద్మ యుగ్మ మధు ప్రవాహం"- (దేవనాయక పంచాశత్) భగవత్పాద పద్మ యుగళమందలి తేనె వాకను ప్రవేశించి, బ్రహ్మానంద రసాన్ని అనుభవించి, 'హా ఉహా ఉహాఉ' అంటూ సామగానాన్ని ఆలపిస్తూ,

సంభ్రమ క్రీడల నాడుతూ, మధువ్రతుడై నిరతిశయ భోగ భాగ్యుడవుతాడు. (జుంటి తుమ్మెద నియమం వంటివాడు మధువ్రతుడు).

తవ పద పద్మే కదా భవిష్యామి:- దేవనాథా! నీ పాదారవిందాలయందు ప్రవేశించి మధు వ్రతత్వాన్ని, ఆనందానుభవరసికత్వాన్ని ఎన్నడు పొంది యుండగలనో? అని దేశికులు ఆవేదనతో ప్రార్థించారు.

89. *ఉవణిస ఆ సిర కుసుమం*
*ఉత్తం సే ఊణ తుహ పఅంబుఅ జుఅళమ్।*
*ద ఇ ఓ హో హిమి క ఇ ఆ*
*దాసో దాసాణం సచ్చ సూరి సరిచ్ఛో॥*

ఛా. *ఉపనిషచ్ఛిరః కుసుమం*
*ఉత్తం సయిత్వా తవ పదాంబుజ యుగళమ్।*
*దయితో భవిష్యామి కదా*
*దాసోదాసానాం సత్య! సూరి సదృక్షః॥*

**అర్థం:** హే దాసానాంసత్య!= దాసులకు సత్యమైన దేవా!; ఉపనిషత్+శిరః కుసుమం= ఉపనిషత్తులు అనే స్త్రీల తలయందలి పుష్పమైప; తవ= నీ యొక్క; పద+అంబుజ యుగళం= పాదారవింద ద్వయాన్ని; ఉత్తంసయిత్వా= తలమీద అలంకారంగా ధరించి; సూరి సదృక్షః= నిత్యసూరులతో సమానుడనై; దయితః= ప్రియమైన; దాసః= దాసునిగా; కదా= ఎప్పుడు; భవిష్యామి= ఉండగలను.

**తా॥** ఓ దాససత్యా! ఉపనిషత్తులనే కాంతలు తమ తలల యందు అలంకరించుకొనే పూవులే నీ పాదపద్మాలు, ఆ పాదపద్మాలను నా తలయందు అలంకారంగా ధరించి నీ సన్నిధిలో ఉండే నిత్యసూరులతో సమానుడనై నేను నీకు ప్రియదాసునిగా ఎప్పుడు ఉండగలను?

వ్యాఖ్య:- ముక్తపురుషుడు భగవత్పాదారవిందాలను శిరసావహించి, నిత్యసూరులతో సమానుడై భగవద్దాస్యరాసిక్యాన్ని అనుభవిస్తాడని వర్ణితం.

ఉపనిషచ్ఛిరః కుసుమం:- ఉపనిషత్తులే స్త్రీలు. వారు తమ తలలమీద ధరించుకొన్న అందమైన, పరిమళ భరితమైన పూవులే భగవత్పాదకమలాలు.

"శుడర్ మిగు శురుదియుళ్ నిన్ఱ శురనే"- (తి.వా.మొ. 1-1-7). ప్రకాశమానమైన సర్వోత్కృష్టమైన వేదాలయందు ప్రతిపాద్యుడై యున్నవాడు శ్రియఃపతియే అని నమ్మాళ్వార్ల శ్రీసూక్తి. శ్రుతులు, ఉపనిషత్తులు స్త్రీలింగ శబ్దాలు. ఉపనిషత్తులే స్త్రీలు అని రూపక మనదగును. కాని 'స్త్రీలు' అని వాగ్రూపంగా రూపింపబడలేదు. ఉపనిషత్ అనే శబ్దమందే స్త్రీ రూపం గమ్యమవుతున్నది. ఉపమేయమైన ఉపనిషచ్ఛబ్దమందే ఆరోపించబడిన స్త్రీ రూపమైన ఉపమానం ఉపమేయ రూపంగానే పరిణమించడంవల్ల ఈ శ్లోకం పరిణామాలంకార లక్షణం కలది. "పరిణామః క్రియార్థశ్చేత్ విషయీ విషయాత్మనా" అని తల్లక్షణం.

పూలను తలలో ధరించడం స్త్రీలకు చాలా ఇష్టం. భగవత్పాదద్వయం తామరపూలవంటివి. కాబట్టి ఉపనిషత్తులకు శిరఃకుసుమం పదాంబుజ యుగళం అంటే భగవంతుని దివ్యమంగళ విగ్రహం ఉపనిషత్తులందే వర్ణింపబడియున్నదని అర్థం. "య ఏషోంత రాదిత్యే పురుషో దృశ్యతే"- ఉపనిషద్వాణి.

*తవ పదాంబుజ యుగళం ఉత్తంస యిత్వా:*- వేదాన్త శాస్త్ర ప్రతిపాదితమైన భగవానుని పాదకమల యుగళాన్ని ముక్తపురుషుడు తన తలమీద అలంకారంగా ధరిస్తాడు.

"నిన్ శెమ్మాపాదపఱ్ఱు త్తలై శేర్త్తు"- (తి.వా.మొ. 2-9-1). నీ యొక్క శ్రేష్ఠమైన పాదపద్మాలను నా శిరస్సున చేర్చుము.

"అమ్మా వడియేన్ వేండువదీదే"- స్వామీ! దాసుడు కోరేది ఇదే అని నమ్మాళ్వార్లు అర్థించారు. పాదాలను శిరోభూషణంగా ధరించడమంటే శేషభూతుడని భావం.

సూరి సదృక్షః దయితః దాసః కదా భవిష్యామి?:- ముక్తపురుషుడు భగవచ్చరణ సరోజాలను తన తలపైన అలంకరించుకొని నిత్యసూరులతో సమానంగా భగవంతుని అనుగ్రహానికి పాత్రుడవుతాడు. ఆశ్రితుల నెడబాయనివి "తిణ్కషల్" దృఢమైన పాదాలు. "దాస భూతాః స్వతః సర్వేహ్యాత్మానః పరమాత్మనః"- భగవానుడు సర్వశేషి-అందరిచే పూజింపబడువాడు. జీవాత్మలు పరమాత్మకు దాసభూతులే శేషభూతులే, సహజదాస్యం కలవారు జీవులు. నిరంతరం కైంకర్యం చేయువారు. శేషత్వమే ఆత్మకు స్వరూపం. కైంకర్యం లేకుండా శేషత్వం సిద్ధింపదు. దాసుడంటే స్వార్థం లేకుండా సేవ చేయువాడు.

దాససత్యా! దేవనాథా! నీ చరణాబ్జయుగళాన్ని శిరోభూషణంగా అలంకరించుకొని సంసార వాసనలేని అనంత గరుడ విష్వక్ సేనాది నిత్య సూరులతో సమానుడనై నీకు ప్రియమైన దాస్యం చేసే దశ నాకు ఎన్నడు సంభించగలదో! అని చింతించడం జ్ఞానవైరాగ్య భూషణుల లక్షణం.

90. అఉణో ణిఉత్తిజోగ్గం
ఓఆర విహార సహ అరత్తణ ధణి అమ్।
అప్ప సమబోఅ మేత్తం
అణు హోహిసి దేవణాహ కాహేణు మిమమ్॥

ఛా. అపునర్నివృత్తి యోగ్యం
అవతార విహార సహచరత్వ ధన్యమ్।
ఆత్మ సమభోగ మాత్రం
అనుభవిష్యసి దేవనాథ! కదాను మామ్॥

**అర్థం:** హే దేవనాథ! అపునర్నివృత్తి యోగ్యం= మళ్ళీ తిరిగిరాని యోగ్యుని గానూ; అవతార విహార సహచరత్వ ధన్యం= (నీ) అవతార లీలలయందు నీతో

కూడియుండే ధన్యునిగానూ; ఆత్మ సమభోగ మాత్రం= నీతో సమాన సుఖానుభవం కలవానిగానూ; మాం= నన్ను; (త్వం= నీవు); కదాను= ఎప్పుడు; అనుభవిష్యసి= అనుభవింపగలవో?

**తా॥** ఓ దేవనాయకా! నన్ను పునర్జన్మలేని యోగ్యునిగానూ, నీవు లోకంలో అవతరించ విహరించునప్పుడు నీతోనే కూడి సంచరించడమందు కృతార్థునిగానూ, బ్రహ్మానుభవమందు నీతో కూడి ముక్తాత్మ సమాన భోగాన్ని అనుభవించే భాగ్యాన్ని మాత్రం నీవు నాకు ఎన్నడు కలిగింపగలవో కదా!

**వ్యాఖ్య:**– ముక్తపురుషుడు శాశ్వతమైన బ్రహ్మానందాన్ని అనుభవించే దశ ప్రార్థింపబడుతున్నది.

నిత్యసూరులతో సమానంగా భగవత్కైంకర్య రసాన్ని తామూ అనుభవించాలని గత శ్లోకంలో ప్రార్థితం.

ఈ శ్లోకమందు ఆపైన కలుగవలసిన మూడు విషయాలను దేశికులు ఆశిస్తున్నారు.

1) అపునర్నివృత్తి యోగ్యం:– ముక్తపురుషుడు మళ్ళీ భూలోకమందు ప్రాకృత జన్మను పొందడానికి తిరిగి వచ్చునేమో అనే సంశయం కలుగవచ్చును కాని శ్రుతి స్మృతులు అట్లు చెప్పలేదు.

"సఖల్వేవం వర్తయన్ యా వదాయుషం బ్రహ్మలోక మభిసంపద్యతే న చ పునరావర్తతే నచ పునరావర్తతే"– (శ్రుతి). బ్రహ్మవేత్త తాను బతికియున్నంత వరకు ఉపాసిస్తూ భక్తి ప్రపత్తులతో ధ్యానిస్తూ– సర్వేశ్వరుణ్ణి పొందుతాడు, మళ్ళీ ఈ లోకానికి వచ్చి జన్మింపడు– పునర్జన్మలేనే లేదు– అని శ్రుతి వాక్యార్థం.

"ఆ బ్రహ్మ భువనాల్లోకాః పునరావర్తినోఽర్జున।
మాము పేత్యతు కౌంతేయ! పునర్జన్మ నవిద్యతే॥"– (భ.గీ. 8–16)

ఓ పార్థా! చతుర్ముఖ బ్రహ్మవరకున్న లోకాలన్నీ పునరావృత్తి కలవి. నన్ను పొందిన వానికి మాత్రం పునర్జన్మ లేదు. (శ్లోకార్థం) "నచ పరమ పురుషః సత్య సంకల్పః అత్యర్థ ప్రియం జ్ఞానినం లబ్ధ్వా కదాచిత్ ఆవర్త యిష్యతి" (శ్రీభాష్యం). సత్యసంకల్పుడైన పరమ పురుషుడు తనకు అత్యంత ప్రియుడైన జ్ఞానిని తన సన్నిధికి చేర్చుకొని, మళ్ళీ అతనికి జన్మను కలుగజేయడు. కాబట్టి, దేశికులు తమకు పునర్జన్మ కలుగకుండా చేయుమని ప్రార్థించారు.

2) అవతార విహార సహచరత్వ ధన్యమ్:- ముక్తపురుషుడు భగవద్విభూతి యైన సర్వలోకాలను కూడా అనుభవిస్తాడు. బద్ధజీవుడు కర్మానుగుణంగా ప్రవర్తిస్తాడు. ముక్తజీవుడు స్వేచ్ఛగా ప్రవర్తిస్తాడు.

"సస్వరాడ్భవతి, తస్య సర్వేషులోకేషు కామచారో భవతి"- (శ్రుతి). ముక్తపురుషుడు (స్వరాట్) కర్మవశ్యుడు కాడు, స్వతంత్రుడైనందున సర్వలోకాలలో స్వేచ్ఛగా విహరించే యోగ్యత కలవాడు.

"ఇమాన్ లోకాన్ కామాన్నీ కామరూప్యను సంచరన్"- ముక్తపురుషుడు ఈ లోకాలలో సంచరిస్తూ తనకిష్టమైన రూపాలను ధరించి, భోగాలను అనుభవిస్తాడన్నది ఉపనిషద్వాణి. ముక్తుడు సత్యసంకల్పుడే అయినా "ఏషహ్యే వానందయాతి"- (తై.ఆ. 7-2-1) బ్రహ్మాండంలో గల భోగాలను అనుభవించే ఆనందాన్ని కూడా సర్వేశ్వరుడే కలుగజేస్తాడు.

"శాశ్వతస్యచ ధర్మస్య సుఖస్యై కాంతికస్య చ"- (భ.గీ. 14-27). జ్ఞాని పొందవలసిన ఆనందానికంతటికీ భగవానుడే ఆధార భూతుడని శ్రుతిస్మృతులు చెబుతున్నాయి. కాబట్టి భగవానుడు రామకృష్ణావతారాలలాగా లోకాంతరాల్లో అవతరించి విహరిస్తున్నప్పుడు, దేశికులు ముక్తదశలో భగవంతునితో పాటు తానూ అవతరించి, "రామః సలక్ష్మణః"- లక్ష్మణునితో కూడియున్న రాముడు- అన్నట్లు సహచరిస్తూ, కైంకర్యం చేస్తూ, భగవల్లీలా రస నిషేవణం చేత కృతార్థుడగు నట్లు అనుగ్రహించవలెనని ప్రార్థించారు.

3) ఆత్మ సమభోగ మాత్రం:- ముక్తాత్మ సర్వేశ్వరునితో సమానంగా బ్రహ్మానందాన్ని అనుభవిస్తాడు.

"జగద్వ్యాపార వర్జం ప్రకరణాత్ అసన్నిహిత త్వాచ్చ"- (బ్ర.సూ. 4-4-17) 'జగద్వ్యాపారం' అంటే సమస్త చేతనాచేతన వస్తువుల యొక్క స్వరూప స్థితి ప్రవృత్తులను నియమించడమని అర్థం. జగత్సృష్ట్యాదులను చేసే సామర్థ్యం అని భావం.

సర్వేశ్వరునికి ప్రకృతితత్త్వమున్నందువల్ల, సృష్టి స్థితి లయాలనబడే జగద్వ్యాపారాన్ని చేసే, అఘటిత ఘటనా సమర్థుడు. ఇది అసాధారణ లక్షణం.

ముక్తపురుషుణికి ఈ లక్షణం- జగద్వ్యాపారమొనర్చే సామర్థ్యం సన్నిహితమై లేదు. కాబట్టి, ముక్తపురుషుడు జగద్వ్యాపారం మాత్రం లేనివాడు. ఇక ముక్తైశ్వర్యం ఎట్లుంటుంది?

"రసోవైసః రసం హ్యేవాయం లబ్ధ్వాఽ ఽ నందీభవతి"- సర్వేశ్వరుడు నిరతి శయానందం కలవాడు. ఆనందమయుణ్ని పొంది ముక్తపురుషుడు ఆనందం కలవాడవుతున్నాడు.

"భోగమాత్ర సామ్యలింగాచ్చ"- బ్ర.సూ. (4-4-21). ముక్తపురుషుణి ఐశ్వర్యం పరమ పురుషాధీనమే. ముక్తుడు జగద్వ్యాపారమందు తప్ప తక్కినవాటి యందు సత్యసంకల్పుడు, పరమ పురుషుణితో సమానుడే.

"సోఽ శ్నుతే సర్వాన్ కామాన్ సహబ్రహ్మణా విపశ్చితా"- (శ్రుతి). సర్వజ్ఞుడైన పరమ పురుషుణితో పాటు ముక్తపురుషుడు కూడా సర్వభోగాలను అనుభవిస్తుంటాడు. సర్వేశ్వరుడు ముక్తపురుషుణికి తన యాథాత్మ్యానుభవ రూపమైన నిరతిశయానందాన్ని కలుగజేస్తాడని సారార్థం.

"అహ మన్నం, అహమన్నాదః" నేను అన్నమును, నేను అన్నం తినువాడను. అన్నం అచేతనం. అన్నాదుడు చేతనుడు. 'అహం' అనే పదం భగవత్పర్యంత వాచి. భోక్తవ్యం, బోగం అనే వాటియందు ఇరువురికి సామ్యమున్నది.

"సాయుజ్య ముభయోరత్ర భోక్తవ్యస్యా విశిష్టతా।
సార్ష్టితా తతత్రభోగస్య తారతమ్య విహీనతా॥"

అనుభవించదగిన వస్తువు 'భోక్తవ్యం' అనబడుతుంది. అనుభవించడమే 'భోగం' అని వ్యవహృతం. ఆత్మకు పరమాత్మకు 'భోక్తవ్య' మందు భేదం లేకపోవడాన్ని సాయుజ్యం (మోక్షం) అంటారు. వీరిద్దరికి 'భోగ' మందు తారతమ్యం (భేదం) లేకపోవడాన్ని "సార్ష్టిత" అంటారు. 'భోగం' విషయంలో ముక్తపురుషుడికి పరబ్రహ్మకు సామ్యమున్నదని సూత్రార్థం.

ఇట్టి భాగ్యాన్ని నాకు ఎన్నడు అనుగ్రహిస్తావు స్వామీ! అని నిర్భరుడై, నిర్భయుడైనా, ఆచార్యులు నమ్రతతో ప్రార్థిస్తున్నారు.

91. ఇఅ ఫుడ మణోరహం మ
ఏఆరిస వఅణ మేత్త సారం వసఅమ్।
కుణసు ణిఅగుణ గణేహిం
సచ్చం దాసాణ సచ్చ సఇ సచ్ఛందో॥

ఛా. ఇతి స్ఫుట మనోరథ మాం
ఏతా దృశ వచన మాత్ర సారం వశగమ్।
కురుష్వ నిజగుణ గణైః
సత్యం దాసానాం సత్య! సదా స్వచ్ఛందః॥

**అర్థం:** హే దాసానాం సత్య!= దాసుల మాటలను సత్యం చేసే దేవనాయకా!; ఇతి= ఇట్లు; స్ఫుట మనోరథం= వెల్లడించిన కోరికలు కలిగినట్టి; ఏతాదృశ వచన మాత్రసారం= ఈ విధమైన మాటలు మాత్రమే ప్రధానంగా కలిగినట్టి; వశగం= నీ అధీనుడనైనట్టి; మాం= నన్ను; సదా= ఎల్లప్పుడు; స్వచ్ఛందః= స్వతంత్రుడవైన నీవు; నిజగుణ గణైః= నీ కల్యాణగుణ సమూహాలచే; సత్యం= (నా కోరికలను) సత్యంగా; కురుష్వ= చేయుము.

**తా॥** ఓ దాససత్యా! నా కోరికలను స్పష్టంగా తెల్యబరచాను. ఆచరణలేని మాట మాత్రమే ముఖ్యమైనదిగా ప్రార్తన జేశాను. నేను పరవశుడను. నీవు స్వతంత్రుడవు. నీ కల్యాణ గుణగణాలచేత నా ప్రార్థనను సత్యం చేయుము.

**వ్యాఖ్య:-** దాసుల మనోరథాన్ని స్వతంత్రుడైన సర్వేశ్వరుడే సత్యం చేయవలెనని ప్రార్థించే శ్లోకం.

అనుష్ఠానంచేత ఫలించదగిన కోరికలను ఎప్పుడు, ఎప్పుడు తీర్చగలవు? కదా! కదా! అని ప్రార్థించావు. ఈ భక్తియోగాన్ని అనుష్ఠించాను, పంచాంగాలతో కూడిన ప్రపత్తిని అనుష్ఠించాను- అని హృదయపూర్వకంగా, సాధికారంగా కోరికలను వెల్లడించని నీ ప్రార్థన కేవలం మాటలు మాత్రమే సారం కలదిగా నున్నది కదా! ఆలోచించుమాచార్యా! అని దేవనాథుడు పల్కినందువల్ల దేశికుల నమ్రమైన ప్రార్థన ఇది.

ఇతి స్ఫుట మనోరథం:- దాససత్యా! ఇట్లు (8 శ్లోకాలలో) దేహంనుంచి ఆత్మ ఉత్క్రమణం మొదలుకొని పరమసామ్యాన్ని పొందే వరకు శాస్త్ర జన్య జ్ఞానం వల్ల కలిగిన నా మనోరథాన్ని నీ సన్నిధిలోనే తేటతెల్లంగా విన్నవించు కొన్నాను. నా విజ్ఞాపనలో సారంలేదని నీవు భావించరాదు.

ఏతాదృశ వచన మాత్రసారం:- ప్రార్తనలో ముఖ్యంగా మాటలకే ప్రాధాన్యముంటుంది. ఇట్టి భక్తి ప్రపత్తుల ననుష్ఠించిన వాడనని, పురుషార్థాన్ని పొందే యోగ్యుడనని విన్నవించుకోడం అకించనుని, అగతికుని లక్షణం కాదు. యోగ్యుడు కానీ, లోకం నిందించే చేష్టలను చేసినవాడు గానీ *"త్రివిక్రమ! త్వచ్చరణాంబుజ ద్వయం మదీయమూర్ధానం కదా అలంకరిష్యతి"*- ఓ త్రివిక్రమా! వేదత్రయమందు ప్రతిపాదింపబడిన ఓ దేవనాథా! నీ చరణ నీరేజ యుగళం నా శిరస్సును ఎప్పుడు అలంకరించగలదో! అని తన ఆవేదనను నివేదించుకొనే, మాటల సారమున్న ప్రార్థనను చేస్తాడు. దర్పాన్ని ప్రకటించే మనోరథం 'ప్రార్థన' అనబడదు. పురుషార్థమూ సంప్రాప్తించదు. ఇట్లు మా ఆచార్యులచేత ఉపదిష్టుడను.

మనిషి మంచివాడో, చెడ్డవాడో అనే సంగతి అతని మాటలను విన్న వెంటనే తెలుస్తుంది కదా! నేను, ఆత్మ సమభోగప్రదాన పర్యంతం అనేక కోరికలను నీ ముందు తెల్యపరచాను.

వశగమ్:- స్వతంత్రుడను కాను. సాధికారంగా ఆశించిన ఫలాన్ని పొందే యోగ్యుడనూ కాను. "నోత్తనోన్మిలేన్"- ఏ నోమును నోచినవాడనూ కాను. క్షుద్రుడను, దుఃఖజలధియైన ఈ సంసారం నుంచి బయటపడి నీ పాదపద్మాలకు పరిచర్య చేసే దశ ఎప్పుడు కలుగునో అని ప్రార్థించిన పరతంత్రుడను.

"యథావాయోః తృణాగ్రాణి వశం యాంతి బలీయసః ధాతు రేవ వశం యాంతి"- బలమైన గాలి ఎటు వీచితే గరుకపోచలు ఆవైపే వంగి గాలికి వశమై జీవిస్తుంటాయి. అట్లే చరాచర పదార్థాలు సృష్టికర్తయైన సర్వేశ్వరునికి అధీనమై యుంటాయి.

"తేన వినా తృణమపిన చలతి"- భగవత్సంకల్పం లేకుండా గరుక పరకయైనా కదలజాలదు కదా! నేను పరాధీనుడను. 'క్షిపామి' అన్నట్లు నన్ను నరకంలో పడవేయడం నీకు తగునా? భగవదధీనుడైన వ్యక్తిని శరణాగతుడైన వాణ్ని "మోక్షయిష్యామి"- అన్న నీ అభయ వచనానికి భంగం కాదా!

సదా స్వచ్ఛందః- నీవు ఎప్పుడూ నిరంకుశ స్వతంత్రుడవే. నేనో యావదాత్మ భావి పరతంత్రుడనే కదా! నిన్ను ప్రశ్నించే నాథుడెవడున్నాడు? నీవు నీ ఇష్టమున్నట్లు ప్రవర్తించే వాడవు. నీకు కురుక్షేత్ర సమర రంగంలో పాండవ పక్షమందున్నప్పటికీ 'ఆయుధాన్ని పట్టను' అని ప్రతిజ్ఞచేసి కూడా భీష్ముని పైకి రథాంగాన్ని చేతబట్టి రణరంగంలో పరుగెత్తినప్పుడు, నీ ప్రతిజ్ఞాభంగానికి వీరులందఱు ఆశ్చర్యపడుతుండగా, భీష్ముడు బద్ధాంజలియై నిన్ను ప్రార్థించాడు. నీ యాశ్రితులను రక్షించడానికి నీ స్వాచ్ఛంద్యం- నీవు నీ యిష్టానుసారం ప్రవర్తించే విషయం విశ్వవిదితమైనది కదా!

నిజగుణ గణైః సత్యం కురుష్వ:- నీవు అనంత కల్యాణగుణ గణ మహోదధివి. నీ సౌశీల్య వాత్సల్య కారుణ్యాది గుణాలచేత నా కోరికను నేను ప్రార్థించిన మాట(ల)ను సత్యం చేయుము. మనోరథం, మాం సత్యం కురుష్వ- ద్వికర్మక ప్రయోగమిది. నా కోరికను సత్యం చేయడానికి నీ కల్యాణ గుణాలే కారణమని నమ్మిన నన్ను సత్యవాదిగా చేయుమయ్యా! స్వామీ!

దాసానాం సత్య:- నీ కింకరుల పట్ల నీవు దయగలవాడవై వారి మాటలను సత్యం చేస్తావు. వారు సత్యవాదులనే కీర్తిని పొందునట్లు చేసే పరంధాముడవు నీవు.

"సత్యం విధాతుం నిజభృత్య భాషితం"- 'చక్రి సర్వోప గతుండు' అన్నట్టి ప్రహ్లాదుని మాటనూ, హిరణ్యకశిపునికి ఇచ్చిన బ్రహ్మదేవుని వరాన్ని కూడా సత్యం చేయడానికి నీ 'స్వాచ్ఛంద్యం' ప్రకాశితం కదా!

92. బాల పవఓవ్వతరళో
మారుఇ జాఇత్తి సాఅరం తరిఉమణో।
పత్థేమి తుమం అచ్చుఅ
కంఖిఅ పఅ పఉమ ఖమసు మహ కావే అమ్॥

ఛా. బాల ప్లవగ ఇవ తరళో
మారుతి జాతి రితి సాగరం తరితుమనాః।
ప్రార్థయే త్వామచ్యుత!
కాంక్షిత పదపద్మ! క్షమస్వమమకాపేయమ్॥

**అర్థం:** హే అచ్యుత!; మారుతి జాతిః= ఆంజనేయుని జాతివంటి జాతి గల్గినట్టి వాడను; ఇతి= అని; సాగరం= సముద్రాన్ని; తరితుమనాః= చాటడానికి మనస్సుగల; బాల ప్లవగః, ఇవ= పిల్లకోతివలె; తరళః= చాపల్యం కలవాడనై; త్వాం= నిన్ను;

ప్రార్థయే= ప్రార్థిస్తున్నాను; హే కాంక్షిత పదపద్మ= అందఱిచే కోరబడిన పాదపద్మాలుగల దేవనాథా!; మమ= నా యొక్క; కాపేయం= వానర స్వభావాన్ని; క్షమస్వ= మన్నింపుము.

**తా॥** ఓ అచ్యుతా! హనుమంతుని జాతియందు పుట్టినానని సముద్రాన్ని ఉల్లంఘింప దలచిన పిల్లకోతిలాగా నిన్ను ప్రార్థిస్తున్నాను. సర్వాపేక్షితమైన పాదకమలాలుగల ఆదిదేవా! నీవు నా కోతిచేష్టను- అర్హతలేని నా కోరికను క్షమింపవలెను.

**వ్యాఖ్య:-** అనర్హుడు దుర్లభమైన భగవదనుభవాన్ని చాపల్యంచేత అపేక్షించిన దోషాన్ని క్షమింపవలెనని ప్రార్థన.

నేనెవరిని? నా ఆశను ప్రకటించడంలో అది శక్యమా!, అశక్యమా! అనే వివేకం లేకపోవడమనే గొప్ప దోషం క్షంతవ్యమని ప్రార్థన.

*మారుతి జాతిరితి సాగరం తరితుమనాః బాలప్లవగ ఇవతరళః*- వాయుపుత్రుడైన ఆంజనేయుడు ఒకే అంగలో సముద్రాన్ని దాటి లంకకు చేరాడు. అతని వంశమందు పుట్టినాననే దర్పంతో ఒక కోతిపిల్ల సముద్రాన్ని దాటగోరిందట.

మారుతి జాతియందు పుట్టినందువల్ల అవయవ సన్నివేశమున్న మాట నిజమే కాని, సాగర లంఘనానికి తగిన సామర్థ్యం తనకున్నదా లేదా అనే జ్ఞానం ఆ పిల్లకోతికి లేదు కదా! పిల్లకోతి కాబట్టి చెట్లకొమ్మలపైన గంతులు వేస్తూ ఎగురడం చాంచల్యముండడం స్వాభావికమే. కాని వేయి పిల్లకోతులు కలిసి కూడా సాగరతరణం చేయలేవు కదా! బాలప్లవగం సాగరోల్లంఘన చేయగోరడం బుద్ధిహీనమైన సాహసమని తెలుస్తునే ఉంది. అట్లే శ్రీ పుండరీక యజ్వయొక్క వంశమందు పుట్టినంత మాత్రాన సంసార సాగరోల్లంఘన చేసి సమస్త ప్రతిబంధకమైన కర్మలు తొలగిపోయిన ముముక్షువులచే పొందదగిన

భగవద్భోగ సామ్యాన్ని అపేక్షించడం బాలమర్కటం వలె చిత్తచాపల్యంచేత నేను నిన్ను ప్రార్థించడం అపచారం- దోషమే అని దేశికుల ఆశయం.

"నాణమిల్లాచ్చిఱుతగైయేన్ నానింగలత్తు వదెన్
పేని వానోర్ కాణమాట్టాప్పీదుడై యప్పనైయే॥"- (తి.వా. 4-7-4)

ఓ స్వామీ! నిత్యసూరులు- బ్రహ్మాదిదేవతలు ఆశపడి సేవించడానికి దుర్లభుడవైన గొప్ప మహిమగల స్వామివైన నిన్ను సిగ్గులేని అతిక్షుద్రుడనైన నేను 'నా కంటికెదుట వచ్చి కనబడవయ్యా!' అని మొరపెట్టడం నా చిత్త చాపల్యమే కాని ఏ ప్రయోజనం లేదని నమ్మాళ్వార్ల శ్రీసూక్తి.

"ధిగవుచిమవినీతం నిర్దయం మామలజ్జం
*పరమ పురుష! యోఽహం యోగివర్యాగ్రగణ్యైః।*
*విధిశివ సనకాద్యైః ధ్యాతుమత్యంత దూరం*
*తవ పరిజన భావం కామయే కామవృత్తః॥*"- (స్తో.ర. 47)

ఓ పరమపురుషా! యోగశ్రేష్ఠులలో మొదట లెక్కింపదగిన బ్రహ్మరుద్రాది దేవతలు, సనక సనందాది మునులు బ్రహ్మభావన కలవారు. అట్టి మహానుభావులు కూడా ధ్యానించడానికి అందనంత దూరమందున్న వాడవు నీవు. అనంత గరుడ విష్వక్సేనాది నిత్యసూరులు అభిలషించే నిరతిశయ భోగ్యమైన నీ కైంకర్య రసానుభవాన్ని ఇష్టానుసారంగా ప్రవర్తించే నేను కోరుకొంటున్నాను. ఛీ ఛీ! పురోడాశాన్ని కోరే కుక్కవలె అపవిత్రుడను, అనర్హుడనైన నేను భగవత్తత్త్వమందు భక్తి, ప్రేమలేనివాడను, గర్విష్ఠుడను, సిగ్గులేని వాడను కదా! అని ఆళ్వందార్ తనను తాను నిందించుకొన్నారు.

అచ్యుత! కాంక్షిత పదపద్మ! ఆశ్రితులకు సులభుడవు నీవు.

"మైందనై మలరాళ్ మణవాళనై
*తుంజుంబోదుమ్ విడాదు తొడర్ కండాయ్॥*"- (తి.వా. 1-10-4)

పరమభోగ్యుడైన లక్ష్మీనాథుణ్ణి నేను ఎడబాసి యున్నను ఓ మనసా! నీవు మాత్రం విడువకుండా అనువర్తింపుము- అని నమ్మాళ్వార్ల దివ్యవాణి. శ్రేయస్సును ఎవడు ఆశించడు?

"దాసభూతాః స్వతః సర్వే"- అందఱు సర్వశేషియైన శ్రియఃపతికి సహజంగా దాసులైనవారే అని పరమశివుని మాట. జీవులందఱు భగవానుని చరణ నళినాలను ఆశ్రయింప గోరువారే కదా! శిష్టాచారాన్నిబట్టి నీవు పొందబడే వాడవు. నేను పొందేవాడను అనే ఆశతో నీ పాదారవింద మధుపమై యుందునట్లు అనుగ్రహింపుమని ప్రార్థించాను.

మమకాపేయం క్షమస్వ:- అసాధ్యమైన కార్యసాధనమందు కోతి చాపల్యం వంటి చాపల్యం గల మహాపరాధినైన నన్ను నీ క్షమారూపమైన ప్రతిక్రియచేత స్వీకరింపుమయ్యా! ఇట్లు దేశికులు భగవానుని క్షమయే తనకు శరణమని ప్రార్థించారు.

93. అచ్చుఅ విస అక్కంతం
భవణ్ణ వావట్ట భమి ణిఉడ్డజ్జం తమ్।
జణణీ థణం ధఅం విఅమం
ఉద్ధరి ఊణ సేవసు సఅం పచ్ఛమ్॥

ఛా. అచ్యుత! విషయాక్రాంతం
భవార్ణవావర్త భ్రమి నిమజ్జంతమ్।
జననీ స్తనంధయ మివమాం
ఉద్ధృత్య సేవస్వ స్వయం పథ్యమ్॥

**అర్థం:** హే అచ్యుత!; విషయ+ఆక్రాంతం= శబ్దాది విషయాలచేత ఆక్రమింపబడినట్టి; భవ+ఆవర్త భ్రమి నిమజ్జంతం= సంసారమనే సముద్రం యొక్క సుడిగుండ

మందు మునుగుతున్నట్టి; మాం= నన్ను; జననీ= తల్లి; స్తనంధయం, ఇవ= చంటి కుమారుణ్ణివలె; ఉద్ధృత్య= ఎత్తుకొని; స్వయం= (తానే) నీవే; పథ్యం= హితాన్ని (ఔషధాన్ని); సేవస్వ= సేవింపుము.

**తా॥** ఓ అచ్యుతా! శబ్దాది విషయాలకు వశపడి యున్నాను. సంసార సాగరం యొక్క సుడిగుండమందు తిరుగుతూ మునిగిపోతున్నాను. ఇట్టి నన్ను తల్లి, వ్యాధిగ్రస్తుడైన తన చంటిపిల్లవాణ్ణిలాగా ఎత్తుకొని నీవే పథ్యాన్ని సేవింపుము.

**వ్యాఖ్య:**– సంసారార్ణవమందలి సుడిగుండంలో మునుగుతున్న జీవుణ్ణి భగవానుడే ఉద్ధరించి రక్షింపవలెనని సుశ్లోకితం.

ఆపదలో నున్నవాడు భగవానుడే కాపాడాలని ప్రార్థిస్తాడు.

*విషయాక్రాంతం:*– శబ్దాది విషయాలు ఐదు. ఇంద్రియాలు ఐదు. శబ్దాన్ని గ్రహించేది శ్రవణేంద్రియం (చెవులు), స్పర్శను చర్మం, రూపాన్ని కన్నులు, రసాన్ని-రుచిని నాలుక, గంధం అంటే వాసనను ముక్కు గ్రహిస్తుంటాయి. విషయాలకు లొంగి ప్రాణులు చెడిపోతాయనడం సత్యం. విషానికి విషయాలకు తారతమ్య మున్నది. విషం మింగినవాణ్ణి చంపుతుంది. విషయాలు తలచినంత మాత్రాననే వ్యక్తిని అధోగతిపాలు చేస్తాయి. విషయాక్రాంతుడు అంటే ప్రాపంచిక భోగాలకు మరిగినవాడని అర్థం.

*భవార్ణవావర్త భ్రమి నిమజ్జంతం:*– భవం అంటే సంసారం. ఆర్ణవమంటే సముద్రం. ఆవర్తమంటే సుడి.

*"భవస్సంసార సంప్రాప్తిః శ్రేయః శంకర జన్మసు", "సరస్వాన్ సాగరోఽర్ణవః"*– *"స్యాదావర్తోఽంభ సాంభ్రమః"*– (అమరం). సంసారమే సముద్రం. జనన మరణ చక్రమందు భ్రమించడమే నీటి సుడిగుండమందు (చుట్లు) తిరుగడం. సంసారమందున్న ప్రాణి విషయాక్రాంతుడవుతాడు. సముద్రంలో పడిన వ్యక్తి (మొసళ్ళు) మకరాది జలచరాలచే ఆక్రమింపబడుతాడు. దైనందిన జీవితంలో

సుఖాన్ని పొందలేక దుఃఖంతో క్రుంగిపోవడమే కడలి సుడిగుండంలో చక్రంలాగా తిరుగుతూ మీదికి లేవలేక, దరికి చేరలేక, హఠాత్తుగా నీటి యడుగుకు చేరడం.

ప్రాణులకు సుఖదుఃఖాదులను కలుగజేసే కర్మ, అవిద్య, రుచి, వాసనా రూపమైన సంసార చక్రమందు అప్పుడప్పుడు ఆపదలు కలుగడం అందఱు అంగీకరించిన విషయమే కదా! ఇదొక మహావ్యాధి. అజ్ఞానం కలవాడు ఎప్పుడూ స్తనంధయుడే- తల్లి చనుపాలను త్రాగే శిశువే సుమా!

"కండూయనేఽపి చాశక్తః పరివర్తేఽప్య నీశ్వరః"- దురద కలిగినప్పుడు గోక్కొనలేని వాడు తన నడవడిని మార్చుకోవడంలోనూ అసమర్థుడే కదా! స్తనంధయునివలె తనను తాను రక్షించుకొనే విషయంలో అత్యంత అశక్తుడు. స్తనంధయుని వ్యాధిని పోగొట్టడానికి నిరవధిక వాత్సల్యం కలిగిన తల్లి మాత్రమే పథ్యం- ఔషధాన్ని సేవించవలసి యుంటుంది. తత్ఫలితంగా తల్లి శిశువును ఎత్తుకొని తన చనుపాలను త్రాగించడంవల్ల శిశువు ఆరోగ్యవంతుడై జీవిస్తాడు. తల్లి ఏ మాత్రం శ్రద్ధవహించి పథ్యం చేయకపోతే, శిశువుకు ఆపద సంభవిస్తుంది కదా! కాబట్టి ఓ దేవనాయకా! సంసార సాగరావర్తంలో పడి మునిగిపోతున్న నన్ను తానే పథ్యమాచరించి ఎత్తుకొని స్తన్యమిచ్చి శిశువును సంరక్షించుకొనే జనని వలె నీవే ఉద్ధరించి నా కోసం నీవే పథ్యం చేయవలె. నీవే ఔషధాన్ని సేవించి నా పట్ల హితమాచరించవలెను. నన్ను నేను రక్షించుకొనే అధికారం నాకు లేదు. రక్షణాధికారం కలిగిన నీవే శ్రద్ధతో నేను బాగుపడునట్లు సంకల్పించుకొనవలె, సంరక్షించవలెనని సారార్థం.

*"క్వాహమత్యంత దుర్బుద్ధిః క్వచ ఆత్మ హిత వీక్షణమ్।*
*యద్ధితం మమదేవేశ! తదాజ్ఞాపయ మాధవ॥"* (జితంతే స్తోత్రం)

మిక్కిలి దుర్మతినైన నేనెక్కడ? నా ఆత్మహితం అభ్యుదయం కోసం నేను చూచుకోవడమెక్కడ? నాకు హితమైనదేదో దేవనాయకుడవైన ఓ లక్ష్మీనాథా!

దాన్ని నీవే ఆజ్ఞాపించవలెను- అనే శ్లోకమిట అనుసంధేయం. "హితే పథ్యం త్రిలింగకం"- (రత్నమాల).

(ఆవర్త శబ్దానికి "తస్యాధూర్తాదౌటః"- అని 'ట' చేరింది. 'నిమజ్జంతం' చోట 'మస్జేరా ఉడ్డణి ఉడ్డ బుడ్డ ఖుప్పాః' అనే సూత్రం చేత మస్జ ధాతువునకు ఉడ్డ/ బుడ్డ ఆదేశం).

94. కమ్మమ అ ఘమ్మ తవి అం
సుహ మిఅతిణ్హాహి కాహివి అతిణ్ణాహమ్।
కారేసు ణివ్వు అం మం
కర ఆ సిసిరేహి అచ్చు అ కడక్ఖేహిమ్॥

ఛా. కర్మమయ ఘర్మ తప్తం
సుఖమృగ తృష్ణాభిః కదాఽప్య తృష్ణాకమ్।
కారయ నిర్వృతం మాం
కరకాశిశిరై రచ్యుత! కటాక్షైః॥

**అర్థం:** హే అచ్యుత!; కర్మమయ ఘర్మతప్తం= కర్మ రూపమైన గ్రీష్మకాల తాపంచేత తపింపబడిన; కదా, అపి= ఎప్పుడు కూడా; సుఖమృగ తృష్ణాభిః= (త్రివర్గ) సుఖమనే ఎండమావులచేత; అతృష్ణాకం= దాహంతీరనట్టి; మాం= నన్ను; కరకాశిశిరైః = వానరాళ్ళ (వడగండ్ల) వలె చల్లగా ఉండే; కటాక్షైః= కడగంటి చూపులచేత; నిర్వృతం= సుఖం పొందిన వానిగా; కారయ= చేయుము.

**తా॥** ఓ అచ్యుతా! యజ్ఞాదికర్మలు అనే వేసవి కాలవేడిమిచేత తాపం చెంది యున్నాను. ఆ కర్మలను అనుష్ఠించడం వల్ల సుఖమెప్పుడూ కలుగలేదు. త్రివర్గ ఫలభోగమనే ఎండమావులలో తిరిగినందువల్ల దాహం తీరకపోగా ఆర్ద్రతనైనా పొందలేదు. కాబట్టి, బాగా తప్తుడనైన నా పైన వడగండ్ల వంటి నీ

కటాక్ష వీక్షణాలను ప్రసరింపజేసి, నా తాపాన్ని శమింపజేయుము. కర్మాచరణల వల్ల పొందని సుఖసంతోషాలను చల్లని నీ నేత్రాంచల దృష్టులచే పొందగలనని ప్రార్థిస్తున్నాను. కృపతో కటాక్షింపుము.

**వ్యాఖ్య:–** భౌతిక తాపం భగవత్కటాక్షం చేతనే శమిస్తుంది.

కర్మమయ ఘర్మతప్తం:– సుకృత దుష్కృత కర్మలు 'నిజకర్మ నిగళయుగళం' పాపరూపమైన కర్మయే గ్రీష్మకాల తాపం. అట్టి తాపంచేత బాధపడే వ్యక్తి పుణ్యరూపమైన కర్మ వలన కలిగే సుఖంచేత తాపం– దుఃఖం– శమిస్తుందని భావించడం లోకపరిపాటి. కాని 'పుణ్యపాపరూప కర్మలు రెండూ సంకెళ్ళవంటివి' అని (83 శ్లో.) ఇంతకు ముందే చెప్పబడింది. తెల్యకచేసిన పాపకర్మలు, తెలుసుకొని చేసిన యాగాది కర్మలు ఉభయ కర్మలు సంసార బంధహేతువులే కదా! ఇంద్రియ సుఖానుభవాన్ని కలిగించేవి. మోక్షఫల ప్రాప్తికి ప్రతిబంధకాలే. ధర్మార్థ కామ పురుషార్థాలు అనబడేవి ప్రవృత్తి మార్గాలు. ఇట్టి కర్మ, గ్రీష్మర్తువులో– వేసవిలో ప్రచండమైన ఎండ వేడిమిచేత దేహేంద్రియాదులు వసివాళ్వాడి పోవునట్లే, 'ఆధిభౌతికం, ఆధ్యాత్మికం, ఆధి దైవికం' అనే తాపత్రయంచేత వ్యక్తిని దుఃఖపడునట్లు చేస్తుంది.

*సుఖ మృగతృష్ణాభిః కదాఽ ప్య తృష్ణాకం:*– ఇట్టి అల్పసుఖాలు ఎండమావులే. అల్పసుఖానికి ఆశించే వ్యక్తులు మానవులు, మృగాల వంటివారు. మృగతృష్ణ ఎండమావులలో జలమున్నదని ఎండవేడిమిచే దప్పిగొన్న లేడివంటి చతుష్పాత్తులు పరుగెత్తి ఇటు– అటు తిరిగి తిరిగి అలసిపోయి మూర్ఛవచ్చి పడిపోతాయి. అట్లే తాపత్రయం చేత దుఃఖపడుతారు. ప్రవృత్తి మార్గంలో పయనించే మానవులు తృప్తిని పొందలేరు.

*కరకా శిశిరైః కటాక్షైః మాం నిర్వృతం కారయ:*– వడగండ్ల వాన చాలా చల్లగా ఉంటుంది. మూర్ఛలో ఉన్న మృగాలమీద మంచురాళ్ళవాన పడితే అవి

తేరుకొని, దాహాన్ని తీర్చుకొని తృప్తిపడుతాయి. 'కరక' శబ్దానికి వానరాయి అని అర్థం.

"కరకః పక్షిభేదేస్యాత్ కమండల కరక యోః।
కరదాడిమ యోః పుంసి స్త్రియా మపిఘనోపలే"- (విశ్వః)

"వర్షోపలేతు కరకా కరకోపిచ దృశ్యతే"- (రభసః)

ఆ విధంగానే, తాప నివర్తకమైన భగవానుని చల్లని కృపా పూర్ణ కటాక్ష వీక్షణాలచేత కర్మాగ్ని తప్తుడైన తమ తాపాన్ని శమింపజేసి సుఖవంతునిగా జేయవలసినదని దేశికులు అచ్యుత భగవానుణ్ని ప్రార్థించారు.

భగవానుని నిగ్రహంవల్ల కలిగిన తాపం భగవదనుగ్రహం వల్లనే తొలగిపోతుంది. భగవత్కటాక్షానికి సాధ్యం కానిదేముంది?

95. తుహ చింతణ విముహాణం
టిట్ఠి విసాణం వ దం సణాఉ మోఏంతో।
అమిఅ ముహాణం విఅమం
అచ్చుఅ భత్తాణ ణేసు ణఅణాసారమ్॥

ఛా. తవ చింతన విముఖానాం
దృష్టి విషాణామివ దర్శనా న్మోచయన్।
అమృత ముఖానా మివమాం
అచ్యుత! భక్తానాం నయస్వ నయనా సారమ్॥

**అర్థం:** హే అచ్యుత!; దృష్టి విషాణాం, ఇవ= చూపులచేతనే విషాన్ని ఎక్కించే సర్పాల లాగా ఉన్నట్టి; తవ= నీ యొక్క; చింతన విముఖానాం= ధ్యానమందు పరాఙ్ముఖులైన వారి యొక్క; దర్శనాత్= దర్శనం నుంచి ; మోచయన్= వదిలింప జేస్తూ; అమృత ముఖానాం, ఇవ= అమృతం ముఖమందు కల వారివలె (స్థితానాం)

ఉన్నట్టి; భక్తానాం= భక్తుల యొక్క; నయన+ఆసారం= చూపుల వానను కలవానిగా; మాం= నన్ను; నయస్వ= అనుగ్రహింపుము.

**తా॥** ఓ అచ్యుతా! చూపులయందే విషం కలిగి నిన్ను ధ్యానించడానికే ఇష్టపడనట్టి నాస్తికులను దర్శించే స్థితినుంచి నివారింపజేయుము. ముఖమందు అమృతం కలిగియున్న నీ భక్తుల దృష్టివృష్టిని పొందేవానిగా నన్ను అనుగ్రహింపుము.

**వ్యాఖ్య:–** నాస్తికుల దృష్టిలో బడనీయక, భాగవతుల కటాక్ష పాత్రునిగా జేయవలెనని ప్రార్థన.

*దృష్టి విషాణా మివ తవ చింతన విముఖానాం దర్శనాత్ మోచయన్:–* సర్పాలలో కొన్ని నాలుకతో నాకి విషాన్ని ప్రసరింపజేస్తాయి. మరికొన్ని తమ చూపులతోనే విషాన్ని ఎక్కించి ప్రాణాన్ని అపహరిస్తాయి. అట్లే భగవద్ధ్యానం చేయని వ్యక్తులు తమ దృష్టిచేతనే ఇతరులకు విషాన్ని సంక్రమింపజేసే సర్పాలవంటి వారు అని భావం. దృష్టి దోషమిది (దృష్టావిషం యేషాంతే= దృష్టి విషాః; తేషాం. ఇది 'వ్యధికరణ బహువ్రీహి సమాస' పదం).

*"అసతాం దర్శనాత్ స్పర్శాత్ సంపర్కాచ్చ సహాసనాత్।*
*ధర్మాచారాః ప్రణశ్యంతి యథా సైకతమంభసా॥"*

దుర్జనుల దర్శనంవల్ల, స్పర్శవల్ల, వారితో కూడియుండడం వల్లనూ, నీటి పారుదలచేత ఇసుక దిన్నెలవలె ధర్మాచారాలన్నీ చెడిపోతాయి.

*"వరం హుత వహజ్వాలా పంజరాంతర్వ్యవస్థితిః।*
*నశౌరిచింతా విముఖ జనసంవాస వైశసమ్॥"*

భగవంతుణ్ని స్మరించడానికి విముఖులుగా నున్నవారితో కూడి సంచరించడం కంటే అగ్నిజ్వాల (అనే పంజరం)లో ఉండడం మేలు.

"పారుష్యమతివాదంచ పై శున్యం చైవ సర్వశః।
అసంబద్ధ ప్రలాపశ్చ వాఙ్మయ స్స్యా చ్చతుర్విధమ్॥"

పరుషం, కఠినంగా మాటలాడడం; పిడివాదం చేయడం, పిశితనంగా పలుకడం, సంబంధం లేని వాగడం అనేవి వాగ్దోషాలు నాలుగు విధాలు. ఇట్టి వాగ్దోషాలు కలవారితో కలిసి యుండకూడదు.

"శిశ్నోదరే యేభిరతాః సదైవ స్తేయానృతా వాక్పరుషాశ్చనిత్యం! వ్యపేత ధర్మా ఇతితాన్ విదిత్వా, దూరాత్ దేవాః సంపరివర్జయంతి॥"- సర్వదా శిశ్నో దరపరాయణులై చౌర్యం, అసత్య సంభాషణం, పరుష భాషణం చేయువారు ధర్మమార్గమందు నడువని వారనుకొని, దేవతలు వారిని విడనాడుతారు.

"పరాఙ్ముఖానాం గోవిందే, విషయాసక్త చేత సాం।
తేషాం తత్పరమం బ్రహ్మ దూరాత్ దూరత రేస్థితమ్॥"

గోవిందునికి అభిముఖులు కాకుండా, శబ్దాది విషయాలయందు ప్రవణులైనట్టి వారికి పరబ్రహ్మ చాలా దూరమే ఉంటాడు.

భగవద్ధ్యానం చేయని ఆగర్భ దుర్భగులు ఎవరినైతే చూస్తారో వారి మీద తమ చూపులతోనే తమ పాపాలను ఆపాదింపజేసి ఆత్మనాశనం చేయడానికి కారకులవుతారు. కాబట్టి, భక్తులు కానివారి దృష్టి తమ మీద ప్రసరించకుండ జేయుమని దేశికులు ప్రార్థించారు.

అమృతముఖానా మివ భక్తానాం నయనా సారం మాం నయస్వ:- ఓ అచ్యుతా! ఆశ్రితుణ్ణి వదలనివాడు భగవానుడని సంబోధించారు. ముఖమందు అమృతం కలవారు భగవద్భక్తులు.

"వ్యపగత ప్రాణాత్మ సంజీవినీ"- భాగవతోత్తముల దృష్టి ప్రాణం పోయిన వారిని జీవింపజేసే సంజీవనౌషధం వంటిది. 'ఆసారః' అంటే జడివాన. "ధారాసంపాత ఆసారః"- "స్యాదాసారః ప్రసరణమ్"- (అమరం). నన్ను

తాపత్రయ నిర్వాపకమైన, అమృత వర్షుకమైన మోక్షాన్ని కలిగించే పరమభాగవత కటాక్ష గోచరునిగా చేయవలెను (ద్వికర్మ కర్త రిప్రయోగమిది).

"తన్మయత్వేన గోవిందే యే నరాఃన్యస్త చేతసః।
విషయ త్యాగిన స్తేషాం విజ్ఞేయం చ తదంతికే॥"

సర్వదా భగవద్ధ్యానపరులై శబ్దాది విషయాలను పూర్తిగా విడిచియున్న పరమైకాంత భక్తులు భగవత్సాన్నిధ్యం కలవారు.

"సకృత్త్వ దాకార విలోకనాశయా
తృణీకృతా నుత్తమ భుక్తి ముక్తిభిః।
మహాత్మభిర్మా మవలోక్యతాం నయ
క్షణేఽపి తే యద్విరహోఽతి దుస్సహః॥"- (స్తో.ర. 56)

ఒక్కసారి నీ స్వరూపాన్ని చూడాలనే ఆశచేత ఉత్తమ భుక్తిని, ముక్తిని కూడా తృణప్రాయంగా భావించినవారు మహాత్ములు. అట్టి గొప్ప జ్ఞానవంతుల విరహం క్షణకాలం కూడా నీకు (భగవంతునికి) సహింపరానిదిగా ఉంటుంది కదా! అటువంటి పరమభాగవతులచేత నేను కటాక్షింపబడునట్లు కృపజేయుమని శ్రీ యామున మునులు- ఆళ్వందార్ స్తుతించారు.

జనన మరణ చక్ర భ్రమణమనే సంసారావర్త వేగాన్ని శమింపజేసే హరిదాస్య రసికుల శుభదృష్టి నా మీద ప్రసరించునట్లు కృపజేయుమని దేశికులు అచ్యుత భగవానుణ్ని సంప్రార్థించారు.

96. విసమిళిఅమహు ణిహేసుఅ
తిణపడిమేసు అ పడిగ్గహేసు పళుడి అమ్।
అమిఅణిహిమ్మి వ అచ్చు అ
ఠావేసు తుమమ్మి ణిమ్మమం మహ హి అఅమ్॥

ఛా. విషమిళిత మధునిభేషు చ
తృణ ప్రతిమేషుచ ప్రతిగ్రహేషు ప్రలుఠితమ్।
అమృత నిధా వివాచ్యుత!
స్థాపయ త్వయి నిర్మమం మమ హృదయమ్॥

**అర్థం:** హే అచ్యుత! విషమిళిత మధు నిభేషు= విషం కలిసిన తేనెతో సమానమైనట్టి; చ= మరియు; తృణప్రతిమేషు, చ= గరుకతో సమానమైనట్టియు; ప్రతిగ్రహేషు= దాన స్వీకారాలయందు; ప్రలుఠితం= పరిభ్రమించిన; మమ= నా యొక్క; హృదయం= హృదయాన్ని; అమృత నిధౌ, ఇవ= అమృత నిధివలె నున్న; త్వయి= నీ యందు; నిర్మమం= మమతాహంకారాలు లేనిదానిగా; స్థాపయ= స్థాపించుము.

**తా॥** ఓ అచ్యుతా! విషంతో కలిసియున్న తేనెవంటిదియు, గడ్డిపోచలాగా గౌరవింపబడనట్టిదియు నైన దానాలను స్వీకరించడమందు సంభ్రమించినట్టిది నా మనస్సు. అమృత నిధివలె భోగ్యంగా ఉండే నీ యందు అట్టి నా మనస్సును, అహంకార మమకారాలు లేనిదిగా, స్థిరంగా సుప్రతిష్ఠింప జేయుము.

**వ్యాఖ్య:–** మోక్ష ప్రతిబంధక వస్తువులయందు అనాసక్తినీ, నిరతిశయానంద రూపమైన భగవత్స్వరూప విషయమందు భోగ్యతా బుద్ధినీ భగవానుడు ప్రసాదింప వలెనని సుశ్లోకితం.

*విషమిళిత మధు నిభేషుచ:–* లోకంలో ప్రతివ్యక్తి యొక్క మనస్సు గృహ, ఆరామ, క్షేత్రాదులయందు చాలా ఆసక్తి కలదై, 'ఇది నాది, నేను శ్రమచేత సంపాదించాను' అనే మమతను, అహంకారాన్ని కలిగియుంటుంది. తాను మాత్రమే అనుభవించడానికి అధికారమున్నదనే అపేక్షతో విషయాసక్తితో అనుభవిస్తుంటాడు. అహంభావంతో సంపత్తును అనుభవించడమనేది విషం కలిసిన తేనెను పానం చేయడం వంటిదే. అనుభవిస్తున్నప్పుడు మధురంగా ఉన్ననూ, తర్వాత శరీరాన్ని

నాశనం చేస్తుంది కదా! విషయ భోగ్యతాబుద్ధి దుఃఖాంతంగా పరిణమిస్తుంధని భావం.

*తృణ ప్రతిమేషుచ ప్రతిగ్రహేషు ప్రలుఠితం:*- కూలిచేసియో, క్షుద్రుల నాశ్రయించి, వారికి లేని గుణాలను ఆరోపిస్తూ కీర్తించియో, సమ్మానాలను పొందియో, దానమిచ్చిన సువర్ణ ధనధాన్యాదులను స్వీకరించియో సంపన్నుడు కావచ్చు. కాని, ఆ సంపద్భోగం గరుకపరకవలె సారంలేనిదే. అల్పమైనది, నశ్వరమైనది, అనాదరణీయమైనది. అయినా, దాన ద్రవ్యాదులను స్వీకరించే విషయంలో మనస్సు తహతహ పడుతుంది, ఆశపడుతుంది. అల్పమైన సంపద గొప్పదని భావిస్తుంది మనస్సు.

"ఎన్నావదెత్తనైనాళైక్కుంపోదుమ్"- (తి.వా.మొ. 3-9-4). ఆ ధనం వల్ల ప్రయోజనమేమి? అది ఎంత కాలముంటుంది? అని నమ్మాళ్వార్లు ఉపదేశించారు. స్వరూపానికి హానికల్గనీయ రాదన్నారు. కోరికలను నెరవేర్చుకొని అనుభవించాలనే ఆశతో అధర్మం చేసియైనా సంపదలను, అధికారాలను పొందాలనుకొంటారు.

*"వర్ధత్య ధర్మేణ నరః తతోభద్రాణి పశ్యతి।*
*తతః సపత్నాన్ జయతి, సమూలస్తు వినశ్యతి॥"*

అధర్మాన్ని ఆచరించడం వల్ల వృద్ధి కల్గుతుంది. సంపదలూ కల్గుతాయి. శత్రువులనూ జయిస్తాడు. చివరకు సమూలంగా నశిస్తాడు కదా!

*అమృత నిధా వివ (స్థితే)త్వయి నిర్మమం మమ హృదయం స్థాపయ:*- నాది, నేను అనే భావన మమకారాన్ని అహంకారాన్ని తెల్పుతుంది. మమతాహంకారాలు లోకనింద్యమైనవి. ఆ భావన మనస్సు నుంచి తొలగిపోవాలి.

*"నీర్ నుమదెన్నివై వేర్ ముదల్ మాయ్త్తు, ఇఱై శేర్మిన్ ఉయిర్క్కు అదనేర్ నిఱై యిల్లే"*- (తి.వా.మొ. 1-2-3). ('నేను, నాది' అన్నంతలోనే ఆ దోషం తమకు కలుగుతుందని, అలాగా పల్క కుండా) మీరు, మీది అనే ఈ అహంకార

మమకారాలను మనస్సులోనుంచి సమూలంగా పెరికివేసి శ్రియఃపతిని ఆశ్రయించండి. జీవాత్మకు పరమాత్మను ఆశ్రయించడం కంటే అధిక భోగభాగ్యం లేనే లేదని నమ్మాళ్వార్లు పరోపదేశం చేశారు.

సర్వేశ్వరుడు అమృతనిధి. అపగత ప్రాణాన్ని సంజీవింపజేసేది అమృతం. అమృతాన్ని కొద్దిగా త్రాగినా, బతికిస్తుంది కదా! ఎందఱికి పంచిననూ తరుగని అమృతనిధి శ్రియఃపతి. మమతాహంకృతులతో స్వరూప హానిని కలిగించే తమ హృదయం నుంచి వాటిని పూర్తిగా నిర్మూలించి, పరిశుద్ధంగా జేసి, అమృత నిధియైన భగవానుని యందే తమ హృదయాన్ని స్థిరంగా ఉండునట్లు అనుగ్రహించ వలసినదని, ఆశ్రయించిన వారిని వదలివేసే సామర్థ్యం లేనట్టి అచ్యుత నామాంచితుడైన భగవానుణ్ని దేశికులు సంప్రార్థించారు.

97. ణిచ్చం ఇమమ్మి కివణే
ణిక్ఖవసు ణమంత సచ్చణిహి సారిచ్ఛే।
పవహంత ణహ పహోఝర
పసమిఅ పణమంత సంజరే తుహచలణే॥

ఛా. నిత్యమస్మిన్ కృపణే
నిక్షిప నమత్సత్య! నిధి సదృక్షౌ,
ప్రవహన్నఖ ప్రభాఝర
ప్రశమిత ప్రణమత్సంజ్వరౌ తవ చరణౌ॥

**అర్థం:** హే నమత్ సత్య!= నమస్కరించే జనులకు సత్యమైనవాడా!; నిత్యం= ఎల్లప్పుడు; కృపణే= అకించనుడైన; అస్మిన్= ఈ దాసునియందు; నిధి సదృక్షౌ= నిధితో సమానమైన; ప్రవహన్నఖ–సంజ్వరౌ/ ప్రవహత్= ప్రవహిస్తున్న; నఖప్రభా= గోళ్ళకాంతుల యొక్క; ఝర= ప్రవాహంచేత; ప్రశమిత= పోగొట్టబడిన; ప్రణమత్=

ప్రపన్నులయొక్క; సంజ్వరౌ= అధిక జ్వరాన్ని కలిగియున్న; తవ= నీ యొక్క; చరణౌ= పాదాలను (రెండింటిని); నిక్షిప= నిక్షేపించుము.

**తా॥** ఆశ్రితులకు సత్యమైన దేవనాథా! నిధితో సమానంగా ఉన్నట్టి; కాలిగోళ్ళ కాంతుల ప్రవాహంచేత ఆశ్రితుల తాపజ్వరాన్ని పోగొట్టే నీ రెండు పాదాలను అకించనుడనైన నా (తల) యందు నిక్షేపించుము.

**వ్యాఖ్య:-** భగవత్పాదాలు ఆశ్రితుల తలమీద నిక్షేపించిన వెంటనే వారి పాపతాపాలను తొలగిస్తాయని సుశ్లోకితం.

ఎప్పుడో ఎవడు ఏమైనా ఇవ్వగలడని ఎదిరిచూస్తూ మమతా బుద్ధిగల హృదయం భగవదనుభవానికి ప్రతిబంధకం. కాబట్టి ఆ హృదయాన్ని కళంక రహితంగా సంస్కరించి, భగవానుడు తన వద్దనే స్థిరంగా ఉంచుకోవాలని గత శ్లోకమందు ప్రార్థింపబడింది. ఈ శ్లోకమందు హిరణ్యనిధిగా ఉన్న భగవత్పాద పద్మాలను దాసజన శిరస్సునందు ఉంచునట్లు కృపజేయవలసిందని విన్నపింప బడింది. పేదవానికి పెన్నిధివంటివి శ్రియఃపతి చరణారవిందాలు.

*నిధి సదృక్షౌ:* – మోక్షద్వారమైన భగవచ్చరణ నళిన యుగళం ముముక్షువు లకు నిరతిశయానందాన్ని కలిగించే బంగారు నిధి వంటిది.

*ప్రవహన్నఖ ప్రభాఝర ప్రశమిత ప్రణమత్ సంజ్వరౌ:* – జ్వర పీడితుని తలమీద సెలయేటి నీరు పడగానే జ్వరం తగ్గిపోతుంది. అట్లే భగవానుని కాళ్ళ గోర్ల కాంతుల ప్రవాహం ఆశ్రితుల తలమీద పడిన క్షణంలోనే వారి సంసార తాపత్రయం నశిస్తుంది.

*నతసత్య! తవ చరణౌ కృపణేఽస్మిన్ నిక్షిప:* – ఆశ్రితుల ప్రార్థనను సత్యం చేయగల దీక్షాదక్షుడవైన దేవనాతా! జ్ఞానానుష్ఠానాది సంపద లేని దరిద్రుడనై, నిన్ను ఆశ్రయించిన ఈ దాసుని తలమీద నీ చరణ రాజీవాలను నిక్షేపించవయ్యా! పాపతాప శాపాలు నశించి, ఆనంద సాగరాంతర్నిమగ్నుడనవుతాను- అని దేశికులు ప్రార్థించారు.

"నిన్ శెమ్మాపాద పఙ్ఙు తలై శేర్త్తు"- (తి.వా.మొ. 2-9-1) అని నమ్మాళ్వార్లు ప్రార్థించిన విధం అనుసంధేయం (ఈ సందర్భాన ఇందున్న 43వ శ్లోకాన్ని చూడవలెను).

98. సరణాగ ఓత్తి జణిఏ
జణవాఏ వి జ ఇ అచ్చుఅ ణ రక్ఖసి మమ్।
హోజ్జఖు సా అర ఘోషో
సా అర పుళిణమ్మి తారిసం తుహ వ అణమ్॥

ఛా. శరణాగత ఇతి జనితే
జనవాదేఽపి యద్యచ్యుత! నరక్షసి మామ్।
భవేత్ ఖలు సాగర ఘోషః
సాగర పులినే తాదృశం తవ వచనమ్॥

**అర్థం:** హే అచ్యుత! = ఆశ్రితులను రక్షించక, చేతులారా విడిచేవాడవు కానట్టి ఓ ఆదిదేవా!; శరణాగతః, ఇవ= రక్షణకోరి వచ్చినవాడు అని; జనవాదే= లోకులమాట, (పుకారు); జనితే, అపి= కలిగియున్నప్పుడు కూడా, (త్వం= నీవు); మాం= నన్ను; యది నరక్షసి= రక్షించకపోతే; సాగర పులినే= సముద్రం యొక్క ఇసుక తిన్నెయందు (తీరమందు); తాదృశం= ఆ విధంగా చెప్పినట్టి; తవ= నీ యొక్క; వచనం= మాట; సాగరఘోషః= సముద్ర ధ్వనిగా; భవేత్, ఖలు= అయ్యి తీరుతుంది కదా! వ్యర్థమవుతుంది కదా!

**తా॥** ఓ అచ్యుతా! శరణాగతుడు అని లోకులు వాడుకునే మాట ఉన్నప్పుడు కూడా నీవు నన్ను రక్షించకుంటే, సాగరతీరమందు విభీషణుడు శరణార్థియై వచ్చినప్పుడు ప్రకటించిన నీ ప్రతిజ్ఞావచనం సముద్రఘోషవలె నిరర్థకమవుతుంది కదా!

**వ్యాఖ్య:**– శరణాగతునికి అభయమిచ్చిన భగవానుని ప్రతిజ్ఞ నిరంతరం సత్యమై యుండవలెనని సుశ్లోకితం.

ఆచార్యా! నీవు పురుషార్థ ఫలం కోసం చాలా ప్రార్థించావు. కాని ప్రపత్తికి అనుగుణమైన సాధనాన్ని సంపూర్ణంగా నీవు అనుష్ఠించలేదు. లోకంలో నీ యాడంబరాన్ని బట్టి శరణాగతుడవనే కింవదంతి ప్రబలంగా నున్నది. అంత మాత్రంచేత నీవు కోరిన ఫలమొసగడం నాకెట్లు శక్యమగును? అని భగవానుడు ప్రశ్నించాడు.

ఈ విషమ ప్రసంగానికి స్పందించిన దేశికులు తమ ఆశయాన్ని సాహసంతో ప్రకటించిన వాగ్రూప వైభవం ఇట్లున్నది. దేవనాథా! దాసుడు ప్రపత్తిని సాంగంగా అనుష్ఠించాడు. న్యస్త భరుడూ అయ్యాడు. ఆ విషయం మీకూ తెలుసు. యథార్థంగా, వేంకటనాథ దేశికులు ప్రపన్నుడు, మరియు 'శరణాగతుడు' అని లోకులు కీర్తిస్తున్నారు. లోకుల ప్రశంసను అనుసరించి దేవరవారు దాసుణ్ణి రక్షించడం మర్యాదగా ఉంటుంది.

*శరణాగత ఇతి జనితే జనవాదేఽపి యది నరక్షసి మామ్:* – శరణాగతుడనే లోకులు వాడుకొనే మాటను 'లోకులు పలు కాకులు' అని నిరాకరించరాదు స్వామీ! కాకి తనకు లభించిన ఆహారాన్ని చూచిన వెంటనే "ఏ కాకీ నరమేత"– "ఒంటరిగా తిని సుఖించరాదు" అనే ఉపనిషద్వాక్యాన్ని సార్థకం చేయడానికి 'సహపంక్తి భోజనాన్ని' అపేక్షించి తన తోడివారిని ఆహ్వానించడం సత్యం కాదా? పచ్చి అపరాధియైన కాకాసురుని ప్రాణాన్ని ఏదో విధంగా కాపాడిన దేవరవారి కారుణ్యాన్ని కాకులుగానీ, లోకులుగానీ ఏనాడూ మరచిపోజాలరు కదా! కృష్ణావతారంలో గోపాలురతో కూడి మీరు విందు భోజనం చేయగా, ఉచ్ఛిష్టమైన (ఎంగిలి) మెతుకులను బ్రహ్మేంద్రాది దేవతలు కాకుల రూపంలో వచ్చి 'శరణోపాయమిదే' అని మెసగి తృప్తి జెందినారు కదా! కాకుల అరుపుల వంటివి లోకుల మాటలు అని నిరాదరించరాదు.

కర్ణాకర్ణికగా విని పలికిన లోకుల మాటలలోనూ సత్యగంధం కొద్దిగనో, గొప్పగనో వ్యాపించి యుంటుంది. లోకారాధన తత్పరులైన దేవరవారికి ఎందఱెన్ని విధాలుగా భావించినా- తెల్యని విషయం కాదు కదా!

మనః పూర్వో వాగుత్తరా- మనశ్చక్రంలో తిరిగి తిరిగి రాటుతేలిన భావమే వాక్కు ద్వారా ప్రకటింపబడుతుంది. కాబట్టి జనవాదం 'శరణాగతుడు మా స్వామి' యని చాటుతున్నది. ఈ లోకుల మాటను పాటించియైనా దాసుని రక్షించడంలో- సంసార బంధంనుంచి విడిపించి దేవరవారి కైంకర్య పరునిగా స్వీకరించడంలో- మీకే కొరతయు ఉండబోదు. శరణాగతుడనైన దాసుణ్ణి రక్షించకపోతే 'అచ్యుత' నామం సార్థకమో, నిరర్థకమో, లోకమే నిర్ణయిస్తుంది.

"తేశ మరియ వుమక్కే యాళాయ్త్తిరిగి న్డోమ్"-(పె.తి.మొ. 4-9-4). దేశమంతా మీకు దాసులమని తెలుసుకొనే రీతిగా సంచరిస్తున్నాం. మా కైంకర్యాన్ని స్వీకరించడానికి నిరాకరించరాదనీ, తిరుమంగై యాళ్వార్లు, భగవత్సేవను ఆశించే ప్రపన్నులనడం లోక ప్రసిద్ధమని ప్రార్థనలో వెల్లడించారు.

*సాగరపులి నే తాదృశం తవ వచనం సాగరఘోషః భవేత్ ఖలు:* - పూర్వం విభీషణుడు శరణార్థియై వచ్చినప్పుడు కడలిగట్టున సుగ్రీవుడు, హనుమంతుడు మొదలైన మహాజనుల ఎదుట దేవరవారు పలికిన మాట "నీవు చెప్పిన విద్యయే నీరజాక్ష!" అని దాసుని స్మృతి పథంలో మెదులుతున్నది.

*"ఆర్తోవా యది వాదృప్తః పరేషాం శరణాగతః।*
*అరిః ప్రాణాన్ పరిత్యజ్య రక్షితవ్యః కృతాత్మనా॥"*

ఆర్త ప్రపన్నుడుగానీ, దృప్తప్రపన్నుడు గానీ, శరణాగతుడు శత్రువైననూ నిశ్చిత బుద్ధిత ప్రాణాలను తెగించియైనా అతడు రక్షింపదగినవాడు అనీ.

*"మిత్రభావేన సంప్రాప్తం నత్యజేయం కథంచన"*- స్నేహధర్మంతో చేరిన వ్యక్తిని ఎట్లైనా విడువను- అనీ.

"అన్నృతం నోక్త పూర్వం మే న చ వక్ష్యే కదాచన"- ఇంతకు ముందు అబద్ధమాడలేదు, ఇక ముందెప్పుడు అసత్యం పల్కలేను, అని లోకాన్ని దృఢంగా విశ్వసింపజేశారు కదా! అంతేకాదు కృష్ణావతారంలోనూ మీరు ప్రతిజ్ఞ చేశారు.

"ద్యౌః పతేత్ పృథివీ శీర్యేత్ హిమవాన్ శకలీ భవేత్।
శుష్యేత్ తోయనిధిః కృష్ణే! నమే మోఘం వచోభవేత్॥"

(దేవకీ వసుదేవుల పుత్రునికీ, ద్రుపదుని పుత్రికకూ, పరాశరమహర్షి యొక్క సుతుడైన కృష్ణద్వైపాయనునికీ 'కృష్ణ' నామం వ్యవహృతం). ఓ ద్రౌపదీ! మిన్ను విరిగిపడనీ, భూమి క్రుంగిపోనీ, హిమవత్పర్వతం బ్రద్దలు, ముక్కలుగానీ, సముద్రం శుష్కించనీ, ఇంకిపోనిమ్ము, నా మాట మాత్రం వ్యర్థం కానేరదు. దేవరవారి సత్య ప్రతిజ్ఞ ఇటువంటిది కదా!

"సంజ్ఞాం ప్రపన్న ఇతి సాహసికోఽబిభర్మి"- ఇప్పుడు ప్రపన్నుడనే పేరును వహించి సాహసికుడనైన దాసుణ్ని రక్షించకపోతే మీ సత్యప్రతిజ్ఞకు భంగం వాటిల్లుతుంది. అసత్యమవుతుంది. అచ్యుతుడు శరణాగత రక్షకుడు కాడని లోకులు మిమ్ములను ఆశ్రయించలేరు. సర్వలోక శరణ్యత్వం, పరమకారుణికత్వం అనే గుణాలకు తావే ఉండదు. తత్ఫలితంగా దేవరవారి సత్య ప్రతిజ్ఞ సాగరఘోషగా మిగులకమానదు.

ఊట నీరు, ఏటినీరు, వాననీరు- ఈ మూడు రకాల నీటితో ఎప్పుడూ నిండుగా ఉంటుంది. కాబట్టి సముద్రానికి మున్నీరని పేరు. విశాలమైన, అగాధమైన సముద్ర జలం అపారమైనది. గాలి తాకిడికి, ఒత్తిడికి గురియైన సముద్ర జలం గుట్టలవంటి భయంకరమైన కెరటాలతో ఉవ్వెత్తుగా లేచి, వీచి, చెలియలి కట్టను దాటలేక, ఎగసి ఎగసి ఒండొంటితో ఒరసుకొని పడిపోతుంటే కలిగే ఘోష నైరంతర్యం. అల్లకల్లోలంగా ఉండే ఘోష, శబ్దమే అయిననూ వాగ్రూప శబ్దానికి అర్థమున్నట్లు, అర్థం కలదికాదు. నిరర్థకమైన సాగరఘోష దానికదియే సాటి. 'సాగరఘోష' అనే నానుడి నిరర్థకత్వానికి ఒరవడి.

దక్షుడైనవాడు శరణాగతుని రక్షించక పరిత్యజిస్తే దోషం తగులుతుంది. దృష్టాదృష్ట ప్రత్యవాయం కల్గుతుందని దేవరవారే నుడివినారు కదా!

"సచేద్భ యాద్వా మోహాద్వా కామాద్వాపి న రక్షితః।
స్వయా శక్త్యా యథా సత్యం తత్పాపం లోక గర్హితమ్॥"

"వినష్టః పశ్యతస్తస్యా రక్షిణః శరణాగతః।
ఆదాయ సుకృతం తస్య సర్వంగచ్ఛేద రక్షితః॥
ఏవం దోషో మహాన్ తత్ర ప్రపన్నానా మరక్షణే।
అస్వర్గ్యంచా యశస్యంచ బలవీర్య వినాశనమ్॥"

భయం, మోహం, కామం– అనే వీటివల్ల శరణాగతుణ్ని శక్తికలిగి యున్న వ్యక్తి కాపాడకుంటే లోకం నిందించునంత పాపం కలుగుతుంది. శరణాగతుడు, రక్షింపబడక నష్టపడుతుంటే చూస్తున్న శక్తిమంతుని పుణ్యమంతటినీ తీసుకొని పోతాడు. ప్రపన్నులను రక్షించకపోతే గొప్ప దోషం కలుగడమే కాదు. బలం, వీర్యం నశిస్తుంది. అపకీర్తి వస్తుంది. దుర్గతి పడుతుంది. లోకరక్షణార్థం దశదిశల రథాన్ని నడిపిన దశరథుని పుత్రుడవై, వసిష్ఠ విశ్వామిత్రులకు శిష్యుడవై, వేద ప్రతిపాద్యుడవై, మహాజ్ఞానియైన జనక మహారాజుతో సంబంధం కలిగినవాడవై, మూర్తీభవించిన ధర్మమే రాముడు. "రామోవిగ్రహవాన్ ధర్మః": – అని ప్రఖ్యాతిని పొందిన దేవరవారికి శరణాగత రక్షణ రూపమైన ధర్మాన్ని పరిత్యజించిన వాడనే అపకీర్తి అవశ్యంగా కలుగుతుంది కదా! అయ్యో! ఎంత కష్టమిది!

"త్వదగ్రే శరణాగతానాం పరాభవోనాథ! నతేఽను రూపః"– (స్తో.ర. 25)

స్వామీ! నీ ఎదుట శరణాగతులైనవారిని రక్షించక వదలడమనే అప్రతిష్ఠ, అవమానం నీకు తగదు. "తస్యనామ మహద్యశః" అని పల్కిన శ్రుతికి విరుద్ధ మవుతుంది, అని ఆళ్వందార్ స్తుతించారు.

శరణాగతుడనైన దాసుణ్ణి రక్షించవయ్యా ప్రభూ! దాసుణ్ణి దేవరవారి కింకరునిగా స్వీకరిస్తే జగజ్జననియైన లక్ష్మీదేవి యొక్క కటాక్షాభివృద్ధి మీకు

కలుగ గలదు. ఈ అవద్య ప్రసంగం 'అచ్యుతుడు తన వస్తువును రక్షిస్తాడు' అనే విశ్వాసదార్ఢ్యాన్ని సూచిస్తుంది.

*99. ణిక్ఖిత్తోమ్హి అ అగఈ*
*ణివుణేహి తుమమ్మి ణాహ కారుణిఏహిమ్।*
*తే తు హ దట్ఠూణ పిఏ*
*ణిహుఅంణఅ సచ్చ భరసు అప్పాణ భరమ్॥*

ఛా. *నిక్షిప్తోఽస్మి చాగతిః*
*నిపుణైస్త్వయి నాథ! కారుణికైః।*
*తాం స్తవదృష్ట్వా ప్రియాన్*
*నిభృతం నతసత్య! భరస్వాత్మ నో భరమ్॥*

**అర్థం:** హే నాథ!= ఓ స్వామీ!; అగతిః= వేరే దిక్కులేనట్టి (అహం= నేను); కారుణికైః= భూత దయగలవారైనట్టి; నిపుణైః= సామర్థ్యంగల ఆచార్యులచేత; త్వయి= నీ యందు; నిక్షిప్తః= సమర్పింపబడినవాడనై; అస్మి= ఉన్నాను; తవ= నీకు; ప్రియాన్= ప్రియులైన; తాన్= వారిని; దృష్ట్వా= చూచి; నిభృతం= నిశ్చలంగా నుండునట్లు; ఆత్మనః= పరమాత్మవైన నీకే; భరం= భారంగా; భరస్వ= భరింపుము.

**తా॥** హేనాథ!, నతసత్య! ఆచార్యులు తప్ప వేరే రక్షకులు లేరని భావించే నేను సర్వభూత దయాపరులైన, జ్ఞానశక్తి నైపుణ్యంగల ఆచార్యులచేత మీ సన్నిధిలో నా భారం సమర్పింపజేయబడిన వాడను. దేవా! నీ ప్రీతిపాత్రులైన ఆచార్యులను చూచి, స్థిర చిత్తంతో ఆత్మ రక్షాభారాన్ని అంగీకరింపుము.

**వ్యాఖ్య:-** భగవత్ప్రీతి పాత్రులైన ఆచార్యులను చూచి వారి ఆశ్రితులను, రక్షణభారాన్ని స్వీకరింపవలెనని ప్రార్థితం.

ఆచార్యా! నీవెట్లు శరణాగతుడవు? జనవాదం అని జనవాదాన్ని సమర్థించడం వల్ల దీనికి దానికి ఏ సంబంధమూ లేదు. కాబట్టి, నిన్ను రక్షించకుంటే నాకు వ్రతభంగమనే కళంకమే మాత్రం కలుగదని భగవానుడు పలుకగా స్పందించిన దేశికులు స్వామీ! రక్షించే అధికారం మిమ్మెప్పుడూ విడిచియుండదు. నా దోషాలను చూడడం మానుకొని, మీ ప్రియులైన మా ఆచార్యులను జూచి నన్ను స్వీకరింపుము అంటూ, ఆచార్య రూపమైన చరమపర్వ నిష్ఠను ప్రకాశింప జేశారు.

*నిక్షిప్తోఽస్మి చాగతిః*:– నేను అకించనుడను. ఆచార్యులు తప్ప వేరే రక్షకులు లేరనే దృఢాధ్యవసాయం కలవాడను. మా ఆచార్యులైన అప్పుళ్ళార్ మీ సన్నిధిలో న్యస్తభరునిగా నన్ను సమర్పింపజేవారు. స్వయంగా అనుష్ఠించే శక్తిలేనందువల్ల నేను ఆచార్యాధీనుడను.

*నిపుణైః కారుణికైః నిక్షిప్తోఽస్మి*:– ఉపాయానుష్ఠానానికి ఉపయుక్తమైన జ్ఞానశక్త్యాది నైపుణ్యం కలవారు ఆచార్యులు. సత్సంప్రదాయమందు స్థిరమైన ధిషణగలవారు. డంభాసూయాదులు లేనివారు. సర్వభూతదయాపరులు. దీర్ఘబంధువులు, స్వపర హితపరులు. కాబట్టి నన్ను వారు పరిగ్రహించడానికి నా యందు దానికి తగిన గుణమొక్కటి కూడా లేదు. కేవలం నన్ను చేతబట్టి సంస్కరించడానికి వారి కృపయే కారణం. మా ఆచార్యులే నా భారాన్ని సర్వశేషివైన మీ పాదారవిందాల యందు సమర్పింపజేశారు. సాంగోపాంగంగా ఆత్మాత్మీయ భరన్యాసం చేయించిన బ్రహ్మనిష్ఠులు.

*తవ ప్రియాన్ తాన్ దృష్ట్వా నిభృతమాత్మనో భరం భరస్వ*:– వేరే విధంగా చేతనులు సంసారం నుంచి తరించలేరని పరమ కారుణికులైన ఆచార్యులు ప్రపత్తికి అధికారులుగా జేసి, అనన్యోపమేయాలైన భగవత్పాద కమలాల యందు న్యస్తభరులనుగా చేయడమే సుకరమని తెలిసిన మహాజ్ఞానంతులు ఆచార్యులు. "*క్షణేఽపితే యద్విరహోఽతి దుస్సహః*"– త్రుటికాలమైనా మీ యెడబాటును

సహించలేనివారు "జ్ఞానీత్వాత్మైవ మే మతమ్"- మహాజ్ఞానియే మీకు ఆత్మయని మీరు భావిస్తుంటారు కదా!

"ప్రియోஉహి జ్ఞానినోஉత్యర్థమ్"- జ్ఞానం కలవారవడంవల్ల చాలా మీకు ప్రియులున్నారు కదా! కాబట్టి "పితామహం నాథమునిం విలోక్య, ప్రసీదమద్వృత్తమ చింత యిత్వా"- (స్తో.ర.) నా ప్రవర్తన చూడక, తలచక, కేవలం నా తాతగారైన శ్రీమన్నాథమునులను దృష్టిలో నుంచుకొని నన్ను అనుగ్రహించుము' అని యాళ్వందార్ ప్రార్థించారు కదా! అట్లే మీకు అత్యంత ప్రియులైన ఆచార్యులను చూచి, నా దోషాలను అనుశీలించడం మానుకొని, నా భారాన్ని మీరే భరించి ఆలస్యం చేయక, నన్ను కాపాడవలెను- అని చరమోపాయ నిష్ఠాగరిష్ఠులైన దేశికులు ఆశ్రితులపట్ల సత్యసంధుడైన అచ్యుత భగవానుణ్ణి ప్రార్థించారు.

ఈ శ్లోక చతుర్థ (4) పాదమందు "భృతం నతసత్య భరస్వాత్మనో భరమ్"- "నిభృతం నతసత్య భరస్వాత్మ భరమ్"- అనే పాఠభేదమున్నది.

*100.* *ణఅసచ్చ పక్కణాణిఅ*
*గళిఅ చిలాఅ భమ ణిఅ కుమారం వణివో।*
*హోజ్జంత జోవ్వణ వహుం*
*వరోవ్వమం లహసు మంతి అణ విణ్ణవి అమ్॥*

ఛా. *నతసత్య! పక్కణానీత*
*గళిత కిరాత భ్రమ నిజకుమార మివ నృపః।*
*భవిష్యద్యౌవన వధూం*
*వర ఇవ మాం లభస్వ మంత్రిజన విజ్ఞాపితమ్॥*

**అర్థం:** హే నతసత్య!; పక్కణ-కుమారం/ పక్కణ= బోయపల్లె నుంచి; ఆనీత= తీసుకొని రాబడిన; గళిత= పోయినట్టి; కిరాతభ్రమ= బోయవాడను అనే భ్రమను

కలిగియున్నట్టి; నిజ= తనయొక్క; కుమారం= తనయుణ్ణి; నృపః, ఇవ= రాజువలెను; భవిష్యత్ యౌవన వధూం= ఉండబోయే పడుచుతనం కలిగిన కన్యను; వరః, ఇవ= వరుడు వలెను; మంత్రిజన విజ్ఞాపితం= మంత్రి జనులచేత విజ్ఞాపన చేయబడినట్టి/ తిరుమంత్రార్థం తెలిసిన ఆచార్యులచేత ఉపదేశింపబడినట్టి; మాం= నన్ను; లభస్వ= పొందుము.

**తా॥** ఓ నతసత్యా! తప్పిపోయిన రాకుమారుణ్ణి మంత్రి జనులు యథార్థాన్ని బోధించి బోయపల్లెనుంచి తీసుకొని వచ్చారు. కిరాతుణ్ణి అనే భ్రమ తొలగిపోయిన తన తనయుణ్ణి మహారాజు స్వీకరించినట్లును, పసిమి మిసిమిగల మంచి పడుచు కాబోతున్న కన్యను వరుడు పాణిగ్రహణంతో పొందినట్లును; తిరుమంత్రార్థ తత్వాన్ని బాగా తెలిసిన ఆచార్య పురుషులచేత బోధింపబడిన దాసుణ్ణి మీరు స్వీకరించి లాభం పొందవలెను అని దేశికులు చివరి ప్రార్థన జేశారు.

**వ్యాఖ్య:**- భగవానుడు తమను స్వీకరించవలెనని దృష్టాంతాన్ని వివరించి స్తోత్రాన్ని ముగిస్తున్నారు దేశికులు.

ఆచార్యా! నీ అభీప్సితాన్ని శరణాగత రక్షణ దీక్షితుడనైన నేను అవశ్యంగా నెరవేర్చవలసిందే అయినా, అనాది కాలం నుంచి హేయతమమైన ప్రకృతి యనే కర్దమాంధ కూపమందు పరిభ్రమించడం చేత- బురద చేత కళంకితమైన దేహం గల నీతో సమాగమం, అప్రాకృతమై భోగ్యతమమైన వస్తువును అనుభవించే ఆసక్తిగల నాకు ఎట్లు రుచిస్తుంది? అనే భగవానుని శంకను దేశికులు దృష్టాంతంగా సమాధానమిస్తున్నారు. మొదటి శ్లోకం నుంచి అనేక రీతుల స్తుతించిన దేశికులు గత శ్లోకమందు ఆచార్యులచేత తమను భగవంతునికి సమర్పించబడినందువల్ల పరిగ్రహించవలెను- అనే అర్థానికి దృష్టాంతం చెబుతున్నారు.

పక్కణానీత-కుమార మివనృపః:- ఒక రాజు సపరివారంగా వేటాడ బోయినాడు. వేటలోనేమగ్నులైన వారినుంచి అడవిలో తప్పిపోయిన బాలుడైన రాకుమారుణ్ణి ఒక కిరాతుడు చూచి, తన కుమారునివలె పెంచి పోషించాడు.

రాజు, సేవకులు ఎంత వెదికినా రాకుమారుని పొడ, జాడ తెల్యనందువల్ల నిరాశులై రాజధానికి చేరుకొన్నారు. కొంతకాలం తర్వాత ఆ కిరాత బాలుడు యువకుడై శబరాలయ ప్రాంతమందు సంచరిస్తుండగా, రాజు యొక్క మంత్రులు చూశారు. అమాత్యులు ఆ యువకుని స్వభావాన్ని, శారీరక లక్షణాలను గమనించి అతని వద్దకు పోయి యథార్థాన్ని తెల్పినారు.

ఓ యువకుడా! నీవు కిరాతజాతికి చెందినవాడవు కావు. నీవు బాల్యదశలో మా నుంచి విడిపోయి కిరాతుని కంటబడి, అతని ఇంటిలో పెరిగి, పెద్దవాడ వయ్యావు. మేము నీ చిన్నతనంలో చూచిన సాముద్రిక లక్షణాలనుబట్టి, నీవు రాకుమారుడవే కాని కిరాతుడవు కావు అనే సత్యాన్ని చెబుతున్నాం. మా వెంట రావయ్యా! రాజనగరుకు పోదామని బోధించారు.

అమాత్యులమాటలను విన్న యువకునికి తాను కిరాతుడనే భ్రమ మనస్సులో నుంచి దిగజారిపోయింది. నేను క్షత్రియుడననే నమ్మకం నెమ్మదిగా కుదుర్కొన్నది. ఆ రాకుమారుడు రాజుగారి దగ్గరికి శబర నివాసం నుంచి తీసుకొని రాబడినాడు. అమాత్యుల విజ్ఞాపనవల్ల మహారాజు సంతుష్టాంతరంగుడై తన కుమారుణ్ణి స్వీకరించాడు. రాజమకుటాన్ని ధరించే నిజమైన వారసుడయ్యాడు. అతడే యువరాజు.

"పక్కణః శబరాలయః"– (అమరం)

*గళితః కిరాత భ్రమః యస్యసః– గళిత కిరాతభ్రమశ్చ* అసౌనిజ కుమారశ్చ, ఇతి– *పక్కణా నీ తశ్చ అసౌ గళిత కిరాత నిజకుమారః; తం.* ఇది కర్మధారయ సమాస పదం. మనమందరం తప్పి విడిపోయిన రాకుమారులమే. మోక్ష సామ్రాజ్యాన్ని పొందే వారసులం. ప్రభువైన వైకుంఠనాథుని కింకరులమే. అక్కడ కులం, మతం, లింగ, వర్ణభేదముండదు. మనం సదాచార్యులను ఆశ్రయించాలి. ప్రపత్తిమార్గాన్ని అవలంబించాలి. శరణాగతులమైనప్పుడు మహారాజు కృపతో సామ్రాజ్యాన్ని సంపాదించుకోగలమని సారార్థం.

భవిష్యద్యౌవన వధూం వర ఇవ మాం లభస్వ మంత్రి జన విజ్ఞాపితమ్:- 'మంత్రిజనులు' అంటే, మంత్రరాజం యొక్క అర్థాన్ని, తత్వాన్ని బాగా తెలిసిన ఆచార్య పురుషులు. జీవాత్మకు, పరమాత్మకు గల ఘనిష్ఠ సంబంధం నిత్యమైనది. "నమక్కు ఇంగు ఒషిక్క ఒషియాదు"- (తిరుప్పావై. 28) ఇక్కడ మనకు, అక్కడ పరమాత్మకు శేషశేషి సంబంధం విడువ శక్యం కానిది. తెంచదలచుకొన్ననూ తెగిపోజాలనిది. ఇట్టి సంబంధాన్ని లెస్సగా బోధించి, దృఢంగా ఘటింపజేసే ఘటికులు ఆచార్య పురుషులు అని అర్థం.

నిండుగా పడుచుతనం పొడుచుకొని రానున్న యౌవనోన్ముఖియైన కన్య ఆఘ్రాణింపబడని పుష్పం- బెజ్జం వేయబడని రత్నమన్నమాట. 'యు-మిశ్రణే' స్త్రీ పురుషునితో, పురుషుడు స్త్రీతో కూడి యుండగలిగే వయస్సు 'యౌవనం' అనబడుతుంది. పెండ్లి ఈడుకు లోబడిన కన్య ఆవహింపనున్న యౌవనంగల వధువును వరుడు స్వీకరించి లాభపడినట్లు ఆచార్యులచేత విశేషంగా ఉపదిష్టుడనైన దాసుణ్ణి స్వీకరించి లాభపడుమని ప్రార్థించారు.

"స్త్రీ ప్రాయ మితరం జగత్"- భగవానుడొక్కడే పురుషుడు. జీవులు- మనమందరం వధువులమే. వరింపబడేవాడు వరుడు.

"దైవాద్వృతే వరః శ్రేష్ఠే త్రిషు క్లీబం మనాక్ ప్రియే"- అమర కోశం నానార్థవర్గం (రాంతం) లో "వరో జామాతృషిద్గయోః- ఇతి శేషః"- అని సూచించింది. ఇది 'శరణాగతి' యొక్క సారాంశం.

మనం భగవానుని పాణిగ్రహణార్థం వేచియున్నాం. నశ్వరమైన మన దేహం విడిపోగానే అది వైభవంగా జరుగనున్నది.

"నాయందేవో నమర్త్యోవా నతిర్యక్ స్థావరోఽపివా।
జ్ఞానానందమయ స్త్వాత్మా శేషోహి పరమాత్మనః।
దాస భూతాః స్వతః సర్వేహ్యాత్మానః పరమాత్మనః॥"

జీవాత్మ, దేవ తిర్యఙ్ మనుష్యస్థావరాలలో ఏది కాదు. కేవలం జ్ఞానానంద మయమైనది. జీవాత్మలన్నీ పరమాత్మకు శేషత్వం, దాస్యం చేసే యోగ్యత కలవి- అని ఆచార్యులు ఆత్మ స్వరూపాన్ని ఉపదేశించి, తత్త్వ హిత పురుషార్థ విషయాన్ని ఘటింపజేస్తారు.

రాకుమారుడు ప్రకృతిలో నిరంతరం పరిభ్రమించి 'ప్రకృతియే ఆత్మ' అనే భ్రాంతిచే మోహితుడయ్యాడు. ధార్మికులచేత ఆత్మయొక్క స్వరూపం బోధింపబడిన వెంటనే రాకుమారునికి ప్రకృత్యాత్మ భ్రమ తొలగిపోయింది. పరిశుద్ధాత్మను పరమాత్మ సంతోషంగా స్వీకరించాడని దృష్టాంతమందలి సారాంశం.

ఇక వధూ పరిగ్రహ విషయం:- కన్యకావస్థ ఉపభోగానికి అనర్హమైనది. ఉపభోగానికి అర్హమైన యౌవన దశ రానున్నది. రానున్న యౌవన దశను అనుభవించే ఆశతో వరుడు వధువును పరిగ్రహిస్తాడు. అట్లే జుగుప్సితమైన ప్రకృతి సంసర్గంచేత అత్యంతానర్హమైనది. ఈ శరీరం నుంచి లేచి "పరంజ్యోతి రుపసంపద్య స్వేనరూపేణ అభినిష్పద్యతే"- (ఛాం). జీవాత్మకు పరంజ్యోతి సన్నిధికి చేరి తన నిజమైన రూపం ఆవిర్భవించే దశ రానున్నది. ఆ దశ పరమాత్మకు ఉపభోగార్హమై యుండగలదు. ఆ దశ అవశ్యంగా రానున్నదే కాబట్టి, భగవానుడు తనను పరిగ్రహించడం యుక్తమనీ, ఆవిర్భవింపబోయే యౌవనం గల వధువును వరుడు పరిగ్రహించే విధంగా దాసుణ్ణి అనుభవించవలసినదని దేశికులు ప్రార్థించారు.

పరాంకుశ, పరకాలమునులవలె 'నా ప్రేమను చూరగొని, నన్ను పత్నిగా పరిగ్రహింపుమని దేశిక నాయకి అచ్యుత భగవానుణ్ణి వేడుకొంటుంది. ఈ విషయమంతా వేదాన్త శాస్త్రమందు, శ్రుతప్రకాశికలోనూ, శ్రీమద్రహస్యత్రయ సారంలోనూ వివరింపబడింది. ఇది జీవదేవ పరిణయ వృత్తాంతం.

101. ఇఅ క ఇ తక్కిఅ కేసరి
వేఅన్తా అరిఅ వేంకడేస విర ఇఅమ్।
సుహఅం అచ్చుఅ సఅఅం
సహిఅఅ హిఅ ఏసుసోహ ఉ సమగ్గ గుణమ్॥

ఛా. ఇతి కవితార్కిక కేసరి
వేదాన్తాచార్య వేంకటేశ విరచితమ్।
సుభగ మచ్యుత శతకం
సహృదయ హృదయేషు శోభతాం సమగ్ర గుణమ్॥

**అర్థం:** ఇతి= ఇట్లు, చెప్పిన విధంగా; కవితార్కిక-విరచితం/ కవి= కవులలోనూ; తార్కిక= తర్కశాస్త్రజ్ఞులలోనూ; కేసరి= సింహం వంటి; శ్రేష్ఠుడైన; వేదాన్తాచార్య= వేదాంతాచార్యులనియు; వేంకటేశ= వేంకటేశుడు అనియు పేర్లున్న కవిచేత; విరచితం= రచింపబడిన; సుభగం= మిక్కిలి భోగ్యమైన; సమగ్రగుణం= సంపూర్ణ గుణాలు కలిగినట్టి; అచ్యుత శతకం= అచ్యుత శతకం అనే గ్రంథం; సహృదయ హృదయేషు= రసికుల హృదయాలయందు; శోభతాం= రంజిల్లుగాక.

**తా॥** ఇంతవరకు చెప్పిన రీతిగా కవితార్కిక కేసరి, వేదాంతాచార్యులు అనే బిరుదులు కలిగిన వేంకటనాథుడనే పేరుగల కవిచేత రచింపబడినట్టి, మిక్కిలి సుఖాన్ని అనుభవింపజేయునట్టి; గుణపూర్ణమైన అచ్యుత శతకమనే గ్రంథం సహృదయుల హృదయాలలో ప్రకాశించుగాత.

**జ్యోతిర్మయీ వ్యాఖ్య:-** నిగమన శ్లోకం. ఫలశ్రుతి.

స్తోత్ర ప్రబంధం ప్రబంధ వైలక్షణ్యంవల్లనూ, విషయవైలక్ష్యణ్యం వల్లనూ, ఫలప్రదాన దక్షతనుబట్టి, సాత్త్వికులచే పరిగ్రహింపబడవలెనని ప్రార్థనారూపమైన మంగళాశాసనంతో ముగింపబడుతున్నది.

కవితార్కిక కేసరి:- లోకాతిశాయి వర్ణన చేయడమందు సమర్థుడు, క్రాంతదర్శి 'కవి' యనబడుతాడు. 'తార్కికుడు' అంటే లింగ లింగిజ్ఞాన రూపమైన ఊహచేత న్యాయంచేత ప్రకాశించేవాడు. కేసరి అంటే సింహమని అర్థం. కవులలోనూ, తార్కికులలోనూ శ్రేష్ఠుడు.

"సింహశార్దూల నాగాద్యాః పుంసి శ్రేష్ఠార్థ గోచరాః"- సింహశార్దూలాది పదాలు ఉత్తర పదంగా ఉంటే శ్రేష్ఠవాచకాలు. ఆచార్యుల యొక్క సింహత్వరూపణం చేత కవితార్కికులకు కలభ- ఏనుగు- రూపణం కూడా అర్థం సిద్ధిస్తున్నది. దుస్తర్కవాదులైన కవితార్కికులు అనే ఏనుగులకు సింహం వంటివాడు వేంకటేశ కవి. సరసకవితోల్లాసన సామర్థ్యం కలిగియుండి, అబాధితమైన అర్థ నిర్ణయమందు లబ్ధ వర్ణుడనీ, ఆయన కృతులు ఆప్తతమత్వం కలవని అభివ్యక్తం.

"అగణి సదసి సద్భిర్య స్సమస్యా సహస్రీ కవి కథక మృగేన్ద్రః"- డిండిమ కవిని జయించిన సమయంలో 'కవితార్కిక కేసరి' అనే బిరుదు సభలో విద్వత్కవులచే సమర్పించబడిందని తెలుస్తున్నది.

వేదాంతాచార్యులు:- వేదాంతాలంటే ఉపనిషత్తులు. వాటికి ఆచార్యుడు. ఉపనిషత్ప్రతిపాదితమైన తత్త్వాన్ని బాగా తెలుసుకొన్నవాడు, ఉపదేశించేవాడును, అనుష్ఠించేవాడని అర్థం.

"ఆచినోతి చశాస్త్రాణి ఆచారే స్థాపయత్యపి।
స్వయమాచరతే యస్తు తమాచార్యం ప్రచక్షతే॥"

అనేక శాస్త్రాల నుంచి పలు విషయాలను సేకరించి బోధిస్తూ, తాను చూపిన పద్ధతులలో తన నాశ్రయించినవారు ప్రవర్తించేటట్లు చేయడమే కాక, తాను బోధించిన నియమాలను తాను కూడా పాటించే వ్యక్తి ఆచార్య పదానికి అర్హుడు అని స్మృతి వాక్యం.

"విశ్వస్మిన్నామరూపాణ్యను విహితవతా తేనదేవేన దత్తాం, వేదాన్తాచార్య సంజ్ఞామవహిత బహువితి సార్థమన్వర్థయామి"- అనే ప్రకటనవల్ల, వేదాంతాచార్యులు అనే బిరుదును స్వయంగా శ్రీరంగనాథ భగవానుడే ప్రసాదించాడు అని తెల్పబడింది.

*వేంకటేశుడు:-* శ్రీ వేంకటేశ్వరస్వామి అవతరించిన దినమందే స్వామి యొక్క ఘంటాంశచే జన్మించినందువల్ల వేంకటనాథుడు- వేంకటేశుడు అని నామకరణం చేయబడింది.

శ్రవణా నక్షత్ర దినమందు "ఉత్ప్రేక్ష్యతే బుధజనై రుపపత్తి భూమ్నా, ఘంటా హరేః సమజనిష్ట యదాత్మనేతి"- పుట్టినట్లు, 'సంకల్ప సూర్యోదయం' అనే దృశ్య కావ్యమందు ప్రకటితం. ఇట్టి వేంకటనాథ కవిచేత వేదాంత సారార్థం పదార్థ, వాక్యార్థాలలో గ్రాహ్యమగునట్లు సుభగంగా రుచిరంగా అనుభవించునట్లు రచింపబడిన స్తోత్ర ప్రబంధమిది. ఈ ప్రబంధం పేరు 'అచ్యుత శతకం' అచ్యుత భగవానుని కృపచేత పురుషార్థ సాధకత్వాది విషయాలు వివరింపబడి, ఒక్కటి కూడా విడిపోకుండా, అచ్యుతుణ్ణి నూరు శ్లోకాలచేత అద్భుతంగా స్తుతించి, ఆ భగవానుని పేర వెలువరింపబడిన గ్రంథమిది.

*సమగ్ర గుణం:-* ఓజః ప్రసాదమధుర గుణాలు సంపూర్ణంగా నున్న గ్రంథమిది. గుణమంటే దారమనే అర్థమూ ఉంది.

*సహృదయ హృదయేషు శోభతామ్:-* గుణగ్రహణ పారీణ ధిషణులు, పరిశ్రమను గుర్తించువారు, నిర్మత్సరులైన సజ్జనులు 'సహృదయ' శబ్దవాచ్యులు. కావ్యవిభావనా పరిపక్వ బుద్ధులైన రసికుల హృదయాలలో అనుసంధీయమానమై సంస్కారాన్ని గోచరింపజేసే విధంగా ఈ శతకం సుస్థిరమై వెలసియుండు గాక.

కేసరి, విరచితం, సుభగం, సమగ్రగుణం, సహృదయ హృదయేషు, శోభతాం- అనే పదాల నిర్దేశంవల్ల 'అచ్యుత శతకం' రత్న- ముక్తాహారమని అభేదాధ్యవసాయం నిరూపించబడింది.

సింహం, గజకుంభస్థలాన్ని చీల్చివేయగా ఆ చోటనున్న ముత్యాలు బయట పడుతాయి. ముత్యాలు మంగళ ప్రదమైనవని ప్రసిద్ధమే కదా! అచ్యుత శతకం ముత్యాల సరమని అర్థాత్ సిద్ధం.

*"జీమూతకరి మత్స్యాహి వంశ శంక వరాహజాః।*
*శుక్త్యుద్భవాశ్చ విజ్ఞేయా అష్టౌ మౌక్తిక యోనయః॥"*

అని ముత్యాలు పుట్టే స్థలాలు ఎనిమిది ఉన్నాయి. *"సమగ్ర గుణం"* అంటే *"సత్త్వం విశుద్ధం వసుదేవ శబ్దితమ్"*– అన్నట్లు, ముత్యాలు సత్త్వగుణం గలవి. గుండ్రనివి, తెల్లనివి, రంగులేనివి, దారంచేత హారంగా (దారం కనబడకుండా) కూర్చబడి, తాపం తీరునట్లు, అంతర్యామి వెలసియున్న హృదయమందు ధరింపదగినవి. ఇట్లు, శైత్యం, నైర్మల్యాది గుణాలు గలిగి గట్టిదారంతో కూర్చబడిన ముక్తాహారం, సహృదయ సార్వభౌముల యెదలో రమ్యంగా రంజిల్లుగాక. కవి పేరును పేర్కొనడం ముద్రాలంకార లక్షణం.

*శోభతాం:*– శుభాశంసనం చేత 'మంగళం' సంపాదింపబడింది. తత్ఫలితంగా, ఈ శతక ప్రబంధం వ్యాఖ్యాతలకు, పాఠకులకు, శ్రోతలకును అనిష్ట పరిహారపూర్వకంగా ఇష్టప్రాప్తికి హేతువగుటచేత సకలమంగళాస్పద మవుతుంది.

*"మంగళాదీని మంగళమధ్యాని మంగళాంతాని చ శాస్త్రాణి ప్రథంతే వీరపురుషాణ్యాయుష్మత్పురుషాణి చ భవంత్య ధ్యేతారశ్చ ప్రవక్తారో భవంతి"*– అని భగవాన్ భాష్యకారుల వచనం.

అచ్యుత శతకం సమాప్తం.

*కవితార్కిక సింహాయ కల్యాణ గుణశాలినే।*
*శ్రీమతే వేంకటేశాయ వేదాన్త గురవేనమః॥*

ఇది శ్రీమాలోల నృసింహస్వామి కటాక్షపాత్ర, హరితస గోత్ర, శ్రీమాన్ కారంచేటి తిరుమల మనోహరాచార్య ప్రథమ పుత్ర, వేంకటరాఘవాచార్య విరచిత ఆంధ్ర టీకాతాత్పర్య, జ్యోతిర్మయీ వ్యాఖ్యా సమేత, శ్రీమద్వేదాంత దేశికాను గృహీతం అచ్యుత శతకం.



# శ్రీమాన్ కె.వి. రాఘవాచార్యుల రచనలు

**మాఘ కావ్యవైభవమ్**
**గోదాస్తుతి** - పరిమళవ్యాఖ్య
**భగవద్విషయం** - ఈడు అవతారికలు - ఆంధ్రానువాదం
**భగవద్ధ్యాన సోపానమ్** - మనోరమా వ్యాఖ్యానమ్
**శ్రీ మద్రామానుజులు - వర్ణాశ్రమధర్మాలు**
**శ్రీ రంగనాథపాదుకాసహస్రమ్** 5 సంపుటాలు
(రమణీయాంధ్ర టీకాతాత్పర్య వ్యాఖ్యాన సహితమ్)
**గరుడ దండకమ్** - సుషమాంధ్ర టీకాతాత్పర్య వ్యాఖ్య
**ఆళ్వార్లు - భక్తిప్రపత్తి మార్గాలు**
**శ్రీనారాయణ శతకమ్** - రాఘవీయ వ్యాఖ్య
**దివ్య ప్రబంధత్రయి** - ఆంధ్ర టీకాతాత్పర్య వివరణమ్
(తిరుప్పల్లాణ్డు - తిరుప్పళ్ళియెషుచ్చి - కణ్ణినుణ్‌శిఱుత్తామ్బు)
**ద్రవిడోపనిషత్తాత్పర్య రత్నావళి** - ప్రకాశికా వ్యాఖ్య
**శ్రీ సుదర్శనాష్టకమ్** - జ్వాలా వ్యాఖ్య
**శ్రీ రుక్మిణీ కల్యాణమ్** - వైష్ణవీ వ్యాఖ్య
**కాంతా చతుః శ్లోకి** - దీపికా వ్యాఖ్య
**యతిరాజ సప్తతి** - చంద్రికా వ్యాఖ్య
**అభీతిస్తవమ్** - సంజీవనీ వ్యాఖ్య
**శ్రీస్తుతి** - హిరణ్మయీ వ్యాఖ్య
**ఉభయ వేదాన్తాల ఐక కంఠ్యమ్**
**దయాశతకమ్** - అమృతాస్వాదినీ వ్యాఖ్య
**శ్రీ వేదాన్త దేశిక దర్శనమ్**
**న్యాస వింశతి** - శ్రేయసీ వ్యాఖ్య
**న్యాస దశకమ్** - బుధరంజనీ వ్యాఖ్య
**శ్రీవరదరాజ పంచాశత్** - సర్వంకషా వ్యాఖ్య
**శ్రీ అచ్యుత శతకమ్** - జ్యోతిర్మయీ వ్యాఖ్య
**యాదవాభ్యుదయ మహాకావ్యమ్** - సుబోధినీ వ్యాఖ్య
(అచ్చులోనున్నది)

# వదాన్యులు

శ్లో॥ శ్రీరామరాజాహ్వాయ న్యాయవాదీ
సమర్చయన్దేవ గురుద్విజాదీన్ ।
ని వృత్తి ధర్మేనిరతో వదాన్యః
తం శ్రీపతిర్మంగళ మాతనోతు ॥



**శ్రీమాన్ ఎ. రామరాజుగారు**
**ధర్మపత్ని శ్రీమతి మధుసూదనమ్మ గారు**

అడ్వకేట్, ప్రపన్నులు, సిద్ధిపేట నివాసులు



# శ్రీ కె.వి. రాఘవాచార్యుల జీవన రేఖలు

| | | |
|---|---|---|
| జననం | : | విభవ, పుష్య శుక్ల ద్వాదశి, 22 జనవరి 1929 |
| స్వగ్రామం | : | నారాయణపురం, ఎల్లారెడ్డిపేట మండలం, కరీంనగర్ జిల్లా (ఆం.ప్ర.) |
| తల్లిదండ్రులు | : | కీ॥శే॥ తిరుమల వెంకటమ్మగారు, కీ॥శే॥ తిరుమల మనోహరాచార్యులు గారు |
| భార్య | : | కీ॥శే॥ పద్మావతి |
| సంతానం | : | డా.॥ కె.వి.రమణాచార్యులు ఐ.ఎ.ఎస్; మనోహరాచార్యులు; శకుంతల; రమాదేవి, సువర్ణ |
| చదువు | : | సంస్కృతం ఎం.ఏ; తెలుగు ఎం.ఏ; బి.ఇడి |
| సోదరసోదరీమణులు | : | తిరుమల పార్థసారథి, తిరుమల నరసింహాచారి, డా॥ తిరుమల శ్రీనివాసాచారి, కీ॥శే॥ డా. వెంకట రమణాచారి, కొండమ్మ, శ్రీనివాసమ్మ |
| గురువులు | : | తండ్రిగారు, దివ్యప్రబంధాలు (ద్రావిడం), సంస్కృత సాహిత్యం, శ్రీమాన్ నమిలకొండ శ్రీరంగాచార్య స్వామి వారు, (నారాయణపురం), బ్ర.శ్రీ. భావికృష్ణ శాస్త్రిగారు (నారాయణపురం), బ్ర.శ్రీ. జోగా వెంకన్న శర్మగారు. |
| ప్రోత్సాహకులు | : | కారంచేటి తిరుమల వెంకట నరసింహాచార్యులు గారు (మెదక్) |
| భగవత్ విషయ బోధకులు | : | ఉ.వే. శ్రీమాన్ కంద్లకుంట (ఎలిజర్ల) సీతారామాచార్య స్వామి వారు |
| వృత్తి | : | విశ్రాంత ఆంధ్రోపన్యాసకులు |
| ప్రవృత్తి | : | పురాణ, ప్రబంధ కాలక్షేపం; దైవమానుషయాజ్ఞికం; గ్రంథ పఠనం, రేడియో టివీ ప్రసంగాలు |